# కొప్పరపు సోదర కవుల కవిత్వము

(శతావధానములు, ఆశుకవితలు, పండిత ప్రశంసలు)

సంపాదకుడు

డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ. ఎమ్.ఏ., పిహెచ్.డి.



శ్రీ కొప్పరపు కవుల కళాపీఠము

విశాఖపట్టణం - 530022.

# KOPPARAPU SODARA KAVULA KAVITHVAMU

Random Collection of Pieces of Poetry
PRONOUNCED EXTEMPORE BY THE DUO

Late Kopparapu Venkata Subbaraya Sarma (1885-1932)
Late Kopparapu Venkata Ramana Sarma ( 1887-1942)

---

Gathered Edited and Presented by
Dr. Gundavarapu Lakhsminarayana MA Ph D ,



Title Logo : Sri BAPU
Title Design and Inscriptions : Sri BHARAGO

DTP : Bhadreswara Rao (Guntur)

First Edition : November 2003

Designed and Printed at :
Ramsha-Sirisha Publications
Samalkot - 533 440 (Tel : 0884-2327454)

Price **Rs 150** (Overseas : US $15^{00}$)

Copies At :

* The Publishers (Visakhapatnam)
* Visalandhra Book House (All Branches)
* Navodaya Book House (Kachiguda, Hyderabad - 500 027)
* Editor ( Dr. Gundavarapu Lakshmi Narayana) at
  Siva Sakti Complex, 8/1, Arundelpeta,
  GUNTUR - 522 002. (Tel : 0863-2230940)

# కొప్పరపు కవి సోదరులు

**అసలు రూపం**



**అపురూపం** (ఆ దస్తూరి)

[illegible]



## దీపధారులు (చూ. చివరిఅట్ట)

## 1. తిరుపతి వేంకటకవులు (1870 - 1950)

దివాకర్ల తిరుపతి శాస్త్రి (1872-1919) చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి(1870-1950) తెలుగులో జంటకవుల సంప్రదాయానికి మూలస్తంభాలు. తెలుగు పద్యాన్ని అవధానాల ద్వారా, నాటకాల ద్వారా వీధివీధిన గొంతుగొంతున నడిపించిన వారు, పలికించినవారు వీరికి ఉన్న శిష్యపరంపరాస్థి అరుదైనది

## 2. వేదము వేంకట రాయ శాస్త్రి (1853-1929)

భాషలా - తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, తమిళము, కన్నడము, హిందీ. అధ్యయనమా-షట్శాస్త్రములు, షడ్దర్శనాలు, అష్టాదశపురాణాలు మున్నగు సమస్తము. సాహితీ వ్యవసాయమా-రచన, వక్తృత్వము, విమర్శనము, అనువాదము, వ్యాఖ్యానము, ప్రచురణము. ఏ రంగంలో కూడా ఇంతటి పెద్దదిక్కు సంభవం అపూర్వం.

## 3. "కావ్య కంఠ" వాసిష్ఠ గణపతి ముని (1878-1936)

ఈ పేరులోని "గణపతి" అనే నాలుగు అక్షరాలు తప్ప మిగిలినవన్నీ ఆయన ("నాయన")అర్హతలకు అనుగుణంగా చేరిన బిరుదులే. సంస్కృతంలో అవధానం, ఆశుకవిత ప్రదర్శనలుగా నిర్వహించగా నవద్వీపంలో చేరినది 'కావ్యకంఠ'. రమణ మహర్షి ప్రేమ పరాకాష్ఠ ఆయన నోట 'నాయన' అయింది జన ప్రియత్వ గౌరవ వచనం 'ముని'. ఎన్ని ఉన్నా తెనుగు, సంస్కృత భాషలలో విస్తరించిన అలనాటి కవిత్వంపై ఉండిన వాత్సల్యం ఆయన ప్రాణప్రదంగా మనకు దయచేసినారు.

## 4. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ (1893-1979)

సంగీత, సాహిత్యరంగాలలో ఎంతటి సమధిక పారీణధురీణుడో సారస్వత విమర్శనలో సంగీత విశ్లేషణలో అంతటి అవధాన కేసరి. సంస్కృత, కన్నడ, ఆంధ్ర భాషల పండితుడు. అన్నమాచార్య సంకీర్తనలకు తొలిసారిగా స్వరవ్యాకరణం సమర్పించారు.

## 5. కాశీ కృష్ణాచార్యులు (1879-1967)

బహుముఖ విద్యా ప్రజ్ఞ, బహువృత్తి పారంగత్వం గల అరుదుగని. అందులో గాత్ర సంగీతం, వేణువీణావాయులీన మృదంగాది వాద్య సంగీతం; వడ్రంగం, కమ్మరం, నేత, ఈత, పాకశాస్త్రం సాముగరిడీలు మొదలైన వృత్తుల విద్యలు ఉండినవి. వక్త, శతావధాని, ఆశుకవి. ఆంధ్రప్రదేశ్ తొలినాటి ప్రభుత్వ ఆస్థాన కవి.

## 6. కందుకూరి వీరేశలింగం (1848-1919)

సాహిత్యాన్ని సంఘసంస్కరణ సాధనంగా స్వీకరించి బహుప్రక్రియల ద్వారా ప్రబోధించిన వైతాళిక మహోదయుడు. తెలుగు కవుల చరిత్రను గ్రంథస్థం చేసి ఆంధ్ర సాహిత్య చరిత్రలో స్థిర పీఠాన్ని అధిష్ఠించి అమరణాంతం సామాజిక ప్రయోజనకర రచననే ఊపిరిగా చేసుకున్న మహనీయుడు.

## 7. రాయప్రోలు సుబ్బారావు (1892-1984)

ఏ దేశమేగినా ఎందు కాలిడినా భారత మాతను స్తుతించమని ఉద్బోధించిన స్వయంభూకవి. నవ్య కవిత్వోద్యమానికి ఆద్యుడు, ప్రభావకరుడు. తెనుగు తోటకు రమ్యాలోకతృణ కంకణాన్ని సమర్పించి తెలుగు కవితను ఇతర భారతీయ భాషలకు పరిచయం చేయించిన శుభ్రరాయుడు.

## 8. తుమ్మల సీతారామమూర్తి చౌదరి (1901-1990)

ఆధునికులలో సంప్రదాయవాది. సనాతనులలో అధునాతనుడు, కవితా సృజనలో దేశభక్తుడు. అన్నీ కలిపి త్రిపాత్రాభినయం అనడానికి వీల్లేని త్రివేణీ సంగమం. గ్రామజీవనం, గాంధీతత్వం, ఆంధ్రాభ్యుదయం, తెలుగు "బాస"- ఈ "అభినవ తిక్కన" చతురంగబలాలు.

## 9. పుట్టపర్తి నారాయణాచార్యులు (1914-1990)

తన కవితాగ్రంథం తనకే పాఠ్యపుస్తకంగా నిర్ణయమై విద్వాన్ పరీక్షలో ఆ గ్రంథానికి సంబంధించిన ప్రశ్నలకు విద్యార్థిగా సమాధానాలు వ్రాసుకోగలిగిన అదృష్టం దృష్టమైన అపురూపకవి. బహుభాషావేత్త, బహుగ్రంథకర్త, బహుగ్రంథ అనువాదకుడు, నటనాధురీణుడు, వక్తృత్వ నిష్ణాతుడు.

## 10. విశ్వనాథ సత్యనారాయణ (1895-1976)

ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో అన్ని ప్రక్రియలలోను సేద్యం చేసి నేలను, పంటను కూడా పరిపుష్టం చేసిన ఈ జ్ఞాన పీఠాధిపతి అక్షరాలా కవి సామ్రాట్. అభిమాన వర్గం, శిష్య వర్గం వీరికి ఉన్నంతగా, మరి ఎవరికో గాని ఏర్పడదు. అధ్యయనాన్ని, అభ్యాసాన్ని కూడా నికషోపలం చేసుకున్న బుద్ధిజీవి.

## 11. త్రిపురనేని రామస్వామి చౌదరి( 1886-1943)

ఆధునిక తెలుగు సాహిత్యంలో హేతువాదానికి, మానవతావాదానికి మూలపురుషుడు. సాంఘిక విప్లవానికి భావ విప్లవమే ఆధారభూతమని ఆశయించి ఆ సిద్ధికి గాను సనాతన వాఙ్మయానికి వినూత్న విశ్లేషణ గోచరమయ్యే రచనలు వీరి కలం నుండి వెలువడ్డాయి.

## 12. నిడుదవోలు వేంకటరావు (1903-1982)

డాక్టరేట్ల కోసం కాక వాఙ్మయ ప్రయోజనం మీది ప్రేమ చేత మానవల్లి, వేటూరి, మల్లంపల్లి వంటి అగ్రపరిశోధక శ్రేణికి చేరినా, అల్పాక్షరాలతో, అనల్పార్థాలతో కవితలున్నూ చెప్పారు. "అసలు" వృత్తి బోధన, సిసలు వృత్తి శోధన, స్పెషలు వృత్తి రచన. చాదస్తం చేరని పాండిత్యం వల్ల జంగమ విజ్ఞాన సర్వస్వంగా మన్ననలందిన బహు గ్రంథ సంతాన కుటుంబి.

## 13. గుఱ్ఱం జాషువా (1895-1971)

ఆధునికతలోంచి భావుకతకు, సామాజికతకు-తననూ తన కవిత్వాన్నీ వ్యాపింపజేసుకున్న త్రివిక్రముడు. కవిత్వంలో లోతు, చమత్కారం, ప్రయోజనం ముప్పేటగా కలిసి రావాలనుకున్న సిద్ధసంకల్పుడు.

## 14. వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950)

తెలుగు కవులపైన, తెలుగు కవిత్వం పైన అపారమైన ప్రేమతో జీవించిన తొలితరపు పరిశోధక కవి. తాళపత్ర గ్రంథాలలో, శాసనాలలో నిక్షిప్తమై ఉండిన అమూల్యమైన ప్రాచీన వాఙ్మయ సంపదను అన్వేషించి, వెలికి తీసి, పరిశీలించి, పరిశోధించిన భాషా శ్రామికుడు. అన్నమయ్య అని ఒక మహనీయుడు ఉండెనని తొలిసారిగా తెలియజేసిన ధన్యజీవి.

## 15. వేలూరి శివరామశాస్త్రి (1892-1967)

అవధాని, బహుభాషావేత్త, బహుప్రక్రియావ్యవసాయి, అనువాదకుడు, ప్రామాణిక విమర్శకుడు. అన్నిటికి మించి సాహితీ సభా నిర్వాహకుడు. తిరుపతి వేంకట కవులకు ప్రథమశ్రేణి అభిమాన శిష్యుడు, కుడిచేయి.



# కొప్పరపు సోదర కవులు

కొప్పరపు వేంకట సుబ్బరాయ శర్మ (12.11.1885 – 29.3.1932), కొప్పరపు వేంకట రమణ శర్మ (30.12..1887 – 21.3.1942), నివాస స్థలం – కొప్పరం గ్రామం, నరసరావు పేట తాలూకా, తల్లిదండ్రులు: సుబ్బమాంబ, వేంకట రాయుడు, బిరుదులు: బాల సరస్వతి, ఆశు కవీంద్ర సింహ, విజయ ఘంటికా, ఆశుకవి చక్రవర్తి, కుండినకవి హంస, కవిరత్న, అవధాని పంచానన, కథాశుకవీశ్వర, ఆశుకవి శిఖామణి. రచనలు: కనకాంగి(పద్య కావ్యము), పసుమర్తి వారి వంశావళి(1909), జ్ఞానోపదేశము, నారాయణాస్త్రము, సుబ్బరాయశతకము (1936), కృష్ణకరుణా ప్రభావము(పద్యకావ్యము), దైవ సంకల్పము (పద్యకావ్యము. 1913), దీక్షితస్తోత్రము (1916), శతావధానము(1911) మొదలుగా.

వీరిద్దరూ అన్నదమ్ములు, ఆశుకవితా చక్రవర్తులు. అసంఖ్యాకంగా అష్టావధానాలు చేశారు(1908) 'కవిత పుట్టిల్లు సోదర కవుల యిల్లు' అనే ఖ్యాతి పొందారు. వీరిది అసాధారణమైన ధారణ. అపూర్వమైన ధార. తిరుపతి వేంకట కవులతో సమ ఉజ్జీలుగా నిలిచి మెప్పు పొందారు. ఈ ఉభయ జంటల మధ్య చెలరేగిన సాహిత్య వివాదం పండిత లోకంలో గొప్ప సంచలనం సృష్టించింది. ఆంధ్రదేశంలోని ఉద్దండ పండితులైన వారందరికీ కొప్పరపు కవుల పక్షానో, తిరుపతి వేంకట కవుల పక్షానో నిలువక తప్పింది కాదు. వీరు లక్కవరం, గద్వాల, చల్లపల్లి వంటి సంస్థానాలలో 150 సభలలో అష్టావధాన, శతావధాన, ఆశుకవితా ప్రదర్శనలనిచ్చారు. వీరి మొదటి ఆశుకవిత్వ సభ ఆల్వాల లష్కరులో జరిగింది. ఈ సభలో ఆదిరాజు తిరుమల రావు గారు వీరికి ముంగాలి·బిరుదు అందెను బహుకరించారు. చెన్నపురి, బాపట్ల, విశదల, చీరాల, గుంటూరు, పంగిడిగూడెం, హైదరాబాదులలో చేసిన శతావధానాలు ప్రఖ్యాతమైనవి. కవి పండితుల సమక్షంలో ప్రతిభావంతంగా ఒక్కరోజులోనే అవధానం పూర్తి చేసి సభికుల ప్రశంసలు పొందటం, ఎక్కువ కాలవ్యవధి లేకుండా రెండు రోజుల వ్యవధానంతోనే శతావధానాలు చేయటం వీరి విశిష్టత. వీరు ప్రబంధ శైలిలో గంటకు 500 పద్యాలు చెప్పేవారు. మార్టేరు సభలో పందెం వేసి గంటకు 720 పద్యాల లెక్కన అరగంటలో 'మను చరిత్ర'ను ఆశువుగా చెప్పారని తెలుస్తున్నది. గద్వాల సభలో

వీరిని పరిచయం చేస్తూ ఆదిపూడి ప్రభాకర కవి చెప్పిన 64 పంక్తుల చంపకమాలిక 'శారద' పత్రికలో(1924) ప్రచురితమై ప్రసిద్ధమైంది. వేంకట సుబ్బరాయశర్మ గారి మరణానంతరం వేంకటరమణ కవి గారు తమ సోదరులైన బుచ్చి రామ కవితో కలిసి ఆశుకవితా సభలు చేశారు. వీరు అవధానాలలో లక్షల కొద్దీ పద్యాలు చెప్పారు.

'కనకాంగి' ఒక అవధానంలో ఆశువుగా చెప్పిన కథా కావ్యం. 'పసుమర్తి వారి వంశావళి' ఆశుధారలో చెప్పిన గ్రంథం. ఇందులో పసుమర్తి సీతారామయ్య, రామయ్య గార్ల వంశానుక్రమణిక ఉంది. 'జ్ఞానోపదేశము' తిరుపతి కవుల హితోపదేశానికి ప్రతిగారాసిన గ్రంథం. 'నారాయణాస్త్రం' తిరుపతి వేంకట కవుల 'నమస్కారానికి' సమాధానం. సుబ్బరాయ శతకం నరసారావు పేట వాస్తవ్యుడైన నాగరపు సుబ్బరాయ శ్రేష్టికి అంకితంగా ఉంది. ఇది గీతశతకం. వీరి రచనలు సంప్రదాయ రీతిలో ప్రాచీన ప్రబంధాల పోకడలో ఉన్నాయి. మణికొండలో తేటిరెడ్డి గోపాలరెడ్డి నుంచి 'బాలసరస్వతి' బిరుదును, నెల్లూరు మహాసభలో 'ఆశుకవీంద్ర సింహ' బిరుదాన్నీ, బుచ్చిరెడ్డి పాలెంలో బెజవాడ పట్టాభిరామరెడ్డి గారి చేత 'విజయఘంటికా' బిరుదాన్నీ, మద్రాసు విజ్ఞాన చంద్రికా మండలి వారి నుంచి 'ఆశుకవి చక్రవర్తి' బిరుదాన్నీ పొందారు. గుంటూరులో 'కుండినకవి హంస' బాపట్లలో 'అవధాని పంచానన' మార్టేరులో 'కథాశుకవీశ్వర' గుంటూరు సోమసుందరేశ్వరాలయంలో 'కవిరత్న' బిరుదాలు పొందారు. కొప్పరపు కవులు వడ్లమూడిలో చేసిన అవధానంలో పృచ్ఛకులుగా ఉన్న కుంటముక్కల వేంకట జానకీ శర్మ 'కొప్పరపు సోదర కవుల శతావధానములు' అనే పేర వారి అవధానపద్యాలను రెండు భాగాలుగా ప్రచురించారు (1963). చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణ ప్రసాదు గారు 'కొప్పరపు కవుల యశోడిండిమం' సంకలితం చేశారు. నిడుదవోలు వేంకటరావు గారు రచించిన 'కొప్పరపు సోదర కవుల చరిత్ర' (1973) వీరిని గురించిన విశేషాలు తెలుపుతున్నది. ఈ సోదర కవుల పేర ఒక ట్రస్టు ఏర్పాటైంది. (1965).

**(తెలుగు అకాడమీ సౌజన్యంతో :**
**"తెలుగు సాహిత్యకోశము 1851-1950" నుండి)**



శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీ స్వామి (సిద్ధేశ్వర పీఠాధిపతి; కుర్తాళం)
(పూర్వాశ్రమం : డాక్టర్ ప్రసాదరాయ కులపతి)

## ఆశీర్వాద శ్రీముఖము

డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ గారు చిరకాలంగా ఆప్తులు. సాహితీ రంగంలో ఎంతో కృషి చేసినవారు. కొప్పరపు సోదర కవులయందు వారికి గల భక్తి అపారము. దాని ఫలితమే ఇంతకుముందు వ్రాసిన గ్రంథము, ఇప్పుడు సిద్ధమైన మరొక బృహద్గ్రంథము. నిర్భయంగా నిస్సంకోచంగా ఎన్నో వివాదాస్పద విషయాలు ఇందు ప్రస్తావించబడినవి. ఈ మాటలు ఎందుకు అనవలసివచ్చిందంటే చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు చిరకాలం జీవించి ఆస్థాన కవియై అప్రతిహత తేజస్సుతో ప్రకాశించటం, వారి శిష్యులు మహామహులై గురుకీర్తిని దిగంతవ్యాప్తం చేయటం జరిగి – ఒక దశలో కొప్పరపు సోదర కవులను గురించి వారి కవితా మహత్వాన్ని గురించి ప్రకటంగా పలకటానికి పండితులు – తెలిసినవారు కూడా భయపడే స్థితి వచ్చింది. మాకు పూజ్యుడైన ఒక వృద్ధ పండితుడు ఈ సోదరకవుల జీవిత చరిత్ర వ్రాసి తనపేరు పెట్టుకోవటానికి ఇష్టపడక మరొకరి పేరుతో ప్రకటించటం నేను స్వయంగా చూచిన సత్యం. తెరవెనుక జరిగిన యిటువంటి విశేషాలనెన్నింటినో నేను ఎరుగుదును.

ప్రస్తుతం లక్ష్మీనారాయణ గారు పూర్వం కుంటముక్కల జానకి రామశర్మగారు ప్రచురించిన గ్రంథం ఆధారంగా ఈ పుస్తకాన్ని తయారుచేసి అలభ్యతా దోషాన్ని నివారించారు. వారి ఆలోచనలు, వివరణలు తయారుజేశారు. అయితే వారుకూడా తీవ్రత్వ సంకోచంతో నెల్లుట్ల రామకృష్ణామాత్యుల భావార్ణవ పద్యాలను పరిహరించారు. దూషణ ఉన్నా కవిత్వం బాగున్నది కనుక తిట్టు కవిత్వ శీర్షిక క్రింద ఉపయోగించవచ్చు. పాటిబండ్ల వారివి, వఝ వారివి, కాళ్ళకూరి వారివి, మరికొందరివి మరికొన్ని ఇవ్వవచ్చు. అయితే ఇప్పటికే గ్రంథం పెద్దదయినది.

ఇవన్నీ అటుంచి రచయితకు తనదైన ఒక ప్రణాళిక ఉంటుంది. గుండవరపు వారు తానెన్నుకొన్న పద్ధతిలో రచన చేశారు. అది బాగుంది. దానిని

అభినందిస్తున్నాను. సోదరకవుల కవిత్వాన్ని ప్రచారం చేయటానికి కంకణం కట్టుకొని దానికోసం ఒక సంస్థను స్థాపించి అనన్య సామాన్యమైన కృషి చేస్తున్న (ఆశుకవిచక్రవర్తి కొప్పరపు సుబ్బరాయశర్మగారి దౌహిత్రుడు) సుబ్బరాయశర్మ గారిని మనఃపూర్వకంగా ప్రశంసిస్తున్నాను. ఈ గ్రంథంలో ఉదహరించని వేదం వేంకట రాయశాస్త్రి గారి పద్యాన్ని ఉదహరిస్తూ ముగిస్తున్నాను. ఇది మంత్రిప్రగడ భుజంగరావు గారి కుమార్తె వివాహ సందర్భంగా జరిగిన సోదరకవుల ఆశుకవితాసభకు అధ్యక్షత వహించినప్పుడు వేదంవారు చెప్పిన పద్యం.

**ఎవ్వరిని మెచ్చువాడ గానెపుడు నేను**
**మెచ్చితిని మిమ్మెజగములు మెచ్చినట్లు**
**ఆశుకవితాశిఖామణులందు మిమ్ము**
**సూరివరులార! కొప్రంపుసుకవులార!**



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మభూషణ్
**డాక్టర్ సి. నారాయణ రెడ్డి,** ఎం.ఏ.పి.హెచ్.డి.,డి.లిట్.,
ఎం.పి. (రాజ్యసభ)
అధ్యక్షులు : ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి.
కళాభవన్, హైదరాబాదు - 500 004.

---

'కొప్పరపు కవులు' అసాధారణ ధారా సంపన్నులు. వారి ప్రౌఢ సమాస చాలనం, సమయోచిత శబ్ద చమత్కార ఖేలనం ఆశ్చర్య జనకాలు. ఆశుకవితా విన్యాసంలో ఎంత ధారాధురీణులో అవధానయాగ నిర్వహణలో అంతటి స్థితప్రజ్ఞులు 'కొప్పరపు సోదర కవులు'.

కొప్పరపు సోదర కవుల అవధాన పద్యాలను సంకలనం చేసిన ప్రయత్నం ప్రశంసనీయం. అందుకు డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ గారిని అభినందిస్తున్నాను.

పద్య విద్యాప్రియులు పదిల పరచుకొనే గ్రంథమిది.



**పద్మశ్రీ డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ Ph.D**
ఎం.పి (రాజ్యసభ)

## ప్రశంస

శ్రీ కొప్పరపు సోదర కవులు, శ్రీ తిరుపతి వేంకట కవులు, శ్రీ వేంకట రామకృష్ణ కవులు, శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు, శ్రీ పింగళి కాటూరి కవులు అవధానం, ఆశుకవిత్వం ధారా శుద్ధితో చెప్పిన జంట కవులు. శ్రీ వేములవాడ భీమకవి, శ్రీనాధుడు, తెనాలి రామకృష్ణుడు మొదలయిన పూర్వకవులు కొన్ని చాటు పద్యాలను అశువుగా అలవోకగా చెప్పినప్పటికీ ఆధునికాంధ్ర భాషలో ఈ జంట కవుల అవధాన ప్రక్రియ ద్వారా తెలుగు కవితకు ప్రశస్తి ప్రాచుర్యాలు కలిగాయి. నేటి కాలంలో కూడా శ్రీ యుతులు మేడసాని, మాడుగుల అవధాన ప్రక్రియ జనామోదం పొందుతోంది.

శ్రీ యుతులు కొప్పరపు వేంకట సుబ్బరాయశర్మ, వేంకట రమణ శర్మ జంట కవుల అవధాన ప్రక్రియా వైశిష్ట్యం జనశ్రుతి ద్వారా, "కొప్పరపు సోదర కవులు" అనే ప్రస్తుత గ్రంథం ద్వారా; మనకు అవగత మవుతోంది. ఆనాడు టేపురికార్డులు, వీడియోలు లేని కారణంగా మనకు వారి ప్రతిభా పాటవాల్ని వీక్షించే అదృష్టం కలగలేదు. ఫలితంగా అనేక అవధానాది పద్య స్రవంతులు కాలసాగర గర్భంలో కలిసిపోయాయి.

కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి, శ్రీ కొక్కొండ వేంకట రత్నము, శ్రీ వావిలకొలను సుబ్బారావు, శ్రీ వసురాయ కవీంద్రుడు, శ్రీ కావ్యకంఠ వాసిష్ఠ గణపతి మునీంద్రులు, శ్రీ కాళ్లకూరి నారాయణ రావు, శ్రీ జయంతి రామయ్య పంతులు మొదలయిన అనేక సుప్రసిద్ధాంధ్ర సంస్కృత పండితులు మన కొప్పరపు సోదర కవుల అవధాన కవితా సరస్వతీ దేవికి హారతులు పట్టిన వారే.

శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దూర్ జమిందారు గారు శ్రీ కొప్పరపు కవుల ఆశుకవితాధురీణతకు మెచ్చి 1913లోనే "ఆశుకవి శిఖామణి" బిరుదుతో సత్కరించారు. బాలసరస్వతి, ఆశుకవీంద్ర సింహ, ఆశుకవి సమ్రాట్,

కవిభూషణాది బిరుద విరాజితులయిన శ్రీ కొప్పరపు కవుల గొప్పదనాన్ని విశద పరిచే సద్గ్రంథం ఇది.

శ్రీ కొప్పరపు కవుల పద్యాలు హృద్యంగా హృదయాలలో సూటిగా నాటుకునేటట్లు ఉంటాయి. వీరి పదాల పొందిక మరే ఇతర సమకాలీన కవులకు లేదు.

"అనువుగ జొన్నయన్నమున యందున గల్పిన గోగుకూర తోఁ
దనకనుకూలమైన రుచి దార్కొనగా నొక పచ్చిమిర్పకా
యను గొఱుకంగఁ బూనుటహహా ! తనుమించిన దానిఁ గూడుమన్
దనయునిముద్దు పెట్టుకొని తాపము వాసిన వాని చందమౌ"

('కొప్పరపు సోదర కవులు' : పుట – 108)

శ్రీ కొప్పరపు కవుల కవిత జొన్నన్నంలో గోంగూర కలుపుకుని పచ్చిమిరపకాయ కొరికినట్లు మనకు మహానందాన్ని కల్గిస్తుంది; తర్వాతే సేద్యః పరినిర్వృతి కలుగుతుంది.

"కొప్పరపు కవులు" గ్రంథాన్ని కూర్చి మనకు అందించిన సహృదయులు డా. గుండవరపు లక్ష్మీనారాయణ గారిని, ప్రస్తుతం 'కొప్పరపు సోదర కవుల కవిత్వం' లోకానికి అందిస్తున్న (శ్రీ కొప్పరపు వేంకట సుబ్బరాయ కవీంద్రుల దౌహిత్రులు) 'మా' శర్మగారిని ఈ సందర్భంగా బహుధా ప్రశంసిస్తున్నాను.

ఇట్లు



# అవధాన సరస్వతీ పీఠమ్
**హైదరాబాదు-500 027**

తిరుపతి వేంకటేశ కవిధీరుల ధీరత కుద్దిగాగమీ
పరపతి సత్ప్రబంధ రసబంధుర పద్య మహాశువేగవత్
పరిమళమై దిగంతములఁబండెను, పండిన మీ తపస్య కొ
ప్పరపవధాని సోదరుల భవ్యకవిత్వముఁబ్రస్తుతించెదన్

ఆశూక్తమ్ముల కావ్యసౌధములు విద్యాశేముషీవైభవ
ప్రాశస్త్యమ్మన స్వర్ణగోపురశిఖాప్రాగల్భ్యమున్ జూప త
ద్రాశీభూత విమానగోపురములే తచ్ఛారదాపాద సం
వేశీవృత్త రణత్సునూపురములై విన్పించె సూరిద్వయీ!

సమకాలీన సమాజదర్శన కళాసౌందర్యమాధుర్యమై,
నమదస్తోక కవీంద్రవాగ్విభవమై, నవ్యమ్మునై, వార్షుకా
భ్ర మహావేగ నభస్వదుత్తరసధారావర్షమై, శ్రోతృవ
ర్గము తృప్తిన్ గన కొప్పరంపు కవియుగ్మశ్రీ మనోధారయౌ

కప్పురమొప్పు పల్కులు, సుఖావహమైన జవాజి పుల్కులున్
గుప్పను కస్తురుల్, కొదమ గుల్కులు, శేషని మేని తళ్కులున్
కొప్పరపున్ కవీశ్వరుల క్రొత్తల కైతల కోటి పల్కులున్
విప్పు సరస్వతీవదన వీథికి ముక్కర ముద్దు గుల్కులున్

స్నేహాలంబిత వంశసూత్రుడు, వచశ్శ్రీహాసుడాఢ్యుండు, మీ
దౌహిత్రుండగు 'శర్మ' కొప్రపు లసద్వంశంబు ధన్యంబుగా
సాహిత్యాక్షర తర్పణమ్మునిడె దీక్షన్ మీకు గ్రంధాకృతిన్
వ్యాహారశ్రుతి! సుబ్బరాయ కవిరాయా! వేగ పద్యాశ్రయా!

— (signature)




**మాడుగుల నాగఫణి శర్మ**
అవధాన సహస్రఫణి
'మాజీ అధ్యక్షుడు అధికార భాషా సంఘం'

# కొప్పరపు కవి జంట

– 'మహాసహస్రావధాని'

**డా॥ గరికిపాటి నరసింహారావు**

## అవధాన విద్య

మాడభూషి కవీంద్రుని మనసులో జన్మించి సహజ గంధములీను సరసవిద్య
తిరుపతి కవిజంట తిలుకమ్ము దిద్దగా ఏనుంగునెక్కు నవీన విద్య
కొప్రంపు కవిజంట కప్రంపుటాశువులు గుప్పించి ఎదిగిన గొప్పవిద్య
ఎనిమిదై వందయై ఎన్నెన్ని వేలుగా తీగసాగినపద్య తీర్థవిద్య
తెలుగు పద్యము నింటింట త్రిప్పువిద్య
తెలుగు సంస్కృతి ఇన్నేళ్లు నిలుపు విద్య
ఎట్టి విశ్వ భాషలనైన లేని విద్య
ధ్యానయోగమ్ము మా అవధాన విద్య

గంటకు ఐదు వందలు ఎకాయెకి నాక
విమాన లోకపుం
ఘంటిక లూడిపోవునటు గంటలు గంటలు
చెప్పిరంటు మీ
వంటి మహాశుసత్కవులు వందకు వేయికి
ఒక్కరుంద్రు మీ
జంటను గూర్చి జెప్ప పదజాలము లేదు
మహాంధ్ర భాషలో



## ఆశుకవిత్వానికి - అక్షరార్చన

-ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం)

గంటకు 400 పద్యాలు, 500 పద్యాలు ఆశువుగా చెప్పినవారు, చెప్పేవారు తెలుగు సాహిత్య చరిత్రలో 'కొప్పరపు సోదరకవులు' తప్ప ఇక ఎవ్వరు లేరు. నువ్వా, నేనా? అని పరీక్షించడానికే వచ్చి కూర్చున్న పృచ్ఛకుల మధ్య అత్యాశువుగా ప్రబంధ నిర్మాణం చేసిన ఘట్టం చరిత్రలో 'అపూర్వం'. అది కొప్పరపు కవులు ఒకసారి కాదు. చాలాసార్లు చేశారు. ఎక్కడ ఎవరు ఏ ఘట్టం ఇచ్చి ప్రబంధం చెప్పమంటే అప్పటికప్పుడే కొన్ని వందల పద్యాలతో అత్యాశువుగా ప్రబంధ నిర్మాణం చేయడం అనేది ఒక గొప్ప విద్య, అది సరస్వతీ ప్రసాదం. ఇది తలచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

కవులలో మూడు రకాలుంటారని మనవాళ్ళు చెప్పారు. సహజకవులు, ఆభ్యాసిక కవులు, ఔపదేశిక కవులు. మంత్రసిద్ధివల్ల, మంత్ర, తంత్ర, ఉపదేశాలవల్ల కవిత్వ కరణ సమర్థులవుతారు, కావ్య నిర్మాణ దక్షులవుతారు. వీరు ఔపదేశిక కవులు.

"కావ్య మీమాంస"లో రాజశేఖరుడు వీరి గురించి చెప్తూ 'మామూలు మాటలు పలికే వేగం కంటే అత్యంత వేగంగా పద్యాలు, శ్లోకాలు చెప్తారు'. కొప్పరపు సోదర కవులు ఈ శ్రేణిలోకి వస్తారు. బహుశా తెలుగులో వీరే ఇలాంటి మొట్టమొదటి కవులు. వీరు Legendary figures

ఈ మహానుభావులకిదే నా నీరాజనం.



## నివాళి

అరకప్పు కాఫీ తాగి ఆకలి తీర్చుకునే అర్భకుల అర తెలుగుతనానికి అందని అవధాన సాహితీ గగనంలో మెరిసే ఇరుతారలు శ్రీ కొప్పరపు కవులు.

తిరుపతి వేంకట కవులు, కోటసోదర కవులు; వీరిబాటలో వేటూరి వేలూరి కవులు కొడాలి విశ్వనాధ కవులు, వేంకట పార్వతీశ్వర కవులు అవధాన సాహితీ సరస్వతిని అర్చించిన వారే.

అఖండ సృజనాత్మకత, అపార శేముషీ వైభవం, అద్వితీయ సమయస్ఫూర్తి, అనంత ధారణా సిద్ధి కలిగి ఆ వీరకవులు ఆంధ్ర సాహితీ క్షేత్రంలో చేసిన స్వైరవిహారం ఒక సువర్ణాధ్యాయం.

శ్రీ తిరుపతి వేంకట కవులతో పాటు ప్రథమ స్థానీయులై కవితా శిల్పం సల్పిన శ్రీ కొప్పరపు కవులను స్మరించుకోగలగడం నా భాగ్యం.

**వేటూరి సుందరరామమూర్తి.**

17-10-2003



## కొప్పరపు సోదర కవులకు కోటి దణ్ణాలు

**-తనికెళ్ళ భరణి**

"పద్యం తెలుగువాడి స్ఫూర్తి
పద్యం తెలుగు'వాడి' కీర్తి
పద్యం తెలుగువాడి సొమ్ము
పద్యం తెలుగువాడి దమ్ము"

అలాంటి పద్యాన్ని ఈవాళ మ్యూజియంలో పెట్టాల్సిన దుస్థితి వచ్చింది. తెలుగు పిల్లలకు కాన్వెంటులో టీచర్స్ చెప్పే "ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్" కంఠతా వచ్చుగానీ వేమనగారి "ఉప్పుకప్పురంబు" పద్యం రాకపోవడం తెలుగుజాతి దౌర్భాగ్యం.

ఒకనాడు పద్యం పట్టపుటేనుగు నెక్కి ఊరేగింది.
ఊరేగించిన వారు తిరుపతి వేంకటకవులు
తరువాత పల్లకిలో ఊరేగింది
ఊరేగించినవారు కొప్పరపు సోదరకవులు

"శత ఘంట కవనం" వినడానికే విచిత్రం! మనం ఒక పద్యం కంఠతా పట్టడానికే గంట కావాలి. అలాంటిది "కొప్పరపు సోదరకవులు" గంటకు వందల కొద్దీ పద్యాలు ఆశువుగా చెప్పడం సూపర్ కంప్యూటర్ యుగంలో కూడా ఊహించలేని అద్భుతం.

అలాంటి మహానుభావుల కవిత్వాన్ని ఓ పుస్తకంగా తీసుకురావడానికి "మా. శర్మ" చేసిన 'యజ్ఞం' సామాన్యమైనది కాదు. అతడు ఈ కృషితో తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా సోమయాజియైపోతాడు.

గత 30 ఏళ్ళుగా "కొప్పరపు సోదరకవుల" వ్యక్తిత్వాన్ని ఆరాధించి, సాహిత్యాన్ని ఆస్వాదించి మనకి అద్భుతాన్ని ప్రసాదిస్తున్న డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ గారు కృష్ణ దేవరాయల కాలంలో పుట్టుంటే 'గండపెండేరానికి' అర్హులు.

ఈ పుస్తకం మళ్ళీ తెలుగులోను, తెలుగు వాళ్ళలోను పద్యం పట్ల మక్కువను ఎక్కువను చేసే మాధ్యమంగా పనికొస్తుందనీ... తెలుగు సారస్వత సరస్వతికి కర్పూరపు నీరాజనాలిచ్చి ఆ పరిమళాలను శాశ్వతం చేసిన 'కొప్పరపు సోదరుల' ఆత్మలకు – ప్రదక్షిణం చేసే అస్మదాదులింకా ఉన్నారనీ నాకు ఒకానొక నిబద్ధ విశ్వాసం.



# సంపాదకీయము

కొప్పరపు సోదర కవులనగా కొప్పరపు వేంకట సుబ్బరాయ కవి (1885-1932), కొప్పరపు వేంకట రమణ కవి (1887-1942). వీరు గుంటూరు జిల్లా యందలి నరసరావుపేట ప్రాంతము నందలి కొప్పరము గ్రామ వాసులు. వీరు సోదరులు. అందువలన కొప్పరపు సోదర కవులుగా ప్రసిద్ధులు.

వీరు ఆశువుగా గంటకు నాలుగు వందల పద్యములను ఎన్నోమారులు పండితుల సమక్షమున చెప్పిన అసాధారణ ప్రతిభావంతులు. "బాలసరస్వతి", "ఆశుకవిచక్రవర్తి", "కథాశుకవీశ్వర" మొదలగు అనేక బిరుదములను పండితులచేత పొందినవారు. పండితులు వీరి శక్తికి నీరాజనము పట్టి చెప్పిన ప్రశంసాపద్యములే సహస్రాధికముగా కలవనియు, వీరు ఆశువుగా చెప్పిన పద్యములు లక్షల కొలదిగానున్నవనియు సమకాలిక పండితుల సాక్ష్యములున్నవి.

ఇంతటి ప్రతిభావంతుల లక్షల పద్యములు లిఖిత రూపము ధరింపక గాలిలో కలసిపోవుట ఆంధ్రుల దురదృష్టము. వారు పల్కిన పల్కులన్నియును పద్యములే. ఎన్నని వ్రాయగలరు? సమకాలిక పత్రికలు కొన్నింటిని ప్రచురించినవి. కాని నేడు అవి అలభ్యములు.

మదరాసు సభలను గూర్చి, గుంటూరు సభలను గూర్చి చిరుమామిళ్ల లక్ష్మీనారాయణ ప్రసాదుగారు, అట్లే కాకినాడ సభలను గూర్చి చేగంటి బాపిరాజు గారు సేకరించి ప్రచురించిన చిన్న పుస్తకములే ప్రధానములైన ఆధారములైనవి. ఈ ఇరువురి మహానుభావులకు ఆంధ్ర సాహిత్య లోకము ఎంతయో ఋణపడి యున్నది.

శిథిలావస్థలోనున్న (1911వ ప్రాంతమునాటి) ఈ రెండు సంకలన ములను, అచ్చుటచ్చుట అచ్చైన కొన్ని అవధానములను, కొన్ని పద్యములను కష్టపడి సేకరించి, విరాళములు పోగుచేసి పునర్ముద్రణము కావించినవారు కుంటముక్కల

వేంకట జానకీరామ శర్మగారు. శర్మగారికి కొప్పరపు సోదర కవులపై గల అభిమానము వర్ణనాతీతము. శర్మగారు పునర్ముద్రణముచేయనిచో లక్ష్మీనారాయణ ప్రసాదుగారి, బాపిరాజుగారి సంకలనములుకూడ కాలగర్భములో కలసి పోయెడివి.

కొప్పరపు సోదర కవుల ప్రతిభను తరువాతి తరముల వారికి అందజేసిన మహానుభావులు ఈ ముగ్గురు.

జానకీరామశర్మగారు ప్రచురించిన గ్రంధములు కూడ వృద్ధుల చెంత శిధిల స్థితిలో నున్నవి.

జానకీరామశర్మగారు ప్రచురించిన కొప్పరపు సోదర కవులకు సంబంధించిన సాహిత్యమును, నేను సేకరించిన మహాకవి కాళ్లకూరు నారాయణ రావు గారు వ్రాసి మనోరంజనీ పత్రికలో ప్రచురించిన "కొప్పరపు సోదర కవులు– ఆశుకవిత" అను వ్యాసమును, మరికొన్ని ఆధారములను, అన్నింటిని చేర్చి ఒక ప్రణాళికవేసికొని ఈ గ్రంథమును నేను రూపొందించుట జరిగినది.

ఈ కార్యక్రమము సంపూర్ణము చేసి అచ్చునకు ప్రతి సిద్ధము చేసిన సంస్కార ఫలముగా, నేను "కొప్పరపు సోదర కవులు" అనునొక 150 పుటల సమీక్షా గ్రంధమును వ్రాసి ప్రచురించినాను (ఫిబ్రవరి 2003).

ఎందరో పెద్దలుండగా ఈ కార్యక్రమమును భగవంతుడు నాచేత చేయించుట నా అదృష్టము, నా పూర్వజన్మ సుకృతము.

గుంటూరు,
నవంబర్ – 2003.

బుధజన విధేయుడు,
***గుండవరపు లక్ష్మీనారాయణ***



# పీఠిక

**"కొప్పరపు సోదరకవులు"** 'మహాకవి' శ్రీ కాళ్లకూరి నారాయణరావు గారి మాటలలో

"సభలోన మాటాడ జాలుటే గొప్ప, ప
  ద్యములతో నగుట చోద్యంబు గాదె!
తడబడుచైనఁ బద్యంబల్లుటే గొప్ప,
  పరమాశుధార యబ్రంబు గాదె!
అడిగిన పద్యమొండైనఁజెప్పుట గొప్ప,
  గంటకేనూఱు లక్కజము గాదె!
ఉర్విలో నిట్టి వారొకరు పుట్టుటే గొప్ప,
  యిరువురొక్కింట నచ్చెరువు గాదె!"

ఇంతటి కొప్పరపు కవుల గురించి నేటికీ చాలామందికి తెలియదు. వీరి సాహిత్యంతో చాలామందికి సాన్నిహిత్యం లేదు, పరిచయమే లేదు. టేప్ రికార్డర్స్, వీడియో కెమేరాలూ ఆ కాలంలో ఉండి ఉంటే రికార్డు స్థాయిలో 'ఆశుకవితా విన్యాసం' చేసిన వీరి సాహితీ సర్వస్వం మనకు 'సంపదగా" ఉండిపోయేది. అయితే ఉండి 'పోయింది', 'రికార్డర్స్' లేక....

'ప్రజాకవి'గా వేమన పరిచయమవడానికి బ్రౌన్ దొరగారి కృషి ఎంత ఉందో అందరికీ తెలిసిందే మన సంస్కృతిపైన ఉన్న మక్కువతో ఆయన చాలా ప్రాంతాలలో శోధించి, తాళపత్రాల రూపంలోనూ మౌఖిక సంప్రదాయంలోనూ దాగి ఉన్న వేమన సాహితీ సంపదను సాధించి, అచ్చు వేయించి తెలుగుజాతికి వెలుగు చూపించారు. జాతి సర్వస్వం బ్రౌన్ మహనీయునికి ఋణపడే ఉంటుంది. అట్లాగే కొప్పరపు సోదరకవుల వాక్ ప్రవాహాన్ని, స్వయంగా చూసి, ఆనందపడి, ఆశ్చర్యం చెందిన 'అభిమాని–ధనం'లో ఒక విలువైన 'రూపం' అయిన కుంటముక్కల జానకీ రామశర్మ గారు 70 ఏండ్ల పైబడిన వయస్సులో అవిశ్రాంత కృషి చేసి కొప్పరపు వారి సాహిత్యాన్ని సేకరించి శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ గారికి అందజేస్తే, ఈనాడు "కొప్పరపు సోదరకవుల" గురించి తెలుసుకోవడానికి ఒక గ్రంథం రూపంగా బయటకు వచ్చింది.

శ్రీ 'లక్ష్మీ' నారాయణునికి,
'సరస్వతీ' పరాయణునికి,
కృతజ్ఞతాభి వందనాలు,
అభినందనలు.

"కొప్పరపు సోదరకవుల కవిత్వము" పుస్తకానికి "పీఠిక" వ్రాయటమంటే అవధాన సరస్వతీపీఠానికి ప్రార్థనాగీతం ఆలపించటంలా భావిస్తాను. ఏ పూజఫలమో! ఏదేని వరమో! ఈనాటి భాగ్యంగా భావిస్తాను.

జంటకవులుగా, అవధానకవులుగా, ఆశుకవులుగా తిరుపతి వేంకటకవులు, కొప్పరపు సోదరకవులు, వేంకట రామకృష్ణ కవులు పాండితీ లోకానికి చిరపరిచితులు, స్థిరపరిచితులు. కొప్పరపు సోదరకవుల ఆశుకవిత్వం అద్వితీయమని అందరికీ తెలిసినా, ఆప్రవాహ వేగం, ఆ సాహితీ సారం, ఆ అవధాన యాగం, యోగం చాలా వరకూ పూర్తిగా తెలియదు. ఎందుకంటే వీరి విషయాలు గ్రంథ రూపంలో ఎక్కువగా లేకపోవడం, సాహిత్య చరిత్ర పుస్తకాల్లో సహితం వీరిగురించి చాలా తక్కువగా స్పృశించి ఉండటం.... 'కొప్పరపు సోదరకవులు' కొన్ని వందల అవధానాలు చేసి, లక్షల పద్యాలు ఆశువుగా చెప్పి, ఆశువుగా ప్రబంధాల నిర్మాణం చేసి, ప్రబంధస్థాయి వర్ణనలతో సంపూర్ణ శతావధానాలు నిర్వహించి, నాటకాలూ, కావ్యాలూ వ్రాసినా...అవన్నీ కాలగర్భంలో కలసిపోగా, వీరి అవధానాలు ఆశుకవిత్వ సభలలోని కొన్ని వర్ణనలు సమస్యాపూరణలతో కూడిన కొన్ని వందల పద్యాలు మరియు ఆనాటి (ఏనాటికీ) మేటి పండితుల ప్రశంసల కలయికగా ఏర్పడిన ఈ పుస్తకం సాహితీ జిజ్ఞాసువులకు కొంత సేద తీరుస్తుంది; వీరిని గురించి తెలియని వారికి ఒక మార్గం ఏర్పరుస్తుంది. ఈ సేద తీరడం వెనుక, కుంటముక్కల వేంకట జానకి రామశర్మ గారి 'స్వేదం', శ్రీ లక్ష్మీనారాయణ గారి 'జీవనాదం' ఉన్నాయి. ఈ స్వేదనాదాలే నిర్వివాదంగా భావివేదాలు అవుతాయి.

32వేల సంకీర్తలు వ్రాసిన 'పదకవితా పితామహుడు' అన్నమయ్య, ఐదు తాళాలను ఒకేసారి ప్రదర్శించిన 'సకలకళాసమ్రాట్' ఆదిభట్ల నారాయణదాసు, 'భారతీయత'ను ఖండాంతర వ్యాప్తి చేసిన స్వామి వివేకానంద, నడుస్తున్న

రైలుబండిని బాహుబలంతో ఆపిన 'కలియుగ భీముడు' కోడి రామమూర్తి, గంటకు 500 పద్యాల వేగ వాక్సృష్టి కల్గిన 'ఆశుకవి చక్రవర్తులు' కొప్పరపు సోదర కవులు వీరంతా కారణ జన్ములు అద్వితీయులు, విద్వన్మణులు, గనులు, ఘనులు.

జ్ఞాపకాల నీడలలో, ఆ సాహిత్యపు ఊడలలో, ఆ సాంస్కృతీ వాడలలో, నిరంతరం తరంతరం నివసిస్తూ ఉండాలి, ఉందాం, ఉంటాం. "ITALIAN OF THE EAST" అని వారెవరో చెప్పడం కాదు, భారతీయ భాషలలో హిందీ తరువాత అత్యధికంగా మాట్లాడే రెండవ భాష 'తెలుగు' అని నిర్మాణాత్మకంగా మనమే తెలియజేస్తూ, తెలుగు వారి ఆస్తి అయిన "పద్యాన్ని" కలకాలం స్మరిస్తూ స్వరించుకుందాం.

"తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ!
ఎల్లనృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశభాషలందు తెలుగులెస్స" అనికదా, ఆర్యవాక్కు!

విధేయతతో,

**మా. శర్మ**

**(మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ)**

శ్రీ కొప్పరపు కవుల కళాపీఠం వ్యవస్థాపక అధ్యక్షుడు



# విజ్ఞప్తి

బాలసరస్వతి, ఆశుకవీంద్రసింహ, ఆశుకవిచక్రవర్తి, కుండినకవిహంస, కవిరత్న, అవధాని పంచానన, కవి కేసరి, కల్పిత కవితా రచనాధురీణ, కవిభూషణ, ప్రౌఢభారతి, కధాశుకవీశ్వర, ఆశుకవిశిఖామణి, ఆశుకవిసమ్రాడిత్యాది బిరుద విరాజితులును, జగద్విఖ్యాత యశోధురంధరులును, శతావధానులునైన, బ్రహ్మశ్రీ వేంకట సుబ్బరాయశర్మ, వేంకట రమణశర్మ నామక కొప్పరపు సోదర కవులచే నొనర్పఁబడి ముద్రణమునొంది, దాదాపిప్పటికి ముప్పది సంవత్సరముల క్రిందట నాకు లభించిన, గుంటూరు, బాపట్ల, విశదల, చీరాల, పంగిడిగూడెముల శతావధానాదికము లెన్నియోమారులు పఠించి, యందలి మృదుమధుర వాక్సుధారస మహాప్రవాహంబున నోలలాడి, యమితానందభరితుండనైతినని వాక్రుచ్చుట యతిశయోక్తి కానేరదు.

ఏతదవధానము లిప్పుడెచ్చటను లభించుటలేదు. అందుచే వాని నన్నిటినిఁ బునర్ముద్రణ మొనరించి, లోకవ్యాప్తి నొందింపఁ జేయవలయునను సంకల్పము, కొంత కాలమునుండి నన్నుఁ బ్రేరేప, డెబ్బది సంవత్సరముల వయోవృద్ధుఁడను, నశక్తుండనైన నేనీకార్యరంగమునకు దిగక తప్పినదికాదు.

కొందఱఁబిన్న పెద్దలను సందర్శించి, వారికి నా సంకల్పము నెఱింగించి నంతనే తమ యామోదమును వెల్లడించి, నేను గోరిన ప్రకారము ధనమిచ్చి, ధైర్యోత్సాహములు గలిగించి, మదాశయసిద్ధికిఁ దోడ్పడిరి. అట్టి అభిమానవంతులకును, తెనాలి మారీసుపేట వాస్తవ్యులు బ్రహ్మశ్రీ యల్లంరాజు సూర్య నారాయణ పంతులు, బి.ఏ.బి.యల్, అడ్వొకేటుగారి ప్రోత్సాహమున, చీరాల శతావధాన పునర్ముద్రణమునకు వలయు ధనమొసంగి, నన్నుఁ గృతార్థుఁజేసిన, తెనాలి గంగానమ్మపేట కాపురస్థులు శ్రీ సంకా సుబ్బారాయఁడుగారి దత్త పుత్రులు, వణిక్పుంగవులు, వదాన్యులునగు శ్రీ సంకా వేంకటేశ్వర్లు గారికిని, భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యము లొసంగి రక్షించుఁగాత.

సోదరకవులను బ్రశంసించు పండితకవుల పద్యభాగమునకు, 'కొప్పరపు కవుల యశోడిండిమ'మనుపేరు పెట్టితిని. ఆ పద్యములనెల్ల నెంతో శ్రద్ధతో సంపాదించి యేఁబది సంవత్సరములకుఁబూర్వమచ్చొత్తించిన, శ్రీచిరుమామిళ్ళ లక్ష్మీనారాయణ ప్రసాదు, బి.ఏ., గారికిని, కాకినాడ సభా వృత్తాంతముల సేకరించి ప్రకటించిన శ్రీ చేగంటి బాపిరాజుగారికిని, మున్ముందు నా కృతజ్ఞతఁ దెలుపు చున్నాను.

కవులయెడ వారికిఁగల యపారాభిమానముచేతను, నాయందలి వాత్సల్యముచేతను, వార్ధకానారోగ్య నేత్రావరోధముల సరకుసేయక, ముద్రణ స్ఖాలిత్యముల నప్పటికప్పుడు సవరించి యిచ్చుచు, నా భారమును తగ్గించిన ఉభయ భాషా ప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర, విద్యానాథ, కవితామహేశ్వర బిరుదాం చితులు శ్రీ మద్గురు భాగవతాద్యనేక గ్రంథకర్తలునైన బ్రహ్మశ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

నేను గోరినప్రకారము విరాళము నొసంగుటయే గాక, నా కృషిలోఁ దామును బాలుగొని, శ్రీ సంకా వేంకటేశ్వర్లు గారిచే, చీరాలశతావధానమునకగు ధనము నిప్పించిన బ్రహ్మశ్రీ యల్లంరాజు సూర్యనారాయణ పంతులు, బి.ఏ., బి.యల్., అడ్వొకేటుగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనశతంబులు.

గ్రంథమును నిర్దుష్టముగా సకాలమునకు ముద్రించియిచ్చిన 'హిందీప్రెస్ ప్రొప్రయిటరు' గారగు శ్రీపతి పండితారాధ్యుల మృత్యుంజయ శర్మ గారికి నా నమస్కారములు.

శక్రుఁ డాహ్వానమంపఁగా సమ్మతించి
స్వర్గమునకేగి యచ్చట సౌఖ్యమొందు
కొప్పరపు సోదరకవుల గొనబు కృతులు
శతవధానంబులివిగొని చదువరయ్య!

పెనుగుదురుపాడు — ఇట్లు,
శుభకృన్మకర సంక్రాంతి — బుధ విధేయుఁడు
14-1-1963 — **కుంటముక్కల వేంకట జానకీరామశర్మ**

# కవి పరిచయము

సోదరులారా!

కవిత్వ మొకకళ, దానినాశువు మధురము చిత్రము విస్తారమునని కొందఱు, నాశువు గర్భము బంధము చిత్రమునని కొందఱు నాలుగు తెఱఁగు లొనర్చిరి. ఉభయమతములందాశువున్నది. ఆ యాశుకవితా సరస్వతి వేములవాడ భీమకవి నాడించినది. ఆవల శ్రీనాథుని చెట్టఁబట్టినది. పిదప నల్లసాని పెద్దనంజేరి కాలికిగజ్జెగట్టి కదనుద్రొక్కినది. రామరాజభూషణుని రచ్చకెక్కించినది. గణపవరపు వేంకటకవిని గణనకుఁ దెచ్చినది. కంకంటి పాపరాజును మిన్నంటనెత్తినది. తక్కిన వారెవ్వరుఁ దమగ్రంథములలో నాశుకవులమని చెప్పుకొనలేదు. అటుమీఁద మోచర్ల వెంకన్న, పిండిప్రోలు లక్ష్మణకవి, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, తురగా వెంకమురాజు మున్నగు వారితో ముచ్చటలాడి పిమ్మట నీయాశు విరువదవశతాబ్ది ప్రవేశించుచో నొక వెలుఁగు వెలిఁగినది. పట్టణము పట్టణము పల్లె పల్లె తిరిగి పట్టపగ్గములులేక మహోద్దండ తాండవము సలిపి మహాజనమునుఱ్ఱూఁతలూఁపినది. మహా పండితులైన నంతపనిచేయలేదు. అదియొక కవులకే తగిపోయినది. కవులైన నొక్కచో నున్నచో నంతపని చేయలేరు. దేశాటనముచేయు నవధాన కవులే చేయఁ గలరు. అవధాన కవులైనఁ గేవలవధానములు సలుపుచు జనసామాన్యము నంతయు నానందపెట్టలేరు. అవధానములలో నవధానియుఁ బృచ్ఛకుఁడునే

కుస్తీపట్టునది. తదితరులకా కష్టముగాని యా యానందముగాని యుండదు. అవధానియగు వాఁడాశుకవియైననే వీరని వారని లేక యెల్లర నానందపెట్టఁ గలఁడు. అట్టివారెప్పుడో యెక్కడనో కాని పుట్టరు. ఆంధ్రులయదృష్టవశమున నట్టివారు కొప్పరపుసోదర కవులవతరించిరి.

వీరి నివాసస్థలము గుంటూరుజిల్లా నర్సరావుపేట తాలూకా కొప్పరము గ్రామము. తండ్రి కొప్పరపు వేంకట రాయఁడుగారు. తల్లి సుబ్బమాంబగారు. ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. కౌండిన్య సగోత్రులు. వేంకటరాయఁడు గారికి ప్రథమపుత్రుఁడు వేంకటసుబ్బరాయ కవి. వీరి జననము 12-11-1885నకు సరియగు పార్థివ సంవత్సర కార్తిక శుద్ధ గురువారము. రెండవపుత్రుఁడు వేంకటరమణ కవి. వీరి జననము 30-12-1887 తారీఖునకు సరియగు సర్వజిత్సంవత్సర పుష్య బ౹౧ శుక్రవారము. మూఁడవ పుత్రుఁడు బుచ్చి రామకవి. జననము 9-12-1892. నాల్గవపుత్రుఁడు లక్ష్మీనారాయణ. వేంకట రాయఁడుగారికి పుల్లమాంబ, లక్ష్మీనరసమ్మయను నిర్వురు పుత్రికలు గలరు. ఇందుఁ బ్రథమ ద్వితీయులగు వేంకట సుబ్బరాయ వేంకట రమణ కవులే సోదర కవులు. వీరి గురువులు బ్రహ్మశ్రీ పోతరాజు రామకవిగారు. బ్రహ్మశ్రీ రామడుగు రామకృష్ణ శాస్త్రిగారు, సోదరకవులష్టావధాన శతావధానాశుకవిత్వ సభలు కొన్ని వందలు చేసిరన్న నతిశయోక్తి కాదు.

సోదరకవుల మేనమామలున్నది నేనున్న యేల్చూరు గ్రామమగుటచే నచ్చటికి వీరప్పుడప్పుడు వచ్చుచుందురు. వీరెక్కడఁ గూర్చున్న నక్కడ జనులు గుంపులు గుంపులు కూడుచుందురు. 1912లో నా పదునాల్గువయేట నేల్చూరులో శ్రీ వేంకటసుబ్బరాయ కవిగారి ప్రథమ దర్శనభాగ్య మొదవినది. నేను గన్పించుట తోడనే చిఱునవ్వుతో "కుశలంబే మిన్నికంటి గురునాథ కవీ" అని పద్యముతో నడిగిరి. నేను నవ్వుచునూరకుండఁగా నీసారినేను వచ్చునప్పటికి నీవు పద్యములతో నుత్తరమీయవలయుననిరి. నేనట్లే వారు వచ్చినపుడింటనే రెండు పద్యముల

గుణించుకొనిపోయి వారడిగినపిదపఁ గుశలముగా నుంటినని యొక కందము, తమ రెప్పుడు దయచేసితిరని యొక కందము చెప్పఁగా వారు బ్రహ్మానందభరితులైరి. అవలవారూరికేగుచునబ్బాయినాయఁడు వ్యాకరణమంపెదను దానింజదువు కొనుమనిరి.

వేంకట సుబ్బరాయకవి మిక్కిలి చక్కనివాఁడు. జాళువా పసిఁడి చాయ మేను. పాలుగాఱు మొగము, చెంపకు చేరెఁడేసి కన్నులు. కంఠధ్వని కంచు మ్రోఁగినట్లుండును. వర్ణోచ్చారణము విస్పష్టముగా నుండును. ప్రాస్తావికశ్లోకములు పద్యములు నెన్నివేలు వచ్చునో చెప్పలేము. మెలితిరిగిన మీసములు మిలమిలలాడ, చిఱునవ్వుకాంతులు చిందులాడ, నిద్దంపు చూపులు నిగనిగలాడ, హస్తకంకణ మందలి యన్నువగంట యల్లలనాడ స్నిగ్ధ గంభీర నిర్ఘోషముతో నొనర్చుచున్న ప్రసంగము విను శ్రోతలు కాలమెంతచన్నది తెలియక యట్టె మ్రాన్పడి వినుచుందురు. వినువారికి విసువుపుట్టకుండ గంటల కొలఁది ప్రసంగ మొనర్చు చుంటయు నొకకళయే. అందఱు నేదియో రిత్తకల్పించుకొని మాటాడనేరరు. వీరు తొమ్మిది పదియేండ్ల యీడుననే తండ్రితనను షాహుకార్లకడకు వెంటఁ బెట్టుకొనిపోవ నప్పుడు తాను చదువుకొనుచున్న రఘువంశమందలి 'యథాకాల ప్రబోధినామ్' మున్నగు రాఘువుల యాచార వ్యవహారముల నభివర్ణించు శ్లోకములం జదివి తదర్థము వివరించి మనమునిట్లుండ వలెనని చెప్పఁగా వారందఱు ముచ్చటపడి మెచ్చుకొని తృణమోకణమో యిచ్చి పంపెడివారఁట. వీరట్లు గడించి కొన్న ధనముతో నుపనయనము జరిగినదట. పెండ్లియు వీరికిఁజిన్నతనముననే జరిగినది. కాఁపురమునకు రాకుండఁగనే భార్య గతించినది. పిమ్మట రెండవ వివాహము జరిగినది. ఆమె చాలకాలమునకుఁగాని కాఁపురమునకు రాలేదు.

వీరు యౌవనదశయందు బ్రహ్మచర్యవ్రతమును దీక్షగా సాగించిరి. "వాని చక్కఁదనము వైరాగ్యమునఁజేసి, కాంక్షసేయు జారకామినులకు, భోగ బాహ్యమయ్యె"నని స్మరించి మేమందఱము వీరిని రెండవ ప్రవరుఁడనుకొనెడి

వారము. శృంగారరసమును లెస్సగావర్ణించు భావసంపదగల సత్కవి. నిండు ప్రాయమున నస్ఖలిత బ్రహ్మచారిగానుంట నేటికాలమందరిదిగదా. ఈవిషయమై వీరొకరితో నిట్లనిరి (35 పుట).

నాఁడునునేఁడునేమి? యొకనాఁటికిబోటికిఁ జిక్కఁబోము పూ
బోఁడుల గోడులందగిలి పోఁడిమి మాన్పఁగ లాభమేమి మా
కూడికకర్థ్వలంచు, విధికూర్చినవారలు గల్గిరింత, కే
బోఁడులతోడ నేమిపని? పూర్ణయశస్కుల కిట్లెఱుంగుమా!

వీరు శౌచము నేమఱనివారు. శిష్యుఁడు చెంబుపట్టుకొని వెంటరాఁగా నూరివెలుపలికేగి వచ్చెడివారు. చెవిజందెముతోఁ దలగుడ్డతో వారువచ్చునప్పటికి పంచయరుగుపై రెండు నీళ్ళ చెంబులు సిద్ధముగా నుండెడివి. ఎనిమిదిసార్లు గండూషించవలసినదే. వీరింటిదగ్గఱనున్నపు డుదయస్నాన సంధ్యావందనములు జపము చేసికొనెడివారు. ఇంతయద్భుతశక్తి వారికుండుట కేమంత్రబలమోయని మేమనుకొనెడివారము, వీరెప్పుడు విక్రయాన్నపానము లెఱుఁగరు. సభలకేగినపు డాహ్వానించినవారే గౌరవింతురుగదా. మధ్యాహ్న పదార్థములరాత్రి ముట్టరు. వీరికిఁ బ్రతిదినము మాపటివేళ కందిపచ్చడి తప్పకయుండవలె. వీరికిఁ బొడుము పీల్చు పండితలక్షణములేదు. పొగత్రాగు పామరలక్షణము లేదు. గోదావరివారి వలె తరవాణి త్రావరు. దక్షిణాదివారివలె కాఫీ త్రాగరు. వీరికింటిసంగతులేవియుఁ దెలియవు. పట్టించుకొనరు. వ్యవసాయమున్నది. జీతగాఁడున్నను నది బ్రాహ్మణ వ్యవసాయమే. ఆయాపనులఁ దమ్ములేచూచుకొందురు. వీరికేకాలము పాడి యుండెడిది. వీరి యింటికి సింహద్వారముత్తరమున నుండును. ఇంటిముందు పంచకలదు. ఆ పంచలో వాఁకిలికిఁదూర్పుగాఁ బెద్దయరుగుపాలగచ్చు చేసినది గలదు. అందుఁజాపపై వీరుకూర్చుండి సారస్వతసేవసేయుచుందురు. చుట్టును బుస్తకములు పడియుండును. పంచలోఁ బడమటివైపొక చిన్నయరుగునందుఁ బుస్తకములుండుగది కలదు. వీరన్న నింటనందఱకు భయమో గౌరవమో లేక

యుభయమో యుండెడిది. 1913 ప్రాంతమున ఓంకారము గురవరాజకవి వీరింట నన్నముదిని చదువుకొనుచుండెను. ప్రతిదినము వీరిందర్శింప నెవరో యొకరు వచ్చుచునేయుందురు. వచ్చినవారినెందఱనైన నేకులమువారినైన భుజింపకుండఁ బోనీయరు.

వీరు సభలకేగునపుడు తమ రెండెద్దులగూడు బండిలోఁ గూర్చుండి యెదురుగా సోదరిపుల్లమ్మగారు వచ్చునట్లేర్పఱచికొని వెళ్ళుచుందురు. కొప్పరము నకు సంతమాగులూరు రైల్ స్టేషన్ 5మైళ్ళలోనుండును. 1913లో నేలూరు హైమవతీ కల్యాణమున కస్మదాదులము కవులము కొప్పరము నుండియే రెండు బండ్లపై స్టేషనుకుఁ బోతిమి. వారిబండిలో నెక్కినవారినూరకుండనిచ్చిరా? ఆ ప్రయాణముంగూర్చి యొక్కొక్కరు తప్పక పద్యము చెప్పవలసినదేయనిరి. అందెవ్వరే నొక్క పాదముచెప్పి యాలోచించుచుండ నాపద్యమును వారేపూర్తిచేసి యావలి వారింజెప్పుమనెడివారు. స్టేషనుకుఁ జేరువఱకు నీపద్యవర్షములే.

రైలువచ్చిన పిదప స్టేషనుమాష్టరువచ్చి మమ్ము పదిపదునైదుమందిని నొకపెట్టెలోనే యెక్కించిరి. ఒకపెట్టెకడకు వీరురాఁగా పెట్టెలోనుండి రండు దయ చేయుఁడన్న మాటలు వినిపించెను. ఆయన్నవారికి నామాల పసయేగాని యాకారపు పసలేదు. అందఱము పెట్టెలోఁగూర్చున్న పిదప వారు మీరాబాయి పుస్తకముదీసి వీరికీయఁగా నప్పుడు వారు శ్రీమాన్ రాళ్ళపల్లి యనంతకృష్ణశర్మ గారనియు మైసూరు మహారాజావారి కాలేజీలో పండితులనియుఁ దెలిసికొంటిమి.

వీరు 1. అలవాల లష్కరులో బ్రహ్మశ్రీ ఆదిరాజు తిరుమలరావుగారి మహాసభలో "ముంగాలి" బిరుదునందిరి. 2. మణికొండ ఆస్థానమున మ.రా.శ్రీ. తాటిరెడ్డి గోపాలరెడ్డి జమీందారువారిచే 'బాలసరస్వతి' బిరుదమును, 3. నెల్లూరులో మహాసభాజనులచే 'ఆశుకవీంద్ర సింహ' బిరుదమును, 4. బుచ్చిరెడ్డి పాలెములో మ. బెజవాడ పట్టాభిరామరెడ్డిగారిచే 'విజయ ఘంటికా' బిరుదమును, 5. మదరాసు మహాజనసభలో విజ్ఞాన చంద్రికామండలి వారిచే 'ఆశుకవి చక్రవర్తి' బిరుదమును,

6. మద్రాసులో మతౌకసభలో 'విజయఘంటికా' బిరుదమును, 7. గుంటూరులో మహాసభాజనులచే 'కుండినకవిహంస' బిరుదమును, 8. గుంటూరు సోమసుంద రేశ్వరాలయ సభలో 'కవి రత్న' బిరుదమును, 9. బాపట్లలో మహాసభాజనులచే 'అవధాని పంచానన' బిరుదమును, 10. మార్టేరులో మహాసభా జనులచే 'కధాశుకవీశ్వర' బిరుదమును బొందిరి. 11. ఏలూరులో శ్రీ రాజామంత్రి ప్రెగడ భుజంగరావు బహద్దర్ జమీందారుగారు తమ ప్రథమ పుత్రికయగు హైమవతి పరిణయమునకు నలుదిక్కులనున్న పండితకవుల నందఱ నాహ్వానించిరి. పెండ్లికి వచ్చిన కవులందఱకు శాలువలనేగాక రానుపోను ఖర్చులంగూడ నిచ్చిరి. వధూ వరులనాశీర్వదించిన 233 మంది కవులచరిత్రలను "ఆధునిక కవి జీవితములు" అను పేర నొక గ్రంథమునచ్చొత్తించి భాషకెనలేని యుపకారమొనర్చిన రాజాగారు చిరస్మరణీయులుగదా. ఆ పెండ్లి నాకబలినాఁడు 22-12-1913 కొప్పరపు కవుల యాశుకవిత్వ సభ జరిగినది. శ్రీవేదము వేంకటరాయశాస్త్రులవారధ్యక్షులుగా నుండిరి. మహా? మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు శ్రీవడ్డాది సుబ్బారాయ కవిగారుమున్నగు పండిత కవులెల్ల సభనలంకరించిరి. హైమవతీ కల్యాణమాశువుగాఁ జెప్పఁబడెను. సభాంతమున వేంకటరాయశాస్త్రిగారు "వీరి కవితా విశేషము గంగాప్రవాహమువలె నుల్లసిల్లుచు వినువారల కానందము గల్గించు చుండె. నేనెన్నఁడు నింతటి శీఘ్రరచనంజూచియుండలేదు" అని ప్రశంసించిరి. బ్రహ్మశ్రీ పేరి కాశీనాథశాస్త్రులవారు శ్లోకరూపమునఁగొనియాడిరి. శ్రీరాజా వారయ్యాశుకవుల కిద్దఱకు "ఆశుకవిశిఖామణి" అను బిరుదాక్షరములతోఁ గూడి నట్టియు, మణిఖచిత మధ్యదేశంబులునగు సువర్ణ కంఠాభరణములు చెఱి యొకటి పారితోషికమిచ్చిరి.

వీరాశువుంజెప్పు నపుడెంతటి వ్రాయసకాఁడును వ్రాయలేఁడు. కారణము? పద్యములను జెప్పుచో తడవుకొనరు. ఆలోచించుచు నాలసింపరు. వేసినపదముందీసి వేయరు. వచ్చినపద్యముల నొప్పగించునట్లు సమమైన వేగముతోఁ బద్యములను నడిపించుకొని పోవుచుందురు. వీరెక్కువగా దుష్కర

ప్రాసములతోనే పద్యములు చెప్పుదురు. అట్టివి వారికి మంచినీళ్ళప్రాయము. వీరి యాశువు విన్నపిదప నేదో యావేశ మేదో యుత్సాహముకల్గి యెందఱో నవకవులు నాశుకవులు పెల్లుబికిరి. ఉన్నతపాఠశాలలోను, కాలేజీలలోను విద్యార్థులాశువున కుబలాటపడసాగిరి. వీరి యాశుకవిత్వ సభలు చాలమంది కవులను లేవఁదీసినవి. ఆనాఁడు వీరి యాశువుంబ్రశంసింపని కవిలేఁడు. చూడుఁ డీ పుస్తకమును. తిరుపతి వేంకటేశ్వరకవులు వీరిని బ్రశంసించిరి. వీరును వారిని బ్రశంసించిరి. మొదట మైత్రితోనున్న యీ జంటలకు దురదృష్టవశమున నడిమివారు 1911 సం. విరోధము పెట్టిరి. కవులకలహము పాండితీబల పరిశీలన పరివ్యాప్తమైన భాషకుఁబరివృధవే కాని యట్లుకానిచో మాత్రమది తీరనియపకారమున కాశ్రయమై నిలిచిపోవును.

కొప్పరపు కవులు 1911నకుఁబూర్వమొనర్చిన యవధానములనచ్చైనవాని నేనుజూడలేదు. కాని యప్పటికే వీరి యవధానములు నాశుకవితాసభలు మద్రాసు రాజధానిలో జరిగినవి. కావ్యకంఠగణపతిమునులు, వావిలికొలను సుబ్బారావు గారు, శతఘంటము వేంకటరంగశాస్త్రి, చెన్నాప్రగడ భానుమూర్తి, ముదిగొండ నాగలింగశాస్త్రి మున్నగువారానాటి పండితులు, కవులునందరు వీరిం బ్రశంసించిరి. తిరుపతి వేంకటకవుల శిష్యులు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు “వీరలాశుకవితోద్య ద్రాజ్యపట్టాభిషేకమునందందగునట్టి దిట్టలని వక్కాణింతు నిక్కమ్ముగన్” అనిరి. యశోడిండిమముంజూడుఁ, డెందఱుకవులెట్లు వీరిని బొగడిరో.

మద్రాసు రాజధాని పండిత కవుల కంఠరవముదెసలఁబ్రాకినపిదప (15-9-1911) బాపట్లలోను, (17-9-1911) విశదలలోను, (1-10-1911) గుంటూరులోను, (16-10-1911) చీరాలలోను వీరిశతావధానములు జరిగినవి. అవి ముద్రింపఁ బడినవి. (25-5-1912) కాకినాడ సభలు ప్రారంభములైనవి. తిరుపతి వేంకటేశ్వరకవులలో దివాకర్ల తిరుపతి శాస్త్రిగారి నాస్థానపండితులుగా నుంచుకొన్న పోలవరము జమీందారు రాజా కొచ్చెర్లకోట వేంకటకృష్ణ రావుబహద్దర్

జమీందారుగారును నొకసభ చేయించిరి. 18-6-1912తేదీ సభలో శ్రీఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "చెలంగగంజామువారింట సీతపెండ్లి, లీల భీష్మజననము కాలేజిలోన, రీవిమీఅ బ్రహ్మానందరావుగారి భవనమున నభిమన్య కంసవధలనెడి. కథలఁజెప్పిరి సోదరకవులు బళిరె" అని ప్రశంసించిరి.

పిదప పంగిడిగూడెము శతావధానములే యచ్చైనవి నాకంటఁబడినవి. 1920 రౌద్రిసంవత్సరమున 61మందికిఁ బంగిడిగూడెమున నవధానమొనర్చిరి. 1921 దుర్మతిసంవత్సరమున 100 మందికి సంపూర్ణశతావధానమొనర్చిరి. ఈ సంపూర్ణ శతావధానాంతమున శ్రీ పి.వేంకటకృష్ణకవి "మునుసంపూర్ణ శతావ ధానము.."హైదరాబాదులో వీరుచేసిరని చెప్పెను. (92 పేజీ చూడుడు) ఆయవధాన మచ్చుకాలేదు.

శతావధానులమని చెప్పుకొనువారు 30-40 మందికేగాని నూర్గురు పృచ్ఛకులకుంజెప్పి యవి ధారణపట్టి యవధానాంతమునఁజదివిన వారెవ్వరులేరు. వీరు మాత్రము చేసిరా? యని భావికాలమందెవ్వరేని శంకింపకుండ దైవికముగా నా పృచ్ఛకుల నామములును నాయాపద్యములంబడినవి. 40,50.82,87,89,91 మున్నగు పద్యములంజూడుఁడు. ఆ సభాంతమందొకరు "పూర్ణశతావధానమిది పూర్ణసమర్థతమీరొనర్చుటన్ బూర్ణముదంబుమాకొదవె" అని ప్రశంసించిరి. ఆ సభలోవీరి ధారణను బరీక్షించుటకుఁ గాఁబోలు గీతపాదమున సమస్యనిచ్చి సీసములోఁజెప్పుమనిరి. 49, 90 పద్యములుచూడుఁడు. అవధానులు సాధారణ ముగాఁగందగీతములతోఁ దప్పించుకొనిపోవుదురు. పెద్దపద్యములు ధారణకు నిలుచుటకష్టము. ఇందు 17 సీసపద్యములుగలవు. ఇంక స్రగ్ధరలు, మహాస్రగ్ధరలు లయగ్రాహులుంగలవు. స్రగ్విణి, సుగంధి, భుజంగ ప్రయాతాది వివిధవృత్తములు గలవు. ఇది శతావధానముగాదు. ఒక ప్రబంధము. దానికిందగినట్లు దైవికముగా నవధానాంతమున నంత్యప్రాసతో మాలినీ వృత్తము 'విపదగ పవిభావా వేణుగోపాల

దేవా!' అనియున్నదిచూడుఁడు 99. ఆద్యంతములు భగవన్నుతితో నొప్పారినవి. మణులుసూత్రమునంబోలెఁబద్యములు నాగభూపాల నామాంకితము చేయఁబడినవి. ఇందలి విషయములెక్కువగా నాగభూపాలునకు సంబంధించినవే కాన నీప్రబంధమును నాగభూపాలీయమనవచ్చును.

ఇందలిపద్యములన్నియు జిగిబిగికలిగి సముచితపదబంధ ప్రచురములై విరాజిల్లుచున్నవి. ఒక్క పద్యమైనఁగందెనలేని లాగుడుబండి చక్రమువలెనున్నది గానరాదు. దుష్కరప్రాసములతోను విపరీతభావములతోను 16 సమస్యలిందుఁ గలవు. అష్టావధానములో నుండఁదగిన దత్తపది యిందుఁగలదు 94. ఏఋతువు నందేపువ్వు పూచును 80. అశ్వత్థమెందుకుఁ బనికివచ్చును 44. గ్రహణస్నానమేల చేయవలె? 39. దేవునిపై నెంతభారముంచవలె? 13. అదృశ్యుడగు దేవుఁడుండెననుటెట్లు 52. దేవుండొక్కఁడేయనుటెట్లు 51. లక్ష్మీనివాసస్థానము లేవి? 53. ఇట్లెన్నియో క్లిష్టవిషయములిందుఁ బరిష్కరింపఁబడినవి. పంగిడిగూడెమును స్వర్గముంజేయవలె 4. ఇట్టి వర్ణనలెన్నియేని గలవు. మన భరతమాతనుగూడ వర్ణింపకపోలేదు. 34. ఇట్లీ సంపూర్ణశతావధానము ప్రబంధఫక్కిఁ బరిఢవిల్లినది. ఆదేమిధారణాశక్తియో అనేక రాజనామములుగల 60 పద్యములెట్లొప్పగించిరోకదా! 1920లోఁ జేసిన యవధానముగూడఁ బ్రబంధపద్ధతిలో సాఁగినది. చదువురులే చూచుకొనవలయు. నా గ్రంథము పెరుగుచున్నది.

కామవరపుకోట, లక్కవరము, జంగారెడ్డిగూడెము, అశ్వారావుపేట, హైదరాబాదు, నెల్లూరు, మద్రాసు, కాకినాడ మున్నగు ననేకస్థలముల నొనర్చిన యవధానములేమైనవో? తెలియదు.

వీరు రాజుల సందర్శించి రాజసన్మానములొంది, గజారోహణాది రాజ భోగము లనుభవించిరి. అది యొక మహోన్నత దశాకాలము. అదియొక మహారాజ యోగము.

మా యేల్చూరులో వైద్యులొక రొకనాఁడాకస్మికముగా బంగారు మురుగులతోఁ గన్పింప నివి యెక్కడివని యడిగితిమి. వారు శ్రీ వేంకటసుబ్బరాయ కవిగారికి జబ్బు చేయనయముచేసితిని. వారు నూతనవస్త్రములు నీ మురుగులు పెట్టిరనిరి. అచ్చటివారమాశ్చర్యపడితిమి. ఏలనో వీరికి జబ్బుచేయఁదదీయు లెవ్వరికిఁ దెలియనిచ్చెడివారు కారు. ఏలూరు సభకు ముందే 1913 ఈ జబ్బు చేసినది. సభానంతరముగూడ జబ్బుచేయ మద్రాసువెళ్ళి యెప్పటికోవచ్చిరి. ఏమి జబ్బో యెవ్వరికిఁ దెలియదు.

ఎవ్వరో యొకసారి హెచ్చరింపఁగా 'నాశువుగనే ప్రబంధములు నిర్మించు మేము; తలంచుకొన్న నెన్ని గ్రంధములు లిఖింపలేము? లిఖించుకాలము ముందు లేదా?' యనిరఁట.

1913 నాటికే వీరు కృష్ణకరుణా ప్రభావము దైవసంకల్పమను కావ్యములు కుశలవ నాటకము వ్రాసియుండిరి. అందలి పద్యములను వారేగాక యితరులు చదువఁగను వింటిని. భగవంతుఁడా! యిప్పుడాగ్రంథములేమైనవో? దురదృష్ట వశమున వీరికవిత్వము పరులపాలైపోయినది. వీరు రచించిన కావ్యములు లేవుగాన వీరాంధ్ర కవుల చరిత్రలోని కెక్కఁదగరా? ఆంధ్రదేశము నాశుకవిత్వముచే నావేశ మెక్కించిన వీరికి కవుల చరిత్రలో స్థానములేదా? అనేక శతావధానము లాచరించి యనేక పండిత కవుల ప్రశంసలందుకొన్న వీరి కాంధ్రసారస్వత చరిత్రలో నొక్కపుట, యుండదా? ఉండనిచోనది భాషాదౌర్బల్యమేకాని నాకమందున్న వారికేమి? ఈ నియమమే యా కవిచరిత్రకారుఁడు పెట్టుకొన్నచో నతని చరిత్ర మసమగ్రముగాఁ దయారగును. ఎందఱో మహామహులు మహోపాధ్యాయులు గ్రంధములు వ్రాయని వారు వ్రాసి పోఁగొట్టుకొన్నవారు నతని చరిత్రను బహిష్కరింతురు. వేంకటసుబ్బ రాయకవిగారు శక్తికిమించిన పనిచేసిరి. సభలలోనేగాక తదితర సమయము లందును నాశువుచెప్పుచుండువారు. అమృతాంజనముడబ్బాను ప్రక్కనుంచుకొనియే వ్రాయుచుండెడివారు. అక్కతన మెదడుకరిగినది. దృష్టిమాంద్య మేర్పడినది. గ్రంథ

రచనకుఁ దీఅని వ్యాఘాత మేర్పడినది. దశ తొలఁగినది. నలువదియాఱేండ్ల నడిప్రాయముననే నాకమున కరిగిరి. 29-3-1932 వీరి నిర్యాణము. ఆ యింటికళ వీరితోనేవచ్చి వీరితోనే పోయినది. పిమ్మట వేంకటరమణ కవిగారు తమ సోదరుఁడగు బుచ్చిరామ కవిగారినిగూడి సోదరకవులన్నపేరు నిలుపుటకుఁ గొన్ని సభలొనర్చిరి. ఆవల వారును 21-3-1942లో గతించిరి. బుచ్చిరామకవి గారు 29-5-1956లో గతించిరి.

సోదరకవులకడగొట్టు తమ్ముఁడు లక్ష్మీనారాయణగారు. వీరును గాలేజిలోఁ జదువుకొనుచున్నప్పుడే యాశువుచెప్పెడివారు. కనుకనే "కవుల పుట్టిల్లు సోదరకవుల యిల్లు" అన్న కీర్తి వచ్చినదని 'ఆధునిక కవిజీవితములను గ్రంథమున 33 పుటలో వ్రాయఁబడెను. కొప్పరపు సోదరకవులతరము గడచిన పిదప శ్రీ వేంకటసుబ్బ రాయకవిగారి కొడుకు సీతారామప్రసాదరావు, వేంకటరమణకవిగారి కొడుకు మల్లికార్జునరావు 'కుమారసోదర కవులు' అనుపేర బయటికివచ్చిరి. నేను గుంటూరు టవున్ హైస్కూలులో ప్రధానాంధ్రపండితస్థానమందుండఁగా వీరు 5-వ ఫారములోనే పద్యములల్లసాఁగిరి. అందలి తప్పులను వివరించి చెప్పుచు నుందును. ఆ కవిత్వపు పిచ్చివలననేయేమో 6-వ ఫారము తప్పిరి. పిదపవీరు బడివదలి అష్టావధానము లొనరింపసాఁగిరి. ఇంతలో దైవముకంటికిఁబేలగింజ యుఁ బెద్దగాఁగన్పించినది. మల్లికార్జునరావు వెళ్లిపోయెను. ఇప్పుడు సీతారామ ప్రసాదరావొక్కఁడే అవధానములొనర్చుచున్నవాఁడు.

ప్రస్తుతము కొప్పరపు సోదరకవుల శతావధానములనెల్లఁ బునర్ముద్రణ మొనరించి యందింప బ్రహ్మశ్రీ కుంటముక్కల వేంకటజానకీరామశర్మగారు పూనుకొనిరి. వీరు డెబ్బదియేండ్లవృద్ధు. కనఁబడనిజబ్బుతో కలఁతపడుచుందురు. వీరిది తెనాలితాలూకా పెనుగుదురుపాడు. ఎక్కడికొప్పరము? ఎక్కడి పెనుగుదురు పాడు? వీరెవరు? వారెవరు? వారికి వీరికేమి సంబంధము? వీనినచ్చొత్తించినఁ దదీయులు వృద్ధులెవరు సంతోషింతురు? అయినను శ్రీబెల్లముకొండ రామరాయ

కవిగారి గ్రంథములకు శ్రీకవితా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పూనుకొన్నట్లు వీరావేశమెత్తినడుమునకుగుడ్డబిగించిలేచి విరాళములకుఁదిరిగి "సంతస్స్వయం పరహితే విహితాభియోగాః" ఎవరేమన్నను సరకుగొనక విరాళములసేకరించి యనుకొన్నపనిపూర్తిచేసి కృతార్థులైరి. వీరు సహృదయులేగాక సరసులేగాక సత్కవులును. భగవద్గీత నాంధ్రపద్యములలో వ్రాసిరి. శ్రీరామనామ సంకీర్తనామృత మను సరసమైన కృతిని రచించిరి. సావిత్రీ సత్యవతీయమను నాటకమువ్రాసిరి. భగవంతుఁడీ పరోపకారశీలున కభ్యుదయ నిశ్శ్రేయసము లొసఁగుఁగాక. శ్రీఏకా ఆంజనేయులు పంతులుగారు "శాంతి" నచ్చువేయించుచున్నపుడు నేనింక నేగ్రంథమునచ్చు వేయింపలేను వేయింపను అనిరి. అని ఆమాటమీఁద నిలచిరా! అబ్బే! వాయియట్లన్ననుచేయి తనపనితాను జేయుచునేయుండెను. ఎన్నోగ్రంథముల నచ్చువేయించుచునేయుండెను. ఇటీవల శ్రీ జాషువా ఖండకావ్యము కైపులోఁ బడి గ్రహించినదిగూడ. దానవీరమననిట్టిదే. ఆలంకారికులు వర్ణించినదీ దాన వీరమునే. ఈదానవీరరసమందే యిప్పుడె పంగిడిగూడెము శతావధానము తడిసి ముద్దైనది. శ్రీ ఆంజనేయులు పంతులు గారికి భగవంతుఁడు దీర్ఘాయు వొసగుఁగాక.

గుంటూరు. ఇట్లు,

15-3-1963 **మిన్నికంటి గురునాథశర్మ**



**భమిడిపాటి రామగోపాలం,** ఎం.ఏ
సుప్రసిద్ధ రచయిత, కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు విజేత
విశాఖపట్నం - 530 022.

## జనాంతికం

"సుకవి జీవించె ప్రజల నాలుకలయందు" అనే మహద్వాక్యం కొప్పరపు కవుల పట్ల వర్తించినంతగా ఇంకెక్కడా వర్తించదేమో!

కొప్పరపు కవులు కవిత్వం చెప్తూ ఉండిన కాలంలో అచ్చుయంత్రాలు విస్తారంగా లేకపోయినా కాగితం. కలం ఉన్నాయి ఐనా సరే వారి పద్యాలు మౌఖిక రక్షణలోనే ఉండిపోవలసి వచ్చింది. వ్రాసి దాచవలసిన కవిత్వమే అయినా వ్రాయడానికి సాధ్యం కాకపోవడం వల్లనే ఆ పరిస్థితి. అది కొప్పరపు కవుల "వేగం" కల్పించిన అవరోధం, అసౌఖ్యం.

ఇప్పుడు చెప్పుకుంటే అదేదో కల్పనలాగ అనిపిస్తుంది కాని; అప్పుడది నిజమే. ఇవాళ మనం "స్పీడు యుగంలో ఉన్నాం' అని ఊరికే జబ్బలు చరుచుకుంటాం కాని వచనం రాయడానికి కూడా షార్టుహాండు వాళ్లు కావాలి కొప్పరపు కవులు గంటకి నూర్ల కొద్దీ పద్యాలు చెప్పినట్టు చాలామంది అప్పటివాళ్ళు తమ తమ రచనలలో, ఉపన్యాసాలలో చెప్పేరు. అప్పట్లో షార్టుహాండు లేకపోయిన మాట నిజమేకాని, ఒకవేళ ఉండి ఉన్నప్పటికీ వ్రాసిపెట్టడం అసాధ్యం. అలా వారి అవధానాలను, ఆశు కవితలను తెలుగుజాతి తగినంతగా దాచుకోలేకపోయింది.

'ప్రజల నాలుకలయందు' కవుల పద్యాలు జీవిస్తాయి. కాని ప్రజలు తరాలు తరాలుగా విడి, గతించిపోతారు. వారితోపాటు ఆ నాలుకల మీద ఉండిన పద్య సంపద కూడా అంతరించిపోతుంది. కాని ప్రతిభావంతుడైన కవికి హృదయవేదులైన శిష్యులు ఉంటారు వారు తమ గురువుల వద్ద "శిష్యరికం" చేయకపోయినా వారి గురువుల వాక్కులను స్మరామి నుండి, చరామి వరకు పరిరక్షించుకొని గురువులనే ధన్యులను చేయగల మహనీయులు. ప్రజాకవి వేమన తన వాక్కులను అలతి అలతి పదాల ఆటవెలదులలో రచించి వీటిని కంఠానా హస్తానా నిలుపుకోని కవితాభిరుచి వృథా అనిపించగలిగాడు సి.పి బ్రౌను వంటివారు వచ్చి ఆ పద్యాలనన్నింటినీ తాళపత్రాల నుంచి మనుష్యుల జ్ఞాపకాల నుంచి వాటిని "కాగిత బద్ధం" చేసి అట్టి మహనీయుల కోవలోకి చేరారు. కొప్పరపు కవుల విషయంలో కుంటముక్కల జానకి రామశర్మ గారు, మిన్నికంటి గురునాథ శర్మగారు; నిడుదవోలు వేంకటరావు గారు ఏకబాణ సేనలవలె పరిశ్రమించి కొప్పరపు కవుల పద్యాల సేకరణను ఒక యజ్ఞంగా నిర్వహించి తాము ధన్యులవుతూ తెలుగు జాతికి అమూల్యమైన సంపదను సమకూర్చి పెట్టారు. ఆ కెరటాల ఉత్థాన పతనాలను జీర్ణించుకొని ధన్యత చెందిన మహనీయులు గుండవరపు లక్ష్మీనారాయణ గారు

గుండవరపు లక్ష్మీనారాయణ గారు గుంటూరు సీమకు Son of the Soil. కొప్పరపు కవులు పుట్టి, పెరిగి, వికసించి, విజృంభించి కీర్తిమంతులైన నేలను నాలుగు చెరుగులా స్పృశించి ఆరు రుచులనూ ఆస్వాదించిన బుద్ధిజీవి. కొప్పరపు కవుల కృతులు కుంటముక్కల జానకి రామశర్మ గారు, మిన్నికంటి గురునాధశర్మగారు, నిడుదవోలు వేంకటరావుగారు కొంతమేరకు సంగ్రహించి పరిరక్షించినా జాతి బాధ్యత అంతటితో తీరిపోదని త్రికరణ శుద్ధిగా నమ్మి, ఆ పద్యాల సేకరణను గ్రంథస్థాయికి చేర్చి దానిని ఒక సంప్రదాయంగా ఏర్పరచాలని కూడా త్రికరణ శుద్ధిగా సంకల్పించాడు దాని ఫలితమే ఈ పుస్తకం గుండవరపు లక్ష్మీనారాయణ గారు తెలుగు అధ్యాపక వృత్తిలో కాకలు తీరినవాడు. తన డాక్టరేట్ డిగ్రీ కోసం ఆయన ఎన్నిక చేసుకున్న వస్తువు “ఆదిభట్ల నారాయణ దాసు”. అక్కడ ఆయనకు సంగీతాశ్రమమైన కవిత్వం మృష్టాన్న భోజనమైంది కాని పంచభక్ష్యాల కోసం షడ్రుచుల కోసం ఆయన ఆశ్రయించినది శ్రీనాధ మహాకవి భీమేశ్వర పురాణము. తన మానసానందం కోసం బుడి బుడి నడకలతో కొప్పరపు కవుల కవిత్వ దివ్య భవనములోకి ప్రవేశించి అక్కడ అంతేవాసియై స్థిరపడ్డాడు. ఇది ఒక విశిష్ట క్రమశిక్షణ ఫలితము అందువలన వినయంతో, పరిపుష్టతా తృష్ణతో రూపొందించిన ఈ సంచయం కవిత్వ పిపాసువులకు కొంత కొత్త వెలుగును ప్రసాదిస్తుంది.

గుండవరపు లక్ష్మీనారాయణ గారిలో నా దృష్టికి ఇంపుగా కనపడిన రెండు విషయాలు ఉన్నాయి ఇంగ్లీషులో "Rome is not Built in One day" అని ఒక నుడికారం ఉంది. తొమ్మిది నెలలు మోస్తేనే గాని ఏ బిడ్డా పుట్టదు. ఈ స్పృహ ఆయనకు కొప్పరపు కవుల పద్యాలను సంచయం చేయడం సందర్భంగా తనువునా హస్తానా నిబద్ధితమై ఉంది. అందువలన ఈ సంచయ ప్రచురణ ఆలోచన ఆయనలో జనించి దాదాపు రెండు దశాబ్దాలు దాటినా ఇప్పటి వరకూ ఆయన ఓపిక పట్టాడు అరకొర శ్రద్ధతో, వేగిరపాటుతో చేసి ఉంటే ఈ పుస్తకం పదహారేళ్ల క్రిందటే వెలువడి ఉండేది. ఇది ఇలా ఉండగా లక్ష్మీనారాయణ గారికి జనార్దన స్వభావమే గాని ధనార్జన చాపల్యం లేదు జనప్రియత ఏర్పడని ఏ వస్తువు గాని పదార్థం గాని మొదటి ప్రయత్నం లోనే లాభాలు తెచ్చిపెట్టదు – అనే సత్యాన్ని గ్రహించినవాడు తాను వ్రాసిన తిరుపతి వేంకటీయము కవుల కలహాలు. నారాయణ దర్శనము గాని, భీమేశ్వర పురాణ వ్యాఖ్యా గ్రంధాది పుస్తకాలు గాని ఎంత డబ్బు పెట్టుబడిగా వెచ్చిస్తే వచ్చాయి; అమ్మకం వల్ల ఏమాత్రం లాభం చేకూరింది అనే ప్రశ్నలూ విచికిత్సలూ సంభవించనివ్వని మనస్తత్వం ఆయనది

కొప్పరపు కవుల కృతులు జనంలోకి రాకుండా ఉండిపోవడానికి వాటి గ్రంధస్థత్వ దుస్సాధ్యత ఒక కారణమైతే రెండవది నియోగి వైదికి వైరస్యం కవిత్వ సృజనకు శాస్త్ర, పురాణ, శ్రుతి వ్యాకరణ ఛందాది జ్ఞానాలలో పరిణతికి తోడుగా ప్రాపంచికత, లౌక్యం, హూందా కూడా ఉంటే ఆ కృషికి రాణ అని నమ్మినవారు కొందరు. జ్ఞానం, పరిజ్ఞానం, భావుకత, వినయముంటే చాలునని

భావించనవారు కొందరు. సహజంగానే మొదటివారు నియోగులుగా రెండవవారు వైదికులుగా ముద్రలు పడ్డారు. ప్రవృత్తిలో ఉన్న ఈ ప్రాధమిక విభేదం బ్రాహ్మణులలో ఆ శాఖల లోనికి ప్రవేశించి నియోగి కవిత్వము - వైదిక కవిత్వము అని రెండు విరసభావాలు కవిప్రజలో నెలకొన్న విధం సంభవించింది. శాఖా విభేదం వలన విద్యలలో కలిగిన స్పర్ధ ("పూను స్పర్ధను విద్యలందే") ప్రకారం ప్రచార ఆదరణలు వారికి వేరు వీరికి వేరుగా సిద్ధమయ్యాయి. తిరుపతి వేంకటకవులు (దివాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి) కొప్పరపు సోదర కవులు (కొప్పరపు వేంకట సుబ్బరాయ శర్మ, వేంకట రమణ శర్మ) సమకాలికులైన రెండు జంటల కవులు. మొదటి జంట వైదికులు, రెండవ జంట నియోగులు. గుంటూరు సీమలో కవిత్వ రంగాలలోనే కాక వ్యవహార రంగంలో కూడా నియోగి - వైదికి వైరస్యం శతాబ్దాల చరిత్ర కలిగినది. తిరుపతి వేంకట కవులు అచ్చంగా గుంటూరు సీమకు చెందినవారు కాకపోయినా వారిలో కవిత్వ శక్తికి సరి సమానంగా ఉండిన లౌక్య సంపద వారిని ఉన్నతాసనంలో కూర్చోబెట్టింది. వారికి అశేషమైన వ్రాయసగణం, శిష్యగణం ప్రాప్తించారు. అవధానాల విషయానికి వస్తే అక్కడ ధారణ, చమత్కారం ప్రధానాంగాలు. ఈ రెండింటిలో ఆ జంట కవులకు, ఈ జంట కవులకు సమాన ప్రతిపత్తి. ఆశుధారా విషయానికి వస్తే కొప్పరపు కవులదే నిస్సంశయంగా పై చేయి. కాని ఆశుధారలు వ్రాయసకత్వానికి నోచుకోవు. కనుక వీరి పీట వెనుక వరుసకు తప్పుకోవలసి వచ్చింది తిరుపతి కవులు తాము ఆశువుగా చెప్పిన ప్రతి పద్యాన్ని వెంట వెంటనే వ్రాయసకాంఢ్ర ద్వారా పరిరక్షించుకోగలిగారు. ఎవరికి ఎన్ని సన్మానాలు, ఎన్ని కంకణాలు, ఎన్ని భుజకీర్తులు, ఎంతలేసి కీర్తులు అనేది అప్పుడు ప్రస్తుతమే గాని ఇప్పుడు అప్రస్తుతం. గుండవరపు లక్ష్మీనారాయణ గారు తమ సుదీర్ఘమైన సాహితీ అభ్యాసంలో వారిని వీరిని అనకుండా అధ్యయనం చేసినవారు మృతివలన స్మృతులు గతములౌతాయి. (Death is the leveller) కనుక ఇప్పుడు క్షీరనీర విచక్షణతో కవితాస్వాదన చేయగల మనకు అందరూ సమానులే.

అన్ని సంపదలకు వలెనే కవితా ప్రతాపానికి కూడా వారసులుంటారు. వీరు కుటుంబాలలోంచి రావచ్చు, లేదా ఆలోచనా ధోరణుల నుండి రావచ్చు. తిరుపతి వేంకట కవులకు విశ్వనాధ సత్యనారాయణ గారి వంటి దిగ్దంతులైన వారసులు ఉన్నారు వారికి 'ప్ర-వారసులు' ఉన్నారు. కాని కొప్పరపు సోదర కవులకు వారసులు లేరు అయితే ఆస్తుల స్వీకారం వలన గాని ధోరణుల అవలంబన వలన గాని ఏర్పడని వారసులు కొప్పరపు కవులకు ఉన్నారు వారే కుంటముక్కల జానకి రామశర్మ గారు, మిన్నికంటి గురునాధ శర్మగారు, నిడుదవోలు వేంకటరావు గారు, గుండవరపు లక్ష్మీనారాయణ గారు, మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయ శర్మగారలు.

ఈ పుస్తక ప్రచురణా యజ్ఞంలో గుండవరపు లక్ష్మీనారాయణ గారు ఋత్విక్ కాగా మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయ శర్మ ఘృతంగా తన పాత్రను నిర్వహించి మనలకు ఈ ఆస్వాదనను సుస్వాద్యం చేసిపెట్టాడు వీరిరువురికీ నా శుభాశీస్సులు

# విషయ సూచిక

# శతావధానములు

## సంగంజాగర్లమూడి శతావధానము

⋘⋘⋘

### పరిచయము

సుప్రసిద్ధ కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంకితులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవిద్వయము దేశ దేశాలు తిరుగుచు నానా రాజాస్థానములను దర్శించుచుఁ దమపాండిత్య గరిమచే నవధానము లద్భుతముగాఁ జేయుచున్న కాలమది. "ఒక చరణం బతండు మఱి యొక్కటి నేను మఱొక్కటాతఁడున్ సకల కవీంద్ర బృందములు సన్నుతి సేయఁగ" అని చెప్పికొని యిర్వురు నవధానమున వీరవిహారము సలుపుచు సామాన్య జనులకు సైతము పరమానందముఁ గూర్చు శైలిలో పద్యములాశువుగా వచించుచు మెప్పందుచుండిరి.

వీరికి  దీటుగా రాఁగలిగిన కవీంద్రులున్నారా? యని సంచరించు కాలములోఁ గొప్పరపు సోదర కవులు ప్రాముఖ్యతకు వచ్చిరి. ఆ కాలపు వైదిక నియోగి? భేదములలోఁ గొందఱు వారిని గొందఱు వీరిని నభిమానించుచున్నను మొత్తముమీఁద సారస్వత ప్రోత్సాహమునేయిచ్చి సత్కరించు చుండిరి ఆంధ్ర దేశములో నవధానములపుడు మెండుగా జరిగెను. ఈ యవధానములు పండిత కవీంద్రుల ధారణ శక్త్యాదుల నచ్చెరువుఁ గల్గించుచు సభాసదులకు ముదము గూర్చును

ఈ శతావధానము బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకటసుబ్బరాయ, వేంకట రమణ జంట కవులచే 1910వ సంవత్సరము మే నెల 18వ తేదీన, తెనాలి తాలూకా సంగంజాగర్లమూడి గ్రామములో, గ్రామ కచేరి హాలునందొనర్పఁ బడినది. తదాది యముద్రితముగానున్న దీనిని బండిత వర్యులు, దానశీలురగు శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు చౌదరిగారి యౌదార్యమున వెల్గునకు గొని రాఁబడినది. నేనా శతావధాన సభలో నొక పృచ్ఛకుండను. దీనిని మా గ్రామములోఁ బెద్దలు, మా తండ్రిగారగు శ్రీ కొత్త శివలింగయ్యగారు, రామస్వామిగారు, సంగయ్యగారు (గ్రామ మునసబు) గోపాలకృష్ణయ్యగారు, వీరభద్రయ్యగారు, కొల్లి వేంకట సుబ్బయ్యగారు మున్నగు వారు చేయించి, దాతల యొద్ద వసూలు చేసిన సొమ్మును గవులకు నొసంగి సన్మానించిరి.

ఆ కవుల యనర్గళమయిన యాశుధార యందఱిని విశేషముగా నాకర్షించెను. వారా కాలములో జగమెఱిగిన శతావధానులు. మా యన్నగారగు కొత్త సంగయ్యగారు ప్రశ్నములను సిద్ధపఱచిరి. వ్రాంత ప్రతిలోఁ బోయిన యొకటి రెండు పదములు నేను బూరించితిని.

ఈ గ్రంథమును ముద్రింపించిన నా మిత్రులు శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు గారికిఁ గృతజ్ఞతా పూర్వక నమోవాకములు - భాషా సేవయే పరమావధిగా నెంచి యిట్టి వానిని వారు ప్రచురించి ధన్యులగుచున్నారు.

సంగంజాగర్లమూడి,
20-10-1969
సౌమ్య విజయదశమి

ఇట్లు,
విమర్శకాగ్రేసర
**కొత్త భావయ్య చౌదరి**



# స్వ విషయము

కొప్పరపు సోదర కవుల చరిత్రను వ్రాయవలయునను సంకల్పము చిరకాలము క్రిందటనే నాకుఁ గల్గినది. ఒకనాఁడు గుంటూరు జిల్లాలోని సంగం జాగర్లమూడి గ్రామమునకు వెళ్లి కొప్పరపుఁ గవులను గుఱించి మీకుఁ దెలిసిన విషయములను దెలుపుఁడని విమర్శకాగ్రేసర శ్రీ కొత్త భావయ్యచౌదరి గారినిఁ గోరితిని. అపుడు వారు కొప్పరపుఁ గవుల శతావధాన పద్యములు గల యొక వ్రాఁత ప్రతిని దెచ్చియిచ్చిరి. అత్యంతానందముతో దానిని స్వీకరించి యింటికిఁ దెచ్చి భద్రముగా దాచితిని.

1910వ సంవత్సరము మే నెల 18వ తారీఖున సంగంజాగర్లమూడిలో శతావధానము గావింపఁబడినది. కాని 100 పద్యములు చెప్పలేదు. చిరకాలము క్రిందట వ్రాయఁబడినదగుట వలన నేను స్వీకరించిన తెల్లకాగితముల పుస్తకము ముట్టుకొన్నచోఁ జినిగి పోవునట్లుండెను.

1969వ సంవత్సరములోఁ బ్రచురింపఁ దలఁచి పరిచయమును వ్రాయుఁడని కోరఁగా శ్రీ భావయ్య చౌదరిగారు వెంటనే వ్రాసి పంపిరి. కాని యపుడు ప్రచురించు భాగ్యము లేకపోయినది. ఇపుడైనను (1971) బ్రచురింపఁ గలిగినందులకు సంతసించుచున్నాఁడను.

శతావధానమును దయతో నొసంగి పరిచయమును వ్రాసిన విమర్శ కాగ్రేసర శ్రీ కొత్త భావయ్య చౌదరిగారికిని, దొలిపలుకును వ్రాసిన శ్రీ పదుల్లపర్తి రామకృష్ణమూర్తి ఎం.ఏ. గారికిని నా యభివందనములు.

ఇట్లు,

సజ్జన విధేయుఁడు,

**కోగంటి దుర్గామల్లికార్జునరాయకవి**

## సంగంజాగర్లమూడి శతావధానము

### (18-05-1910)

**1. హనుమంత స్తవము - లయగ్రాహి**

శ్రీ రఘువరేణ్యు పదసారసము నెమ్మి
        భవతారక మటంచు మదిc గోరు గుణధామున్
సౌరగిరి ధీరు దివిజారి మదమారణ
        విచారరణ భూతల విహార బలధామున్
సూరిజనవంద్య సువిచారునిc
        బ్రభంజనకుమారుని జగద్వినుత శూరగుణధామున్
నేరుపులుమీఱcగ ననారతము నెంతు
        నతి సారవచనంబుల నుదారమతి యొప్పన్

**2. గజలక్ష్మి**

గజములు రెండిరు గడలc జేరిపయోజ
        ములను బూజింపcగా ముదముగాంచి
అలఘు సువర్ణ సహస్ర పత్రము పవి
        త్రావాసమై యుండ ననువు గాంచి
అమృతంబు శశియుc గల్పాగంబులును దోడc
        బుట్టువులై యొప్పc బొలుపు గాంచి
మంగళ దేవతా మహిత సమాఖ్యచే
        విబుధులు వినుతింప వేడ్క cగాంచి

విశ్వ జనకుండనంగ నొప్పు విష్ణుదేవు
మహిళయై యొప్పు తాలోక మాతయైన
యా మహాలక్ష్మి దేవి యత్యంత సుగుణ
మమ్ము మిమ్మును నిరతంబు మనుచుం గాత

## 3. పంచ ముఖాంజనేయ స్తవము

కల్పాంత పవనుండై కఠిన శత్రువనాళి
మొదలంటం బెఱికెనే భూరి బలుండు
పంచాస్య వక్త్రుండై ప్రకటారి గజముల
వధియించె నేలోక వందితుండు
క్రోడాస్యుండై ద్విషత్కుటిల ముస్తాకోటి
భక్షించె నేమహద్భాసురుండు
గంధర్వ వదనుండై గణ్యంబులౌ చిత్ర
కార్యముల్ దీర్చెనే కమ్రయశుండు

పద్మ లోచనుండై బాలపద్మబంధు
కోటి రుచుల నెసంగెనే గురు గుణాఢ్యుం
డట్టి శ్రీ హనుమంతు దయా నిశాంతు
శాత్రవకృతాంతు నతిదాంతు సంస్మరింతు.

## 4. మనోజ మనో వ్యథ

శతసంఖ్యల్ పదిగాంగ రూప్యముల వెచ్చంబెట్టితింగాని నా
సతి యీవేళకు రాకపోయె నింక నే చంద్రాస్యనుంజేరి యే
గతింబ్రార్థించెద మత్సమానపురుషుల్ కామ్యంబులన్ దీఱిరం
చతులంబైన మనోవ్యథం గనె నొకండాహారనిద్రాచ్యుతిన్

## 5. వీరభద్రుండు

అక్షీణాప్రతిమ ప్రభావముల వహ్న్యాక్షుండుదన్ బంపంగా
దీక్షన్ రూక్షవిషేక్షణప్రభలంబృథ్వీభాగమున్ మాడ్చుచున్

దక్షున్ దన్మఖమున్ మఖప్రియుల విధ్వంసంబు గావించె నే
దక్షుండాతఁడె వీరభద్రుఁడు సుమీ ధాత్రీసురగ్రామణీ!

**6. సంగమేశ్వరుఁడు**

జాగర్లమూడి పురికడ
బాగుగఁ గృష్ణయును దుంగభద్రానది సం
యోగము గని నట్టి ధరన్
ఈగి వెలయనుండు సంగమేశుఁడు శివుఁడే

**7. వనము**

మారుతము కేకిరవములు
భూరుహముల లే చివుళ్లు పూ పొదలెసఁగన్
సారతరాత్మోద్భవ సుఖ
కారణమై వని వసంతకాలమునఁ దగెన్

**8. కామధేనువు**

అంభోరాశిని లక్ష్మితోడ సుధతో నబ్జారి బింబంబుతో
సంభూతంబయి యిష్టదానగరిమన్ శ్లాఘన్ విడంబించుచున్
జంభద్వేషిముఖుల్ నుతింపఁదగు నాస్వర్ధేనువున్ భక్తి వి
స్రంభం బొప్పఁదలంతు మన్మతి నభీష్టార్థంబు సిద్ధింపఁగన్

**9. వెన్నెల**

కనుగవగల్గు వారికి సుఖంబుగ దర్శన యోగ్యమై కవీ
డ్జనులు నుతింపఁగా దగి ప్రశస్తిని క్షీరసముద్రరాజనం
దన విలసద్ద్యుతి వ్రజముదారతఁ జంద్రికయన్ సమాఖ్యచేఁ
దనరి జగంబునన్ వెలసె ధన్యగుణాకర! చూడు మియ్యెడన్

### 10. వేణుగోపాలుఁడు

తరువులుఁబల్ చిగుళ్లుఁదగ ధాత్రిధరోరుశిలావ్రజంబులున్
గరగఁగ, గోపికల్ పశునికాయము బిడ్డలయందుఁ బ్రేముడిన్
బరువడిఁబాసి, గానసుధఁ బానమొనర్పఁగఁ దన్నుఁ జేర సు
స్థిరమతి వేణుగానమును జేసిన నందసుతున్ భజించెదన్

### 11. విఘ్నేశ్వరుఁడు

కార్యారంభములందు నెవ్వని సుధీ కాండంబు ధ్యానించునో
యార్యా దేవియు శంకరుండెవనిఁ బుత్రాపేక్షతోఁ జూచిరో
యార్యుల్ మెచ్చఁగ నెవ్వఁడత్యధిక విద్యాపూర్ణుఁడై యొప్పె నా
చార్యుండెవ్వఁడు సత్కవీంద్రతతికే జైయందు నవ్విఘ్నపున్

### 12. మోహిని

క్షీరాబ్ధిని జనియించిన
సారామృత కలశమును నిశాటులు గొన న
వ్వారిఁ గికురించి మోహిని
యై, రహి హరి సురల కిచ్చె నయ్యమృతంబున్

### 13. మంగళగిరి క్షేత్రము

ఘనపదంబంటిన గాలిగోపురముచేఁ
        జెలువొందె నేమహా క్షేత్రవరము
సారోదకములచే మీఱిన కోనేళ్లఁ
        జెలువొందె నేమహా క్షేత్ర వరము
పానకాల్ రాయఁడన్ బ్రథగన్న నృహరిచేఁ
        జెలువొందె నేమహా క్షేత్ర వరము
భవ్యనృసింహోత్స వాడంబరంబుచేఁ
        జెలువొందె నేమహా క్షేత్ర వరము

ఎయ్యది తలంప మంగళం బినుమడించు
నది మహాక్షేత్రమను కీర్తి నమరి నట్టి
మంగళగిరి జగజ్జన మాన్య తరము
పురములన్నింటిలో నగ్రసరము సుమ్మి

**14. ఆంజనేయుఁడు**

ఎవఁడాక్షారపయోధి గోష్పదమనన్ హేయంబుగా దాటెనో
ఎవఁడా లంకను బేదకొంప యన వహ్నిజ్వాలలన్ గాల్చెనో
ఎవఁడా రాముని సీతతోఁ బ్రజలతో నింపొందఁగాఁ జేసెనో
పవనప్రోద్భవుఁడమ్మహామహుఁడు సౌభాగ్యంబుమాకీవుతన్

**15. బావి**

జీవనము పూర్తిగాఁ దగ
బావులు గ్రామంబులందుఁ బ్రజలకు దిక్కై
భావింప నొప్పు చెఱువులు
పావన జల నదులు లేని బాధలడంగన్

**16. తిల పుష్పము**

చక్కని కామిని కొప్పెడు
ముక్కునకును బోల్కి గనుచుఁ బువ్వులలోఁ బెం
పెక్కెఁ దిల పుష్పమే సుమి
యక్కొలఁది యెఱుంగఁ గవి హృదంభోజమెకా

**17. సభా వర్ణన – తోటకము**

ధారుణి దేవులు, ధన్య విచారుల్
బేరులు చూడఁ గుబేర సమానుల్

ధీరులు శూద్రులు ధీమణు లన్యుల్
సారముఁ జూపఁగ సత్సభ యొప్పెన్

**18. మామిడి చెట్టు మీఁదఁ జిలుక**

పచ్చలును బద్మరాగముల్ ప్రబలునట్టి
గద్దెపైనుండి పాడెడి కాంతయనఁగ
నాకులుఁ జిగుళ్లుఁ గల మావి యందు నిలిచి
చెలువు పలుకులఁ బలికెడి చిలుకఁ గనుము

**19. పార్వతీ స్తవము – ఉపేంద్ర వ్రజవృత్తము**

ధరిత్రిభృద్రాజసుతామతల్లిన్
సరోజపత్రేక్షణ శంభు పత్నిన్
విరోధి దైత్యాటవీ భీమవహ్నిన్
స్మరింతు దేవిన్ సతి సర్వవంద్యన్

**20. శతావధానము**

ఒకరడిగిన యది మఱి వే
ఱొకరడుగక యున్నఁ గాని యుచితార్థములన్
బ్రకట మతి నూర్గురికి, డ
య్యక చెప్ప శతావధాన మంద్రు సుధీంద్రుల్

**21. విరహ వేదన**

మలయ గిరీంద్ర మారుతము మండెడు వేసవి సోకుడైతగన్
జిలుకలు గోరువంకలును సింహములున్ శరభంబులైతగన్
బలువుగ నన్న పానములపై భ్రమ వీడి మనోజ వేదనన్
సొలయుచునుండెనొక్క బిససూనవిలోచనయేమి చెప్పుదున్

**22. అష్టావధానము**

అష్టావధాన కార్య మ
దృష్టముచేఁ గాక యెట్లు దీర్పఁగ వచ్చున్
కష్టమొ, సుఖమో యది, యు
త్కృష్ట మనీషులె యెఱింగి కీర్తింతు రిలన్

**23. సమస్య : నీ వ్రతమాచరించెదను నీటుగనన్ను ననుగ్రహింపుమా**

ధీవ్రజ వర్ణనీయ రుచి దీప్త యశోవిభవాభిరామ! ము
గ్ధ వ్రజ కామినీ కుసుమ కాండ! జనార్దన! కృష్ణ! మాధవా!
సువ్రతమంద్రు ద్వాదశిని సూరులు నీ కెపుడిష్టమౌట నా
నీ వ్రత మాచరించెదను నీటుగ నన్ను ననుగ్రహింపుమా

**24. త్రిమూర్తి స్తవము**

వాణీ నాయకు సర్వలోక రచనా వశ్యాత్ముఁ బ్రార్థించి ల
క్ష్మీ నాళీక దృగాప్త రక్షణ కళా స్ఫీతున్ మదిన్నిల్పి దు
ర్గానాథున్ లయకర్త నెంచెదను దీర్ఘాయుర్యశోభూతు ల
త్యానందంబున నొందఁ గోరి సువచో వ్యాపార పారీణతన్

**25. ఉపేంద్రుఁడు – సింహాసన వృత్తము**

కృపా పయోధిన్ గృతి లోక వంద్యున్
ఉపేంద్ర దేవున్ హుతభుక్ప్రభావున్
విపద్వినాశున్ విపుల ప్రకాశున్
జపంబొనర్తున్ సతతంబు భక్తిన్

**26. కలియుగ మాహాత్మ్యము**

దాతన్ బేద, ధనాఢ్యునిన్ గృపణు, నుద్యత్పాపి దీర్ఘాయుర
న్వీతున్, సన్మతి నిర్గతాయువును, బుద్ధీశున్ మహావంశసం

జాతున్, భృత్యు సదన్వయప్రభవుగా సల్పున్, గలిన్ బంకజో
ద్భూతుండౌ విధియవ్విధిన్ దలంప నెంతో చింత వాటిల్లదే?

**27. గంగా నది స్తుతి**

గంగన్ దోష విభంగన్,
రంగన్నిజ సత్తరంగ రంగ స్థల నృ
త్తాంగీ కృత చక్రాంగ వి
హంగన్, శివ శీర్ష సంగనాత్మ భజింతున్

**28. పురవర్ణన - క్రమాలంకారము**

వేదవేదాంగాది విద్యా ప్రవీణులై
సొంపుగా విలసిల్లుచుండువారు
శౌర్యధైర్యౌదార్య చాతుర్య ధుర్యులై
సొంపుగా విలసిల్లుచుండువారు
ధనధాన్య సంపదుత్తమ భారభరణులై
సొంపుగా విలసిల్లుచుండువారు
విప్ర గోదేవతా విశ్వాస మూర్తులై
సొంపుగా విలసిల్లుచుండువారు

బాడబాన్వయులును క్షత్ర వర్యు లర్య
కులులు విష్ణుపదోద్భవుల్ గురుగుణాఢ్యు
లట్టి వారలచే నొప్పినట్టి దైన
చాగరలమూడి భాగ్య ప్రశస్తి గనుత

**29. యోగిని**

కామ మోహాది విషయ సుఖంబు వీడి
నిలయమును వీడి తల్లిదండ్రులను వీడి

గణ్యమైన తపో వృత్తిఁ గానఁ జేరి
మోక్షమును గన్న యోగినిఁ బొగడఁ దరమె?

**30. ముకురము – తోటకము**

ధారుణిఁ గల్గు నుదార జనంబుల్
సారె విలాసముఁ జక్కఁగఁ గాంచన్
గోరి క్రయంబిడి కొల్వగ నద్దాల్
పేరిమి గూర్తురు వేశ్మములందున్

**31. వైశ్యులు**

ఘనకరుణా విశేషమునఁగన్యక నిచ్చలుఁ బ్రోచుచుండఁగా
ననుపమమౌమతిన్ ధనమునార్జన చేసెడివృత్తిఁ గాంచి యె
వ్వని నెటుచూడ గౌరవమవార్యముగా లభియించునట్టులే
యనయముసేయు వైశ్యతతియార్యజనంబులునిచ్చ మెచ్చగాన్

**32. ఆఱు వేల నియోగులు**

రాజాధి రాజ సద్రాజ గౌరవముల
విలసిల్లు వారాఱువేలవారు
పరిపంథి బంధు రాపద్దాన సంధులై
విలసిల్లు వారాఱువేలవారు
పతికార్య నిర్వాహ భావ గరిష్ఠులై
విలసిల్లు వారాఱువేలవారు
సకల కలా కలాపక సత్సమాఖ్యులై
విలసిల్లు వారాఱువేలవారు

మతిమదగ్రణులనఁగ నున్నతి వహించి
వెలయుచుండెడి వారాఱువేలవారు

శంకర కృపానుసార విస్తార వంశ
విభవ యుతులగు వారాఋవేలవారు

**33. మన్మథుఁడు**

శూర కులాగ్ర గణ్యుఁడన శోభవహించిన మేటియెవ్వఁడే
దారుణమౌ శిలీముఖముఁ దాల్చిన నొక్కటిరెండుగాఁగనౌ
నీరజ సాయకుండు నవనీరజ బాణ మొకండు దాల్చినన్
బేరిమి రెండొకండగును వీరుఁడితండతఁడో గ్రహింపుఁడీ

**34. మయబ్రహ్మ**

జగతిని నయోమయంబను సంజ్ఞఁ గనిన
లోహమెన్నెన్నొ రీతుల లోకులకు ను
పకృతులుగఁ జేసి సుస్థిర ప్రథను వెలసి
నట్టిఁడైన మయబ్రహ్మ యనఘుఁడు గద

**35. విశ్వకర్మ**

బ్రహ్మరుద్రేంద్ర దైవశ్రేష్ఠు లెవ్వాని
        హితుఁడుగా మనముల నెంచుచుంద్రు
మనుమయత్వష్ట నామకులైన వారలు
        గురుడుగా నెవ్వనిఁ గొల్చుచుంద్రు
తద్వంశ సంభవోత్తమ గుణ నిధులెల్ల
        వంశకర్తయని యెవ్వాని నెంతు
రన్య జాతీయ శిల్పాచార నిపుణులు
        ధాత యంచెవ్వానిఁ దలఁచుచుందు

రతఁడె కద శిల్ప విద్య నగ్రాసనుండు
విశ్వకర్మాభిధానుండు, విపుల యశుఁడు
గాన నవ్వానిఁ గొలువుమీ మానసమునఁ
బ్రకట సజ్జన చయ సంగ! బసవ లింగ!

### 36. శివుఁడు గోరిన మోహిన్యవతారము

సారాచారుఁడు శంకరుండొకట నబ్జాతాక్షు వీక్షించి దై
త్యారాతీ! మునునీవు దివ్యుల నమర్త్యశ్రీకులన్ జేయ నా
రీరత్నాకృతిగాంచినాఁడవఁట, యాస్త్రీరూపమున్ జూపుమం
చారూఢిన్దను వేడఁ జక్రి సతియై హర్షాత్ముఁ జేసెన్హరున్.

### 37. యౌవన స్త్రీ

సరసిజవైరివైరులను జక్కఁగ గెల్చు కుచద్వయంబుతో
సరసిజ వైరి వైరి నగఁ జాలిన మేలగు మధ్యమంబుతో
సరసిజ వైరి వైరి నెకసక్కెము లాడెడు కప్పు కొప్పుతో
సరసిజగంధివచ్చె మరుసాయకమోయన సుబ్బయాహ్వాయా!

### 38. కాంత

చన్నులు పైడికుండలకుఁ జక్కదనంబును గూర్చుచుండఁగా
గన్నులుగండు మీలకును గల్కితనంబును నేర్పుచుండఁగాఁ
జెన్నగు వేణి కృష్ణఫణి చెల్వముతో జగడంబు లాడఁగాఁ
గ్రొన్ననఁబోడి వచ్చెనదిగో కనుగొమ్మిఁకవీథి, మిత్రుఁడా!

### 39. సంగమేశ్వరస్వామి రథము

హరువుగను చిత్రతర విగ్రహములతోడ
వేడ్క నింపెడు ఘంటికా వితతితోడ
వన్నె మీఱెడు పటముల చెన్నుతోడ
సంగమేశ్వరు తేరు హొరంగు మీఱు

### 40. యాజ్ఞవల్క్య ఋషి

మును వైశంపాయన ముని
ఘన కరుణను నేర్పి మఱలఁగా నిమ్మన, న

ర్పణఁ జేసి నిగమమును సూ
ర్యుని దయఁ గొను యాజ్ఞవల్క్యు రూఢిఁ దలంతున్

## 41. పాంచాల పురుషుఁడు

అధిక విద్యా రహస్యజ్ఞుఁడై చెలువొందుఁ
బాంచాల పురుషుఁడెప్పటికిఁ జూడ
అఖిలావనీపాల నాయత కీర్తియౌ
పాంచాల పురుషుఁడెప్పటికిఁ జూడ
సకల జనావన ప్రకట సుస్తేముఁడౌ
పాంచాల పురుషుఁడెప్పటికిఁ జూడ
నాయక గణములో నాయక మణియగుఁ
బాంచాల పురుషుఁడెప్పటికిఁ జూడ

పద్మినీ కామినీ రతోద్భవ ముద ప్ర
భరిత హృదయుఁడు పాంచాల పురుషుఁ డెపుడు
దైవ కార్యానుకూల సద్భావుఁడగుచు
ధరణిఁ జెన్నొందుఁ బాంచాల పురుషుఁడెపుడు.

## 42. కన్యక

మును పేరుగన్న పెను గొం
డను బుట్టియు విష్ణువర్ధన ధరాధవుఁడే
తను గోర శపించియు వై
శ్య నికాయముఁ బ్రోచు కన్యకాంబను గొల్తున్

## 43. సంగమేశ్వర స్తవము

శ్రీమద్ధరాభృత్యుతామేయమాన మా
నస హంసమా! వందనమ్ము నీకు

చంద్రరేఖా సమాసంగ రంగద్విహా
యస నదీ జూట! జోహారునీకు
దక్షాధ్వరాగత దైవతాగవ్రాత
కులిశోపమా! గిడిగుడులు నీకు
ప్రతి పక్ష రాక్షస ప్రాణధారాధర
వాతూల సమరూప! జోత నీకు

హిత జనామోదదా! నమస్కృతులు నీకు
డమరుకాంచిత హస్త! దండంబు నీకు
శంబరాహిత! హర! ప్రణామంబు నీకు
సంగమేశ్వర దేవ! యంజలులు నీకు

**44. పురవర్ణన**

స్నాన సంధ్యాద్యనుష్ఠాన కర్మఠులైన
బ్రాహ్మణావళులు శోభను వహింపఁ
దతగుణాభరణోచితప్రాభవులు నైన
క్షత్రియకులులు హెచ్చరికఁ గాంచ
వ్యాపార లాభ సంభరిత సంతోషులై
బేరులు మిక్కిలి పెంపు గనఁగ
నఖిల గుణంబుల కాధారులై కీర్తి
ప్రౌఢికెక్కిన యంఘ్రిభవులు వెలుఁగ

సంగమేశ్వరు కరుణారస ప్రవర్ధ
మానమై ధారుణీ స్థలి మహితమైన
యశము చేతను జెన్నొందు ననవరతము
వేడుకల మీఱు జాగర్లమూడి పురము

### 45. ఆంజనేయ స్తవము

ఎవని శౌర్యము విన్న నెడదలోఁ జెయివెట్టి
కలచి నట్టడలు రాకాసి మూఁక
ఎవ్వాని నుడివిన నెల్ల గంధర్వ కి
న్నర సుర నాయకుల్నతులు సేతు
రెవ్వాని సడిగన్న నెల్ల భూతాదిక
గ్రహము లెల్లపుడుఁ జీకాకుఁ జెందు
నెవని నామము విన్న నెంతయుఁ దమపాలఁ
గలుగు వాఁడని భక్తగణము దలఁచు

నట్టి దేవాది దేవు మహానుభావు
శంకర కుమారు భక్త కలంక హారు
రామకార్య విచారుఁ బ్రోద్దామసారు
నఖిల గుణవంతు, హనుమంతు నభినుతింతు

### 46. కామినీ గర్హము

మదిమోహంబిడు చన్నులన్దలఁపఁగా మాంసంపుఁబెన్ముద్దలౌ
ముదమున్జూపెడి కన్నులన్దలఁప నెప్డున్ నీర్పుసుల్తావులౌఁ
గద! యక్కాంతను గూడువారలకు మోక్షంబిల్లయౌఁగీర్తిసం
పద శూన్యంబగు నంచు వేదవిదు లేపట్ల న్విచారింతురౌ

### 47. హనుమద్దండకము

శ్రీకౌంజరీగర్భవారాశిరాకాసుధాధామమూర్తీ! జగత్పూర్ణకీర్తీ! లసత్సత్య మార్గానువర్తీ! సురానీక సంతాపకృత్సర్వపూర్వామరౌఘాటవీ వీతిహోత్రా! దయాపాత్ర! గీర్వాణ రాజా బభూ యక్ష రాట్పన్నగ ప్రేత రాదర్చితోద్యత్ప్రభా వాంఘ్రియుగ్మా! దశస్యందనాపత్య భక్తాగ్రణీ! శ్రీ హనూమంత దేవా! నమస్తే! నమః

**48. హంస - మత్తకోకిల**

సారసాసను వాహమన్న ప్రశస్త కీర్తి వహించియున్
నీరుపాల్ విభజింపఁగా దగు నేర్పు గాంచియు నీరజా
గారమెప్పు నగారమౌచు వికాస మందఁగఁ జేయుచున్
మీరు హంసము నెన్నుమా మది మిత్రుఁడా! శుభపాత్రుఁడా!

**49. వీరరాఘవస్వామి స్తుతి**

కవిరాజుల్ నరరాజ ముఖ్యులెపుడే కల్యాణుఁ గీర్తించి దు
ష్ట వికార శ్రమకారణాఘ సమితిన్ జక్కాడి సేమంబులన్
బ్రవిలాసంబులఁ గాంచి మోక్ష నిధులై వర్ధిల్లి రా వీరరా
ఘవదేవున్ నుతభావుఁగొల్చెదను సౌఖ్యంబెప్డుఁ జేకూర్పఁగన్

**50. మృదంగము**

ప్రమదము మదికిడు సంగీ
తమునకు వన్నియను బెట్టఁదగి, లయగతిచే
నమితరవముఁ గొనిన మృదం
గమునెన్నఁగ వలదె? యెట్టి ఘనుఁడైన ధరన్

**51. స్నేహితుఁడు (రేఫప్రాస)**

కరమగుకష్టసంఘముల ఖండనముం బొనరించి యాత్మకున్
బరమముదంబుఁగూర్చుసుగుణవ్రజమున్ మదికెక్కఁ జేయు దు
ర్భరమగు చింతలం గెడపు ప్రాణముకన్నను బ్రాణమైతగున్
ధరణిసుహృద్వతంసుఁడు యధార్ధము కీర్తిరమాధురంధరా!

**52. శ్రీరాముఁడు**

ఘోర విపత్పరంపరలు గూర్చెడు పంక్తిగళోరు శక్తిచే
దారిత సత్త్వులై ముని వితానముతో సురలా మురారినిన్
జేరి యెఱుంగఁ జేయ నవనిన్ రఘువంశమునందుఁబుట్టియా
దారుణశత్రురావణు వధం బొనరించెను శౌరి, రాముఁడై.

**(సంపూర్ణము)**

# బాపట్ల శతావధానము

## పీఠిక

ఆర్యులారా!

శ్రీమదాశుకవిసింహేత్యాది బిరుదాంచితులైన బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకట సుబ్బరాయ వేంకట రమణాభిఖ్యాతి విఖ్యాతకవిపుంగవు లీనెల 14వ తారీఖున మా బాపట్ల పురవాసులును విద్యాభిమానులును నగు బ్రహ్మశ్రీ చోరగుడి వేంకటాద్రి గారును, బ్రహ్మశ్రీ రాచపూడి జగన్నాథరావుగారును, బ్రహ్మశ్రీ పాతూరి శివరామయ్య గారును, బ్రహ్మశ్రీ కోన వేంకట్రావుగారును, బ్రహ్మశ్రీ ఆలూరి గోపాలరావు గారును, బ్రహ్మశ్రీ వల్లూరి వేంకటరామయ్యగారును, బ్రహ్మశ్రీ కొమరవోలు హనుమంతరావు గారును, బ్రహ్మశ్రీ చెంచురామయ్యగారును, బ్రహ్మశ్రీ కోటేశ్వరరావుగారును, బ్రహ్మశ్రీ బ్రహ్మాండం బాపయ్య గారి గుమస్తాగారగు బ్రహ్మశ్రీ గోపాలరావుగారును, బ్రహ్మశ్రీ కర్లపాలెపు సూర్యనారాయణగారును, బ్రహ్మశ్రీ పెళ్లూరి శ్రీనివాస కవిగారును మఱియు ననేకులగు మహామహులును సముచితంబుగ నాహ్వాన మొనర్ప నంగీకరించి వచ్చి, మా బాపట్ల రైలు స్టేషను లోనికిఁ బ్రవేశించు వఱకుఁ దద్దర్శనోత్సాహ వర్ధిష్ణులైన జనులనేకులు కరతాళ ధ్వనులొనర్చుచు జయజయేతి శబ్దంబులచే నుతియించుచు స్వాగత పద్యంబు లొసంగి యశ్వ శకటాధిరోహులఁ గావించి యూరేగించి సభా భవనమునఁ బ్రవేశపెట్టిరి. సభ యందు నిండియుండిన పండిత పామరులందఱొక్కసారిగాఁ గరతాళ స్వనంబులచేఁ దమ సంతోషంబును దెలిపిరి. ఆనాఁటి సభయందగ్రాసనాధిపతులుగా కోర్టు మునసబు గారైన బ్రహ్మశ్రీ టి.భుజంగరావు పంతులుగారుండిరి. ఈ కవి ద్వయము సభ్యులచే నెఱిఁగింపఁ బడిన కథా విషయంబుల నగ్రాసనాధిపతి గారు కోరఁగాఁ దమ నిరుపమానమగు నాశు కవితా ప్రభావంబుచే నక్కథలను బూర్తియొనరించి యెల్లర హృదయంబు లమందానంద కందళితంబులుగా సల్పిరి. ఇతఃపూర్వ మెన్నఁడును నెచ్చటను గని విని యుండని వారి యత్యద్భుత కవితాధారచేఁ దనిసి మెచ్చి తలయూపనివారు కానరారైరి. మఱునాఁడు 15వ తేదీన (15-9-1911) మధ్యాహ్నము సుమారు

గం. 2-20 నిమిషములకు శతావధానముఁ బ్రారంభించి (తెల్లవారు జాము) గం. 2-10 ని.లకు ముగించిరి. ఆ సభకు బ్రహ్మశ్రీ దేశిరాజు కృష్ణయ్య పంతులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. పృచ్ఛకులకు ననులోమ విలోమ సంఖ్యాకముగాఁ గోరిన విషయములం గూర్చి కోరిన వృత్తములం జెప్పిరి. ధారణా శక్తి తప్పిపోవుట గాని, సమస్యాపూరణ మందు సారస్యము లేకపోవుట గాని, అవధానాంతమునఁ బద్యములు చదువకుండుట గాని, కోరిన సమస్యలు మార్చి పూర్తి సేయుట గాని, పద్యములు మఱునాడు చదివెదమనుట గాని సంభవింపక, యసూయాగ్రస్తులకు సైతము వేఱైన యూహలు దోఁపఁదగిన వ్యవధి లేకుండుటచే నిదియేమి యాశ్చర్యమను నట్లు సభ్యులగు వారికందఱ కత్యధికమగు సంతసమును గలిగించిరి. మూఁడవనాఁడు (16-9-1911) సభ్యుల కోరికచే వారి యత్యద్భుత కవితా ధారఁజూపి గంటకు 480 పద్యములు చెప్పి మెప్పు గాంచిరి. పులినిఁ జూచి నక్క వాఁతఁ బెట్టుకొన్న సామ్యమున నీ సోదర కవులవలె నాశు కవిత్వమును జెప్పుటకు సాహసించి మృదు మధురశైలి లేకపోగా నడుగు సాఁగక, విషయము తోఁచక, యతులు గతులు చెడుట వలన మతియును, స్మృతియునుఁ గూడఁ దప్పి, కథను గోదావరిలోనో, గంగలోనో కలిపినవారై తమ శక్తి లేమి నెఱింగియు నితరుల శక్తినిఁజూచి యోర్వలేక యందని మ్రాని కఱ్ఱులు సాఁపుచు సత్కీర్తినిఁ గోరుచుఁ బిదప దానికి వ్యతిరేకమగు దానినే వడయచున్నవారిని గొందఱినిఁ జూచిన యెల్లరకు నీ బాలసరస్వతుల యసమాన సామర్థ్యమత్యాశ్చర్యముఁ గలిగించెను. ఆ నాఁడే యీ సోదర కవి సింహులకు రు. 116-0-0 పారితోషిక మొసంగఁబడి బంగరు పతకంబులుఁగూడ వాగ్దానము సేయఁబడెను. బహుమాన మునొసంగి నప్పుడది గ్రహించి బెల్లముఁ గొట్టిన రాళ్ల వలె నూరకుండెడి కొందఱ వలెఁ గాక తమ సంతోషము నంగీకారమును వెల్లడించుచుఁ బ్రతిపద రసభావ గుంభితంబులుగా నొక యేఁబది పద్యములఁ జెప్పి సభాస్తారుల రంజింపఁ జేసిరి. ఇట్టి సోదర కవియుగ్మమున కత్యంతాయురారోగ్య భాగ్యంబుల నింకను వెలయించి సర్వకామిత ప్రదుండగు భగవంతుండు నిరంతరంబును రక్షించుఁగాత.

బాపట్ల, ఇట్లు,

20-9-1911

**చంద్రమౌళి చిదంబరరావు**

## బాపట్ల రైల్వేస్టేషనులో దిగినపుడు చదివిన స్వాగతపద్యములు

శ్రీకొప్పరపువంశ సింధుసంజనిత ము
        క్తామయులార! స్వాగతము మీకు
ఘనసుబ్బరాయ వేంకటరమణాఖ్య స
        త్కవివరులార! స్వాగతము మీకు
ఆశుకవీంద్ర మృగాధీశ్వరప్రథాం
        చితమూర్తులార! స్వాగతము మీకు
కుండినకవికుల మండలహంసాఖ్య
        గణనీయులార! స్వాగతము మీకు

రాజధానియందురహిమించు నాంధ్ర దే
శంబునందు యశముఁజల్లి మిగుల
బిరుదులంది పెంపుఁ బేర్కొన్న నగ సమ
ధైర్యులార! స్వాగతంబు మీకు

కొప్పరపు కవులటంచును
గొప్పగు కీర్తిని వహించి కొమరొప్పెడు నీ
యొప్పులకుప్పల కిప్పుడు
మెప్పుగ స్వాగత మొసంగ మేలగుఁగాదే

చిత్రమే శారదా నవరాత్రులందు
పాత్రులై శారదా నవగాత్రులైన
మిత్రు లీకవివర్యుల మేలిరాక
శిష్ట శతపత్రములు వికసించు ధాక

**కర్లపాలెం సూర్యనారాయణ**

# బాపట్ల శతావధానము

**(15-09-1911)**

1. శ్రీమత్కనకదుర్గాంబాయై నమః

ప్రాపై పల్లెలఁ బట్టణంబుల ధరాపాలుల్ కవుల్ మెచ్చఁగా
నైపుణ్యంబును జూపఁజేసి జయమున్ ద్రవ్యంబుఁ జేకూర్చుచున్
మాపట్లన్ దయనించు దేవివని నిన్ భావంబునన్ నిల్పి యీ
బాపట్లన్ జరుపంగఁబూనితి సభన్ బాలింపు కాత్యాయనీ

2. వర్షాకాలప్రవాహము – గర్భిణీసతి

నీరుచే నద్దియిద్దియు నెగడుచుండు
తృప్తిఁగనకద్దియిద్దియు నెసఁగుచుండు
నదియు నిదియును దరులదృశ్యములుగఁ దగు
గర్భిణీకాంత నది యభంగప్రచార

3. గోపికావస్త్రాపహరణము – మందాక్రాంతవృత్తము

కాంతల్ భక్తిన్ గిరిజఁగొలువంగా నదిన్ దానమాడన్
వింతల్దోపన్ వసనములఁ బృథ్వీజమందుంచఁగా నా
దంతీద్యానల్ వెదకి హరికృత్యంబటంచున్ భజింపన్
జింతల్ పాయన్ గరుణనొసఁగెన్ జేలముల్ కృష్ణుఁడంతన్

4. వసంతర్తువునందు వనములు

నానాసూనవితాన సంపదల నానందంబు సంధింపుచున్
సూనాస్త్రాయుధరాజికిన్ శరధులై సొంపొందుచున్ గామ కే
ళ్యానందంబునఁ దేలుయౌవతము నుత్యర్థోక్తులన్ గాంచి సా
రానన్ మించె వసంత వేళను వనుల్ రమ్యస్థితిన్ జెందుచున్

5. సమస్య : పున్నమ యమవస యనంగఁ బొల్పందె భువిన్

అన్నా పున్నమ లెన్నియొ
కన్నుల పండువును జేయఁగా ఘన తిమిర
చ్ఛన్నమయి వ్యాసు పేరిటి
పున్నమ యమవస యనంగఁ బొల్పందె భువిన్

6. రెండవ పూర్తి –

వెన్నెల వెదఁజల్లుచు దివి
వెన్న వలెన్ దోఁచు చంద్రబింబము నెల్లన్
గ్రన్నన రాహువుమ్రింగఁగఁ
బున్నమ యమవస యనంగఁ బొల్పందె భువిన్

7. దేహము – గడియారము

ఊహింపందగు యంత్రసంపదలచే నొప్పొంది యెల్లప్పు డు
త్సాహంబిచ్చెడు నందొకండు చెడినన్ సౌకర్యముంబాసి వే
వే హానిన్గను వేయిఁజెప్పవలెనే విశ్వంబు నందన్నిటన్
దేహంబున్ గడియారమున్ సమము సందేహింపకో మిత్రుఁడా!

8. సమస్య : క్రమమనియెంచిపంచెఁ గవిరాయఁడు భారతియిస్తువంతయున్

ప్రమదముదోప గాయకులుఁ బాండితిగల్గినవార లొక్కెడన్
సమరముసేయుచుండఁగని శారద యందఱి మాత "యిందు న్యా
యము కవిరాజ తెల్పు"మనె నయ్యెడ రాజునిజంబుఁ దెల్పు టే
క్రమమనియెంచి పంచెఁ గవిరాయఁడు భారతి యిస్తువంతయున్

9. నల్లి – లయగ్రాహి

మల్లెలును మొల్లలును జల్లినను శయ్యపయి
నల్లియొకఁడుండ సుఖమెల్లయును బాదం

చెల్లరు వచింతు రటు లెల్లిదము సేయఁదగ
దల్ల కుసుమాంబకుని భల్ల మదియందున్
వల్లభుఁడు కాంత ముదమల్లుకొన సెజ్జఁగనఁ
బెల్లెగసి నిద్ర తనువెల్ల మఱపింపన్
ఝుల్లుమనఁగుట్టి రతి నుల్లములు దన్పి భళి
వల్లెయని వారి నుతులల్లపుడె గంటన్

10. బ్రహ్మశ్రీ నందిరాజు లక్ష్మీనారాయణదీక్షితులవారు

వేదంబనంగ నేవీథిలోవస్తువో
యనువారి సందియం బడలఁద్రోచె
శాస్త్రంబనంగ బాజాఱులో నెంతటి
క్రయమను వారల కలతఁబాపె
బ్రమసి సంధ్యావందనమను పల్కునకెట్టి
యర్థమో యనువారి కదియుఁదెలిపెఁ
దమ రెట్టిజాతిజన్మములనుండిరొ యది
యెఱుఁగనివారల కెఱుఁగఁజేసె
నెట్టివారల నేవిధి నెప్పుడెపుడు
గాంచఁగావలె నవ్వారిఁ గరుణ నట్టి
విధు లెసఁగఁ గాంచె విజ్ఞాన విఖ్యాతిఁబెంచె
దీక్షితుండనఁ దామరసాక్షుఁ డవని

11. ఆశుకవిత్వ మీజన్మమున నెట్లుసంభవించెననుటకు

తనకన్నఁ బెద్దలౌ ఘనమతులను గాంచి
గౌరవించిన పుణ్యకర్మ మొకటి
విద్యార్థులకు సర్వవిద్యల నెఱిఁగించి
కైకొన్నదౌ పుణ్యకర్మ మొకటి

తల్లిదండ్రులకన్న దైవముల్ లేరంచు
గణుతిఁజేసిన పుణ్యకర్మ మొకటి
అలశారదా దేవి నతిభక్తిఁ గొల్చుచుఁ
గైజోతలిడు పుణ్యకర్మ మొకటి
కలసి మెలసిన నీభువిఁ గలుగువేళ
నాశు కవనము లభియించు నందు రట్టి
కవితయన మాటమాత్రంబె చవులఁగురిసి
సరసులకు వశ్యమంత్రమై సౌరునించు

12. సమస్య : తొలిఁజేసెన్ భయమింతయున్ గనక విద్యుద్వల్లికబ్రంబహో

తళుకుంజూపుల్ఘ సోగకన్నులును మందంబైన యానంబునున్
గులుకుంగుబ్బలు బారలౌ కురులు బెళ్కుంజూపు మధ్యంబునున్
వెలయన్ నల్వస్మరాస్త్రమే మెయియనన్ బింబోష్ఠినిర్మించితాఁ
దొలిఁజేసెన్ భయమింతయున్ గనక విద్యుద్వల్లికబ్రంబహో.

13. అంధుండాలయముఁ గాంచి యానందించెన్

బంధురశక్తిని రేఁచి సు
ధాంధుల నడలింపఁ జంద్రధరుఁగన భక్తిన్
సంధించి బాణుఁడను గ
ర్వాంధుం డాలయముఁగాంచి యానందించెన్

14. సీత, దమయంతి, చంద్రమతి యను స్త్రీలలో శ్రేష్ఠురాలెవరనుటకు

పాతివ్రత్యమునందు ముప్వరును మున్ప్రావీణ్యమున్ గాంచిరా
సీతాదేవియు, భీమరాజసుతయున్ సీమంతినీరత్నమన్
ఖ్యాతిన్గన్న త్రిశంకుపట్టిసతియున్ గానీ విభున్ బ్రోవఁగా
నీతిన్నిల్పెనుగానఁ జంద్రమతియే నేటంచు నేనెంచెదన్

15. సమస్య : పద్మంబునకోడి చేరెం బద్మారి దివిన్

పద్మవ్యూహము విప్ర క
కుద్మంతుండు గూర్పనడంపం గోరెద రంచున్
బద్మారియైన వ్యూహపుం
బద్మంబున కోడి చేరెం బద్మారి దివిన్

16. రెండవ పూర్తి –

పద్మములు విలోచనములు
పద్మపుముకుళములు చనులు పద్మాక్షికి నా
పద్మాక్షి సుందరానన
పద్మంబునకోడి చేరెం బద్మారి దివిన్

17. గ్రీష్మకాలము – కవిరాజవిరాజితము

సుమశరుండేపునుజూపందొడంగిన సుందరులన్ విడంజేయుటలో
శ్రమమును గొల్పుచు నెండలు వెల్గుటం జల్లనిగాలియుం గల్గమిచేం
జెమటలు గ్రమ్ముట దేహము తాపముంజెందుట నీరము ద్రావంగంగో
ర్కె మహితమౌటం గడుంగడుంగల్గును గ్రీష్మమునందున ధీరనుతా

18. నాగలింగ సోమయాజిగారనువారు

నేను నాగలింగసోమయాజిని, బ్రాహ్మణుండను, కౌండిన్యగోత్రుండను, నీభక్తుండను, నాకుం జిన్నతనమునం జెవిలోం బోటుపుట్టంగా నోమోపిదేవి సుబ్రహ్మణ్య స్వామీ నీపుట్టకు నమస్కారముం జేసితిని, చెవిలోని పోటు పోయినది యను నర్థమువచ్చునట్లు శార్దూలమును చెప్పుమనగా –

భావింతున్ నిను మోపిదేవింగల సుబ్రహ్మణ్య! నీభక్తుండన్
నేవిప్రుండను నాగలింగయను గౌండిన్యాఖ్యగోత్రుండ నా
కావిర్భావముం జెందెంబోటు చెవిలో నాబాల్యమందప్పుడో
దేవా! నీదగుపుట్టకు న్నతుల నెంతేంజేయం బోయెంగదే

19. త్రిమూర్తులను స్తుతించుట

శ్రీనారీప్రియవల్లభుండయిన యాశ్రీవిష్ణుసేవించెదన్
ధీనంద్యుండగు కాళికాధవుభవున్ వేడ్కన్ బ్రశంసించెదన్
సూనాస్త్రాగ్రజు శారదాపతి విధిన్ శోభాగతుల్ గూర్పఁగా
నానందంబునఁ గొల్తుఁ బండితులు మేలౌరా యనన్ మాటికిన్

20. ప్రస్తుత సభ

అందఱు సద్గుణౌఘయుతు లందఱు భూరికళావిశేష లీ
యందఱుఁ బాండితీప్రథితు లందఱు సత్కవితాభిమానులీ
యందఱు దానధర్మరతు లందఱుఁ గీర్తి రమావిలాసులీ
యందఱు నందఱౌట సభయందలి వీరలనెన్న శక్యమే

21. సుదర్శన చక్రము

ఆ కరినాథుఁ గాచుటకునై చని నక్రముఁజంపె నుద్ధతిన్
బ్రాకటశక్తిఁ బళ్ళెరమునాఁదగి చైద్యుని రూపుమాపె సు
శ్లోకులు సన్నుతింప నెటులోపము గల్గకయుండ భక్తులన్
శ్రీకరమౌచుఁ గాచెనది శ్రీశు సుదర్శన చక్రమో సఖా

22. రాజునకుఁ గవికి మైత్రి

సారసరాజికిన్ భసల సంతతి కెంతటిమైత్రి యుండెనో
వారిదపంక్తికిన్ మఱియు బర్హి చయంబున కెట్టిమైత్రియో
కీర పికాళికిన్ మధువు గీల్కొను మావుల కెట్టిమైత్రియో
ధారుణీ భర్తకున్ గవికిఁ దద్గతి మైత్రి నితాంతమైతగున్

23. సోదరకవులమైత్రి – లయగ్రాహి

ఒక్క యెడకే చనుచు నొక్క నరునే గనుచు
నొక్క పనిఁజేయుచు మఱొక్క మతి లేకే

యొక్క పదవిం గనుచు నొక్కటనె సొపడుచు
నొక్కటనె పండుచు మఱొక్కటియుఁగాకే
యొక్కటను గాని క్రుధనొక్కరును బూనకయె
యొక్క కృతిఁజేయుచును మిక్కుటపుఁ జెల్మిన్
నెక్కొనిన సోదరులు పెక్కగు వధానములఁ
జక్కని కవిత్వమున నుక్కుఁ గనిరిందున్

24. బ్రహ్మశ్రీ బెల్లముకొండ రామరాయకవీంద్రులు

అలనాగేంద్రుఁడె శబ్దసంతతికినై యాశించు నానొప్పుచున్
బలుకుల్ కప్రపుఁబల్కులై దొరలఁగాఁ బద్యంబుఁదోడ్తోడరాఁ
బలుకుందన్వియె యిట్లుపుట్టెననఁ గబ్బంబుల్దగన్ వ్రాయుచున్
మెలఁగెన్ బెల్లముకొండ రామకవిసుమ్మీ సత్కవీశానుఁడై

25. సాయంకాలమునందు తూర్పున నొకకాంత సూర్యునిఁ జూచుట

సారసనేత్రయొక్కరిత సారసమిత్రుఁడు పశ్చిమాంబుధిన్
జేరఁగబోయి నట్టియెడఁ జెల్వుగఁ దూర్పునఁగల్గుచెర్వులో
నీరముపాత్రఁ గైకొనఁగ నెమ్మది నెంచి జలంబుఁజూడ నా
నీరమునందుఁ జాయయయి నీరజ మిత్రుఁడు దోఁచెనొయ్యనన్

26. కృతఘ్నునకు దైవ శిక్ష

అరసి యుపకారి కపకార మాచరింపఁ
దలఁచిన కృతఘ్నునకు సేయు దైవమెదుట
నన్నమున్ బెట్టి తిననెంచు నట్టివేళఁ
దొలఁగఁజేసెడి పాపినిఁ గొలుచునట్లు

27. అవధానమునఁ గవికినిఁ బృచ్ఛకులకుఁ గలుగు కష్టసుఖములు

కదల కొక్కెడ నుండుటే కష్ట మొకటి
కాని, సరస పదంబులు కవితఁబడిన

సంతసముగల్గు నామీఁద సౌఖ్యమబ్బుఁ
దలఁపఁ గవి పృచ్ఛకుల కవధానమందు

28. పండితుఁడు, కవి

కవివరుం డల్లినట్టి శ్లోకంబునందు
గల్గు నర్థంబుఁ బాండితీగరిమఁ గన్న
ఘనుఁడు, తెల్పును గవి యట్టు లొనరఁ దెల్పి
మీఁదఁ గవనంబుఁ జెప్పియు మెప్పుగాంచు

29. మల్లె – లయవిభాతి

వెలయును సుగంధమున వెలయును సురూపమున
వెలయును మదాళికినిఁ జెలువము ఘటింపన్
వెలయును దుషారదర మలయజ శతారశర
ములను నగఁజాలెడి ధవళరుచులతోడన్
వెలయు మరుబాణమయి వెలఁదులకుఁ బూరుషుల
కలుకలను బాపి మదిఁ గలయికలు గూర్పన్
బొలుపెసఁగ మల్లెయది తులయగు సుమంబు ధరఁ
గలయఁగను జూచినను గలుగదనఁ జెల్లున్

30. ఖండిత నాయిక

నీరేజాక్షినొకర్తుఁగూడి పిదపన్ నెయ్యంబు దోపంగఁదన్
జేరన్ వచ్చిననాథుఁ గన్గొని భళీ, చెంగల్వలై నేత్రముల్
మీఱెన్ దేహము వాడువాఱె ముఖమెమ్మెన్ బాసి మేల్వీడె నీ
తీ రేమంచెదిరించి ఖండిత యనున్ దీవ్రోక్తి పుంజంబులన్

31. సమస్య : కాంతుఁడు లేనివేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్క తోన్

కంతుని వాడితూపులను గాసిలు నన్ దయఁగావ వత్తునం
చింతకురాకఁ దక్కెఁబ్రియుఁడేమిటికోయని బిట్టు దూఱుచున్

జింతయుఁగోపమూను సరసీరుహలోచనఁ జేరె నాతఁడున్
గాంతుఁడు లేని వేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్

32. శ్వేతాభిసారిక

అనువుగఁ బ్రాసవిశ్రమము లర్థము భావము చూచుకొంచు నం
తనగను నాశుధారఁ గవనంబు చెలంగు విధంబుఁదోపఁగా
వనిత విటున్ గనుంగొనెడు వాంఛను దెల్లనిచీరఁగట్టి తె
ల్లని నును వెన్నెలన్ జను భళా యభిసారిక మానసత్వరన్

33. బాలాసుందరీ నాటకశాలను భావనారాయణస్వామిని రక్షింపుమనుట

మీలంబోలి తెరల్ తళుక్కుమని యెమ్మెన్ జూపుచుండంగ భం
గాళిన్ బోలుచుఁ గట్టడంబులవి నేత్రానందమున్ జేయఁగా
బాలాసుందరి కంపెనిన్ వనధిగా భావించినారార్య లిం
దోలిన్ నీవువసించి ప్రోవఁగదవే యో భావనారాయణా

34. అభిమన్యుని పద్మవ్యూహనిర్భేదనము – పంచచామరము

ధరామరుండు ద్రోణుఁడల్ల ధర్మరాజుఁబట్టఁగాఁ
గరంబుఁ బన్నిదంబు వైవఁగా నరాత్మజుండు తా
దరంబులేక మొగ్గరం బుదగ్రుఁడౌచుఁ జించుచో
గురుప్రకాండ మెల్ల గోడుగోడుమంచు నేడిచెన్

35. సమస్య : శనికిన్ భయమందనట్టి చతురుండితఁడే

వనజాక్షు బహిఃప్రాణం
బనఁదగు విజయుండితండె యమరేంద్ర వనం
బును వహ్నికిచ్చి యుగ్రా
శనికిన్ భయమందనట్టి చతురుం డితఁడే

36. సమస్య : దుర్మతి రాజుగాఁగఁ బరితోషము గైకొని రెల్లవారలున్

దుర్ముఖియందె పుట్టియును దుర్ముఖిగాక ప్రజానురాగుఁడై
కర్మఠుఁడైనయట్టి నరకాంతుని పుత్రుఁడు రౌద్రివత్సరం
బర్మిలి నిండినంతఁ దగునంతటి ప్రాయముగల్గి మేటియై
దుర్మతి రాజుగాఁగఁ బరితోషము గైకొని రెల్లవారలున్.

37. సమస్య : కుక్క చేతనుబడెఁగదా కుంజరంబు

దుర్బలుం డకృతాస్త్రుఁడౌ ద్రుపద పుత్రు
చేత ద్రోణుండు చాపదేశికుఁడు పడియె
నన్నమాత్రన యచ్చెరువయ్యె మదికిఁ
గుక్క చేతను పడెఁగదా కుంజరంబు.

38. సమస్య : కోడెలతోడ ఢీకొనియుఁగూలెఁగదా ముసలెద్దులొక్కటన్.

వాఁడితొలంగి దేహబల వైభవమున్ మతిబుద్ధి శక్తియున్
గూడఁదొఱంగి దుష్కవులు కొందఱు సత్కవి సింహపోతముల్
పోఁడిమిఁజూపఁగా నెదిరిపోరి యడంగెడునట్లుగాఁగ నా
కోడెలతోడ ఢీకొనియుఁ గూలెఁగదా ముసలెద్దు లొక్కటన్

39. సమస్య : తల్లి తల్లిమగఁడు తల్లియయ్యె

మోహినీస్వరూపమున నొప్పు హరితోడ
భవుఁడు కలయఁ బుట్టె భైరవుండు
దాన భైరవునకుఁ దండ్రియయ్యె శివుండు
తల్లితల్లి మగఁడు తల్లియయ్యె

40. సమస్య : తలలోపలనున్న కల్లుఁద్రావిరనేకుల్

బలువేసవి దినములలోఁ
గలిగిన తాపంబు దీఱఁగా నుత్సాహం

బొలయఁగఁ గడుఁజల్లని ముం
తల లోపలనున్న కల్లుఁ ద్రావి రనేకుల్

41. సమస్య : ఫలముఁదినందగునె చూతఫలముంబోలెన్ – దమయంతీ కథ

నలనామ మొనర నుగ్రా
నలుని వరింపంగ నెట్లు నాకొనఁగూడున్
ఫలమనినమాత్ర ముక్తా
ఫలముఁ దినందగునె చూతఫలముంబోలెన్

**(సంపూర్ణము)**



## అవధానాంతమున

## పండితకవుల యభిప్రాయములు

### బ్రహ్మశ్రీ పెళ్ళూరి శ్రీనివాసశాస్త్రిగారు

శ్రీమత్కొప్పర వంశేజాతౌ సుబ్బార్యోరమణశ్చేత్యుక్తౌ
ఏతౌభూమిమలంకుర్వాణౌ ధీరౌసద్గుణసంపద్యుక్తౌ

ఏతౌహిసోదరావస్మిన్ నగరే సత్కృతౌజనై
స్తయోర్దర్శనమాత్రేణ పరిపూర్ణ మనోరథైః

సూరివరేణ్యులాశుకవిశూరులు గంటకునాల్గు నూఱ్ఱసా
ధారణశక్తి యుక్తి బుధతండము వల్లెయనంగఁ బద్యముల్
ధీరతఁ జెప్పినారుగద ధీవరులార! యుదారులార! యా
శారద యీ సురూపముల సభ్యులు మెచ్చఁగఁ దాల్చియున్నదౌ

విద్యామహిమఁ జూచి వినుతింపుమందురా
    కవిచక్రవర్తులే ఘనులుగారె
ఆశుకవిత్వంబు నల్లుటయందును
    బాలసరస్వతుల్ ప్రథితులిలను
శతఘంటకవనంబు సమధిక స్థితిసల్ప
    సుబ్బార్యరమణులే శూరులెన్న
అష్టావధానంబు నతిదక్షత నొనర్పఁ
    గవికులసింహముల్ గణుతికెక్కి

రరయ నేత్రావధానంబు సరణిఁదెల్పి
కొప్పరపు వంశశుక్తిలోఁ గొమరుమిగులఁ

బరఁగు ముక్తాఫలంబులై వాసికెక్కి
రట్టివారలు విబుధు లత్యధిక మతులు

శతావధానాశుకవిత్వధీరౌ అష్టావధానేప్యసహాయశూరౌ
తథాబుధౌనేత్రవధానశక్తౌ నారాయణో రక్షతుపండితౌ తౌ

పెళ్ళూరుశ్రీనివాసేన కృతాన్యేతాని పండితాదృష్ట్వా
అత్ర స్థితాన్ హి దోషాన్ క్షంతుంయుష్మాన్ భజామ్యహంవై

## బాపట్ల కోర్టు ప్లీడరు
## బ్రహ్మశ్రీ చంద్రమౌళి చిదంబరరావు పంతులుగారు

శ్రీలసమానకొప్పరపురీమణిదీప కవీంద్రులార! నీ
లా లలనామనోహర విలాసపదాబ్జమరందపాన కే
ళీలలితాత్ములార! సఫలీకృత కారణజన్ములార! నే
కేలు మొగిడ్చి మ్రొక్కెదనొగిన్ గవిసోదరులార! మీకిటన్

కవులంజూచితిఁబండితాగ్రణులఁ బెక్కండ్రం గనుంగొంటి భా
రవిముఖ్యాదిమహత్కవీశ రచితోద్గ్రంథంబులన్ వింటి పె
క్కవధానంబులఁగాంచితిన్ వివిధ విద్యానాధులన్ జూచితిన్
భవదీయోరుకవిత్వధారగల యీ ప్రాగల్భ్యముల్ గంటినే?

కవితాధారయొ లేక ధూమశకటోగ్రవ్యగ్రవేగంబొ కా
క వియత్తుంగతరంగసంగతమహాగంగాప్రవాహంబొ యం
చు వివేకుల్ కవివర్యు లెంతయును నౌత్సుక్యంబు దీపింపఁగా
సువినీతిన్ విరచింప నేరికగు నెచ్చో మీకె గాకీధరన్

సరసకళాస్వరూపయగు శారద మీముఖరంగమందు సుం
దరతరలీల నృత్యము ముదంబునఁ జేయునటంచుఁ బండితో

త్తరులనఁ గాదు వాణియవతారము నిక్కము కొప్పరంపు సో
దర కవియుగ్మమియ్యది యథార్థమటం చెద నాకుఁ దోఁచెడిన్

రసవదలంకార రమణీయవృత్తముల్
కోరిన సంఖ్యకుఁ గొదువలేదు
ధారాప్రమాణంబుఁ గోరిన నైగరా
జలపాతమునుగొని కొలువవచ్చు
దీర్ఘసమాసంపు తెరువుగావలెనన్నఁ
గాదంబరీకావ్య కలనఁజూపు
భావగాంభీర్యాది పరిణతిఁగాంచిన
భవభూతిగౌరవ ప్రభ వహించు

సుబ్బరాయకవీశ్వర సూరివినుత
వేంకటరమణకవిమణి వేడ్కమీఱ
మీ కవిత్వంబు వర్ణింప నాకెగాదు
తలలు వెయిగల్గు చిలువకుఁ దరముగాదు.

రంగదుత్తుంగ తరంగసంగతగాంగ
భంగవేగము సరివచ్చు నేమొ
ధావదుగ్రవ్యగ్ర ధారణాధికధూమ
శకట వేగముకొంత చాలునేమొ
ప్రావృట్సమయభూరి పర్జన్యుఁ దంపెడు
జడివాన రయమైనఁ జాలునేమొ
రాము నమోఘ శస్త్రవితాన గమన వే
గముకొంత వెంటరాఁగలుగునేమొ

కాని యితరంబు ధారుణిఁగానరాదు
నిరుపమాఖిల కవి వర్ణనీయ విమల

చాతురీద్య భవత్కవిత్వాతిధార
కెన యనంగను దలపంగ ననువుగలదె

కవితామాధురియొప్పుధారయు నలంకారప్రభారీతి శ
బ్దవితానంబున సౌష్ఠవంబు రసవంతంబై మనోరంజక
త్వవిధిన్ గూరుచుశయ్యచొప్పు వహవా పాండిత్యసంపత్తి యె
య్యవి లేవే కవితన్? రసజ్ఞులకు మోదాంకూరముల్ పుట్టఁగన్

వర జయంత్యన్వయాభరణంబు రామధీ
రాగ్రణి యొక్కరుఁ డమలయశుఁడు
వావిలికొల్ను సుబ్బారాయకవిచంద్రుఁ
డాంధ్రవాల్మికి బిరుదాంకితుండు
సకలభాషావేది శాంతుండు చెన్నాప్ర
గడ భానుమూర్తి సత్కవివరుండు
చతురవచోవిలాసయుతుండు శతఘంట
వేంకటరంగ కవిప్రవరుఁడు

సంస్కృతాంధ్ర కవిత్వ విశారదులు ర
సజ్ఞు లనుపమ ధిషణా నిశాంతులెల్ల
సాక్షులుగనుండు మీకవీశ్వరతనెట్లు
కాదనుచు నెంచి వచియింపఁగల్గువాఁడ

పండితులౌదురో యలఁతిబాలకులో సురభాషలోను ధీ
మండలి శాస్త్రవాదములు మాన్యతఁ గాంతురొ యవ్వియేల యు
ద్దండసరిత్తరంగ సమధాటిమహత్త్వ కవిత్వవైదుషీ
మండనులార! మీకవిత మాకు మనోహరమయ్యె నియ్యెడన్.

మును మనసార వల్లెయిడి పోఁడిమితోఁ బఠియించినట్టివా
నినె పఠియించురీతిఁగడు నేర్పునఁజెప్పు కవిత్వశక్తి మీ

యనుపమధారణామహిమ యన్నిట సన్నుతిపాత్రమయ్యెనో
ఘనకవులార! మీకవితకన్నను బూజ్యతయెుందుపొందునే?

### బ్రహ్మశ్రీ పంగులూరి వీరరాఘవయ్యగారు

శ్రీరమణీమనోహరుఁ డశేషజనోద్ధరుఁ డిద్ధకీర్తివి
స్తారుఁడు సత్యరూపకుఁడు దైవశిఖామణి భక్తలోకమం
దారుఁ డుదీర్ణమానసుఁడు ధర్మవిచారుఁడు రామమూర్తి మి
మ్మారయుఁగావుతన్ గడుఁ జిరాయువొసంగి నిరంతరంబొగిన్

మీకవితావిలాసములు మీపదగుంభనముల్ సదాగతిన్
వీక హసించు సత్వరకవిత్వములున్ గడునొప్పుశ్లేష ల
స్తోకపుభావగర్భముల సొంపులు మేలుపమానపంక్తులున్
మీకె తగున్ మహాసభ లమేయతరంబుగఁజేసి పండితా
నేక బహూకృతుల్ వడసి నిర్మలకీర్తివహించినట్టియో
శ్రీకరకొప్పరంపుకుల సింధుసుధాకరులార! నానుడుల్
చేకొనరయ్య మీరిపుడుచేసిన యీయవధానమెంతొ న
వ్యాకృతినొప్పఁ గాంచితిని భావపురంబున నీసభాజనుల్
ప్రాకటమోదమొందిరను పల్కునుబల్కఁగ నేల నాదు మో
దాకలనంబు మీకుసుమదామము లర్పణఁజేతునన్నచో
వాకెసఁగంగ నీపురనివాసు లధీశులు సన్మహోత్సవా
నేకములాచరించిరట నేర్పరులై తగు పెక్కుమంది ద్ర
వ్యాకృతిచేత నూటపదియాఱులొసంగిరి వేతెయియ్యఁగా
నాకిటశక్తిచాలమి ఘనంబుగ నుత్పలమాలికావళుల్
తేకువఁగూర్చియిచ్చితి నతిప్రమదంబున నూఱువేలుగాఁ
గైకొని సంతసింపుఁ డల కల్వలతేఁడొక జీర్ణతంతువున్
జేకొని సంతసింపఁడె యశేషజనైక సుఖప్రదాతయై

ఆశుగ జవంబుఁబోలు మీయాశుధార
అమృతధారకుఁబురుడు మీయాశుధార
ఆర్యహృదయంగమంబు మీయాశుధార
శుభగమతులార! సోదర సుకవులార!

**బ్రహ్మశ్రీ కర్లపాలెపు సూర్యనారాయణరావుగారు**

శ్రీకొప్పరపు కవిశ్రేష్ఠులు మనపురం
    బందున నిన్న నేఁడందముగను
నాశుకవిత్వంబు నవధానమహిమంబు
    సలిపినవార లత్యలఘుమహిమ
వారివాగ్ధోరణి వర్ణింపవేయినో
    ళ్ళభుజంగ రాయండు లఘువుననియెఁ
గీర్తివర్ధనుఁడైన కృష్ణాభిధానుండు
    సంతోషవారిధి నెంతొమునిఁగెఁ

గానవీరిని వర్ణింపఁగాఁదరంబె
నాదుబోంట్లకునైనను నామనంబు
నందుఁగల సంతసంబున నిందునిలిచి
నాను వేతేమిచెప్పఁగా లేను నిజము.

గ్రుక్కవిడువక నొక్కటనుక్కు మిగిలి
గ్రక్కు గ్రక్కునఁబల్కెడు పెక్కులైన
యక్కరపుముక్కలప్పక్కి జిక్కి నెక్కు
చక్కనయ్యకుఁజెప్పఁగ మిక్కుటంబె

తురంగగతివృత్తము

అనయము మనమున ముదమున నగజాత్మజన్ నెలకొల్పుచున్
వినయమునను దమవినుతులను నవీనముల్గ నొనర్చుచున్

ఘనమగు మదినిలకడయును ననఘంబునౌ కవితారుచుల్
గను కవివరులకుఁ దురగయుగము గానుకంచు నొసంగెదన్

తురంగగతివృత్తము

వినుతి గలకవనమున మనుజుల వేడ్కలన్ దగఁ దేల్చుచున్
వనజములఁ దినకరుఁడు ననయము వాసిగా దయఁజూచున
ట్లనయము సుజనుల హృదయములు మహోముదంబును జెందఁగాఁ
గను కవివరులకుఁ దురగయుగము గానుకంచు నొసంగెదన్.

## శ్రీ గంగరాజు పున్నయ్యగారు

బిరుదుల నెన్నియో వడసి పెక్కు సభల్ ఘటియించి పండితుల్
నిరుపమ సత్కవిత్వ రమణీయులు వాఙ్నిధులంచు మెచ్చఁగా
నఱమరలేక యాశు కవితార్భటిఁ జారుతరావధానముల్
గఱపెడి మిమ్ముఁ బావనులఁ గాంచిన యిప్పురి పున్నెమెట్టిదో!

మీ కావ్యామృత మాధురీ మహిమయున్ మీధారణా శక్తియున్
మీకున్నట్టి సుయోజనాతిశయమున్ మీవాక్య సందోహమున్
వీఁకన్ గన్గొని భారతీ ప్రియుఁడు నువ్విళ్లూరు "నా సృష్టికిన్
జేకూరెన్ గద సార్థకత్వ" మనుచున్ నిక్కంబుగా సత్కవుల్

అడిగినఁ బ్రశ్న నల్కఁగొని యట్టిటు పల్కుచుఁ ద్రోసివేయ కే
నుడివితి రయ్య లెస్సయగు నూత్నవచో రచనా చమత్కృతిన్
వడి వడిఁ గావ్య సంతతుల వైఖరిఁ దెల్పెడి యాశుధార మీ
యడుగుల మ్రోలనే నిలిచె నద్దిర! మీదగు భాగ్య మెట్టిదో!

నిష్కళంకులు మీకైత నిక్కువముగ
మెచ్చుచుండ నీర్ష్యాళువుల్ మెచ్చుకున్న

లోటు మీకేమి గలదొ యాలోకమాత
భారతీదేవి మీ జిహ్వాc బాదు కొనcగ.

శతలేఖినీపద్య వితతిని వర్షించు
కవిసార్వభౌమాంక ఘనులుమీరె
గంటకాలంబులోc గావ్యముల్ రచియించు
కవిసార్వభౌమాంక ఘనులుమీరె
గాఢసమస్య లెక్కనుజేయకే చెప్పు
కవిసార్వభౌమాంక ఘనులుమీరె
ప్రౌఢపదార్థాది భావంబులొడcగూర్చు
కవిసార్వభౌమాంక ఘనులుమీరె

బాపురే భాను చంద్రుల పగిది మీర
లాంధ్ర లోకంబు వెలయింప నవతరించి
యశము గాంచుచు నున్నార లతులితముగ
ననుజ సత్కవులార! గుణాఢ్యులార!

**శ్రీపూసపాటి రంగనాయకులుగారు**

సజ్జనోత్తములార! యో సభ్యులార!
యిక్కవీంద్రులcగూర్చి నే నెలమితోడc
జిన్ని పద్యంబులనుగూర్చి చెప్పువాcడ
వినcగ వేడెద మిమ్ముల ననఘమతులు

పరగ శతావధానములc బట్టణసీమల సల్పినట్టి కొ
ప్పరపుcగవీంద్రులార! బహుభంగుల మిమ్ములసన్నుతింప నా
తరమగునే వినుండిcకను దప్పుల నెంచకుcడయ్య ప్రీతిc జం
దురునకు నూలుపోగిడిన దోసమటంచుc దలంపన్యాయమే

ధారణఁజూచి యల్ల కవితాసతి వీరిని వీడియుండినన్
గౌరవ మెట్టు లబ్బునిఁక నాకని యిక్కవిరాజరాజులన్
జేరెనటంచు నెంచెదను జెప్పఁగ నేటికి వేయిమాటలా
తీరునఁగాకయుండిన సుధీరులు వహ్వారె యంచు మెత్తురే

ఎవ్వ రెట్టి సమస్యల నియ్య నపుడె
వలదటంచును బలుకక నలఘుమతులఁ
బూర్తిఁజేసినయట్టి మీ పూర్వపుణ్య
ఫలమదేమొకొ కొప్రంపు వాసులార!

భారతవర్షంబు పావనంబుగఁ జేయఁ
బరమేశ్వరుఁడు మిమ్ము పంచెనొక్కొ
పూరుషాకృతినిచ్చి భారతీ దేవి న
ప్పరమేష్ఠి జగతిపైఁ బంపెనొక్కొ
మీతల్లిదండ్రులు ప్రీతి నోచిననోము
ఫలము లీరీతిగాఁ బరఁగెనొక్కొ
కలరిప్పటికి మహాకవులను వారి వా
క్యములు రూపంబులు గాంచెనొక్కొ

యనుచు మిమ్మెల్లవార లత్యంతగరిమ
సంస్తుతించుచునున్నారు సకలదిశల
మీయదృష్టంబునకు నింతమేరకలదె
యనుజ సత్కవులార! గుణాఢ్యులార!

మిమ్ముఁబోలిన కవులను నమ్ముఁడయ్య
యెచటఁగానము మీతోడ నిచ్చకంబు
లాడుటయెగాదు మేమట్టు లాడనేమి
వచ్చునది కొప్రపుం గవివర్యులార!

జగతిలో మిమ్ముఁ బోలిన సత్కవులను
కొందఱినినైనఁ బుట్టించి కోర్కెమీఱ
భరతవర్షంబునకు మేలు నెఱపుకొఱకు
వినుతిజేయుచునున్నాఁడ విశ్వనాథు.

దేశరాజాన్వయాగార దీపమైన
కృష్ణయ బుధుండు సమధిక కీర్తిశాలి
సభకు నధిపతియై చాల సంతసింపఁ
జేసితిరి మిమ్ము దేవి రక్షించు గాక.

## బాపట్ల నుండి ప్రయాణమై వెడలునపుడు చెప్పిన పద్యములు

### బ్రహ్మశ్రీ వేంకట సుబ్బరాయ కవిగారు

వైరులు దుర్విచారులయి వాగి కడుంగడు నింద సేయ భా
షా రుచిరత్వ మేర్పడఁగ సత్యమసత్యమెఱుంగఁ గోరి మే
లారసి యస్మదీయ విజయధ్వజ సంస్థితి నొప్పి సద్యశో
భారముఁ గొన్న భావపుర వాసులఁ గాంచన వాసుఁడేలుతన్.

### బ్రహ్మశ్రీ వేంకట రమణ కవిగారు

అజరాధీశ దిశా సరిద్విటతటోద్యద్దేవ భూజంబవై
భజమానార్య కదంబవై తనరు నో బాపట్ల పూరిందిరా
రజనీశాస్య! సతంబు సోదర కవీంద్ర స్థాపితంబైనదౌ
విజయస్తంభముఁ బ్రోవుమీ త్రిజగతీ విఖ్యాతి దీపింపఁగన్.



శ్రీ కనకదుర్గాంబాయై నమః

## విశదల శతావధాన పీఠిక



బాలసరస్వత్యాశుకవిచక్రవర్త్యాది బిరుదాంచితులగు శ్రీ కొప్పరపు సోదర కవులను గూర్చి పండిత ప్రకాండులు వ్రాసి పంపిన పద్యములు మొదలయినవి కొన్నియు, వారిచేఁ జేయఁబడిన సమస్యా పూర్తులు కొన్నియు నొక చిన్న పుస్తకముగా సంగ్రహింపఁబడియెను. వారి కవితాశక్తి యసమానమైనదని యందువలననే కొంత తేటపడకమానదు. అందలి యంశములన్నియు నప్పటప్పటి వార్తాపత్రిక లలోఁ బ్రచురింపఁబడినవేయైనను నాత్మదోషంబు కతనఁ గొందఱు విశ్వసింపఁజాల కుండిరి. తన కన్నులతోఁ జూచుచుండిన భర్భువను తన మంత్రి బ్రతికి యున్నట్లు విశ్వసింప లేకపోయిన రాజుకథవినమె? ఇట్లు వీరి రసనాగ్రసీమల యందు సహజ సముత్పన్నయైన కవితాలతికకు దృష్టి దోషంబుదగిలి యందుద్భవించిన యశః పుష్పంబులు వాడునో యను శంక దూరదృష్టిలేని కొందఱు జనంబుల మనంబులఁ బొడమఁ దొడంగెను. ఇట్టి సమయంబున నీ గుంటూరు పట్టణంబునకు సమీపంబుననున్న విశదలగ్రామ నివాసియును గమ్మవంశజుండును నిరుపమాన మల్లీశ్వర దేవతాయతన నిర్మాణ జనిత నిర్మల కీర్తియునగు శ్రీ చెరుకూరి తిరుపతిరాయ మహాశయుండు పై యంశములను దెలిసినవాఁడై యీ సోదరకవుల సామర్థ్యము స్వయముగా వీక్షింపనెంచి మిత్రజనంబుల ప్రోత్సాహంబున స్వగ్రామంబున నొక సభ సమకూర్చె. ఈనెల 17వ తేది ఆదివారమునాఁడు విశదలలో శ్రీమల్లీశ్వర స్వామివారి దేవళముముంగిట సభ జరిగెను. గుంటూరు నుండి యనేకులు న్యాయవాదులును, నుద్యోగీయులును నచ్చటినుండియుఁ జుట్టు పట్లు నుండియుఁ బెక్కురు పండితులును, గవులును విచ్చేసియుండిరి. బ్రహ్మశ్రీ కొండా వేంకటప్పయ్యపంతులు, బి.ఏ., బి.ఎల్., గారగ్రాసనాధిపతిగా సభ్యులచే

నెన్నుకొనఁబడిరి. సోదర కవులలో జ్యేష్ఠులగు బ్రహ్మశ్రీ సుబ్బరాయ కవిగారు పగలు షుమారు 1 1/2 గంటలకు శతావధానముఁ బ్రారంభించి రాత్రి 12 గంటలగు వఱకు ముగించిరి. కూరుచున్న వారిలోఁ బలుగురు రాజకార్యముల నిమిత్తము మఱునాఁడు గుంటూరికిఁ దిరిగి వెళ్ళవలసిన వారగుటచేఁ బృచ్ఛకుల సంఖ్య నలువది యొకటికి మించనీయఁబడలేదు. అవధానము జరుగునంత కాలము కవిగారు పృచ్ఛకుల మధ్యము నుండి కదలనే లేదు. నడుమ నడుమ సభ్యులడుగు ప్రశ్నలకు సమాధానములుగా ననేక పద్యములఁ జదువుచు ననేకముల నాశువుగాఁ జెప్పుచుఁగూడ వచ్చిరి. పృచ్ఛకులలోఁ గొందఱు తమకుబదులొరుల నియమించియుఁ గొందఱు తమకాగితముల నెవరిమీఁదనో పడవైచియు నడుమ నడుమనే సగముకంటె నెక్కుడుగా జారి పోయిరి. అయినను సగముమేని వానికరుణఁ గవిగారి ధారణ చెడక యవధానము నిరాఘాటముగా నెఱవేఱినది. సమస్యలును బ్రశ్నలలో గొన్నియును విషమములుగా నున్నను బద్యములలోఁ గొన్ని మహాకావ్యములలో నుండి వానికి వన్నెతేఁదగినవిగా నున్నవని గుణగ్రహణ పారీణులగు వారికిఁదోఁపక మానదు. లోపము లెంచఁజూచినచో మహాకవులు సావకాశముగా రచించిన ప్రబంధములలోనే కన్పట్టుచుండ నాశువుగాఁ బృచ్ఛకులయు సభ్యులయుఁ దొందరలతోఁ జెప్పఁబడిన కవిత్వములోనా దొరకకుండుట? ప్రకృతావధానము జ్యేష్ఠ సోదరుల సామర్థ్యము మాత్రమే చాటు చున్నను గనిష్ఠులును దక్కువ వారుకారని నే నెఱిఁగినదానినిబట్టి చెప్పఁగలను. వారి సమస్యాపూర్తి యొక్కటి యిందుఁబొందుపరుపఁబడియునున్నది. భగవంతుఁడు వీరికి దీర్ఘాయు రారోగ్యైశ్వర్యము లొసంగి వీరనేకములగు సద్గ్రంథముల నొనర్చి దేశీయుల మనంబుల రంజిల్లఁజేసి శాశ్వతకీర్తి గడించునట్లు వీరికిఁ దోడ్పడుఁగాత.

ఈ చిన్నపుస్తకములో నవధానము మఱునాఁడు కొందఱు వీరిని గుఱించి వ్రాసియిచ్చిన పద్యములుఁ గొన్ని గలవు.

ఇట్లు,

22-9-1911 **పాటిబండ సూర్యనారాయణరావు**

# విశదల శతావధానము

(17-09-1911)

శ్రీరంజిల్ల శతావధానమిచటన్ జేయంగ నూహించితిన్
బ్రారూఢిన్ నినునమ్మి యిమ్మహిత సభ్యశ్రేణి మెచ్చంగ నీ
కారుణ్యామృతబిందువుల్ చిలికి విఖ్యాతిన్ విడంబింపవే
ధారాశుద్ధియు ధారణాధికతయున్ దార్కాణగా శాంభవీ

కుశలుఁడు సత్యవాది చెరుకూరి కులుండు మదారివారణాం
కుశము కవిప్రియుం డఖిలకోవిదవంద్యచరిత్రుఁ డుల్లస
ద్విశద యశోభిరాముఁడగు తిర్పతినాముఁడు పిల్వనేఁడు నీ
విశదలఁజేయు సత్సభను వేడుకఁజూడుము మల్లికేశ్వరా

1. ఆంజనేయ స్తవము

ఎవ్వనినమ్మి దేశములకెంతయుఁబోయి జయంబు గంటిమో
యెవ్వనినమ్మి యీ సభ నహీనధృతిన్ జరగించుచుంటిమో
యెవ్వనినమ్మి యేమిటనొకింతయు సందియమందకుంటిమో
యవ్వరకీర్తిశాలి పవనాత్మజుఁ డేలుత మిమ్ముమమ్మునున్

2. మల్లీశ్వరస్వామి ధ్వజముఁగూర్చి యుత్ప్రేక్ష

ఈమల్లీశ్వర దేవు కోవెలధ్వజంబింపొందు నత్యున్నతిన్
ధీమంతుల్ వినుతింప ఘంటలధ్వనుల్ నిత్యంబు మాస్వామిఁదా
నేమాన్యాత్ముఁడు గొల్చునాతనికి లే దేలాటి పాపంబటం
చామోదంబునఁదెల్పు శూలిభటులోయంచున్ వితర్కింపఁగన్

3. సమస్య : తల్లిమగండు తండ్రియని తల్పక కూడియు సాధ్వి యయ్యెఁగా

తల్లిధరిత్రి సీతకు యథార్థము శ్రీహరి యా ధరిత్రికిన్
వల్లభుఁడయ్యె నాహరియు వర్ణితలీలను రాముఁడయ్యెనా
హల్లకపాణి సీత విభుఁడై తగురాముని యోగ్య వేళలన్
తల్లిమగండు తండ్రియని తల్పక కూడియు సాధ్వియయ్యెఁగా.

4. సమస్య : మార్తాండుం డపరాద్రిఁగ్రుంకె నిదిగో మధ్యాహ్న కాలంబునన్

ఆర్తిన్ వేల్పులు కావుకావుమని హాహా కారముల్ సల్పఁగా
ధూర్తుల్ ధారుణి నిల్వఁగూడదని రుద్రుండాజ్ఞనీఁ గాళి దు
ర్వర్తుల్ గావున దైత్యులం దునిమి యాపైఁజంప శుంభాసు రే
ణ్మార్తాండుం డపరాద్రిఁగ్రుంకె నిదిగో మధ్యాహ్న కాలంబునన్

5. చంద్రోదయము - లయగ్రాహి

కమ్మవిలుకాని పువుటమ్ములను బోలి వెల
కొమ్మలు విటాళికిలుగుమ్మములఁ జేరన్
దుమ్మెదలగుంపు కమలమ్ములను బాసి కుతు
కమ్మునఁ దొవల్గల సరమ్ములనుదూరన్
నెమ్మిని జకోరతతు లిమ్ముఁగన జక్కవ కొ
లమ్ములు వియోగమున నుమ్మలికఁ జెందన్
భమ్ముల విభుండు సిరితమ్ముఁడు శశాంకుఁడు న
భమ్మునను దోఁచెఁ గళ లెమ్మలు పొసంగన్

6. కాశీపట్టణము

సంజవేళల మౌనిసప్తకంబు నుతింపఁ
బంచాస్త్రవైరి నర్తించుచోటు
మధ్యాహ్నముల ధరామరరాజి కన్నంబుఁ
బంచాస్య రాణి వడ్డించుచోటు

మాధవప్రభృతు లాత్మాభిధానంబులు
మించ లింగముల స్థాపించుచోటు
కలుషకర్ముల సుకర్ములఁజేయు సురగంగ
యంచితస్థితిఁ బ్రవహించుచోటు

అరయఁ బంచత్వమొందినయట్టి జంతు
వెట్టిదైనను లింగమై పుట్టుచోటు
కాశి యది పుణ్యరాశి దుష్కలుషవల్లి
కా శితాసి భజింతు నిక్కముగ నెంతు.

7. ఇద్దఱు భార్యలుకలవాఁడు

ఒకతఱినొక్కదానిఁబ్రియ మొప్పఁగఁజూచినఁగోపమందు వే
రొకతె, సుబుద్ధిదానిపయినుంచిన నద్ది కుబుద్ధివంచనున్
గకవికదోఁప నిద్దఱగుకాంతలు కల్గినవానికష్ట మే
రికి వివరింపనౌ నది భరించిన శూలికిఁగాక యెయ్యెడన్

8. సమస్య : జయజయయంచుఁ గౌరవులు చాలవిషాదముఁజెంద నాత్మలోన్

భయదపరాక్రమంబునను బార్థులఁగూల్చునుభీష్ముఁడంచు దు
ర్నయమునఁబల్కు కౌరవుల నాకువశంబొకొనిల్పనంచు మే
ల్జయమగు మీకటంచనియెసంజయుడద్దిగ్రహించియౌర సం
జయజయయంచుఁ గౌరవులు చాలవిషాదముఁజెంద నాత్మలోన్

భయదపుసింహనాదము ప్రభంజనసంభవుఁ డాచరించి టె
క్కియముపయిన్నటింప హరి కేల్గవ దట్టినుతింపఁ బార్థుఁడ
క్షయధృతినారిమీటఁగనె, ఘల్ఘలమ్రోఁగెను వింటిగంటమేల్
జయజయయంచుఁ గౌరవులు చాలవిషాదముఁజెంద నాత్మలోన్

శ్రీవేంకటరమణకవిగారాశువుగాఁబూర్తి

భయదపరాక్రమంబునను బార్థులగెల్చునుభీష్ముఁడంచు దు
ర్నయుఁడు సుయోధనుండు వదరన్ విని దానికినోర్వలేక వే
జయమునుగాంచఁబార్థుఁడట శాతశిలీముఖమూనిదూఁకెఁదా
జయజయయంచుఁ గౌరవులు చాలవిషాదముఁజెంద నాత్మలోన్

9. సమస్య : దారములేని హారము నితంబిని నీ కెవఁడిచ్చెఁ జెప్పుమా

చారుపటీర చర్చకలశద్వితయోపమమౌ కుచద్వయిన్
మీఱఁగనొక్కపూరుషుని మెచ్చి కవుంగిటఁజేర్చితౌటనా
పూరుషుపేరుముత్తెములఁబొల్పగుగుర్తులునిల్చెఁగానిచో
దారములేని హారము నితంబిని నీ కెవఁడిచ్చెఁ జెప్పుమా

10. అచ్చ తెనుఁగు; కొండవీడు

కైతలుగూర్చువారి బలఁగంబదిసంబరమీనుచుండఁగాఁ
జేతులబల్మిగల్గి పసఁజెందిన తేఁడుల గుంపుమీఱఁగా
నేతటి నీరొకించుకయు నెండని వాఁగులు జాలువాఱఁగా
జోతలుకొండవీడుగనెఁ జొప్పడుమాదగు కొప్పరంబటన్

11. సుశక్తుఁడు, అశక్తుఁడు - పంచచామరము

సుశక్తుఁడైన శూరుఁడొక్క శూరుతోడఁబోరుఁదా
నశక్తులైనవారు పల్వురైనఁగాక పోర ర
ప్రశస్తమం చధర్మమంచుఁ బల్కనొక్క డేగతో
భృశంబుపోరునొక్కడేగ పిట్టలెన్నొపోరెడున్

12. సరసులైన కవులను గౌరవించు రాజులిప్పటికి నుండిరా?

అభినవభోజుఁడో యనఁదగు మంత్రి ప్రె
గడ భుజంగక్షమాకాంతుఁడుండెఁ

గవితాభిమాని పోలవర వేంకటకృష్ణ
రాయాఖ్యుఁడొఁక ధరారమణుఁడుండె
విద్యావినోది శ్రీవేంకటగిరి మాన
వేంద్రుండు కృష్ణయాచేంద్రుఁడుండె
శ్రితలోకములకెల్లఁ జింతామణి పిఠాపు
రాధీశ్వరుఁడు సూర్య రాయఁడుండె

విజయనగర ప్రభుండు బొబ్బిలివిభుండు
విరవజటప్రోల్ నృపులు నూజవీటి దొరలు
నరసరాట్పురి మణికొండ ధరణిపతులు
గలరు మఱికొందఱున్నారు కఱవుగలదె?

13. జొన్నన్నములో గోఁగుకూర గలుపుకొని పచ్చిమిరపకాయఁ గొఱకుట

అనువుగ జొన్నయన్నమున యందునుఁగల్పిన గోఁగుకూరతోఁ
దనకనుకూలమైనరుచి దార్కొనఁగానొక పచ్చిమిర్పకా
యను గొఱుకంగఁ బూనుటలహా! తనుమించిన దానిఁగూడుచున్
దనయుని ముద్దుఁబెట్టుకొని తాపము వాసినవాని చందమౌ

14. తమలపాకు, స్త్రీతోఁ బోల్చుట

అందిందున్ గలుగున్ నఖక్షతము లాయా వేళలందొప్పగా
నందిందున్ గలుగున్ మృదుత్వము మనోహ్లాదంబు సంధిల్లఁగా
నందిందున్ గలుగున్ సుఖానుభవ మత్యంతంబు వర్ణింపఁగా
నందిందేమన వీడియంపుదళమం దాకాంతయందెన్నఁగాన్

15. సజ్జ - మంగళమహాశ్రీవృత్తము

గజ్జెలును మువ్వలును ఘల్లనఁగ మోదమున గండుగలయెద్దు లిలదున్నన్
సజ్జఫలియించునది సస్యములలోనఁగడు శ్లాఘ్యమని కర్షకులుపల్కన్

వెజ్జులు భుజింపనిది వీలనుచుఁదెల్పుదురు వేసటయడంగు నదిమెక్కన్
మజ్జిగకుదానికిని మైత్రియనుచుం దదభిమానులు వచింత్రు మెసవంగన్

16. అవధాన సమయమునందుఁ గవిగారువేసికొనిన సాలువ

అంతయు నెఱ్ఱ రంగుగలదై తనరన్ జలతారుపోఁగుల
త్యంతముగాఁ గనంబడెడు నయ్యది బంగరు కాంతులీనఁగా
నెంతొ క్రయంబుసేయు, నిదియిచ్చిరి చెన్నపురిన్ సుధీమణుల్
వింత యిదేమి సాలువను పేరువహించెనుసుమ్మి మిత్రుఁడా

17. సమస్య : బుద్ధమతావలంబనులు పూజలుసల్పిరి విష్ణుమూర్తికిన్

బుద్ధుఁడనంగవిష్ణుఁ డొకపూజ్యతరంబగు పేరుగాంచెమున్
సిద్ధమువానిదౌమతముఁ జెందుటఁ జేసి యభీష్టసిద్ధిగా
బుద్ధిఁదలంచి మేలనుచుఁ బొల్పగు నొక్క దినమ్మునందునా
బుద్ధమతావలంబనులు పూజలుసల్పిరి విష్ణుమూర్తికిన్

18. తెల్లునూఁగు - మహాస్రగ్ధర

కనమే యాతెల్లునూఁగున్ గఱకుఁదనముచేఁ గ్రాలిబాధించుచుంటన్
దనువంటన్ మంటతోఁచున్ దగిలినయెడ వస్త్రంబులెంతేనిపాడౌ
వినలేదద్దాన నీమేల్వేలయుననుచునే విజ్ఞుఁడుందెల్ప నెందున్
దనరుం దుర్మార్గుతో నెంతయునదిసరిగాఁదమ్ముఁడా పోల్కిసేయన్

19. చీఁపురుఁగట్ట

మలినంబుఁబాపి నిర్మలతఁజూపుటఁ జేసి
యల్ల గంగాదేవి యనఁగవచ్చు
నఖిలప్రదేశంబు లందుఁ దోఁచుటఁ జేసి
యల పరమాత్మయే యనఁగవచ్చు

నిత్యాభిషేకమ్ము నెమ్మిఁగాంచుటఁ జేసి
　　యల జలస్థిత లింగమనఁగవచ్చు
స్త్రీకరగ్రహణంబుఁ జెలిమినందుటఁ జేసి
　　యల పురుషోత్తముఁడనఁగ వచ్చు

ననుచునెట్లెట్లో పొగడఁగా నయ్యెఁగాదె
యదియు సింగారపుంగట్టు యనుటఁ జేసి
కాక నద్దాని జీఁపురుఁగట్టు యనిన
నింతగా వర్ణనముసేయ నెవఁడుదలఁచు?

20. సమస్య: మాయాతి, నాయాతి, నయాతి, యాతి, అనుపదములు వరుసగా
నాల్గుచరణములలో నొక్కొక్కటిగా నిమిడ్చి కృష్ణపరముగా

మాయాతిస్థిరవృత్తిఁ గృష్ణుఁడన దుర్మానారి మీనవ్రజా
నాయాతి స్ఫుటశక్తిఁజూపి తనరెన్ నారాయణుండాతఁడో
యాయుష్మంతుఁడ! తానయాతిమతినయ్యాద్యుం బరుంగొల్చినన్
శ్రేయంబబ్బు జయాతికీర్తి గరిమం జెందు న్నరుండెయ్యెడన్.

21. మత్తేభము

ఇలనెత్తె తగు కొండచందమున నెంతేరూపమింపందెడిన్
బలువౌ తుండము వాసుకిం దెగడి సౌభాగ్యంబు వాటించెడిన్
జెలఁగుం జేటలరీతి శ్రోత్రము లెదం జింతించియద్దానినే
పలుకంగాఁదగు మత్తకుంజరమునా వాక్యంబు లింకేటికిన్

22. విద్యయే భూషణము

విద్య నరేంద్రపూజితము విద్య సుధీంద్రహితప్రచారమా
విద్య యశఃప్రదంబు మతివిద్య ధనప్రద మల్ల విద్యయే

హృద్యము ధాత్రినద్ది యొకయించుకగల్గినఁజాలుఁగాక యే
చోద్యము వెండిబంగరపు సొమ్ములుదాల్చివిలాసమందుటల్

23. సమస్య : తద్భవమన నిట్టిదనుచుఁ దగుఁ దెలియంగన్

సద్భుజనీయం బియ్యది
యద్భుతమే శాణమునకు నగు సాన యనన్
సద్భవనంబులఁ గావునఁ
దద్భవమన నిట్టిదనుచుఁదగుఁ దెలియంగన్

24. అతనుసంగరకళా భ్యాసదేశికకశాఘాతమోయన జడకటినటింప అను సీసపాదార్థము కందపద్యములోఁ జెప్పుఁడు

కందర్పాహవ కళనౌ
సందేహముఁబాపు గురు కశాఘాతమనన్
మందేభగమన కటి మీఁ
దం దగు జడయనఁగ మొదటిదానికి సమమౌ

25. కందపద్య లక్షణము

అందముగా భజసనలము
లంది త్రిశరగణములొంది యటవడిమూఁటన్
జెంది నలజ లవి యాఱిట
నొందఁగఁ గందంబు మఱియు నొకకొన్నిటనౌ

26. తోఁకచుక్క

ఆకాశంబునఁదోకచుక్క తగుభీమాకారముందాల్చి య
స్తోకుల్ సత్కవిరాజు రాజులిది యీక్షోణీస్థలిన్గల్గు సు
శ్రీకళ్యాణములెల్ల నూడ్చుటకునై చింతించి కాలేశ్వరుం
డే కేలందగఁబట్టుజీఁపురనుచున్ హేయంబుగాఁబల్కఁగాన్

27. భీష్మ కర్ణాభిమన్యు శబ్దార్థములువచ్చునట్లు రామాయణకథ

భీష్ముఁడై కుంభకర్ణుండు విక్రమింపఁ
గాంచివిజయప్రభూత దోర్గర్వమడర
రామదేవుండు తీవ్రనారాచములను
బఱపి దునుమాడె వానరప్రవరులలర.

28. ఇంద్రచాపము

తెలు పెఱుపుఁ బసువుఁబచ్చన
నలుపాదిగఁ జిత్రవర్ణ నవరుచులెసఁగన్
జలధర పథమున నత్యు
జ్జ్వలమైతగు నింద్రధనువు సత్కవి నుతమై

29. రామాయణముయొక్క ఆత్మార్థము
ప్రకృతియె సీతయై తనర రాముఁడె యీశ్వరుఁడై రహింపఁగా
వికృతి యొకింతలేక సుకవిప్రవరుల్ తమకావ్యరాశిలో
సుకృతి పొసంగ వ్రాయుదురు సుస్థిరమై తగు జ్ఞానలబ్ధికై
ప్రకృత మెఱుంగువారికది పథ్యముగాఁ దనరార కుండునే?

30. (ఇంతలుకన్నులుండఁ దెరువెవ్వరి) యను మనుచరిత్ర పద్యమునకుఁ
బ్రతి కందపద్యము
ఇంతలు కనులుండఁగఁ బ్ర
శ్నింతువు వచ్చినపథంబుఁ జెప్పుమనుచు శు
ద్ధాంతసతుల నిటుపల్కుట
యెంతకొ యిదివ్యాజమనుచు నేఁదలఁతుసుమీ

31. అవధాని చిత్తవృత్తి – పృచ్ఛకుని నెంబరు
ముప్పది యొక్కఁడు నెంబరు

తప్పదు నీపద్యమిది వధానం బిందున్
దప్పునొ ధారణ? యుమ కృప
చొప్పడినం దప్పదనుచు సూచింతుఁజుమీ

32. ప్రస్తుత సభావర్ణన
రెండైనపంక్తులుగఁ గూ
ర్చుండిరి పృచ్ఛకులు సరసు లుండిరి కవులో
మెండుగ నవధానపు సభ
నుండిరి మల్లీశు కరుణ నొనరు విశదలన్

33. సంధ్యారాగ వర్ణన
చేరన్ వచ్చెను రాజు సత్ప్రియతచేఁ జెల్వొందునాతేఁడు శృం
గారం బొప్పఁగఁజేసి యాతని మదిన్ గల్పింతునాహ్లాదమున్
వేతేలాయని పాశి దిక్తరుణిలోఁ బ్రేమించి శోణాంబరం
బారూఢిన్ ధరియించె నాఁగఁ దగె సంధ్యారాగ మభ్రంబునన్.

34. షట్చక్రవర్తులపేరులు వచ్చునట్లు కందము - క్రమమక్కఱలేదు

ధరనలుఁడు హరిశ్చంద్రుఁడుఁ
బురుకుత్సుండును బురూరవుఁడు సగరుఁడు దు
ర్భరుఁడైన కార్తవీర్యుఁడు
వఱలుటఁదగె మున్ను చక్రవర్తి ప్రథచేన్

35. నియోగులకు వైదికులకు భేదము వలదనుట

బెరయన్ రాదునియోగి వైదికులకున్ భేదంబు రవ్వంతయున్
ధరపై వారలు చాలమైత్రిఁగొని మిథ్యావాదముల్ మాని యొం
డొరులాహ్లాదముఁబొందుటల్ తగును వేఱొక్కండుగానున్నచో
సిరులెల్లం జెడిపోవుఁ గీర్తులడఁగున్ జింతల్ గడున్ వర్ధిలున్

36. పురాతన నూతనాంధ్ర ప్రబంధకవులు

పూర్వమునందుఁతెల్గునఁబ్రపూర్ణ రసోన్నతిఁ గావ్యరాజి ధీ
ధూర్వహులౌచు వ్రాసి పరితోషము నించిరి గాని యింతయే
గర్వముఁ బూనలేదటులఁగా కిపుడున్న కవుల్ కృతిక్రియా
నిర్వహణప్రవీణతకు నిగ్గక గర్వము గాంతు రక్కటా.

37. నన్నయ తిక్కనల కవిత్వము

ఇరువురి సత్కవిత్వమున నింతయులే దపశబ్దదోషమా
యిరువురి ప్రజ్ఞలున్ సమములేయగు నించుకభేద మెంచనా
తరమగునె కవీంద్రులు ప్రధానులు నన్నయతిక్కయజ్వలా
వరమతులన్ నుతించుటకు వాణియొ శేషుఁడొ రావలెన్ జుమీ

38. కృష్ణరాయల యాంధ్ర కవిత్వాభిమానము – కవిరాజ విరాజితము

తెనుఁగు కవిత్వమునందునఁ బ్రేమ యతి స్థిరమై విలసిల్లుటచే
నెనిమిదిమంది కవీంద్రుల గౌరవమిచ్చుచుఁ బ్రోచెను గృష్ణుఁడటుల్
ఘనులొకకొందఱు గల్గిరినేఁడు సుఖంబిడివారల మన్ననసే
యు నరవరేణ్యులొకానొకచోఁదగియుండకపోరదియారయనౌ

39. నిశ్చయబుద్ధి లేనివాఁడు

అంతకుమున్ను దియ్యనిదన్న శర్కరఁ
　　బాడు చేఁదనిపల్కుఁ బైత్యరోగి
అంతకుమునుబిడ్డయని యెంచిలాలించు
　　దూడ యాఁబోతుగాఁగూడుఁ బశువు
అంతకుమున్న యుప్పునుప్పుఁ బిదపఁగా
　　దని చెప్పు సర్పవిషాకులుండు
అంతకుమున్నక్క యనుదాని నాలుగాఁ
　　దాఱుమాఱుగఁజూచుఁ ద్రాగుఁబోతు

కాన నిశ్చయమగు బుద్ధి కాసువీస
మైన లేకున్న వారల కగు నవస్థఁ
జెప్పఁదరమౌనె వేయేండ్లు చిక్కువడిన
నెవరి కర్మం బదెట్టులో యెసఁగునట్లె.

40. వసంతఋతువు చివర వృద్ధత్వ యౌవనమధ్యావస్థ - మాలిని

చివురులును గరంబుల్ చెల్వమంతంతఁ బాయున్
సవసవగాని కాయల్ చాచులున్ జేవ దప్పున్
భువిని మధువు పెంపున్ బోవుచోఁగొమ్మలందున్
బొవరు వయసుపెంపున్ బోవుచోఁగొమ్మలందున్

41. వర్షాకాలమును 'భారతయుద్ధముతోఁ బోల్చుట - పంచచామరము

మురారియట్లు వానకాలమున్నతిన్ ఘటింపఁగాఁ
గరంబుశక్రచాప మల్ల గాండివంబునాఁదగన్
నరుండెదిర్చినట్లుగాఁగ నారదం బుదగ్రతన్
గురుప్రతాపవహ్నినార్చె ఘోరకాండవృష్టిచేన్

42. కవుల గౌరవమొనరించు మఱికొందఱు రాజులు

ఉరలాంభూపతులాత్మకూరు నృపవర్యుల్ శ్రీమహాశూరభూ
వరచంద్రుల్ వనపర్తి భూపతులు గద్వాలక్ష్మావల్లభుల్
కిరలంపూడి నరేంద్రులింక మఱియున్ గీర్తింపఁగానెందఱెం
దఱొదాతల్ నరనేతలుండి రిఁక విద్యాగౌరవంబల్పమే?

**(సంపూర్ణము)**



# అవధానాంతమున పండితకవుల యభిప్రాయములు

### శ్రీ జూపూడి హనుమచ్ఛాస్త్రి, శతావధాని

శ్రీకరుఁడార్తరక్షకుఁడుఁ జిన్మయరూపుఁడు ముక్తిదాయకుం
డా కమలామనోహరుఁ దహంకృతిదూరుఁడు నిర్వికారుఁడ
స్తోకములైన భోగములతోఁ దులఁదూఁగఁగఁ జేయుఁగాత మి
మ్మో కవివర్యులార బుధులుత్తమ భావులు సంస్తుతింపఁగన్

పత్రమో పుష్పమో లేక ఫలమొ యేమొ
పెద్దలను జూచుచో సమర్పింపవలయు
ననెడి యార్యోక్తినమ్మి పద్యప్రసూన
ముల నొసంగితిఁ గైకొనుం డలఘుమతులు

ధారణతప్పకుండ, బుధతండము హాయనిచొక్కు చుండ వా
గ్ధార తలంగకుండ, బెడిదంబుల నోట నెసంగ కుండ, వి
స్ఫార కవిత్వతత్త్వమున సభ్యులఁదన్పితి రేమి చెప్ప నే
నారయలేదు మున్ను జనులా శతఘంట కవిత్వరాజ్య ధూ
ర్ధారణమేడ బాలక విధానమదేడ ననంగ, మీ కవి
త్వారభటిన్ వధానగతి నారయకుండనివారు, వారలి
ప్డోరిచి చూచి మెచ్చుకొని రూరక మున్ననినారమంచు, నా
నేరుపదేమి మెచ్చితినె, నిక్కముగా మిముఁజూడకుండి, యే
తీరున మెచ్చవచ్చు, గడిదేఱిసభన్ జరగించుమిమ్ము, ని
చ్ఛోరమణీయవృత్తిఁగవిశూరులఁగంటిని మెచ్చుకొంటి మీ
ధోరణిజూడఁ బార్వణ విధూదయలాభ సముల్లసత్తరం
గోరు ఘుమంఘుమారవ సముత్కట వార్ధులమించె సద్యశో
భారముఁబూనినట్టి మిము బాలురటంచు వచింప నిప్డు నా

నోరెటులాడు, రూపముననో పలుకం దలకొందుఁగాని, బల్
నేరుపుచేతఁ బూర్వకవినేతలనుం దలఁపించుచుంటి రో
భారవులార! మీసుగుణ పద్ధతిమేలు, శతావధాన సం
ధారమణీయులార! బహుధా నుతియింపఁగఁజెల్లు మిమ్ములన్

శతలేఖిన్యవధానులఁ
జతురుల నత్యంతకీర్తి సంపద్యుతులన్
మతిమద్వర్ణిత మూర్తుల
ధృతియుతులన్ మిమ్ము దేవ దేవుఁడు బ్రోచున్

## బ్రహ్మశ్రీ బెల్లముకొండ రామారాయ కవీంద్రుల శిష్యుడఁగు శ్రీ ములుకుట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు

రామరాయనివర్ణింప రాదునాకు
భక్తిమైఁదెల్పనది స్వభావోక్తియగుట
నమ్మహాత్ముని శిష్యుండ నంతొయింతొ
శాంకరీయంబుఁ జదివితి జంకులేదు

కంటిని మీకవిత్వమును గంటిని మీదు శతావధానమున్
గంటిని మీమహత్త్వమును గన్నులపండువుగాఁగ నేఁడహో
జంట కవీంద్రులార! మదిసంతసమయ్యె మతేమియీయలే
కుంటను వేయినూఱులని యొంచుఁడి యిచ్చితినొక్కపద్యమున్

## బ్రహ్మశ్రీ చివుకుల రాధాకృష్ణశాస్త్రిగారు

కుప్రముఁబలుకులఁ గుతిసెడి
కొప్రపు కవివరుల కవితకున్ జయమగుతన్
సుప్రధిత ధారణాస్థితి
కప్రతిమాత్యంతకీర్తి యబ్బెడుఁగాతన్

ధరనవధానముల్ జరుప దక్షతగల్గినవారి సత్కవీ
శ్వరుల యశోధురంధురులఁ జాలఁగఁగాంచితి నంతెగాక నే

జరుపఁగ నేర్చినానయిన సత్యముగా భవదీయ ధారణా
గరిమను జూచి సిగ్గుపడఁగావలసెన్ మొలచెన్ భయంబెదన్

అవధానంబునఁ బూర్తిచేయఁగ నసాధ్యంబై గభీరార్థశ
బ్దవితానంబయి యన్యదుర్లభమునై భాసిల్లు నీదుస్సమ
స్య విలాసంబుగఁ బూర్తిచేసితివి నీసామర్థ్యమెన్నంగ నా
కవునే వేంకటసుబ్బరాయ కవివర్యా! యార్యలోకస్తుతా!

## శ్రీమాన్ తిరుపతి రంగాచార్యులవారు

శ్రీమత్కొప్పరపు బుధ
స్వాములకున్ సోదరులకు సరసులకు యశో
ధాముల కవధాన కవి
గ్రామణులకు రాముఁడిచ్చుఁగాత శుభంబుల్

గంగాభంగతరంగ ఘుంఘుమరవోద్గాఢ ప్రసంగంబులన్
గాంగేయోగ్రరణధ్వనత్కర ధనుర్ఘంటా విలాసంబులన్
రంగత్పద్మభవాంగనాంఘ్రి కటకారావప్రభావంబులన్
భ్రమింగున్ మీ కవితా మహామహిమ నెమ్మి న్నమ్మివర్ణింపఁగన్

పాయసంబున నుప్పు లోపంబటంచుఁ
గోడి నడినెత్తి పైమూఁడు కొమ్ములనుచుఁ
బలుకువా రీర్ష్య నెట్టులోఁ బలుక నేమి
మిమ్ము నిష్పక్ష పాతులు మెచ్చినారు

ధారణకు మెచ్చితిని మీ
ధోరణికిన్ మెచ్చితిని బుధుల్ కవులు నృపుల్
మీరాక కెదురుచూచుచు
గౌరవ మిచ్చెదరుసుండి కవిమణులారా!

## బ్రహ్మశ్రీ రామేశ్వర కవులు శతావధానులు

శతఘంట కవనమ్ముసల్పు వారెవరన్న
మున్నుగా మిమ్మునే యెన్నవలయు
అష్టావధానమ్ము నాచరింత్రెవరన్న
మున్నుగా మిమ్మునే యెన్నవలయు
ఆశుకవిత్వమ్ము నల్లువారెవరన్న
మున్నుగా మిమ్మునే యెన్నవలయు
నేత్రావధానమ్ము నెగడింతు రెవరన్న
మున్నుగా మిమ్మునే యెన్నవలయు

నెన్నియో దేశములనుండి యెందఱేని
పండితులు సత్కవీంద్రులు వచ్చినారు
గాని మిమ్మునుబోలఁ డొక్కండుగూడ
రమణ సుబ్బాఖ్య కవులార! రసికులార!

సరసులు నాఱువేలకుల సాగరచంద్రులు వాసభూమి కొ
ప్పరము, శతావధానము లపారముగా నొనరించినారు సో
దర కవులంచుఁ బేర్వడసి దక్షుల మెచ్చుగఁ జేసియెన్నియో
బిరుదములందినారు పృథివీశుల మన్నన లొందినారు భా
సురముగ నాంధ్రమండలి యశోవిభవంబును బాదుకొల్పి నా
రురుతరశక్తియుక్తుల మహోన్నతులై తనరారినారు బం
ధుర జయయాత్రలన్ జనని నోముఫలింపఁగఁ జేసినారు సు
స్థిరసుకలాభిరాములన ధీరతఁ బెంపువహించినారు మా
తరమె నుతింప వీరిని బుధస్తవనీయుల సద్విధేయులన్
కవనముండినఁ బాండిత్య గరిమసున్న
పాండితియెయున్నఁ గవనలాభము హుళక్కి

తనర నవిరెండు శుద్ధవర్తనము గలుగ
దుర్వినటుగాక మీకన్ని యుండె భళిరె

రంగత్కావ్య పరంపరాభిరచనా ప్రారంభశుంభద్వచో
త్తుంగా! చారు శతావధానఘటనా దుర్వార! స్వర్వాహినీ
భంగానంగఘుమంఘుమారవసదృక్పద్యార్భటీ తృప్తస
భ్యాంగీకార! బుధాంబురుట్తరణి! సుబ్బారాయవిద్వన్మణీ!

**బ్రహ్మశ్రీ తురగా వేంకట కవీంద్రుల శిష్యుఁడు**

**భిమిరెడ్డి వెంకటప్పారెడ్డి**

శ్రీరామారమణీమనోహరుని హృత్సీమన్దగన్నిల్పిత
త్కారుణ్యంబున సత్కవిత్వ రచనాదార్ఢ్యంబుచే మించి దు
ర్వారుల్కొప్రపుసత్కవీశ్వరులు వహ్వాయంచు విద్యానిధుల్
పేరొప్పన్నుతియింపమీమహిమముల్ వింటిన్ప్రమోదించితిన్

ఈయనుజన్ముల కిట్టియాశుకవిత్వ
పటుశక్తి యెవ్విధిఁ బట్టువడెనొ
ఈసోదరులయందె తాసోయగముఁజూపె
ధారణాతరుణి యే కారణంబొ
ఈసరసుల జత నీక్షింప సభ్యుల
మనము లానందంబుఁ గొనుటయెట్లొ
ఈపూజ్యమూర్తుల నేపుణ్యమునుజేసి
కాంచిరో తలిదండ్రు లెంచిచూడ
ననుచు జనములు గొనియాడ నలరిశతవ
ధాన ధౌరేయులై బిరుదములు గాంచి

రాశుకవిచక్రవర్తులయారె యనఁగ
నఖిలదిక్తటి మీకీర్తి యతిశయించె

పొంకముగాఁగ మీమహిమ పోఁడిమిఁజెప్ప నశక్యమైన ని
శ్శంక రచించినాఁడ మదిఁజాల్కొనిపొంగిన మోదశక్తి నా
వంక దయారసేక్షణము పర్వఁగఁజూడుఁడి వేంకటప్పఁడన్
వేంకట సుబ్బరాయ ఘన వేంకట శ్రీరమణాఖ్య సత్కవుల్

సభల వేయాఱు లందెడు సత్కవులకు
నే నొసంగితి పద్యముల్ పూని మీకృ
పా విశేషమ్ము మదిలోనఁ బడయఁగోరి
చంద్రునకు నూలుపోగను సామెతఁగాని

## బ్రహ్మశ్రీ పాటిబండ సూర్యనారాయణరావుగారు

చేసిరి పూర్వమిప్పుడును జేయుటగద్దు శతావధానముల్
భాసురరీతి నందఱు సెబాసన మీవలె నెవ్వరేని మున్
జేసిరె, యిప్పుడుంగలఁడె, చేయఁగలాఁడొకఁడేని మీకు నా
హో, సముఁడున్నె కొప్పరకులానుజసత్కవులార ధాత్రిలోన్

ఒజ్జలకడ నెన్నియో మొట్టికాయలు
తినినేర్చినట్టి విద్దెయునుగాదు
గ్రహణశక్తియొకింత గల్గిన లేకున్న
శాస్త్రముల్ పిడివేయు సరణిగాదు
పేరవధానులై విఱ్ఱవీఁగుటకునై
పరుని సాయముగోరు పటిమ గాదు
అబ్బబ్బ? దొడుగిడ్చినట్లు జెప్పఁగఁదోఁచు
నాశుకవిత్వ మియ్యదియుఁగాదు

భళిభళీ! యౌర! దైవాంశ వలనవీరు
పుట్టినప్పుడె కవులౌచు బుధులునగుచు
వఱలినా రన్యమెంచుట వట్టివెఱ్ఱి
ధర ననన్యధీజవులు కొప్పరపుఁ గవులు.

శ్రీమత్కొప్పర వంశపావనయశశ్శ్రీభ్రాతృయుగ్మంబ!యా
సోమార్కంబు భవద్యశంబధికమై శోభిల్లుతన్ ధాత్రిమీ
నామంబుల్ వినినంత మాత్రమున నున్మత్తస్థితింజెందిపో
రే మీశత్రులు మత్సరత్వమునకున్ హృత్పీమఁజోటిచ్చినన్

## బ్రహ్మశ్రీ పుట్రేపు శేషయ్యగారు

గంగాప్రవాహ భంగప్రచారంబు మీ
యాశుధారా కవిత్వాతిశయము
పూషాంశుకాండ విస్ఫురణాసమంబు మీ
యాశుధారా కవిత్వాతిశయము
జంఝానిలాటోప సంరంభయుతము మీ
యాశుధారా కవిత్వాతిశయము
గాండీవిహస్తనిర్గళితాస్త్రధార మీ
యాశుధారా కవిత్వాతిశయము

నిర్మలము నిష్కళంకము నిరుపమాన
మై యెసంగెను మీ కవిత్వాతిశయము
గాన మిమ్మెన్న నేరుపు గలదె నాకు
సూరిహితులార! సోదర సుకవులార!!

ఆశుకవిత్వసంపద కహోయని మెచ్చనియట్టివారు మీ
పేశల వాక్సుధామహిమపెంపు నుతింపనియట్టివార లీ
చేసిన మేల్ వధానము ప్రసిద్ధమటంచు గణింపనట్టి వా
రీ సభఁగాన రారు సుకవీశ్వరులార! రసజ్ఞులౌటచే.

సుగుణమయమైన మీయెదఁ జోటెటింగి
ప్రౌఢి స్మృతి మతి బుద్ధియుఁ బ్రజ్ఞయనెడు
గంబములఁబాతి ధారణా గరిమయనఁగఁ
దగినదూలంబుపైఁ గవిత్వచ్ఛదంబు
నిలిపి వాణికి గేహంబు నలువ గూర్చె

శ్రీయుతుఁడంబుజాప్తకుల శీతకరుండు దయాకరుండు స
త్ప్రాయతకీర్తిశోభితుఁ డనంతుఁడు దుష్టజనాంతకుండు ప్ర
జ్ఞాయుతుఁడార్త రక్షకుఁడు కర్మఫలప్రదుఁడంతరాత్ముఁడే
యేయెడనైన సజ్జయమునిచ్చి సుఖంబిడుఁగాత మీకొగిన్

**బ్రహ్మశ్రీ వేంకట సుబ్బరాయ కవి గౌరవానంతరమున**
**ఆశువుగాఁ జెప్పిన పద్యములు**

అలగర్తపురిని రామాభిఖ్యు నింటి కే
        తెంచి మత్కవిత నాలించినాఁడు
చేయింతు సభను మీచేత మాయూరిలో
        పల నంచు వినయోక్తిఁ బలికినాఁడు
ఉద్యోగి జనుల గుంటూరున నుండి రా
        వించి బల్ విందు గావించినాఁడు
శతఘంట కవనంబు సల్పించి నూర్పదా
        ర్లంచిత స్థితి సమర్పించినాఁడు

రీవి మల్లీశు గృహము కట్టించినాఁడు
రేవ నర్థులలేమి నెట్టించినాఁడు
పూజ్య చెరుకూరి వంశ సంభూతుఁడైన
తిరుపతి సమాహ్వాయుండు సుధీహితుండు.

### అగ్రాసనాధిపతిగారిని గుఱించి

అవధానంబొనరించు నీసభకుఁ దానగ్రాసనాధీశ్వర
త్వ విలాసంబు భరించినాఁడు కవితా తత్త్వంబు వీక్షించినాఁ
డవురా తిర్పతియున్ సభాసదులుఁ దన్నౌనంచు మన్నింప వే
ద్యవరంబై తగ న్యాయవాదియగు కొండా వేంకటప్పార్యుఁడే.

### మఱియు సభచేయించినవారిని గుఱించి

వేంకట రాయనాముఁడు ప్రవీణుఁడు సోదరుఁడై రహింప ని
శ్శంక గుణాభిరాములగు సౌమ్యులు పేరయ వీరయాహ్వయుల్
కొంకు గలంకు లేక తనకున్ బరిచర్యలు సేయుచుండ నే
వంక గొఱంత లేని సిరి వర్ధిలఁ దిర్పతి యొప్పుఁగావుతన్.

### శ్రీ చెరుకూరు తిరుపతిరాయఁడుగారి వృత్తాంతము

మానితంబైన గుంటూరు మండలమునఁ
దనరె సిరి కాఁపురంబు విస్తలపురంబు
పుణ్యపురుషులకది జన్మభూమి యందుఁ
గలరు చెరుకూరివారన కమ్మవారు

చెరుకూరు వంశాబ్ధి శీతాంశుఁ డురుకీర్తి
        భరుఁడు పేరయ్య యెవ్వానితండ్రి
భాగ్యదేవతకుఁదాఁ బ్రతివచ్చు భాగమాం
        బా శిరోరత్న మెవ్వానితల్లి
శంకాపహారి శ్రీ వేంకటరాయాభి
        ధానుండు సుగుణి యెవ్వాని తమ్ముఁ
డతిసుందరాకారుఁడైన వీరయ్య యె
        వ్వని సోదరుని ప్రియతనయుఁడయ్యె

నట్టి విద్యాభిమాని పేరయ్య తండ్రి
ప్రబల ధీస్ఫూర్తి తిరుపతిరాయమూర్తి
విశదల పురాధికారి సేవితపురారి
నెమ్మి గుంటూరి కేతెంచి మమ్ముఁగాంచి

పాలడుగు వేంకటప్పయ
తో లలిత యశోవిలాసుతో సచివునితో
నాలోచించి మిముం దగు
వీలున సభఁగూర్చి గౌరవించెద ననుచున్

ఏకా రామాదుల నా
లోకించి సభన్‌ఘటింప లోపింపక య
స్తోక వినయోక్తిఁ బిలిచి గు
ణాకరులగువారి యిష్టమంది చని పయిన్

తన గుమాస్తాను గుంటూరి కనిపి కవులఁ
బండితుల నధికారుల భారతీ ప్రి
యత వలయు నెల్లజనుల నాహ్వాన మాచ
రింపుమన నాఘనుండట్టిరీతి జరుప

స్థిరవారమున మేము చేరితి మంతలో
    నూరూరి చుట్టముల్ చేరినారు
రెండుమూఁడామడలుండు విద్యా ప్రియుల్
    నూటులకొలఁదిగాఁ జేరినారు
కవితా చమత్క్రియా గౌరవుల్ పాండితీ
    ధౌరేయులెందఱో చేరినారు
గుంటూరుపురినుండి గొప్పయుద్యోగులు
    శిష్టు లనేకులు చేరినారు

జరుగు శతఘంట కవనంపు సభ యటంచుఁ
బిలిచి నంతటనే విశదలకు వారి
నర్మ వాక్యంబులను మధురాన్నములను
హాయిగొనఁజేసి తిరుపతిరాయఁ డలరె

## విశదల శ్రీ మల్లీశ్వరస్వామి

ఒయ్యనఁ బుట్ట కోటపయి నుండిన శ్రీ రమణీశుబొల్లి మో
రయ్యనుగాంచి, యా హరిదయామతి నాత్మకుఁదోఁచిశూలినా
నెయ్యుఁడు నాకు నాతనికి నిక్కము భేదములేదు కాన నీ
వెయ్యెడనైన దేవళము నీశునకుం దగఁ గట్టి యాతనిన్
జయ్యనఁగొల్వు మిష్టములు సాగును దిర్పతి! యంచుఁబల్కనా
యయ్యకు మ్రొక్కి విస్తలపురావనిఁ జిత్ర విచిత్ర వైఖరిన్
డయ్యన నొక్కకోవెల దృఢంబుగఁ గట్టి కుమారదేవుఁ గ
న్నయ్యను మల్లికేశు నిను నాభ్రమరాంబను విశ్వమాతఁదా
నియ్యెడనిల్పి కొల్చె నతఁ డీతఁడె తిర్పతి ప్రోవు మీశ్వరా

శరడిండీరపటీరశుభ్ర సరసీజాతాచ్ఛపత్రాదితే
యరసారుట్ శరదబ్దహీరదర పంచాస్యారవాణీపయ
శ్శరధీరాభ్ర తరంగిణీలహరికాసంక్రందనాశ్వక్షపా
కరనీకాశకనత్స్వరూప! త్రిజగత్కళ్యాణ! మల్లీశ్వరా!

సరసీజాసన శక్రముఖ్యదివిషత్సంఘో త్తమాంగస్థభా
స్వరరత్నస్థగితోరు భూరిమకుటీశస్తద్యుతిచ్ఛన్న సుం
దరవాతాశన రాజ మండన లసత్పాదారవిందా! బుధా
దర చారిత్ర! దినేశసోమశుచినేత్రా! భర్గ! మల్లీశ్వరా!

మంచుంగొండకుఁగల్గు భాగ్యమయినన్ మాబోండ్లకున్ రాదుగా
కొంచెంబెట్లగు వెండికొండయశ ముక్కుంబూనెఁగాశీపురం
బెంచన్ రాని మహత్త్వ మీవొసఁగుటన్ హీనుండఁగాకుండ భ
ద్రాంచత్సత్కృపతోడఁజూడవె యుమాప్రాణేశ! మల్లీశ్వరా!

సర్వజ్ఞుండవు నీవెఱుంగనిది యేజాడన్గనన్ రాదుగా
నిర్వాణోజ్జ్వలహర్మ్య దేశమునకున్ నిశ్రేణి నీభక్తినిన్
గీర్వాణుల్ వరభక్తిమైఁ గొలుతురే క్రేవన్ విచారింప భ
ద్రార్వా! భక్తజనావనవ్రత! ఫణీద్రైవేయ! మల్లీశ్వరా!

రంభాభోగము నవ్వునిన్గొలుచు ధీరస్వాంతుఁడశ్రాంతమా
జంభారాతిపదంబు హేయమను నీసద్భక్తుఁడాత్మార్థమున్
శుంభద్రీతి నెఱుంగవచ్చునినుసంశుద్ధాత్ముఁడై కొల్చువాఁ
డంభోజాసనపూజితైకపదయుగ్మా! శర్వ! మల్లీశ్వరా!

పౌలస్త్యున్వరియించుటిల్ల హరికిన్ బ్రాపౌటయేకల్ల యా
వ్యాళంబున్ గృపఁజూచుటేయనృత మార్యా దేవికిన్ మైసగం
బాలోచింపక యిచ్చుటీవనుటసత్యం బిందునన్ బ్రోవకే
యాలస్యంబొనరించెదేని, శ్రితలోకాధార! మల్లీశ్వరా!

కందర్పుండు భవద్విరోధియయి యాకారచ్యుతింజెందె నా
యిందుండొప్పె వరాంగసంగతిని నీయిష్టంబునార్జించి నీ
యందే భావమునిల్పు భక్తునకు లో టావంతయుం గల్గరా
దందున్ విందును నీవెదేవుఁడవు దాసానంద! మల్లీశ్వరా!

ఉక్షేంద్రధ్వజ! నీకటాక్షమునకై యూహింత్రు మౌనీశ్వరుల్
పక్షీంద్రధ్వజబాణ! నిన్గొలుచుసద్భక్తుల్ మహేంద్రాదులో
దక్షద్వేషి! భవత్పదాశ్రితులకున్ దాపౌను మోక్షంబు గో
ధ్యక్షానన్ గృపరక్ష సేయఁగదె లోకాధ్యక్ష! మల్లీశ్వరా!

కీర్తింపందగు సచ్చరిత్రముల మేల్గీల్కొల్పువారల్ ధరా
భర్తల్ పల్వురుగల్గియుండినను నిర్వాణోన్నతిన్ గూర్పఁగా
ధూర్తుల్ నవ్వకయుండఁబ్రోవఁగనునీతో సాటివాఁడెవ్వఁడో
యార్తత్రాణపరాయణా! వరద! సత్యాకార! మల్లీశ్వరా!

వింటిన్ భక్తజనావన వ్రతమునన్ వెల్గొందు నీవైఖరిన్
గంటిన్ నీదగు దివ్యవిగ్రహము దృక్పర్వంబు సంధింపఁగాఁ
గొంటిన్ నీదుపదాంబుజద్వయముహృత్కోశంబునన్ బ్రోవవే
యంటిన్ నీకిదితప్పదంటి భ్రమరాంబాధీశ! మల్లీశ్వరా!

సిరియొకకొంతయుంట నతిచిత్రముగాఁబొరుగూళ్ళనుండియిం
దఱ బిలిపించి విందిడి వధాన మొనర్పఁగఁజేసి మాకు సో
దరులకు వస్త్రభూషల ముదంబిడి నూటపదాఱులిచ్చె నీ
తిరుపతిరాయఁడాధనపతింబలెఁ బ్రోవవె మల్లికేశ్వరా!



శ్రీశారదాంబాయైనమః

# గుంటూరు శతావధానము

## పీఠిక



శ్రీ బాలసరస్వత్యాశుకవిచక్రవర్త్యాద్యనేక బిరుదాంచితులగు బ్రహ్మశ్రీ కొప్పరపు సోదరకవు లాంధ్రదేశమున ననేక ముఖ్యస్థానములయందు నాశుకవిత్వ శతావధానాష్టావధానములు నిరాఘాటముగసల్పి తమకీర్తి యెల్లయెడల వ్యాపింపఁ జేసిరి. మా గుంటూరుపుర వాస్తవ్యులును గొలది కాలముక్రిందట వారి యాశుకవిత్వ ప్రౌఢిమనుగాంచి మెచ్చి వారికిఁ "గుండినకవిహంస" బిరుద మిచ్చిరి. ఇటీవల వారి శతావధాన ప్రాగల్భ్యమును సైతము వీక్షింపఁ గుతూహలము కలిగి యందునకొక సభఁగూర్ప నుద్దేశించుచుండ నింతలో విశదలలో శ్రీ చెరుకూరి

తిరుపతిరాయ మహాశయుండా సోదర కవులలో నగ్రజుచేతను, బాపట్లలోఁ దత్పుర వాసులనుజుని చేతను శతావధానములు చేయించి మిక్కిలి సంతసించి నూట పదారులు బహుమానములొసంగి వారినత్యంతము గారవించిరి. పిమ్మట ఆ 1911 సం.రం. అక్టోబరునెల ది 1,2 తేదీలను గుంటూరులోఁ గొందరు ప్రముఖులు సభఁగూర్చి సోదర కవులలో అగ్రజులగు బ్రహ్మశ్రీ వేంకట సుబ్బరాయకవివర్యులచే శతావధానమును జరిపించిరి. తొలిదినమున బెజవాడ డి.ము. కోర్టు ప్లీడరుగారగు బ్రహ్మశ్రీ పాటిబండ వేంకటరమణయ్య పంతులుగారును, మఱుదినమున మా పట్టణమందలి మిషన్ కాలేజి నుపాధ్యాయులగు శ్రీమాన్ వంగిపురపు కృష్ణమా చార్యులు బి.ఏ., యల్.టి. గారును సభాధ్యక్షులుగా నుండిరి. మొదటి దినము నలుబదియొక్కరగు పృచ్ఛకులకును, రెండవ దినము మఱిపదుగురిని గలిపి యేబదియొక్కరికిని నవధానము జరుపబడెను. రెండు దినముల సభలకును మా పట్టణములోఁగల ప్రముఖులనేకులు విచ్చేసిరి. అవధానిగారి కవితాధోరణియు, సమస్యాపూరణనైపుణియు, ధారణాశక్తియు నసాధారణములై యొప్పెను. అవధాన మంతమయిన పిదప సభ్యులలో గొందరు పద్యములు రచియించి కవుల నైపుణ్యమును శ్లాఘించిరి. సభాంతమున నీ శతావధాన కవులకు నూటపదారులు బహుమాన మీయఁబడెను. జయజయధ్వనులతో సభముగిసెను. ఆ యవధాన పద్యములునుఁ బ్రశంసాపద్యములును నిందుఁ బొందుపఱపఁబడినవి.

గుంటూరు,
అక్టోబరు, 1911

ఇట్లు,
బుధజనవిధేయుఁడు
**కాకాని పుండరీకాక్షుడు**



# గుంటూరు శతావధానము

**(01-10-1911)**



**గురుస్తుతి**

రామడుగు రామకృష్ణ సు
ధీమణినిన్ సంస్మరింతు దేశికవర్యున్
శ్రీమహితుఁ బోత రాట్కుల
రామకవిన్ దలఁతు సుగురురత్నము ననఘున్

శ్రీరమణీయులైన్నృపులు చేరిరి, సత్కవిరాజరాజులున్
జేరిరి, పండితోత్తములుఁజేరిరి, సజ్జను లన్యులెందఱో
చేరిరి, విఘ్నమిందొకటి సేరకయుండఁగజూచి నేఁటి గుం
టూరి శతావధానసభ నొప్పుగ బ్రోవఁగదమ్మ శాంభవీ

1. అడవిలో దొంగలు తండ్రిని జంప నావృత్తాంతము మూఁగ యితరునకుఁ దెలియఁజేయుట - భుజంగప్రయాతము

వనంబందునం దొంగవాండ్రుగ్రులై తం
డ్రినింజంప దుఃఖంబు వ్రేగౌటచే న

న్యునింగాంచి యవ్వార్త యుల్లంబు ఝుల్లం
చనం దెల్పుc దామూcగహా! హస్తసంజ్ఞన్.

2. గుంటూరు కవిరాజులకు నివాసమని

విక్రమార్కునిచేత విబుధాగ్రసరుల కా
లయమైన యట్టియుజ్జయిని యనcగ
భోజ భూపతిచేత బుధరత్నముల కాక
రంబైన ధారాపురంబనంగ
వేమభూపాలుచే ధీమన్మణులకెల్ల
వేశ్మమై తగు కొండవీడనంగ
నల కృష్ణదేవరాయల చేతcగవులకు
మందిరంబగు నానెగొంది యనcగc

గవియు నృపవర్యుcడైన భాస్కరునిచేత
నున్నత పదంబుగొన్న గుంటూరు పురము
నేcడుcగూడ సరస్వతీ నిలయమగుచు
వఱలు చున్నది కవిరాజ వరులచేత

3. సమస్య : పశ్చిమదిశ రవియు మనుజు పాపయునుండెన్

ఆశ్చర్యమేమి పలువురు
పశ్చిమమునcజూడc దూర్పుపట్టునcగూడన్
నిశ్చయముగ ననుకొననటు
పశ్చిమదిశ రవియు మనుజు పాపయునుండెన్

4. కలము

కరము ద్విజిహ్వల గరిమ గాంచుటc జేసి
యత్యుగ్ర ఫణిరాజమనcగవచ్చు

నెమ్మి సువర్ణంబు నిర్మించుటను జేసి
యల శమంతక రత్న మనఁగవచ్చు
నీలోదకంబుచే నెగడు చుండుటఁజేసి
యల యమునానది యనఁగవచ్చు
మంచి చెడ్డలనొక్క మాడ్కి నుండుటఁజేసి
యాత్మార్థ విజ్ఞాని యనఁగవచ్చు

కాగితములను నదులపైఁ గ్రాలు చుంటఁ
గల మనఁగవచ్చుఁ గాన నీకలము మహిమ
మిట్టిదని వర్ణన మొనర్ప నెవరితరము?
రమ్య కారుణ్యగుణసాంద్ర! రామచంద్ర!!

5. ప్రస్తుత శతావధానమును గుఱించి

ధీరాగ్రేసరులైన పృచ్ఛకుల కెంతేఁగోరు వృత్తంబులున్
ఘోరంబుల్ సుకరంబులౌ విషయముల్ కూర్పొప్పఁగాఁజేసిమేల్
ధారన్ ధారణఁజూపిమెచ్చుఁగొన స్వాంతంబందునన్ గోర్కె చే
కూరన్ జేయుచునుంటి నేఁడుసభ నీగుంటూరిలోఁ జూడుమీ

6. చల్లగాలి, చలిగాలి భేదము

మలయ పవమాన మెంతయు
చలిఁజేయదుకాని హృదయసౌఖ్యంబిడు నీ
చలికాలపు పవమానము
చలిచేయుటెకాక హృదయసౌఖ్యం బడఁచున్

7. చాకు

అవసరంబుగల్గి నప్పుడెయ్యదియైనఁ
జెక్కుటకునువీలు చెందునెద్ది
దంతపుటొఱ గల్గి తళ్కుతళ్కను నద్ది
చొక్కమైన యట్టి యుక్కు చాకు.

8. నాటకశాలయందుఁగల యొక తెలివర్ణన

మత్తేభంబులు లోచనంబులకు నమ్మత్తేభపున్ వాంఛలన్
హత్తంజేయఁగ సర్పసంతతులు భీమాకారముల్ దాల్చియే
చిత్తంబుం బటుసర్పభీతిననుపన్ జిత్రించి యింకెన్నియో
నృత్తాగారమునం దెసంగు తెలిపై నిర్మించినా రద్దిరే

9. విద్యవలన లాభము

పరదేశ సంచార పరులైన వారికి
విద్య రైల్బండియై వెలయుచుండు
గృహమేధి సద్ధర్మ మహితులౌ వారికి
విద్యయే విభవాభివృద్ధిఁ గూర్చుఁ
బలురాచ మన్ననల్ వడయు వారికి విద్య
యే వశ్యమంత్రమై యింపొసంగుఁ
జలముతో వైరుల సాధించువారికి
విద్య బ్రహ్మాస్త్రమై విజయ మొసఁగు

యశమునకు విద్యయే మేటి యవసథంబు
పరమునకు విద్యయే మంచి పట్టుఁగొమ్మ
పాపగిరులకు విద్యయే వజ్రధార
యట్టి విద్యాధిదేవత నభినుతింతు.

10. రక్తంబంచును నిర్మలోదకమునుం ద్రావంగ శంకించెఁదాన్

రక్తాంభోజ సమాన పాణియగుచున్ రంజిల్లు బింబోష్ఠి ధీ
శక్తుల్లేమిని ముగ్ధ గావునఁ బిపాసాయాసముం దీర్ప నా
సక్తిన్ దోసిట బట్టి కేలుగవఁ గెంజాయల్ విడంబింపఁగా
రక్తంబంచును నిర్మలోదకమునుం ద్రావంగ శంకించెఁదాన్

.1. వృద్ధునకు బాలునకుఁ బోలిక

ఒరుల సహాయముండవలె నొప్పుగ వానికి వీని కెయ్యెడన్
గరచరణాదులున్న నధికంబగు లాభములేదు మాటనే
ర్పరి తనమింతలేదు మతివానికి వీనికి నట్లుగావునన్
సరిగను బాలువృద్ధుని నిజంబుగఁ బోల్పఁగవచ్చు మిత్రుఁడా.

12. అవసరమైనప్పు డొరునిదేవిరించి, అవసరములేనపు డెన్నండు
నతనిఁజూడనివానివలె నటించువాఁడెట్టివాఁడనుటకు

అబ్బినచో సిగ నబ్బుకుండినఁ గాళ్లుఁ
బట్టఁగాఁదలపోయువాఁడుగాక
యొక వేళఁదల్లి వేఱొకవేళ నాలని
పలుకంగఁ దలపోయువాఁడుగాక
తండ్రియెవ్వఁడునాకు దైవమెవ్వఁడటంచుఁ
బలుకంగఁ దలపోయువాఁడుగాక
పాపంబు నన్నృత మాభరణంబులుగ నెంచి
పలుకంగఁదలపోయువాఁడు గాక

తనకుఁ దఱి యబ్బినపుడు పాదములుపట్టి
వానికబ్బిన నేయూరివాఁడవనుచు
నడుగ నేర్చునె యన్యుఁడైనట్టివాఁడు
నిర్భయంబైన తనశక్తి నిగ్గుదేర.

13. నాటకములు చూచుటవలని లాభనష్టములు

వనితల్ పూరుషులున్ మనోభవ కళావైదుష్యముల్ చూపుచోఁ
గనుటన్ దగ్గత చేష్టలం దొరయు నుత్కంఠరన్ గడుం గీడగున్
ఘనులౌ వారి సువృత్తముల్ గనుట విజ్ఞానంబు ప్రాపించుఁ గా
వుననే నాటకమున్ గనుంగొనిన ముప్పున్ మెప్పుచేకూరెడున్.

14. గోలకొండ, పూలదండ, కొత్తకుండ, మాలముండ అను పదములు వచ్చునట్లు రామాయణ కథ

నీనాథుండన గోలకొండపయి నెంతేనుండు నవ్వారితో
నీ నాఁడంబుధి దాఁటివచ్చు టెఱుఁగండేమందు నా రాఘవో
ర్వీనుండిష్టైద పూలదండ పయిఁబైరేకొత్తకుండంగ గె
ల్పానన్ రామనమాలముండ దనుటెట్లో తెల్పుమందోదరీ!

15. పుల్లివిస్తరాకు

అన్నముం బుల్సు మజ్జిగ యాదిగల్గు
నవిభుజించి యనంతరం బందుఁబాఱ
వైచువిస్తరి యెండఁగావచ్చును పులి
యా కనెడునామ మద్దాని కర్థమగుచు

16. లవంగము

కారంబుగల్గి సౌఖ్యము సంఘటించుచు
నెద్ది ప్రసిద్ధితో నెసఁగినదియొ
పైత్యదోషంబులఁ బాపు సమర్థత
నెద్దిప్రసిద్ధితో నెసఁగినదియొ
తాంబూలమొనరింపఁ దగువస్తువులలోన
నెద్దిప్రసిద్ధితో నెసఁగినదియొ
దుర్గంధములనెల్లఁ దొలగించు లీలల
నెద్దిప్రసిద్ధితో నెసఁగినదియొ

అయ్యది లవంగమనునది యబ్జగంధు
లెందఱోకర్ణ భూషగా నిచ్చగింతు
రెన్నియో యౌషధంబుల కిడు సహాయ
మది ప్రతిమనుష్యుఁ డార్జింపనగును జుమ్ము

17. దశావతార కృత్యములు

మత్స్యరూపమున సోమకు నుక్కడంచెఁ దాఁ
    గూర్మాకృతిని దరికొండనెత్తె
గిటియై హిరణ్యాక్షుఁ బటుశక్తిఁ ద్రుంచె నృ
    సింహుండై ప్రహ్లాదుఁ జెలిమిఁ బ్రోచె
వామనుండై బలి వైభవంబు హరించె
    భృగురాముఁడై రాజవితతిఁ గూల్చె
దశరథ రాముఁడై దశకంఠుఁ దునుమాడె
    హలియై ప్రలంబ ముఖ్యుల వధించె

బుద్ధుడై నేర్పె శ్రితులకు భూతదయను
గలికియై దుస్స్వభావుల గర్వమడఁచె
నట్టి దేవాది దేవు మహాను భావు
సిద్ధముగఁగొల్తు నిష్ట సంసిద్ధి కొఱకు.

18. సిరాబుడ్డి – మహాస్రగ్ధర

అవనిన్ వేలేఖకుల్ వ్రాయఁగ దలఁచి కలంబందియున్ గాకితంబం
దివిధిన్ దేనిన్ దలంపన్ దివుటఁగనియె దానిన్ సిరాబుడ్డి యందుర్
కవులెన్నన్ గుండ్రనై సోగయయి వెడలుపై గ్రాలి లోతై రహించున్
వివిధోద్యత్కాన్తులొప్ప న్వెలయు నది జగద్విశ్రుతంబౌచు నెందున్.

19. తలవెండ్రుక – స్రగ్ధర

అంభోజాతాక్షి వేణిన్ హరువుగనిన రోమాతి సౌభాగ్య మెంతే
సంభావింతున్ బయోముక్సముదయరుచులున్ స్ఫారరోలంబకాంతుల్
శుంభద్ధ్వాన్తప్రభల్ హెచ్చుగఁగొనివిధి మెచ్చొప్పఁగాఁ గూర్చియాపై
జంభద్విడ్రత్న రోచుల్ చమిరి యొనరుపన్ జక్కనౌ తీవెయో నాన్.

20. తీసివేసిన గోరు

కష్ట సుఖంబుల గణియింప కుండిన
పూరుషు నొక్కనిఁ బోల్చవచ్చు
నయమింత లేక యనామధేయుండైన
పూరుషు నొక్కనిఁబోల్చవచ్చు
నిత్యంబు పరుని నిందించుటే పనిగల్గు
పూరుషు నొక్కనిఁబోల్చవచ్చు
తన తప్పెఱుంగ కన్యుని తప్పు వెదకెడి
పూరుషు నొక్కనిఁబోల్చవచ్చు

నవసరంబైన యపుడు కవ్యగ్రగణ్యు
లిట్టి విషయంబులకును దానిక్క యనఁగ
గొప్ప పదవి వహించిన గుఱుతెఱుఁగక
తీసివేసిన గోరని తెగడఁదగునె.

21. గుంటూరు కాలేజి ప్రిన్సిపాల్ యూల్ దొరగారిని గుఱించి - తరలము

అమెరికాన్ జనియించి సర్వకళాఢ్యుఁడై యిపుడిండియాన్
సుమహితంబగునట్టి గుంటురుస్కూలులో నధికారియై
విమలబుద్ధుల నెల్ల బాలురు విద్య నేర్పఁగ నేర్పి తా
క్షమయు శాంతి యెసంగ యూల్ దొర చాలకీర్తిభరించుతన్

22. సమస్య : రోమము సౌఖ్యమిచ్చుచును బ్రోవనిచో యశమెల్లఁ బాడగున్

ఏమొక పక్షమూనుకొనుటేటికిఁ బౌరులమౌటఁ జేసి మా
కేమిటనైనఁ గష్ట మొకయించుక రాదది యెట్టులన్న సం
గ్రామమునం జయంబుఁగొని కౌరవ పాండవులందు వీరొ వా
రో మము సౌఖ్యమిచ్చుచును బ్రోవనిచో యశమెల్లఁ బాడగున్

23. వార్తాపత్రికల యుపయోగము - శార్దూలవృత్తము

ధూర్తుందెల్పు నధూర్తునిం దెలుపు మందుం దెల్పుఁ దెల్పుం బుధున్
హర్తం దెల్పును భర్తనుం దెలుపు న్యాయాన్యాయముల్ దెల్పు దు
ష్కీర్తుల్ దెల్పు సుకీర్తులం దెలుపు దుఃఖిం దెల్పుఁ దెల్పున్సుఖిన్
వార్తాపత్రిక దాని లాభములిఁకన్ వర్ణింపఁగా శక్యమే.

24. తాళవృంతము

గాలి యొకింతలేని యెడఁ గల్పన జేసి సుఖంబొసంగు ని
ర్మూలన మాచరించుసుమి ముఖ్యముగా మెయి ఘర్మ బిందువుల్
వైళమ తాళవృంతమది బాంధవమున్ ఘటియించు వేసవిన్
మేలని ప్రౌఢదంపతులు మెచ్చి నిశాసమయంబులం గొనన్.

25. కనుబొమలు

అనువుగ వీక్షణాంబక సహస్రముఁ గూర్చిన శంబర ద్విష
ద్ధనువులనంగఁ గన్బొమలు తామరసాక్షికిఁ జెల్వొసంగు యౌ
వన మదమత్తులం గనిన భావసముద్భవ శక్తినిక్కి వ
ర్ణన మొనరింపరాని యతిరమ్య విలాసము లావహించుచున్.

26. సమస్య : దారములేకున్న బ్రతుకఁదరమే ప్రజకున్

క్రూరుఁడగు కనకలోచను
మారణ మొనరించి ధరణి మనుపఁగ హరి భూ
దారమయి యొప్పె నా భూ
దారములేకున్న బ్రతుకఁదరమే ప్రజకున్

27. అభిమన్యుఁడు చచ్చినవార్తవినిన యర్జునుని గుఱించి

అక్కట వేల్పురా మనుమఁడా హరి యల్లుఁడు నా కుమారకుం
డెక్కడ యొంటి జిక్కి యని నీల్గుట దెక్కడ యిక్కథన్ వినన్

వ్రక్కలుగాదు నా మనము వ్రక్కలుగాదు శరీరమంచుఁ దా
నక్కొడుకుం దలంచి మది నర్జునుఁ డెంతటి చింతఁ జెందునో.

28. మేఘముఁజూచి నెమళ్ళు సంతోషించుట – మత్తకోకిల

ఆకసంబున ధ్వాంతమట్టుల నంబుదంబు రహింపఁగా
వీఁకఁ జిత్రరుచుల్ వెలింగెడి పింఛియంబుల విప్పుచున్
గేకు లెన్నియొ మూఁక గట్టుచుఁగేక లొప్ప నటించెడిన్
లోకమందున నవ్విశేషమనూన మైత్రినిఁ దెల్పఁగన్.

29. సూర్యోదయము చంద్రాస్తమయము

ఇంద్రాశన్ భువన ప్రియుండినుఁడు చక్రేశుండు చండాంశుఁడై
సాంద్ర ప్రాభవ మొప్ప దోఁచుటయు నచ్ఛాయన్ గనన్ లేక తాఁ
జంద్రుండస్త నగంబుఁ జేరె నదియౌఁ జర్చింప మిత్రుండు ని
స్తంద్ర ప్రజ్ఞను దన్నుఁ జేరునెడ దోషస్వాంతుఁడెట్లొప్పెడిన్.

30. సమస్య : మంచాలన్ బిగియించె గూటములకమ్మా బిందియం దేఁగదే

కంచున్మించును దోఁపఁబాలకయి యాగంబియ్యెడన్ బాలకుల్
కొంచెం బాగక చేయుచుండిరిటఁబాలుం దీయఁ బ్రొద్దేఁగె వే
ఱెంచన్ రాదిపు డాల కాఁపరియుఁ దానేతెంచె యాలస్య మే
మంచాలన్ బిగియించె గూటముల కమ్మా బిందియం దేఁగదే

31. సమస్య : దిరిగిరి సత్పథంబెనసి తేజరిలెన్ విబుధాళి కిక్కయై

గరువముమీఱు వింధ్యమునకంటె సమర్థతఁ జూపఁబూనఁగా
హరునిశరాసనంబను మహత్త్వపుఁ గల్మిని రత్న కూటముల్
మెఱయ సువర్ణ సంపదల మేకొన నిర్జరులెల్ల మోదమం
దిరి గిరి సత్పథంబెనసి తేజరిలెన్ విబుధాళి కిక్కయై

32. సమస్య : గవ్వకుఁ గొఱగావు మేటికవి నెదిరిచినన్

ఇవ్వడువునఁ గాకంబా
చివ్వకుఁగా(ర్దవ్వి మున్నె చెడిపోయితివా
నెవ్వగ పోయెనె యిపుడుం
గవ్వకుఁ గొఱగావు మేటికవి నెదిరిచినన్

33. తేలుకొండికాయ

తాఁకినమాత్రనే దనువుఁగీఱగఁ జేయు
దండిగా నీ తేలు కొండికాయ
యంటినమాత్రనే మంటఁగల్గఁగఁ జేయు
దండిగా నీ తేలు కొండికాయ
మొనముండ్లచేబాధ మొలకలెత్తఁగఁ జేయు
దండిగా నీ తేలు కొండికాయ
తనయాఖ్యకైన యర్థముఁజూపునన్నింటఁ
దండిగా నీ తేలు కొండికాయ

యదియు నొకకొన్ని విషయంబులందుజనుల
గౌరవంబందుచుండె జగంబునందు
పనికిరానట్టి వస్తువా పద్మభవుఁడు
సలుపలేదను మాటకు సాక్షియగుచు

34. సమస్య : సతిసతి కలియంగఁ బు(త్ర సంతతిగలిగెన్

నుతకీర్తిమీఱ లోకం
బతిశయముగ వృద్ధిగనఁగ నాత్మభవ సుఖో
న్నతులు దులకింపఁ బతిఁబతి
సతిసతి కలియంగఁ బు(త్రసంతతి గలిగెన్

35. సమస్య : కుక్కుట గృహమందుఁగాక ఘూకములుండెన్

ఒక్కఁడగు బోయ పక్షుల
నక్కజముగ నెన్నొ జాతులనఁదగు వానిం
గక్కురితిఁదెచ్చి యొక్కటఁ
కుక్కుట గృహమందుఁగాక ఘూకములుండెన్

36. ఒక పద్యముచదివి తదర్థమువచ్చునట్లు చెప్పుఁడనగాఁ జెప్పినపద్యము

ఇల సరసజ్ఞవృత్తిని రసేద్ధవిలాసమునొందఁబోదుతా
నలవడుకాణరీతినిఁ బదార్థక సుప్రియతన్ వహింపదొఁ
గలిగినదోషరూఢి నెసకంపుఁబ్రసాదముఁ గాంచఁబోదు దు
ర్విలసితమైనకాకవి కవిత్వము ప్రాజ్ఞులు మెచ్చ రెంతయున్

37. బైసికిలు – కవిరాజవిరాజితము

అతులితవేగము మీఱఁగఁబోవునహర్నిశ మెయ్యదియన్న యెడన్
క్షితిపయి బైసికిలేసుమి రబ్బరుచేఁదగు టైరు పొసంగ లస
ద్గతులెసగంగ నయోమయ సాధన గౌరవ సంపద పెంపుఁగనన్
ప్రతిమతిదానికి లేదుగతిన్ బలవంతుఁడు దాని గ్రహించునెడన్

38. విరోధిజుట్టుపట్టుకొని లాగుకొనిపోవుచుండఁగా వాఁడనుకొను విధము–మత్తకోకిల

ఏటికీకలహంబు వీనికి నిట్లు నాకులభించె ము
మ్మాటికీతఁడు జుట్టుఁబట్టియు మానుషంబడఁగింప నే
నేటికీబ్రతుకంది యుండుటనింకనంచు దలంచుఁదా
గాటమౌ నవమాన మెవ్వఁడు గాంచియాత్మభరించెడిన్

39. లక్ష్మి – అచ్చ తెనుఁగు

మెచ్చు లెసంగ లెంకలను మేలుగ నేలఁగజాలు తల్లి ని
ప్పచ్చర మెల్ల ఁబాపుచును బాగుగఁజూచు వెలంది తమ్మియి

ల్లచ్చుగఁ గాఁపురంబయిన యాకటి వేలుపుకూర్మి రాణియౌ
లచ్చిని నమ్మి నెమ్మదిని లావుగఁ గొల్వఁగ వచ్చు నేరికిన్.

40. ఒకబోయ కుక్కతో,భార్యతోవేఁటకుబోవుచు మాటాడుట గ్రామ్యము -లయగ్రాహి

కుక్కనుసిఁగొల్పుచును గక్కుటిటిఁజూపుచును
బ్రక్కఁగలయాలిఁగని జొక్కుఁగనిదన్నీ
యక్కయిదియేందె పొయిరెక్కినదెసెప్పఁ గదె
పక్కలిటుబల్చి తెగ నిక్కెదనఁటేమే
సక్కఁ బులినీళ్ళు రుసులెక్కుతయిదెణ్ణమును
మెక్కిపులియాఁటకును సొక్కకనుబోలెన్
సిక్కులివియేంటెయనెఁ గొక్కెరవిధంబుగను
గక్కసపురూపొ కడు వెక్కసమెసంగన్

41. సమస్య : ద్రుంచెన్ రామశిరంబు రావణుఁడు సంతోషించిరానిర్జరుల్

ఎంచన్ సీతకు మాయసీతఁ దగునట్లేర్పాటు గావించి తా
ద్రుంచెన్ శక్రజితుండటంచనిన దైత్యుండిష్టుఁడై యున్నఁ ద
చ్చుంచద్రత్న కిరీట మూడిపడఁ గీశానీకమౌనౌననం
త్రుంచెన్ రామ, శిరంబు రావణుఁడు సంతోషించిరానిర్జరుల్

42. పూర్వపు గురుశిష్యులకు నిప్పటి గురుశిష్యులకు భేదమున్నదా

గురువులయందు శిష్యులకు గొప్పగభక్తి యెసంగు శిష్యులం
దరుస మెసంగు నాగురువులందఱ కప్పటికాలమందు న
గ్గురువులునట్టి శిష్యులొనగూడిరె నేఁడని సంశయింపకో
వరమతి యెందుఁజూచితిమి వారలనీయది నిశ్చయింపఁగన్

43. చెప్పులు - లయగ్రాహి

ఎప్పశువుతోలయిన నుప్పునను వైచి బిగి
చొప్పడఁగ నెండనిడి కప్పుగొనఁగత్తిన్

జిప్పలుగఁగోసి ముడులొప్పెసఁగనారె
రవముప్పతిలఁగుట్టనవి చెప్పులన నొప్పున్
సప్పముల కాటువడిఁ దప్పుకొనఁజేయు మఱి
నిప్పుపయి గాలిడిన నొప్పిఁగొననీకన్
మెప్పునిడుఱాలమఱి అప్పలను దేళులను
దిప్పలను ముండ్లనగు ముప్పు నడగించున్

44. వేదము వేంకటరాయశాస్త్రిగారు

దైవతాంధ్రాంగ్లేయ ద్రావిడభాషల
నప్రతిమానత నందినాఁడు
ప్రతివాది భంజన ప్రౌఢ ధీశక్తిచే
ననుపమానఖ్యాతి నందినాఁడు
రసవత్ప్రబంధ సద్రచనాగరిమచేత
నద్భుతాసమకీర్తి నందినాఁడు
సచ్ఛాత్రులను గవి స్వాములఁగాఁ జేసి
యటు నమానుషశక్తి నందినాఁడు

పండిత కవీంద్ర వినుతులు వడసినాఁడు
వేదశాస్త్రంబులకు నందె వేసినాఁడు
చెన్నపురిలోనఁ నేఁడు వసించినాఁడు
ప్రకట వేదము వేంకటరాయశాస్త్రి

45. సమస్య : వైశాఖము మునిఁగిపోయె వననిధి నడుమన్

ఆశరులును వేల్పులు నమృ
తాశ వనధి మందరాద్రి నటు దఱవఁగ లో
కేశుకృపలేమి గిరియగు
వైశాఖము మునిఁగిపోయె వననిధి నడుమన్

46. అగ్ని నీటిలోఁ బుట్టి నీటిచేఁ జల్లారినట్లుగా మఱికొన్ని సీసములో వచ్చునట్లు చెప్పుడి

జలముచేఁబుట్టియు జలముచేఁబిమ్మట
నగ్ని చల్లారిన యట్లుగాఁగఁ
దానురాక్షసుఁడయి తగరాక్షసునిచేత
నలరావణుఁడు చచ్చి నట్లుగాఁగ
దానుక్కుఁగమ్మియై తగునుక్కు శాణమ్ము
నం దదితెగిపోయి నట్లుగాఁగ
దానొక్క మత్స్యమై తగమత్స్యమునఁ జేసి
యసువుల విడనాడి నట్లుగాఁగ

నొక్కవంశంబులోఁబుట్టి యోర్వలేమి
కాపురంబుగనుండిన కౌరవేయ
పాండవేయులు హతులైరి బవరమందు
నరయ నన్యోన్యబాణ ప్రహారగతుల

47. ఏమియులేనిచోట నేమియున్నది

ఇలపై నేమియు లేనిచోట మఱితానేముండునో యంటివా
బళిరే యల్ల చిదంబరస్థలమె యాభావంబుఁజూపించెడిన్
గలిమిన్గోవెల దేవుడుండెనని వక్కాణింత్రు నిక్కంబుగాఁ
గలయన్జూచినఁబోవు సందియము వాక్యార్థంబులింకేటికిన్

48. గడ్డిపోఁచ

తెలియక గడ్డిపోఁచ యని తేలికగాఁ బలుకంగవచ్చునే
యిలపయి నట్టి గడ్డిఁదినియేగద యావులు పాలొసంగుఁ బ
ట్టెలుమఱిగొట్టెలున్ బ్రతికి ప్రీతినొసంగెడు నిండ్ల ఁగప్పనౌ
గలిమిని దానసైన నుపకారములిన్నియు నిట్టులుండఁగాన్.

49. భరతఖండము కామధేనువుతోఁ బోల్చుట

షడ్రసోపేత భోజనసౌఖ్యములొసంగ
నీరెండు సమతచే నింపుఁగాంచు
నవరత్నములు సమున్నత శక్తినీనంగ
నీరెండు సమతచే నింపుఁగాంచుఁ
జిత్రాంబరంబులు చెలువారఁగనొసంగ
నీరెండు సమతచే నింపుఁగాంచు
గామ్యార్థములనెల్ల గరిమతోనొసఁగంగ
నీరెండు సమతచే నింపుఁగాంచు

భరతఖండంబుసుమియిది ప్రణుతిసేయ
గామధేనువుసుమ్మది గణుతిసేయ
నిట్టియీరెంటిసామర్థ్య మెవ్వఁడేని
వర్ణన మొనర్పకున్న శోభనముగలదె

50. కోతుల యుపయోగము

స్వామికార్యేషు నిర్వహణప్రవీణత
నుజ్జ్వలస్థితి గాంచె నొక్క కోఁతి
మున్నీటిపైఁగొండ లెన్నింటినో తేల్చి
యుజ్జ్వలస్థితిగాంచె నొక్కకోఁతి
మరణమందినవారి మఱలంగబ్రతికించి
యుజ్జ్వలస్థితిగాంచె నొక్కకోఁతి
శ్రీరామకల్యాణ సిద్ధి దైవారంగ
నుజ్జ్వలస్థితిగాంచె నొక్కకోఁతి

యిట్లుగా వర్ణనముసేయ నింతవఱకు
నెన్నియో కోఁతులున్నవి మన్ననమునఁ

బటుప్రబంధంబులందెన్నఁ బడినతేవఁ
గానఁగోతులమహిమఁ బల్కంగఁదరమె

51. తన్నచిత్ర మను చంపూభారత శ్లోకమునకుఁ దెలుఁగు

అలరు వనమధ్య విహరణం బవధరించు
ధరణిపతి చంద్రహాసపతనము పుండ
రీక తతిమీలనంబు వరింపఁజేసెఁ
గాన నిందేమి చిత్రంబు గలదు చెపుమ.

(సంపూర్ణము)



## అవధానాంతమున
## పండితకవుల యభిప్రాయములు

❋❋❋❋❋

### బ్రహ్మశ్రీ శతావధాని జూపూడి హనుమచ్ఛాస్త్రిగారు
### (బెల్లంకొండ రామరాయ విద్వత్కవీంద్రుల శిష్యులు)

శతలేఖిన్యవధాన తంత్రమన దుస్సాధ్యంబు సూ, పైని వ
స్తు తతుల్ గోరిరి చెప్పరాని వవి సంతోషంబుగాఁ బూర్తి చే
సితి వింకేమి కొఱంతలేదు, కవితా సింహాసనస్థాన సం
స్థితిఁ గల్యాణ పరంపరాతి గరిమల్ చేకొంటివో సత్కవీ!

దయగల వాఁడు జీవన ముదారతనిచ్చెడు వాఁడు శుద్ధచి
న్మయుఁడు గుణాఢ్యుఁడాద్యుఁడు సుమాస్త్రునితండ్రి రమావినోది య
ద్వయుఁడల రామమూర్తి కవితారమణీయుల మిమ్ముమమ్మునున్
దయదయివాఱఁబ్రోచుత విధాతయు నాయువొంసగుఁ గావుతన్

### బ్రహ్మశ్రీ పులిగుండం రంగరావుపంతులుగారు బి.ఏ.
### గుంటూరుజిల్లా కోర్టు ప్లీడరు

పెరిమెన్ బొల్చును నీకవిత్వము మహావిద్వాంసులున్ ధీరులున్
గరిమన్ మెచ్చఁగఁజెప్పినాఁడవిఁక నీకావ్యంబు లెట్లుండునో
వెఱఁగౌ నీయవధానపుం గతులనే వేనోళ్ళ గీర్తింపఁగాఁ
బరఁగెన్ భేషన సుబ్బరాయకవి సంభావింపరాదే? నినున్

## బ్రహ్మశ్రీ బాలేమర్తి వేంకటసుబ్బయ్యగారు

### ఉత్పలమాలిక

శ్రీరుచిమించి శారదవశీకరయై నిజజిహ్వాలందు సం
చారముసల్పుచుండ నవిచారముచే నవధానసత్సభన్
ధారనుజూపి కల్పనను ధారణశక్తియుఁజూపి సభ్యహృ
త్సారసవీథికర్కులయి చాలవికాసము గూర్చిరౌర యీ
వీరులు కొప్రపుంగవులు వీరికినీడగువారినేర్రి నీ
ధారుణి నేనెఱుంగనిది తథ్యము సూరిజనంబులార! యీ
తీరునఁగానిచో సకలదేశములం గవిరాజులెల్లరున్
గోరికలూరఁబద్యములఁగూర్చి లిఖించుటెగాక మేటియౌ
గౌరవ మొప్ప హారములు ఘల్లను మేల్జయఘంటికాది శృం
గారపు భూషణంబు లెటుగా నిడిరో యవిచూచువారికిన్
వేఱుగఁజెప్పనేమిటికి వెన్నెలఁజూచుచుఁ జంద్రుఁడేడియన్
వారుగలారెచూడ నటువంటి మహాత్ములజాడ లేడ యీ
ధారణశక్తియేడ యవధానవిధానవిలాసమేడ యీ
భారముఁబూనినట్టి కవిభాస్కరులన్ నుతియింతువీరలన్

## బ్రహ్మశ్రీ అమరవాది రామకవిగారు

అరయవిరోధ మేల మనకంచుఁ బరస్పరమైత్రికై సహో
దరత వహించి యాత్మకవితాధిషణోన్నతు లేర్పడంగఁ గొ
ప్పరపుఁగవీంద్రయుగ్మమయి భార్గవగీష్పతు లుప్పతిల్లి రు
ర్వరనటుగానిచో మతికవార్యమహత్త్వము వీరికబ్బునే

## బ్రహ్మశ్రీ సేకూరి వేంకటకృష్ణకవిగారు

వర్ణాభ్ర గర్జారవంబుల మఱపించు
 పదగుంభనంబుల భద్రపఱచి

జుంటితేనియతేట జొటజొటజొబ్బిల్లు
సొబగుగా రసముల సొంపునింపి
చిత్తంబుమోదంబుఁ జెంద సద్భావంబు
లందందు నందంబు చెందఁజొనిపి
మలయానిలప్రభా విలసనంబునఁజొక్కు
సరణిని సౌఖ్యంబుఁగురియఁ జేసి

యర్థగాంభీర్య పదశుద్ధు లంతకంత
కతిశయాహ్లాదగరిమల నందఁజేయ
నాశుధారనుఁగాని యత్యంతకష్ట
మైన యవధానములఁగాని యధికులెన్ను
కవితఁగాంచిరి సోదరకవులు నిజము
ఆర్యమణులార! సత్కవివర్యులార!!

అరుగు నొక్కొకమాఱు నరుధనుర్జ్యా నినా
దముతోడ నెదిరి పంతంబులాడఁ
జెలఁగునొక్కొకపరి శ్రీకృష్ణు పిల్లన
గ్రోవిరావంబుతో గుంజులాడఁ
బరుగిడునొకపరి పంకజాసనురాణి
మంజీర రవముతో మాటలాడ
నేగునొక్కొకసారి హిమశైలనిస్సర
ద్గాంగభంగాళితోఁ గలసియాడ

దేశ దేశంబులెల్లను దిరిగితిరిగి
మేటియవధాన సభలఁ దాటోటుగనక
పండితకవీంద్ర గౌరవప్రాభవముల
నందియుండెను వీరి మహాశుధార

తొలుతనుగల్గినంతటనె దొడ్డతనంబెటులబ్బుఁ బిమ్మటన్
గలిగినమాత్ర హైన్యమెటుగల్గును శక్తులఁజూపినంత యం
దలి గుణవర్గమే తెలుపు నల్గురి కెచ్చును దచ్చు ధాత్రిపై
ములగలు ముందుపుట్టిననుఁ బోల్తురె? చేవను చింత చెట్లతో

విశ్రమంబుల వెతకక యశ్రమమునఁ
బ్రాసములఁగూర్పఁ గడఁగండ్లఁబడుట లేక
తోడివారలఁ దమకింత తోడుగొనక
కవితఁజెప్పుట సోదరకవులసొమ్ము

**బ్రహ్మశ్రీ కొండముది శ్రీరాములుగారు, ప్లీడరు**

నటదీశానజటాటవీ లసదనూనద్యో మహోవాహినీ
చటులోత్తుంగతరంగ ఘుంఘుమరవోత్సాహంబొ కాదంబినీ
పటువిస్వానమొ సుబ్బరాయకవితా వాగ్వైభవంబోకడున్
ఘటియించెన్ బరమోత్సవంబు మదికిన్ నానారసాన్వీతమై

అడుగఁగవచ్చుఁ బ్రశ్నముల నజ్ఞునకైనను వానినెల్ల వెం
బడివచియింపఁ గష్టమది పండిత వేద్యము గొడ్డురాలు న
వ్వెడుఁ బ్రసవించుదానిఁగని పిన్నవె యయ్యు మహోద్భుతంబుగా
నుడివితివయ్య మోదము మనోగతినించితివయ్య చాలఁగన్

శారదరాకా నిశాకర కరపుంజ
మురుతాపమొనరించు విరహికెపుడు
ఉన్నదియున్నట్లు లెన్నఁగాఁదోఁపదు
పసిరికలైన మానిసికి నెపుడు
శర్కరగూడ విసంబుగాఁ గాన్పించు
జ్వరమునఁగడుఁగుందువాని కెపుడు

సన్మార్గ వర్తియై చనుదెంచు నినురీతి
ఘోరంబుగాఁదోచు గూబకెపుడుఁ
గావున త్వదీయమహిత శృంగారలలిత
బహుళ నవ రసాలంకృత భరితకవిత
హృద్యమై కొందఱకుఁదోఁప దేమొకాని
సరసకవికర్ణ పేయమై వఱలుచుండు

కలిగె యశంబుమీకతనఁ గాశ్యపియందున నాంధ్రవాణికిన్
గలువలఱేని నొక్కరునిఁగాంచియు మిన్నును మన్నుఁగాన కే
మెలఁగెడువార్ధికన్నఁ గడుమిన్నగదా దలఁపన్ గళావిలా
సుల మిమునిర్వురన్ గనిన సువ్రతమున్ గనియుంట సత్కవుల్

యశము దిక్కుల రాజిలు నటులఁ జేసి
యాయురారోగ్య భాగ్యంబు లధికకరుణ
నొసఁగి మిముఁబ్రోచుఁగావుత నసురజీవ
వాతవాతాశనుఁడు చక్రపాణియెపుడు.

**బ్రహ్మశ్రీ పుట్రేపు శేషయ్యగారు**

కవితా కాంతయు ధారణారమణి సౌఖ్యంబందఁగా వేఁడి మి
మ్మే వరించెన్ జూఁడియీడుజోడనుచు నెమ్మిన్ జాలఁగాంక్షించితా
నవలన్ వచ్చె యశోలతాంగియిటు లాహాయిందఱన్ దన్ను ధీ
రవధాన్యగ్రణులైన మీకుఁ గవితారాజ్యంబు గట్టందగున్

ఆశుకవనంబె వీరలకబ్బెఁగాని
శతవధానంబుఁ జరఁగించు శక్తిసున్న
యనెడివారలఁ దగు దురూహాగ్రహంబు
మఱుఁగుపడె నేటియవధాన మంత్రమహిమ

**శ్రీమాన్ తిరుమల శేషాచార్యులు, వేంకట రమణాచార్యులు గార్లు**

చరికొండధర్మ్మఁడన్ సత్కవిచంద్రుఁడు
నవకంపు మొక్కను నాటినాఁడు
భట్టుమూర్తియనెడి పండితమాన్యుండు
పొలుపొందఁగా నీరుపోసినాఁడు
అటమాడభూషి వేంకటసత్క వీంద్రుండు
పెంపొందఁగా నల్లుపెట్టినాఁడు
తిరుపతి వేంకటేశ్వరుల నశ్వరముగా
సదమలకృపతోడ సాఁకినార

లట్టిదగు నీశతవధానమనెడి లతిక
సరసకొప్పరపుం గవీశ్వరులచేతఁ
బుషితమై విరులందగెఁ దత్ఫుల్లసుమము
లఖిల వేదులుఁదాల్చెద రౌఁదలలను

మునుశతఘంటసత్కవులమూల్యవచోధను లాంధ్రమండలిన్
గనఁగనొకండొకండయినఁ గన్పడఁడందురు నేఁడుపల్లెటూ
రున మఱిపట్టణంబులను రూఢిగ మేల్లని రాంధ్రభూమితా
గనుఁగొనునోముపంట లనఁగాఁదగదే పరికింపవీరలన్

అమలలతాంత సంగ్రథితమైతగు దారముమేటివాసనల్
గొమరలరారఁ గాంచుగతిఁ గొప్పరమన్ పురి గొప్పగాంచెనాం
ధ్రమహి తదీయకీర్తిలత తద్దయు నల్లెనటంచునేరికీ
క్రమమునెఱుంగఁ జెప్పవలెఁ గాంచియెఱుంగరె ధీరసత్తముల్

ఒనరఁగమిన్నుముట్టుగతి యోజనఁ జేసియు వ్యర్థవాక్కులన్
జొనుపక శ్లేషఁగూర్చి మృదుసూక్తులఁ గైతరచించుపూర్వపుం

ఘనుల ప్రబంధ శైలిని సుఖంబుగ నీకవులాక్రమించి రం
చును వచియించుటల్ సహజసూక్తియె దబ్బరకాదు కాదిలన్

ప్రస్తుతంబువిడచి పల్కినపల్కుల
సైచవలయు భవ్యశతవధాన
చాతురీమహత్త్వ సంస్తవ మొనరింతు
మాలకింపుఁడీ నయాఢ్యులార!

## ఉత్పలమాలిక

కందువమాటలున్ జిగి నిగారపుచేఁతలు జిగ్గునిగ్గు పెం
పుం దనరార నాయకుని ముందనువొందు నవారవిందనే
త్రం దలపించుఁగైత తనుదానె వరించుటఁజేసి సద్యశం
బందిచెలంగి నేఁటిసభయందుఁ గవీంద్రులు భూపురందరుల్
డెందములందు మోదమువడిన్ జివురింపఁగ మెచ్చుమమ్ముబోం
ట్లం దతమోదవాక్యముల నాణెముగాఁగడుఁ దేల్చి కోరిన
ట్లెందఱకెన్ని పద్యములో యెట్టులనుండిన మేలుమేల్ రసం
బందునఁబుట్టునట్లె వెఱఁగందఁగఁదెల్పె నిఁకెట్టులెందునేన్
గందుమె విందుమే సుకవి కాండములో నిటువంటివానిసం
క్రందన రత్న రాజులును రాజమణుల్ మగఱాలుముత్తెముల్
వందలు వేలులక్షలయి వర్షముగాఁ బడినట్లు పద్యకో
టిం దగులీలఁ బైవిసరి తీవవధాన మొనర్చెఁ దమ్మిఁడా
నందముతోడఁ బజ్జఁదగ, నవ్వులకేనొరుసాయమంద కే
మందు మమందధీబలవిహారుఁడు ధీరుఁడు సుబ్బరాయఁడే
మిందులకొక్క మాలిక మెయిన్ రచియించితిమబ్బురంపుఁగై
తం దిలకించినట్టి గుణధాములకిద్ది హితంబెకావునన్

అరయంగ మీవంటి యవధానులీలోక
 మందు లేరంచు నే నందుమిగుల
నిట్టికవితఁజెప్పు నట్టివారీలోక
 మందు లేరంచు నే నందుమిగుల
నిన్నిబిరుదులను గొన్నవారీలోక
 మందు లేరంచు నే నందుమిగుల
నిట్టులీజయఘంటఁ గట్టువారీలోక
 మందు లేరంచు నే నందుమిగుల

మఱియు మీరలు కవితను మన్ననంబుఁ
జేయుచున్నారఁటంచును జెప్పఁగలను
మిమ్ముఁబోలెడు కవులు లోకమ్మునందుఁ
బరులెవరు లేరటంచు నేఁబల్కఁగలను

మిమ్ము నుతియింప నాకుఁ దరమ్ముగాదు
కలహభోజనుతండ్రికిఁ గాదుతరము
పాపరేనిమాట తలఁపనోప దట్టి
తమకు స్వాగత మియ్యది దయనుకొనుఁడి

మోముఁజూడంగఁజంద్రుని గోముఁబోలుఁ
గవితఁజూడంగఁబెద్దన్న కవితఁబోలు
ధైర్యమదిచూడ దశరథ తనయుఁబోలు
మాటయొకటియె యమృతంపు తేటఁబోలు

మీదుసభ యనుమాత్రాన మిక్కుటముగ
జనులు సంభ్రమ మొందుచుఁ జక్కఁగాను
వీరలు చిరాయురున్నతి వెలయుచుందు
రనుచునున్నార లీగ్రామ మందునిజము

కొప్పరపుకవులార మీ గొప్పతనము
నింతయని వర్ణనముసేయ నెవరితరము?
కాని నాచేతనయినంత గాను నాదు
సంతసంబును వెల్లడి సల్పుకొంటి.

### శ్రీమాన్ వింజమూరి రంగాచార్యులుగారు

నలువ ముఖంబుల నెప్పుడు
నలువుంగను పలుకు చెలువ నలువకొలంబన్
కలశోదధి కిందు లనన్
మెలఁగుట భావ్యంబెకాన మీకడ మెలఁగున్

శతఘంటకవనమ్ము సల్పఁజూచినయెడ
మూర్తికవులటంచుఁ బొగడవచ్చు
అష్టావధానమ్ము నాచరింపఁగఁజూడ
వేంకటార్యులటంచుఁ బిలువవచ్చు
ఆశుధారాకవిత్వాధిక్యమును జూడ
నలపెద్దనకవీంద్రు లనఁగవచ్చు
ముద్దుముద్దుగఁ జెప్పు ముఖ్యస్థితిని జూడ
దిమ్మనకవులంచుఁ దెలియవచ్చు

సంస్కృత శ్లోకమున కాంధ్రసరణిఁ దెల్ప
నల్ల శ్రీనాథకవిరాజు లనఁగవచ్చు
నహహా! యేవిషయముఁ జూడ నత్యధికులు
ననఘులగు కొప్పరపు కవులంద్రు బుధులు

అరయశతావధానముల నంచితరీతిని జేయనేర్తుమం
చఱచెడివారు కొందఱనినట్లుఁ జేయరు సత్కవిత్వ సుం
దరియును ధారణాసతియుఁదత్పరతన్ మిముఁబొందిరెందునన్
దరుణులు వృద్ధులన్విడి ముదంబున యౌవనులందుటబ్రమే

ధోరణికి లోపమింతయుఁ దోఁపదయ్యె
ధారణకు నంతకంటెను మేరలేదు
కాన మీయవధానమే పూనఁదగును
వాస్తవావధానమను ప్రశస్తినవని

వర్ణనాతీతమైన పావన విచిత్ర
రీతి నవధానమొనరించి ప్రీతిఁగూర్ప
నెల్ల నిష్పక్షపాతుల కెదలఁగూడె
మాటలను దెల్పరాని సమ్మదము నిజము

కూరిమి గూరిన యంతనె
గారవమునఁ బద్యములను గల్పించియు నీ
తోరంపుఁగీర్తిచంద్రున
కారయ నూల్పోఁగునీయ నగునని తోఁచెన్

తోఁచినంతనె పద్యసందోహమల్లి
పారితోషిక మొసఁగితిఁబ్రణుతిఁజేసి
దయను గైకొండు దీని వధానులార!
బుధవినుతులార! కొప్పరపుకవులార!

శ్రీరంజిల్లఁగ భక్తమానస మహా సింహాసనాసీనుఁడై
కారుణ్యంబున సర్వలోకములఁ దాఁ గాపాడుసర్వేశు సీ
తారామున్ గరుణాలవాలు, హరి నిత్యానందసంధాయి నే
నారాధింతుఁ జిరాయురున్నతులు మీకశ్రాంతముంగూర్పఁగన్

భక్తిఁదెలిపెడి పుష్పంబొ ఫలమొ లేక
యెద్దియైననుజేకొని యేగి మఱియు
బెద్దలను జూచితా సమర్పింపవలయు

ననెడు లోకోక్తికొలఁది పద్యప్రసూన
దామ మొసఁగెద మీరిది దాల్పుఁడయ్య!

మీకుఁదగినట్టి బహుమతుల్ మెప్పుకొలఁది
నియ్యఁజాలని బడుగును నెయ్యముననె
యియ్యెడను దీనిఁ గైకొనుండయ్యలార!
కొండయంతటి జేజేకుఁ గొండయంత
పత్రమిడునట్టి శక్తి యెవ్వనికిఁగలదు?

శతఘంటకవితకు శక్తులు దామెగా
కితరులు గారని యెంచుటెల్ల
సుకవిశబ్దమునకై శోధించిచూచినఁ
దమకెకద్దనిచెప్పు ధైర్య మెల్ల
గురువులుశిష్యునిఁగూర్చుండఁబెట్టి సం
స్తవమునుజేయు ప్రసక్తి యెల్ల
కవిరాజులందఱు కాకవులగుచును
బల్లెలఁజేరిర న్పలుకులెల్ల

వ్యర్థమైపోయి ప్రత్యర్థు లణగిపోవఁ
జక్కఁగాఁజెప్పినట్టి మీ సరసకవిత
నెటులవర్ణింపఁగలనొ నాకెఱుఁగరాదు
పూర్ణదయఁగొనుఁ డీపద్య పుష్పమాల

ధారణదప్పకుండ నవధానము జేయఁగ వీరశక్తులం
చారయలేక మిమ్మిట ననార్యతఁబల్కినదెల్లమీదువా
గ్ధోరణిధారణాగరిమఁ దొల్లిగనుంగొనకుంట లేనిచో
నేరికిఁబల్కవచ్చుఁ దమరిచ్చుట నేటిదినంబునందు వి
స్ఫారకవిత్వమాధురిని సభ్యులఁదన్పితి రేమియందు, నే

నారయకుండమున్ను జనులాడెడుమాటలఁ గొంతనమ్మి మే
ధారుచిమీఱు నట్టికవితల్గని సంతసమంది యింక ని
ర్ధారణఁజేయలేక తమధారణశక్తినిఁగూడఁ జూడఁగాఁ
గోరుచునుండఁ గాళ్ళకుఁదగుల్కొనుతీవియవోలె మీరలీ
యూరనె సంతసంబడర నోరిమిఁజేయువధానమిప్డు దు
ర్వారముగాఁగఁగాంచితిని బాలసరస్వతులన్నమీ కెగా
కేరికిఁజెల్లు నీభవదహీన కవిత్వ మదింతెగాక వా
గ్ధార తలంగనీక బెడిదంబగుశబ్దము దొర్లనీక నీ
తీరునఁజెప్ప నేరికగు తీవ్రతరంబుగ గంగ యార్భటిన్
ధారుణిపైకి వచ్చెడివిధంబును దోఁప శిరంబుపై బుధా
ధారుఁడు శంభుఁడేక్రియ సుధాకిరణుం దగఁదాల్చె సద్యశో
భారము మీరలట్టులె సభ ల్దనియంగ ధరించియుంటిరీ
నేరుపుఁజూడఁ బూర్వకవినేతలనాకుఁ దలంపనయ్యెనో
భారవులార! మీకవనపక్కియు నాకుముదంబుఁగూర్పనా
నేరిచినట్లుపల్కితిని నిక్కము మీరిఁకఁ గీర్తిఁగాంచఁగా
భారతవంశవర్ధనుఁడు పాండవమిత్రుఁడు కృష్ణుఁడేలుతన్
(ఇట్లుపద్యములఁజదివిన కవి తనపద్యములువ్రాసిన కాగితముమీద పేరువ్రాయలేదు)

### బ్రహ్మశ్రీ పుట్టంరాజు వరదయ్యగారు, కాలేజి విద్యార్థి

శ్రీరామామణి యెల్లకాలమును మీ శృంగార గేహంబునన్
గారుణ్యంబునఁ బెంపుఁ గాంచుత, లసద్గాంభీర్యధైర్యంబులన్
బేరున్ దెచ్చుచు వన్నె వెట్టఁగ భవద్విద్యాధికత్వంబుచేఁ
జేరన్ రారిఁకధూర్తశత్రులు కవీట్సింహాంక విభ్రాజితా.

అచ్చెరువౌట మీసుకవితార్భటిఁ జూడఁగమోదమందివి
ద్వచ్చయమెల్లముక్కుపయిఁ దప్పకనుంచిన వ్రేలుఁదీయ కే

యెచ్చుటిధారణాగరిమ మెట్టిమహత్త్వమటంచు భ్రాంతిమై
మెచ్చుకొనంగడంగెనిటు మేలుసెబాసని వేయిభంగులన్

అరయ నవధానమనునట్టి యంబుధి నిటు
సరకుసేయక తరియించి మెఱపుఁగంటి
వన్యదుర్లభమైన నాయాంజనేయుఁ
డల్ల వారిధిదాఁటఁడే యనఁగ బుధులు

## బ్రహ్మశ్రీ గంగరాజు పున్నయ్యగారు

విబుధవర్యులు మీదగు విద్యఁజూచి
హెచ్చుగా మెప్పులిచ్చుచు మెచ్చినారు
భక్తిమై నేనొసంగెడు పద్దెము లన
సంద్రమున కర్ఘ్యమనియెడి చందమెకద

భారతి సత్కృపారతి స్వభావవిశేషముజూపెవహ్వా వీ
రేరహి దొంటిజన్మమున నింపలరారఁగ నామెఁగొల్చిరో
కారణమేమొయాజనని కారుణికత్వమునూనివేడ్క మై
సారెకువీరెపుత్రులని స్వాంతమునందున నిల్పెఁగావునన్
ధారణనిల్వ కేమి యమితంబగు ధోరణిపుట్ట కేమి యీ
ధారుణి దుర్జనాళి పరితాపము నొందుట కేమి వీరికిన్
మాఱుగలారెయంచుబుధమాన్యులుసంతసమొందునట్లుబల్
నేరుపుఁజూపి చక్కఁగను నేఁడు వధానముఁ బూర్తిఁ జేసి గా
థా రచనావిలాసము సుధారసతుల్య మొనర్చితౌ భళీ
సూరిజనస్తుతోరుమతిశోభిత వేంకట సుబ్బరాట్కవీ.

p p p p p p p

## చీరాల శతావధానము

### పీఠిక

సత్యబంధులారా! రసికోత్తంసులారా!

జగత్ప్రసిద్ధులును శ్రీమద్బాలసరస్వత్యాశుకవిసింహాది బిరుదాంకితులు నైన బ్రహ్మశ్రీ కొప్పరపు సోదరకవి శిఖామణులు 15-10-1911 తేదీన మా చీరాల, పేరాల గ్రామవాసులయిన విద్యాభిమానులచే నాహూతులయి మా చీరాలకు దయచేసిరి. వారు ధూమయానము నెక్కివచ్చి మాయూరి రైల్ స్టేషనునందు దిగునప్పుడు మాయూరివారలును వారిని దర్శింపవచ్చిన యితరగ్రామ వాసులును గుంపులు గుంపులుగా వారినెదుర్కొని కరతాళధ్వనులచేతఁ దమయానందం బెతిఁగించుచు దర్శనోత్సవంబు జరిపిరి. అట్టి సమయమున మాపురవాసులు ముందుగా నీక్రింది విధముగా స్వాగత పద్యములను జదివి కవి చక్రవర్తుల యాశీర్వాదంబుంజెందిరి.

స్వాగత పద్యములు

శ్రీమదాశుకవిసింహబాలసరస్వతి కుండినకవిహంస కవిచక్రవర్త్యాది బిరుదాంకులగు బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకటసుబ్బరాయ, వేంకటరమణ కవీశ్వరుల సన్నిధికి -

శ్రీకర కొప్పరంపుకుల సింధుసుధాకర మూర్తులార! వి
ద్యాకలితాత్ములార! సరసాశుకవిత్వ పటుత్వవైదుషీ
ప్రాకట మల్లికా కుసుమ పాండుర నిర్మల కీర్తులార! లో
కైక కవీంద్రులార! యిదె యందుఁడి స్వాగతపద్యమాలికల్

స్వాగతంబిదె మీకు ఫణికులేంద్రస్తవ్య
ప్రకటాశు కవి చక్రవర్తులార!
స్వాగతంబిదె మీకు శారదారూపులై
యలరు కుండిన కవిహంసలార!
స్వాగతంబిదె మీకు భవ్య విద్వద్వరే
ణ్య వినుతాశుకవిసింహాంకులార!
స్వాగతంబిదె మీకు బాలసరస్వతీ
త్యాదిక వరబిరుదాఢ్యులార!

స్వాగతంబిందు చందన పారిజాత
గాంగ డిండీర పాండుర ఖ్యాతులార!
సోదర కవీంద్రులార! విశ్రుతనియోగి
వంశమణులార! బుధులార! స్వాగతంబు.

కవితాలతాంగి మక్కువమీర నెవ్వారి
రసనాగ్రసీమ నర్తనముఁ జేయు
స్వామి సత్కార్య తత్పరత యెవ్వారికి
నుగ్గుబాలై సతంబొప్పుమీఱు
భవ్యసత్పురుష సంభావ్యమానధనంబు
వసుధనెవ్వారికి భాగధేయ
మతులోపకారి వర్ణితవదాన్యత యేరి
హృదయ సంస్థానము ల్పదనసీమ

లట్టియార్వేలవారి వంశాంబురాశి
యందు సంపూర్ణ హిమధాము లనఁగఁ జెలఁగు
రమణసుబ్బాఖ్యులార! సత్రపాఖ్యులార!
సదయమతిఁ గైకొనుండిదే స్వాగతంబు

శ్రీపీఠికాపురీ భూపాలవరునిచే
        నెనలేనియట్టి మన్ననలఁ జెంది
మణికొండ నృపసభా మండపంబునయందు
        రాజితలీల గౌరవముఁబొంది
నెల్లూరుపురిని సంపల్లీల నాశుక
        వీంద్రసింహాభిఖ్య నెసకమంది
చెన్నపురీవరాశేష విద్యానాథ
        వితతిచే మేటి సన్నుతులనొంది

షట్సహస్రనియోగి వంశప్రదీపు
లగుచు నాశాంతదంతురితాచ్ఛకీర్తి
సాంద్రులగు సోదరకవీంద్ర చంద్రులార!
సరసమతులార! మీకిదే స్వాగతంబు

కవిలోకపద్మసంభవుఁ దిక్కనామాత్యుఁ
        గారామెలర్పఁగాఁ గన్న తల్లి
సహజపాండిత్య విశారదుఁ బోతనా
        ఖ్యాకుని గారాలఁ గన్నతల్లి
యలికాక్షమును డాఁచి యవనిఁ జేరినసోముఁ
        గవిలోకసోమునిఁ గన్న తల్లి
భువనపూర్ణ ప్రభాద్భుత తంత్రి మంత్రి భా
        స్కర కవీశ్వరుఁగూర్మిఁ గన్నతల్లి

ఆంధ్రదేశమతల్లి యర్ఘ్యమరవల్లి
మిమ్ముఁగడుపారఁ గని సఫలమ్మునయ్యె
సోదరకవీంద్రులార! విశ్రుతనియోగి
వంశమణులార! పండిత ప్రవరులార!

అలతుషార ధరాధరాగ్ర నిర్గతసార
వాహినీభంగ సంపదవహించి
పార్ధకార్ముకముక్త బాణపరంపరా
మితవేగ విస్ఫురద్గతివహించి
కమలబాంధవరథోత్తమ తురంగమ రయో
ద్ధత పద్ధతీద్ధ సంగతివహించి
యనుపమానాసమానానూన ధూమ శా
కటవేగ జాగ్రదుగ్రత వహించి

యెవరి మధురస పరిపాటి కవనధాటి
ముదముఁ బొదలించు విబుధోత్తములకు నట్టి
సోదరకవీంద్రులార! విశ్రుతనియోగి
వంశమణులార! మీకిదే స్వాగతంబు

కవితఁ జెప్పెడువారు గలుగరే పద్యాళి
మీరీతిఁ గుప్పంగ లేరుగాని
అవధానగరిమంబు నందరే యిటువలె
నూదినధారణ లేదుగాని
లలి సమస్యాపూర్తి సలుపరే పెక్కండ్రు
రసభావయుక్తి దొరకదుగాని
పాండితీభావంబుఁ బడయరే కొందఱు
సుగుణ సంపత్తులు సున్నగాని

కొప్పరంపుకులాంభోధి కువలయాప్తు
లార! భవ్యసోదర కవులార! రమణ
సుబ్బరాయాఖ్యులార! సంస్తూయమాను
లార! కొనుఁడయ్య మీకిదే స్వాగతంబు

రసమును భావమర్థమును రమ్యగుణంబును జాతిరీతిపెం
పెసఁగఁగఁజాతురీరచన లెంతయుసంతసమీనుచుండ, ను
ల్లసితకవిత్వకన్యక విలాస మెలర్ప మిమున్వరించి సం
తసపడి యో యనూనకవితావనితేశ్వరులార! స్వాగతం
బొసఁగెనిదే గ్రహింపుఁడు జయోన్నతిఁగాంచుఁడుదంచితస్థితిన్

శ్రీలఁజెలంగి సాధుజన సేవితులై యలరారునట్టి చీ
రాలపురంబువారు కవిరాజుల మెప్పులఁబొందినట్టి పే
రాలపురంబువారు నవరత్నములిచ్చిరి పద్యధార, ధా
రాళముగాఁగ నో విబుధరాజగురుప్రణుతాశు దివ్యవా
గ్జాలవిజృంభణోల్లసిత కవ్రమకవిత్వ విలాసులార! భూ
పాలక వందనీయగుణ పారగులార! శతావధానమే
ధాలయులార! రాజకిరణాంచిత సర్వదిగంత దంతురో
త్తాల యశస్కులార! యతిధన్యులకుం దమకర్థభక్తితోన్

చీరాల ఇట్లు,

15-10-1911 **చీరాల, పేరాల పురవాసులు**



ఇట్లు స్వాగత పద్యరత్నభూషణ భూషితులంజేసిన పిదప గుంటూరు, బెజవాడ, బాపట్ల, తెనాలి, వంగవోలు, మన్నవ మున్నగు పట్టణముల నుండి సభార్థమాహూతులయి వచ్చిన మహామహులును గూడరాఁగా వేలకొలంది జనులు తమ జన్మములు పవిత్రములయ్యెనని సంతసించి, జయజయ ధ్వానము లొనర్పఁగాఁ బుష్ప దామాలంకృతులయిన కవిచక్రవర్తుల నొక పుష్పరథంబునఁ గూర్చుండఁ బెట్టి యిరుగడలఁ జిత్రచ్ఛత్రయుగళంబును బట్టువారును జామరంబుల వీచువారును నై కొందఱు పరిసేవింప నూరేగించిరి. అయ్యూరేగింపు సమయంబు నందు "ఆశుకవి చక్రవర్తి" బిరుదవర్ణాంకితములయిన, విజయధ్వజములెత్తి కొందఱు ముందు నడిచిరి. బాలికలు గానంబొనర్చిరి. బాలకులు కోలాటంబాడిరి. మల్లులు కొందఱు తమ దేహ పరిశ్రమ విద్యఁగనుపఱచి వేడుకఁజూపిరి. ఇట్లు మంగళవాద్య ధ్వనులు పెల్లు చెలరేగ నూరేగింపు మహోత్సవంబు నెఱవేఱిన పిదప నాశుకవిత్వ ప్రదర్శనంబుచే నెల్లరానందము జెందిరి. ఆసభ కగ్రాసనాధి పతులుగా వంగవోలు మిషన్ స్కూలులోని పండితులును, సంస్కృతాంధ్ర భాషా పారంగతులునైన బ్రహ్మశ్రీ ముక్తి నూతలపాటి గోపాలకృష్ణ శాస్త్రి గారుండిరి. ఈయాశుకవిత్వసభ యనర్గళ ప్రవాహముగా సాగెను. మఱునాఁడును ఆశుకవిత్వమే కావలయునని మేము గోరితిమి గాని "అవధానమొనర్ప వలయునని మా యుద్దేశమని" కవిసింహులు తమయభిప్రాయముందెలుపుటచే, సభ్యులయ్యదికూడఁ జూడవలయు" నను నుత్సాహముతో నందులకొడంబడిరి. ఆనాఁటి యవధాన సభ యత్యద్భుతముగా నెఱవేఱెను. ఆ యవధాన సభకనేకులు విద్వత్కవివర్యులు చనుదెంచిరి. అట్టి విద్వాంసులలోఁ గొందఱు పృచ్ఛకులయి కూర్చుండి విషమ ప్రశ్నములనేకము లిచ్చిరి. అట్టి ప్రశ్నములన్నియు నీ కవిసోదరులు తృణ ప్రాయముగా నతిరస వంతములుగాఁ బూరించిరి. శ్రీ తిరుపతి వేంకటకవులు, నరసరావుపేటలో వృథగా బ్రహ్మశ్రీ బెల్లముకొండ రామరాయ కవీంద్రులనిరసించి వారి శిష్యులు తారసిల్లుటచే భయగ్రస్తులయి, ఆహ్వానముచేసిన వారి మర్యాదయైన

నెంచక పిక్కబలంబుఁ జూపించిరి. ఆ వృత్తాంతమెఱింగియో యెఱుంగకయో తదభిమానులు కొందఱు బాపట్లలో నదివఱకు సోదర కవీంద్రులొనర్చిన యాశుకవిత్వావధానముల కన్న మిన్నగా నొనర్పఁజేసెదమని శ్రీ తిరుపతి వేంకట కవుల నాహ్వానముజేసి సభ గూర్చిరి. అందాశుకవిత్వము పేరెత్తినంతనే వారు తబ్బిబ్బుతో నేలవచ్చితిమి దేవుఁడాయనుకొని తమ కృత్రిమపు సభలు నేఁడు బైటపడునని కాలనేమియుక్తులతో నాశుకవిత్వమును దప్పించుకొని యవధానమను పేరుతో నొక సభఁగావించిరి. సోదరకవులపైఁ దమకుఁ బ్రతిగా గంటలుగట్టి కొంటిరఁట .... గెంటెదనని దూఁకిన శ్రీశివరామశాస్త్రిచే నాశుకవిత్వముఁ జెప్పింపఁదలఁచి ముందఱకు నెట్టి సభ్యులఁగథ కోరుకొనుండనఁగా సభ్యులు రామరావణ యుద్ధంబుఁగోరిరి. అంతట నా బాలకవి యీ కథలో మేటరులేదు. కావునఁ జెప్పుటకు వీలులేదనఁగా "జననంబాదిగా నేల చెప్పరా"దని వేంకటశాస్త్రి గారూత యొసంగిరి. అంతట నా శివరామకవిగారు, "రాళ్ళచేనిలో గుంటక దొల్లించి"నట్లు ప్రాసవిశ్రమముల దూరముగాఁ బాఱఁజిమ్ముచు నాశుకవిత్వమునఁ బ్రాసవిశ్రమము లవసరమ్ములేదని శాసనంబుఁ జేయుచు రసాభాసమొనర్చి గంటకుఁ బదియాఱు పద్యములనల్లిరి. వేంకటశాస్త్రిగా రంతటఁ దమ్ముద్ధరింప వచ్చెనన్న విశ్వాసమయినలేకుండ నిజమాడిన నిష్ఠురమనియైనఁ దలంపక "ఇఁక కథ నే గోదావరిలోనో గంగలోనో కలిపితివి" చాలులేయని పరిహసించిరి. శ్రీ తిరుపతి శాస్త్రిగారు, పిదపఁ దామొక గీతపద్యము మొదలుపెట్టిరి. అంతట వేంకట శాస్త్రిగారును గలిసి చెఱియొక పాదముగాఁ ......... చేయంగల విన్నపములనునట్లు చెప్పి శిష్యునకుం దమకుంగల తారతమ్యంబును నాశుకవిత్వంబునఁ దమకుఁగల ప్రజ్ఞయు సకలజనంబుల కెఱింగించిరి. అవధానమందైన సోదర కవులఁ బోలఁజాలరా యను తమవారి సంతోషమంతయు భంగము చెందునట్లు తొలి నాఁడవధానమునఁ ప్రశ్నములిచ్చిన పృచ్ఛకుల కసంతుష్టిగాఁ గొన్నియడిగిన ప్రశ్నములమార్చియుఁ గొన్ని వీలు లేదనియుఁ జెప్పి తమ చాకచక్యంబుఁ గనుపఱచిరి. వారవధాన సమయమునఁ జెప్పుటకు వీలులేదని విడచినవియుఁ, జెప్పినవియుఁ గొన్ని దిక్ప్రదర్శనముగా నీ క్రింద నుదహరించితిని.

1. కరోమి, కవయామి, వయామి, యామి అను పదములనుకరణము లేకుండ మీయిష్టమువచ్చిన వృత్తములోఁ జెప్పుఁడన యుభయభాషా ప్రవీణులు, ఆంధ్రంబున నెక్కువ ప్రవేశముగలవారు చెప్పవలయుఁగాని మేము చెప్పలేము మాకశక్యమని దానిని వదలిరి.

2. ఈసోదరకవులచేఁ జేయఁబడిన యవధాన పద్యములలో 5, 11 పద్యముల తాత్పర్యమును మీయిష్టమువచ్చిన పద్యములుగాఁ జెప్పుడన నవియిప్పుడసాధ్యమని త్రోసివేసిరి.

3. రంభముగడుపారమెక్కె రవితాపమునన్, అనుసమస్యఁ బాడుచేసిరి.

4. దీపముతలమీఁదయీఁగ ధీరతవ్రాలెన్ - అను సమస్యను దీనతయని దిద్దికొనిరి.

5. దారము లేకున్న బ్రతుకఁ దరమే మనకున్ - అను సమస్యను ధారము అని మార్చిరి.

ఇట్లెట్లో అవధానమంతమందిన మీఁదట మరలఁ బద్యములఁ జదువుఁ డని సభ్యులు కోరిరి. అంతట భోజనమొనర్పఁ బ్రొద్దుపోయినదనియు, నవధా నాంతమున బద్యములు చదువకున్న లోపము కాదనియు, వేంకటశాస్త్రిగారు చెప్పిరి. అందుల కొడంబడక సభ్యులు చదువుఁడని మరలఁగోరఁగా నమస్కార బాణములచేఁ దప్పుకొనుట తటస్థించెను.

ఈ విధముగా నాసభలో వారు సభ్యుల యనుగ్రహమునకై ప్రార్థించిన ప్రార్థనము లిందు వివరింపఁ బడవు, కాని సోదరకవీశ్వరులను మెచ్చి కవివర్యులు కొందఱు చెప్పిన పద్యములచే నవ్విషయములన్నియు విశదపడఁగలవు. అట్లు తిరుపతి వేంకటకవు లసాధ్యములని, వదలివేసిన ప్రశ్నములన్నియు నీ సోదర కవి శిఖామణులచే నతిరసాలవాలముగాఁ బూర్తిచేయఁబడెను. అవియన్నియుఁ దూచా తప్పకుండఁగాఁ జదివి వినిపించుటచే మహానందముఁజెందిన సభ్యులందఱు నీసోదరకవి సింహుల ననేకవిధంబుల స్తుతించి నూటపదాఱులిచ్చి బహూకరించిరి.

గుంటూరులో నవసరముగా నసూయావిశేషముచేఁ దిరుపతి వేంకటకవులు తమ్మునిందించుటచే నీసోదరకవులు వారినిఁ గూర్చి కొన్ని ప్రతిజ్ఞా పద్యములఁజెప్పిరి. అందుకొన్నిటినిందుఁ దెలుపుచున్నారము.

**ప్రతిజ్ఞా పద్యములు**

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకట కవీశ్వరులకు

తిరుపతి వేంకటేశ కవిధీరుల కియ్యది విన్నపంబు కొ
ప్పరపు శతావధానులను వారలలో నొకరుండ నాత్మలో
నిరతము మీరు మున్నొసఁగు స్నేహము నిల్పఁగఁగోరువాఁడ మీ
పరువును మాపు మాటకు జవాబు నొసంగిన వాఁడ నమ్ముఁడీ.

చెన్న పురంబునందు మఱి చెప్పఁగ నొప్పెడి పట్టణంబులం
దెన్నఁడు మిమ్ము చూడకయె, యేము ప్రసంగ వశంబునన్ మిము
న్మన్నన చేసినామనెడి మాట నెఱింగియు, మమ్ముఁబూర్వమే
సన్నుతిఁజేసి నేఁటి సభ శాంతము వీడి వచించు టేమొకో.

మీరును మేమున్ మైత్రిన్
బేరుంగొనినార మనుచు విమతులు నడుమన్
జేరి కుయుక్తులు పన్నిన
యారీతి నెఱుంగ కట్టులాడందగునే

అన్యుని సహాయ మించుకయైన లేక
పద్య మవధానమందుఁ జెప్పంగలేని
మీ మహాధారణాశక్తి మీకె కాక
యెల్ల వారికి నీ సభ నెఱుక పడియె.

ఆశుకవిత్వంబు నల్లఁబూనెదరేని యద్దాని మించి చేయంగలేమొ
అష్టావధానంబు నాచరించెదరేని యద్దాని మించి చేయంగలేమొ

శతఘంట కవనంబు సల్పఁబూనెదరేని యద్దాని మించి చేయంగలేమొ
నేత్రావధానంబు నేర్పు జూపెదరేని యద్దాని మించి చేయంగలేమొ

ఆంధ్రమున నిన్ని యన్ని పద్యములటన్న
నింతకాలంబులోనన్న, నిందఱన్న
నిట్టి వర్ణోత్కరంబన్న, నేమి వెఱపు
తెలుఁగు మీసంబు నిలుపంగఁ దివురుఁడింక.

చెప్పిన వన్ని చేసెదము, చింత యొకింతయు లేదు వెంటనే
చెప్పుఁడి యుత్తరంబు, సభచేయుటొ చేయక మారు వ్రాయుటో
తప్పక వ్రాయఁగావలసె, ధర్మమె గెల్చునఁటంచు నమ్మి నా
తప్పొకయింత లేమి, యిది ధార్మికులందఱెఱింగి యుండుటన్.

గుంటూరు, ఇట్లు,
20-8-1911 **కొప్పరపు వేంకటసుబ్బరాయశర్మ**, శతావధాని.

ఇట్లు ప్రతిజ్ఞా పద్యములంజెప్పిన వీరిశక్తినిఁబ్రత్యక్షముగాఁజూడఁగోరిన మా చీరాల పేరాల పురవాసులకు నీ సోదర కవిచక్రవర్తులు పరమానందంబును గూర్చిరి.

అట్టి అవధానిపంచాననులను; మరల మంగళవాద్యములను, ఆవిరి దీపములను, మహానందంబు సంఘటింప నూరేగించిరి. ఆ సమయమునఁ బౌరులందఱును గర్పూర నీరాజనాదుల సమర్పించి పవిత్రులైరి. ఇట్లు మమ్మందఱ నమందానంద భరితులఁజేసిన శ్రీ బాలసరస్వతులకు భగవంతుఁడు దీర్ఘాయుర్భాగ్యంబు లొసంగుఁగాత!

ఇట్లు,
**ఉలిచి పిచ్చయ్య**
**మునిపల్లి వేంకటసుబ్బయ్యశర్మ**

# చీరాల శతావధానము

**(15-10-1911)**



శ్రీరాజత్కరుణావలోకనములన్ జెల్వొప్పవీక్షించుచున్
ధారాశక్తికిధారణాధృతికి దైన్యంబింతరానీక యూ
రూరన్ బట్టణసీమలన్ బనిచి యీయుద్యోగమేనిల్పుటన్
జీరాలన్ సభనిప్డుఁబ్రోవఁగదె వాసిన్ భర్మదుర్గాంబికా.

1. బ్రహ్మశ్రీ బెల్లముకొండ రామరాయకవీంద్రులను గుఱించి

అత్యుగ్రకుకవి పంచాననంబులు పలా
　　　　యనమంద శరభాంక మందినాఁడు
సకలాభినుత శబ్దశాస్త్ర పారావార
　　　　మున కగస్త్య ఖ్యాతి బూనినాఁడు
అఖిలాగమాంత రహస్యార్థమునకు ది
　　　　వ్యాంజనంబగు ప్రజ్ఞనందినాఁడు
భవ్యబెల్లముకొండ వంశ వంశమునకు
　　　　ముక్తాఫలంబనఁబొసఁగి నాఁడు

శిష్యసమితికి విద్యలు చెప్పినాఁడు
గురుయశంబందినాఁడు శ్రీకొండవీటి
సీమ కాభరణం బనఁజెలఁగినాఁడు
రామరాయాఖ్య సుకవిసుత్రాముఁడిపుడు.

2. కొండవీటి సీమ

కోటీశ్వరస్వామి గూర్మిఁగాంచుటఁజేసి
యైశ్వర్యమున సందియంబులేదు
మందు మూఁకులగిరుల్ వందలుండుటఁజేసి
యారోగ్యమునకింత మేరలేదు
ఓంకారనది కృష్ణ యొరసి పాఱుటఁజేసి
యతి పవిత్రతకు లోటనుటలేదు
సుకవి పండితరాజ నికరముండుటఁజేసి
విద్యాభివృద్ధికే వెఱపులేదు
కాన నెన్నంగఁబడియె సత్కవులచేత
సకల పండితపామర జనులచేత
జగతిఁగల సీమలకు నెల్లఁజందమామ
విపుల సుఖ భూమ మాకొండవీటిసీమ.

3. శుద్ధవిదియనాటి చంద్రరేఖ ఒకరిచ్చిన కల్పన

మేలున్ గూర్చెడిశుద్ధమందు విదియం బెంపొందుశీతాంశునిన్
హాళింబోల్చెదఁ జిత్రవర్ణములచేఁ హర్షంబునుంగూర్చుపం
జాలోమ్లేచ్ఛులుపీర్ల పండుగను జేర్చున్ దళ్కుచే వంకయౌ
లాలాసాహెబుపీరుతోడ నభమెల్లన్ బంజయంచాడుచున్

4. కవులను గౌరవింపవలదను వారికిశిక్ష

సారతరార్థ సంపదలు జాలులు వాఱఁగ శారదాకృపన్
దీరిన సత్కవిత్వమునఁదేజువహించు కవీంద్ర చంద్రులన్
గూరిచి సత్కృతుల్ జరుపఁగూడ దటంచను నీచు ధర్మ్మడెం
దాఱని దుఃఖసంచయము లంటఁగఁ జేసెడు మంటఁ గాల్చుచున్.

5. పద్యమునకుఁ బ్రతిపద్యము

అలదానిమ్మ యిగుర్లనయ్యలరు దంతాళిన్ గరచ్ఛాయమై
తెలివిన్ బోలఁగనెంచి కాకునికి నెంతేనాది మధ్యాంతముల్
వెలియా దేవునిగొల్చి యట్లయయి యాబింబోష్ఠిమేల్ గబ్బిగు
బ్బలధమ్మిల్లమునున్ వళిన్ దొరసి శోభన్గాంచె నిష్టాప్తిగన్

6. బాల్యమున వితంతువైన కాంత

చేరలఁగొల్వఁగాఁదగియుఁజిన్నెలువన్నెలుమించుకన్నులున్
సారసవైరిసౌరు నెకసక్కెముసల్పెడియాస్యమన్నిటన్
దీరిన సుందరాంగములు నెమ్మినెసంగిన నేమి? దుర్గతిన్
గూరిమిదూరమైమగఁడు కోల్పడ డీల్పడియున్న కాంతకున్

7. కైలాసము

అల నీహారధరాధరేంద్రసుత యొయ్యారంబుఁ జూపింప ను
జ్జ్వల మోదంబున దేవవాహినియు గ్రేవన్నిల్వ దేవేంద్ర ము
ఖ్యులు కైవారము లాచరింపఁ బ్రమథుల్ గొల్వంగ శంభుండు సౌ
ఖ్యలసత్ప్రాభవ మొందఁ జెన్నుగను నాకైలాస మెన్నందగున్.

8. అవధాన సభను గతించి

నేఁడేయొక్క శతావధాన మిచటన్నిర్విఘ్నమై సాగునం
చాడాడన్ దగుసజ్జనుల్ గనఁగరానత్యంతమోదంబునన్
గూడన్ జేరినపౌరులిట్టిసభయందున్ గొంటెనుం బోలుచున్
బాడౌ వానయొకండువచ్చి చనెనంబా! నీకటాక్షంబుచే

9. సమస్య : కమలబాంధవుఁడేతేరఁ గలువ విచ్చె

జంపతులకాత్మ మోదంబు సొంపునింప
జారచోరుల గుండియల్ సంచలింప

విదిత రుచి మీఱ రోహిణీ హృదయ కమల
కమలబాంధవుఁ డేతేరఁ గలువ విచ్చె

10. సమస్య : దీపముపై నొక్కయీఁగ ధీరతఁ్రవాలెన్

భూపాలు కేళిగృహమున
దీపములై శోణమణులు దీపింప దురా
శాపటిమఁజేసి తన్మణి
దీపముపై నొక్కయీఁగ ధీరతఁ్రవాలెన్

11. పద్యమునకుఁ బ్రతిపద్యము

ఆ సుమగంధి వేణిరుచి కంబుధరంబెనగాక యోడి లో
గాసిలి రెండుఖండములుగాఁగని, తత్సుపదాంతరంబునన్
భాసిలుచున్న వారగుటఁబట్టి తదంశములన్ గ్రహించి వే
వేసరిపోల్చి రాబుధులు వీక్షణపాళిఁబయోధరంబులన్

12. ఈఁగ

తన కేమి యొరగకుండినఁ
గన లేకొరుసౌఖ్యమడపఁగా నెంచు దురా
త్మునిఁబోలి యీఁగ యన్నముఁ
దినునెడ లోదూఱి, నరుని తేఁకువఁజెఱచున్

13. సమస్య : కవికొప్పునె సర్వలోక కాంత రవిరుచుల్

ప్రవిమల గతి సారసచయ
ము విలాసముఁజెంద జగము పొగడఁగఁ దిమిరం
బవలఁ బడఁద్రోయుటను ఘూ
కవికొప్పునె? సర్వలోక కాంత రవి రుచుల్

14. కరము అనుపదము నాలుగుపాదముల వచ్చునట్లు స్త్రీవర్ణన – మహాస్రగ్ధర

కరమున్‌బోల్పంగ నెమ్మేన్ గరిమనుగొనియెన్ గంధసంపుష్టదంతీ
ట్కరమున్‌బోల్పంగనూరుల్ గణుతినిగనియెన్ గాళమైయొప్పుదర్వీ
కరమున్ బోల్పంగనెంతేఘనతను గొనియెన్ గాటమౌవేణి క్షీరా
కరమున్ బోల్పంగ నవ్వాకలికికిఁదనరెన్ గావ్యకృద్వర్ణనాప్తిన్

15. ప్రస్తుత సభ – మందాక్రాంత వృత్తము

సారప్రజ్ఞాన్వితులువిబుధుల్ క్ష్మాసురుల్ కూడియుండన్
మేరంగాంచన్ దగనిసిరులన్ మీఱువైశ్యుల్ సెలంగన్
దోరంబౌ వేడ్కఁదనరెడి శూద్రుల్ గడున్ జేరియుంటన్
జీరాలన్ హెచ్చునుగనుసభన్ జేయుచుంటిన్ సుధీంద్రా

16. రైలుదప్పినవాఁడు – అచ్చ తెనుఁగు

ఉన్నదిచాలఁగాఁబనియు నున్నదిపోయెడియూరుదవ్వునన్
జన్నదిగుప్పుమని నల్లడలన్ బొగయేగ బండియ
న్నన్న యొకింతకూడయిన నాఁకటికీయెడ వేయకుంటి నే
తెన్నును దోఁచదాయెనని తిర్గునొకండు తలంపుకీడ్వడన్

17. సమస్య : రంభముఁగడుపార మెక్కె రవి తాపమునన్

అంభఃపానంబున సం
స్తంభింపని జాఠరాగ్నిఁ జల్లార్పఁగ సం
రంభమును బూని యొకఁడు క
రంభముఁ గడుపారమెక్కె రవి తాపమునన్

18. అభిసారిక – నది

గారంబైన విలాససంపదలులేకన్ దోడునున్ లేకయే
దారిండొంకయుఁ గాంచఁబోవక కడున్ ధాత్రిన్ విడంబించుచున్

దూరంబందునఁగల్గునాయకుని సంతోషంబులన్ దేల్పఁగాఁ
జేరుంబో యభిసారికాంగన ధునీశ్రేష్ఠంబు ప్రజ్ఞానిధీ

19. ఐకమత్యము లేకపోవుటవలన నష్టము

ఒక్కనిమాటయన్నమతియొక్కఁడు కోపముఁజెందునంత వే
ఱొక్క విధంబుగాఁదలఁచి యొయ్యనఁబాడొనరింపఁజూచుఁ బై
నక్కట యైకమత్య మనునట్టిది లేశముగల్గకుంటచే
నిక్కలికాలమందు నిదియే యిఁకనున్న జగంబడంగెడున్

20. చంద్రుఁడు - పొన్న చెట్టు

సారతరోక్తులన్ శశినిఁజక్కనిపొన్నకుఁబోల్చుమంచు నిం
పారఁగఁబల్కినావు శశియందలిమచ్చయె యాకుజొంపమై
తారకలెల్ల నిండుప్రమదంబిడు సూనములై రహింపఁగా
భూరుహమొప్పుఁ జంద్రుఁడనఁ బొల్పెసలారుచు ధీరనంద్యమై

21. కొప్పోలు, ఒంగవోలు, దశరాజుపల్లె కర్వది యను యూళ్ళపేరులు వచ్చునట్లు భారతకథ

చాలఁగసైన్యముండవలె సంగరముంబొనరింపఁగానఁ గొ
ప్పోలున కొంగవోలునకుఁ బోతిమిగన్ దశరాజుపల్లెకున్
మేలునమించుకర్వదికి మేదినినాథుఁడు కౌరవాధిపుం
డేలలిఁబొమ్మనంగ నటకేగియు సైన్యముఁగూర్చి తెచ్చితిన్

22. తుంగభద్ర, రాజ్యలక్ష్మి, పొన్నూరు, భావనారాయణస్వామి పేర్లు వచ్చునట్లు భావనారాయణస్వామికి సంబోధన

నీరంబొప్పఁగ నేత్రపర్వమయి యెంతేఁదుంగభద్రాస్రవం
తీ రత్నంబు కురంగటన్ దనరఁగన్ శ్రీరాజ్యలక్ష్మ్యంబ సొం
పూరన్ జేయఁగ భక్తసంతతుల నెప్డున్ బ్రోదిఁగావింప పొ
న్నూరన్ నిల్చిన దేవ నిన్నుమదినెంతున్ భావనారాయణా

23. కరోమి, కవయామి, వయామి, యామి అనుపదములు వచ్చునట్లు విష్ణుస్తవము

గరిమన్నిల్పక, రోమిటారి వలెఁ గుల్కన్ సాగె దుర్మేధ, ధీ
వర హృత్సాంకవ! యామికుండు నిశఁ బ్రోవంజూచినట్లే యబో
ధ రహింపంగను దేవ! యామిడిని బొందంజేయకే యెందు శ్రీ
ధర! యామిన్యధిపాన్వయేశ! సురవంద్యా! కృష్ణ! భక్తావనా!

24. లక్ష్మీసరస్వతుల హెచ్చుతగ్గులు

వరుసనుజూడ నత్తయగు భార్గవి శారదకంటె హెచ్చుగున్
వరమతిఁజూడఁ గోడలగు భారతిహెచ్చగు లక్ష్మికంటెఁదా
సిరినిడు లచ్చి విద్యనిడు నీరజగర్భునిరాణి గాన నా
యిరువురిలోనఁ దచ్చునియు హెచ్చని యేయమఁ బల్కఁజాలుదున్

25. సమస్య : మాద్రియు దోగ్ధృతంగనె హిమాద్రియుఁ దర్ణకమయ్యె నయ్యెడన్

క్షుద్రపువ్యాధి లోకములఁ జొచ్చి చికాకును జేయుచుండగాఁ
భద్రము లిచ్చు నోషధు లపారముగాఁ గొన ధేనువయ్యె ని
ర్నిద్రగతిన్ వసుంధరయుఁ బ్రేముడి నాపృధునామధైర్యహే
మాద్రియు దోగ్ధృతంగనె హిమాద్రియుఁ దర్ణకమయ్యె నయ్యెడన్

26. సమస్య : చెలువుగఁబిల్లిఁ బట్టుకొనఁ జేరెడి యెల్కల పిండుఁ బోలెడిన్

జ్వలితపురోషవహ్ని రిపువారదవంబును నేఁడెకాల్తు నం
చలఘు బలంబుఁజూపఁ బవనాత్మజుఁడా రణసీమఁజేర న
బ్బలియు నొకంటఁగూల్తుమని పైబడు కౌరవసేన యయ్యెడన్
చెలువుగఁబిల్లిఁ బట్టుకొనఁ జేరెడి యెల్కల పిండుఁ బోలెడిన్

**(సంపూర్ణము)**



# అవధానాంతమున
# పండితకవుల యభిప్రాయములు



## బ్రహ్మశ్రీ బొమ్మరాజు జానకీరామశర్మ

శ్రీకాంతాగాఢవక్షోజ కుంకుమాంకవిభూషణః
పాతుమామబ్ధిజామాతా భో సోదరకవీశ్వరౌ

కైశికీభారతీవృత్తియుక్తా గౌరీవిభూషితా
సుశయ్యాచావధానేవాం రాజతేకవితా భృశం

అవధిశిఖరపశ్చాద్భాగగానాంశిలానాం
శితశితినువిభేదాజ్ఞానభాజాంక్రమేణ
ప్రథితవిమలకీర్త్యబ్జాతపై స్సూచయంతౌ
కవిమలతిల కేపావిష్ణురాయుర్విధత్తాం

కొప్పరపుంగవుల్ సుకవికోటిని మాన్యులటంచువింటి నే
నెప్పుడుగాంతునా? యనుచు నెంతయు నువ్విళులూరుచుండ నే
డిప్పురిస్వాగతంబొసఁగిరియ్యది మామకదిష్టమౌట నే
నిప్పుడచేర్తు వీరలకహీనమతిన్ఁ గవికంఠభూషలన్

### కవికంఠ భూషణములు

సురసంచయంబునకుసోకులమూకకునుం గురుత్వముల్
సరగంగ్రహించుటను శాత్రవవృత్తినినుండిరిప్పుసో
దరసత్కవీశులనాధారుణిగీష్పతి భార్గవుల్ జనిం
చిరటంచుసజ్జనులుసేవలుసల్పఁ జరించి రంతటన్

భువిఁగింకవీంద్రులకుఁ బొల్చెడిదొడ్డగదన్ జికిత్ససే
యవిరించియాజ్ఞఁగొని యశ్వినులాద్యభిషగ్వరుల్ వడిన్
దివినుండివచ్చిరనధీనిధులైన కవీశులిర్వురున్
గవివందనీయతనుఁగాంచిరి, వేం, సు, ర, నామధేయులై

కడునాశుధారగను గంటకునూఱులుపద్యముల్ సుధన్
జడివానగొల్పి కవిసన్నుతులంగొనమీకె సెల్లుఁగా
యుడురాజశారద పయోధర ధాతృకుటుంబినీ సుధా
జడధిప్రఫుల్ల సితసారసశుభ్రయశః ప్రకాశులై

ఎలమిన్ భగీరథమహీశ తపోముదితేశ మస్తకో
జ్జ్వలసజ్జటాపతన సంభ్రమవేగవియన్నదీ ఝరిన్
దలపించు మీవిమల ధారను మేధను గల్మి చల్వయున్
గలవాణివాణియును గావుతఁగాఁపురమయ్యు మీయెడన్

భువినొప్పు పోతవరపూర్ణిలయుండును – రామరాయ సూ
రివరప్రశిష్యుఁ డతిప్రేమను సోదరసత్కవీశులన్
గవిగంరభూషలను కమ్మనిపద్దెము లింపుమీఱఁగన్
జవులొల్కఁబల్కె గవినాథులుఁ బండితవర్యులౌనసన్

**శ్రీమాన్ మాడభూషి వీరరాఘవాచార్యులుగారు, పేరాల**

శ్రీపతిః కరుణారాశిః పాతుసత్కవిశేఖరౌ
భ్రాతరౌకవితాధారా సంపూరితదిక్తటౌ

చీరాలపేరాల ఇతిప్రసిద్ధం పురద్వయంపూర్వసముద్రతీరే
విభాతివిద్వత్ప్రకరైః ప్రకీర్ణంపురం యథేంద్రస్యమనుష్యధర్మణః

తత్రత్రైఃకవితావలోకనపరైః కార్యేషుదక్షైఃప్రభోః
శ్రీదుర్గాంబిక సత్ప్రసాదవిభవైః శ్రీలోకనాథాదిభిః

సానందంసకుతూహలం సవినయం సంప్రార్థితౌసాదరం
స్వాసాధారణలక్షణైశ్శుభకరైః స్సుస్వాగతౌసుప్రభౌ

## బ్రహ్మశ్రీ పెళ్లూరి శ్రీనివాసశాస్త్రిగారు

తాభ్యాంకృతాన్యనుపమాన శతావధానా
న్యాశుప్రబంధరచనాని పరశ్శతాని
దృష్టానిసర్వవిబుధైః పరికీర్తితాని
వక్తుంక్షమాని న సహస్రముఖేనతాని

ఆకల్పమత్రవిజయీ కవిరాజవర్య
భ్రాత్రాసహైవ భవవేంకటసుబ్బయాఖ్య
త్వద్వాక్యజాతమకరందరసప్రవాహే
మజ్జత్యయంసమనుభూయబుధాళివర్గః

## బ్రహ్మశ్రీ మన్నవ నరసింహముగారు, మన్నవ

కప్పురపుఁబల్కు కొప్రంపుఁ గవులపల్కు
నవరసులమూట కొప్రంపుఁ గవులమాట
కాకవులఁగొట్టు కొప్రంపుఁ గవులతిట్టు
లనఁగఁగవిసింహులయి యశంబందినారు

మెచ్చిరి పండితోత్తములు మెచ్చిరి నాగరికాగ్రగణ్యులున్
మెచ్చిరి సత్కవీంద్రులును మెచ్చిరి భూరినరేంద్రచంద్రులున్
మెచ్చనివారిమాటయిఁక మిమ్ములఁజూచి సహింపకుంట వా
రెచ్చటనైన నొక్కరుఁడొ యిద్దఱొయుండిన లోపమున్నదే

అనిలకుమారకుండబ్ధి దాఁటినమాట
 నిక్కమాయనిపల్కు నేర్పరులకు
వార్ధిఁబుక్కిటఁబట్ట వశమెట్లగస్త్యున

కనిసంశయించు మహాత్ములకును
కొండమోకాటిలో నుండెనా జాంబవం
తునికనిపల్కెడు మనుజులకును
పసిబిడ్డఁడై తృణావర్తునిఁగృష్ణుండు
కూల్చెనా యనిపల్కు కోవిదులకు

నిట్టియద్భుతకృత్యంబులెల్ల నిక్క
మనుచుఁదెల్పఁగవచ్చిన యజులుగాక
పద్దెములు గంటకొకనాల్గువందలల్ల
జాలిరే కవులీకలికాలమునను

నన్నయకవినిఁజే కొన్న రాజనరేంద్ర
భూనాథచంద్రుండు లేనికొఱఁత
కవిరత్నమైనతిక్కననుఁ బ్రోచిన మన్మ
భూనాథచంద్రుండు లేనికొఱఁత
కవిరాజుశ్రీనాథు గారవించిన వేమ
భూనాథచంద్రుండు లేనికొఱఁత
కవిదిగ్గజములరక్షణ మొనర్చిన కృష్ణ
భూనాథచంద్రుండు లేనికొఱఁత

గలుగఁజేసె విచార మాంధ్రులకు నేఁడు
వారిలోనెవ్వరయిన నిప్పట్లనున్న
కవికులమహేంద్రులార! మీకవితవిన్న
గారవింపరె గండ పెండార మొసఁగి

## శ్రీమాన్ శ్రీరంగకవిగారు

వీరౌనాశుకవిత్వవాహినికి పృథ్విన్ బేరుఁదెప్పించు వి
స్తారామేయ శరద్ఘనామలయశస్సంవ్యాప్త లోకుల్మహా

సూరుల్ భవ్యశతావధానకవితా శుద్ధాంతులున్ భూరిధీ
సారుల్ కొప్పరపుంగవీశ్వరులు భాషాదేవి పుంభావులున్

కుండినకవిహంస లుండినందునఁగాదె
కాకవులకుఁ గల గర్వమడఁగె
బాలసరస్వతుల్ ప్రభవించుటనుగాదె
యాంధ్రభాషకు మోదమావహిల్లె
ఆశుసుకవిసింహు లతిశయించుటఁగాదె
దుష్టమత్తేభముల్ దూలిపోయె
ప్రకటాశుకవిచక్ర వర్తులొప్పుటఁగాదె
కవితామహాలక్ష్మి గరిమఁగాంచె

నట్టిసోదరసుకవీంద్రు లాఱువేల
వంశవర్ధిష్ణులౌట నీవంశమెంత
భాగ్యమందెనొ? తెల్పఁగా బ్రహ్మవశమె
వారిఁబ్రోవుతఁ గృష్ణుఁ డవార్యమహిమ

అంబుజగర్భ మోదదము లద్భుతభూతవిచిత్రసృష్టి మూ
లంబులు భక్తిచిత్తకమలప్రకరార్కరుచుల్ బుధాత్మ స
క్తంబులు లోకపాలకనుతంబులు పద్మభవాంగనా కటా
క్షంబులు గల్గుమీ కెపుడుఁ గాకవిగర్వ నిబర్హణంబులై

**బ్రహ్మశ్రీ చిల్లర వేంకటేశ్వరకవిగారు, వెల్లలూరు**

సిరికిమగండు భక్తజనసేవితపాదుఁడు కంజసంభవా
మరపతి ఫాలనేత్రముఖమాన్యుల కెల్ల విభుండు శత్రుసం
హరణుఁడపారకీర్తినిధి యంబుజనాభుఁడొసంగుచుండుఁగొ
ప్పరపుశతావధానులకు భాగ్యముల న్విలసద్యశంబులన్

ఎవ్వారు శబ్దార్థ మవ్వారిగ గ్రహించు
ప్రజ్ఞలో బాలసరస్వతులయి
రెవ్వారు కుకవి మదేభాళిహరియించు
శూరత్వమందు నాశుకవిసింహు
లెవ్వారు మధురమై యింపౌ కవిత్వరా
జ్యంబు ప్రోచుటఁ గవిచక్రవర్తు
లెవ్వారు రయమున నేగు నాశుకవిత్వ
సురనదీవిహృతిచే సుకవి హంస

లట్టి కొప్పరపన్వవాయాబ్ధిచంద్రు
లైన వేంకటసుబ్బరాయకవి వేంక
టరమణకవుల మహిమంబుఁదరమె పొగడ
ఫణిపతికినైన వాక్సతీపతికినైన

ఒక పద్యంబుఁ బఠించి దాని మఱి వేఱొక్కండుగా మార్పుఁ డం
చొకఁడన్నన్మఱి నాల్గు శబ్దములు తానొక్కండు ముందిచ్చి కొం
కక యాంధ్రంబునఁ బద్యమల్లుఁడనినన్ గాదంచ శక్యం బటం
చకటా చంపకుఁడంచు వందనము లేమర్పింతు మంచున్ గృపా
ధికతన్ మమ్మొటొ పంపుఁడీ యనుచు నీతీరైన మేమింక మా
నుకొనన్ వచ్చు వధాన మంచు తమకున్ గోపంబు వద్దంచు త
ప్పక యెవ్వాఁడవధాన మందివి యొనర్పం జాలఁడంచున్మమున్
సుకవుల్ మీరు పరాభవింపఁ దలఁపన్ సొంపౌనె యంచున్ సభన్
వికలంబౌమతి జూపుచు న్వినయమున్ భీతిన్ గనన్ జేయు వా
రికి నీ నాఁటి భవద్వధాన కవితా శ్రీపూర్ణ కీర్తుల్ శతా
ర కఠోరంబులునై త్రపాప్రదములై రాణించెఁ బ్రాజ్ఞుల్ కవి
ప్రకరంబుల్ నిజముం గ్రహించి మిము సంభావించిరో కొప్రపున్
సుకవి గ్రామణులార! వేడ్కగొనుఁడిచ్చో నా నమస్కారముల్.

## బ్రహ్మశ్రీ అన్నంరాజు సుబ్బారావుగారు, నందూరు

శూలిశుంభజ్జటాజూటనిర్ముక్తస
ద్గంగాప్రవాహ వేగంబుమీఱి
యమృతాపహరణార్థ మమరేంద్రపురి కేగు
నలఖగేశ్వరుగతి నపహసించి
మలయశైలాగతోన్మహితసామోదగం
ధవహగర్వంబు నధఃకరించి

వెలయు మీయాశుధారాకవిత్వమౌర
యిట్టి మీశక్తిఁగొనియాడ నెంతవాఁడ
నలువయగునేని యొక్కింతపలుకునేమొ
సుగుణనిధులార! సోదరసుకవులార!!

శ్రీనాథకవిచంద్రు సీమఁబుట్టినమీకుఁ
గన నాదుపాండిత్య గరిమయెంత
నిరుపమానకవిత్వ నిర్ణేతలగుమీకు
నే రచించెడు పద్యనిచయమెంత
యాంధ్రవాల్మీకి మెప్పందియుండినమీకుఁ
గణుతింప నానమస్కారమెంత
యలవేయి నూటపదాఱులందెడుమీకుఁ
దనియింప నాయిచ్చు ధనమదెంత

యవనిలో నెవరైనఁ గొండంతవారి
నరసి కొండంతపూజ సేయంగఁగలరె
భక్తితోనిచ్చునట్టి నా పద్యములను
జూచిసంతసమందుఁడో సుకవులార!

అడిగినవిషయంబు లన్ని చెప్పుటెకాని
యదియుఁగా దిదియుగాఁ దనుట లేదు
విషమవృత్తములైన వెసఁజెప్పుటే కాని
యవియుఁగావివియుగా వనుట లేదు
కోరుసమస్యలఁ బూరించుటయె కాని
తప్పను మిషఁద్రోయు దారిలేదు
తుదిఁబద్యములనెల్లఁ జదివి చెప్పుటెకాని
యడుగువారినిఁ గోపపడుట లేదు

ధర శతవధానులను పేరఁ దనరువార
లెందఱున్నారు వారల కిట్టిబుద్ధి
బలమొకించుకయైనను గలదెచూడ
సుగుణయుతులార! కొప్రంపుసుకవులార!

ధీరవరేణ్యులార! వెనుదీయక విన్నపమొండు సేతునీ
ధారణఁదప్పకుండ నవధానమొనర్పఁగఁజాలు శక్తియే
కారణసంపదన్ దమకుఁగల్గెనొ చెప్పకఁజెప్పుచుండె మీ
చారుతరస్వరూపములె సభ్యులకుం గడులేంతప్రాయమున్

చనమే యెప్పుడు పట్టణంబులకు విస్తారంబుగానచ్చుటన్
గనమే దివ్యశతావధానులఁగడున్ గౌతూహలంబొప్పఁగా
వినమే వారల యాశుధారకవితావిఖ్యాతి నీరీతిగా
ననిదంపూర్వముగాఁ గనంబడెనె యాహా! మీయదృష్టంబెకా

**బ్రహ్మశ్రీ రావినూతల వేంకటప్పయ్యకవిగారు, వేటపాలెము**

అంజలిఁ జేసిభజించెద
నంజఁగదల్పక సదాముదావహముగ హృ
త్కంజము వికసింపం బుధ
రంజకమౌ నిన్నుఁ గొప్పరపుఁ గవియుగమా!

సములెందుంగలరిప్పుఁ డిద్ధరఁ గవీశవ్రాతమం దుత్తమాం
ధ్రమునం దాశుకవిత్వమందు నవధానంబందు నేత్రావధా
నమునందున్ సమయానుకూల పదసంధానంబునం ధీర భా
వమునందత్యధికంపుధారణమునన్ వాగ్జృంభణంబందు వా
గమృతంబందును వాక్చమత్కృతిని వాక్యాలంకృతిన్ ధైర్యమం
దమలత్వంబున నీకునాశుకవిసింహా! బ్రహ్మవంశోత్తమా!

నీ సుకవిత్వసౌరభము నీటుగఁగ్రమ్మిననాటనుండి సం
భాసితకీర్తులౌ సుకవిమండలమండనులున్ నిరంతరా
న్యాసకళానిధుల్ విబుధభాస్కరులున్ నరపాలచంద్రులున్
దాసజనుల్ గుణగ్రహణదక్షులు సజ్జనులెల్లమానవుల్
వాసిఁజెలంగ నిన్నెటుల వాకొని వాక్పరిశుద్ధిఁగాంచి రా
యాసఁదరింపఁగాఁదలఁపునందుఁ దలంచితి నట్టిగౌరవ
శ్రీసతినందుకొమ్మిఁకను జెప్పెడిదేమి మహాకవీశ్వరా

వనధిసభాస్థలంబు కవివర్యులిలన్ బుధులద్రులెల్ల వా
రును రతనంబులందలి విరుద్ధపుఁబ్రశ్న లెపో తుపాను కుం
డినకనిహంస! నీయశపు తీవియె నావసరంగు నీవుత్రో
వనునడపించుపల్క నిరవద్యతగన్న కవిత్వలక్ష్మిదా
నినిఁగొని నావనొడ్డునకు నేర్పునఁజేర్చితివౌర నేఁడు నీ
టను బడకుండ నిన్నుఁ బొగడందరమా సరితూఁగసెక్కెమా

భోజునికాలమందుఁ బరిపూర్ణవిలాసముతోడ సంస్కృతం
బీజగమెల్లనిండుగొని యెంతయువాసిగ నుండె నందు రా
యోజనె కృష్ణరాయనిమహోన్నత కాలమునందు నాంధ్రమం
భోజభవాండమెల్లెడలఁబూర్తిగనిండి క్రమక్రమంబునన్
దేజమువాసియిప్డిపుడు ధీధృతినొప్పుకవీంద్రకోటిచే
బీజమునాటమొక్కయయివృద్ధికినాంధ్రమె ముందువచ్చి మున్

దా జనియించినట్టి విహితస్థలమైతగునాంధ్రమండలిన్
భ్రాజితమయ్యె నీవలన భాసురలీలలఁ బూర్వమెట్టుల
ట్టేజయమందు సోదరకవీశ్వరచక్రచరా! సుఖస్థితిన్

ఎద్దానిజడులునీ కియ్యభావింపరో
యెద్దానిదుష్కవు లెఱిఁగికొనరో
ఎద్దానిచేఁ బెద్ద లెలమిహర్షింతురో
తప్పులెద్దానిచే నొప్పుఁగనునొ
రాజకీయోద్యోగ రాజసంబెద్దియో
సకలజనుల కేది సాయమగునొ
దైవతస్వాములెద్దానఁ బ్రసన్నులో
కనికరం బెద్దానఁ గలుగఁగలదొ

అఖిలలోకైక పూజ్యమైనట్టి దెదియొ
భూతదయగల్గఁగారణభూతమెదియొ
అట్టివందనమును మీపదాబ్జములకు
నర్పణముచేయుచున్నాఁడ ననఘులార!

**బ్రహ్మశ్రీ పూసపాటి వేంకటప్పయ్య శర్మగారు**

ఓకవీశ్వరులార! మీ రేకమతిని
నిచటగావించునాశువు ప్రచురమయ్యె
శతవధానంబుమిక్కిలి జయముఁగాంచె
నింపుదళుకొత్తెనామది కిదినిజంబు

ఆశుకవిత్వమందతిశక్తిఁజూపుటఁ
బృథుకీర్తిఁగాంచె నార్వేలశాఖ
అష్టావధానమం దద్భుతంబుఁగూర్చుటఁ
బృథుకీర్తిఁగాంచె నార్వేలశాఖ

శతఘంటకవిత నాశ్చర్యమిచ్చుటచేతఁ
        బృథుకీర్తిఁగాంచె నార్వేలశాఖ
సత్కవిబుధరాజ సత్కృతుల్ గనుటచేఁ
        బృథుకీర్తిఁగాంచె నార్వేలశాఖ
మీరలీభువిజనియించి మించుకతన
నిందుఁ దమృతంబుఁ జనియింప నెల్లవారి
పొగడికలఁగన్న దుగ్ధాబ్ధి పోల్కిఁగాఁగఁ
గొప్పరఁపుఁగవులార! సద్గోత్రులార!

**బ్రహ్మశ్రీ కొండముది నరసింహకవిగారు, అప్పికట్ల**

శ్రీమత్కొప్పరపన్వయాంబునిధి చంద్రీభూత శ్రీసుబ్బరా
యామాత్యా! భవదాస్యపుష్కరవినిర్యత్పద్య సంపాతమే
ధీమచ్చిత్తతటాకమందుఁబడి యేధీకుల్యలన్ బాఱునా
శ్రీమజ్జీవితసస్య మొక్కటిగదా సిద్ధించుసాఫల్యమై

సరసులు సత్కవీశ్వరులు శాస్త్రవిశారదులద్భుతావధా
న రచనలందు నేర్పరులు నమ్రులుసద్యశులైనయట్టి కొ
ప్పరకుల సింధుసోములు ప్రభావసమన్వితులైన సోదరుల్
సురుచిరరూపసంపదలఁ జూడఁగవాగ్వనితా నరాకృతుల్

పటుకీర్త్యాకర పండితావన లసద్భాగ్యోదయా! నీదుపే
రిటివారెందఱుఁగంటిఁగాని కవితారీతిన్ విమర్శింప వేం
కటసుబ్బాఖ్యకవీంద్ర! నీసదృశులన్ గాంచంగలేదెన్నఁడున్
నిటలాక్షుండు మదీయుఁడౌటను సుమీ నీదర్శనంబబ్బుటల్

**బ్రహ్మశ్రీ గుంటుపల్లి చంద్రశేఖరరావు**

చాటుకవనంపుఁబద్దెముల్ చదువుటింతె
కాక కబ్బంబుగూర్పఁగాఁగలరె వీర

లనెడు వారలమోరల నడఁచినట్లు
గా హరిశ్చంద్రుకతఁ గూర్చు ఘనులు మీరె

ఆశుకవిత్వమందఱకు నబ్బురముం గలిగించె నిన్న నేఁ
డీసభసంతసంబుఁ బ్రవహింపఁగ జేసె శతావధానమున్
భాసురకీర్తిచంద్రికలఁ బర్వఁగఁ జేసితిరయ్యలార! వా
తాశనరాజుకైనఁ గొనియాడఁగ శక్యమె యిజ్జగంబునన్

కాళిదాసకవిత్వ కౌశలంబునుతింప
భోజరాజేంద్రుఁడీ పుడమినెగడె
కవి బ్రహ్మయనెడి తిక్కనపొగడ్తకుఁ దేఁగ
మనుమసిద్ధినృపాల మౌళియొప్పె
శ్రీనాథువాక్చాతురీసుధఁ గ్రోలంగ
ననవేమభూపతి యమరియుండె

తగ నాంధ్రకవితా పితామహాఖ్యనుగొన్న
పెద్దనార్యుని గృష్ణవిభుఁడు ప్రోచె
గాని యీకవులకును సత్కార మొసఁగు
వారు లేరను శంకలీవరకుఁ బోవఁ
బరగఁ జీరాల పేరాల పౌరవరులు
చూపెదరుగాక బహుమాన సూచకములు

## చీరాల పేరాల పురవాసులు

శ్రీ వెలయు కొప్పరంపు పురీ నివాసు
లార! రమణాఖ్య సుబ్బరాయాఖ్యులార!
సోదరకవీంద్రులార! యశోనిధాను
లార! మావిన్నపముఁ బ్రేమమీఱ వినుఁడు

ఒక్కఁడు నింగిలీషునను నొక్కఁడుఘూర్జరభాషయందు వే
ఱొక్కఁడు పార్సియందునుమఱొక్కఁడుల్యాటినునందుమిమ్ములన్
గ్రక్కునఁబోరరమ్మనుచుఁ గాఱులుపల్కుట లెల్లవింటిమా
తక్కరిపండితోత్తములు తప్పుకొనంగను మాఱుమార్గముల్
ద్రొక్కుచునుండు వారలొగిధూర్తమతంబుగ్రహించియెందుమీ
ప్రక్కను నిల్వలేక యిటుబల్మరునాడుదురింతెగాని యా
యక్కజపుం బ్రసంగులనయారె యెఱుంగని బాసయందు పెం
పెక్కరచింపుఁడన్న నదియెట్లని నెమ్మది నెంచలేరుగా
కొక్కటియైనఁ జక్కఁగను నోర్చినఁజాలునుగాని యాగతిన్
నిక్కువ మొక్క విద్దెయును నేర్పుగ నేరువలేనివారితో
నెక్కడివాదమంచు మదినెంచుఁడి మించుఁడి యాసడించుఁడీ

ఆశుకవితావిధానములనఁగ నెంత
పొట్టకూటికి భట్రాజు పోల్కిననుచు
నొకరొాయిద్దఱొ యనిరని యొక్కనోట
విన్నవారము మీరిది విన్నవారె

అఖిలరాజన్య ధనాధిపాశ్రయములు
గోరుచుండుట పొట్టకూటికొఱకె
కృతులొనర్చుచును ముద్రింపించి యవియమ్మ
కొనుచుండుటలు పొట్టకూటికొఱకె
పాండితిలేకున్నఁ బండితుండననుట
కోర్కెదీరఁగఁ బొట్టకూటికొఱకె
పరగౌరవమె దుఃఖభాజనంబుగ నెంచు
కొని వాఁగుటయుఁ బొట్టకూటికొఱకె

కోటివిద్దెలు నేర్చినఁ గూటికొఱకె
యనెడు నార్యోక్తి నెఱుఁగని యధములాడు

పలుకులెంచంగవలదు మీతలఁపులందు
మిమ్ము ప్రార్థించువార మమేయులార!

ఘటికాశతగ్రంథ కర్తనంచని రామ
రాజభూషణుఁడనెఁ దేజమెసఁగ
సూరనార్యుండు నాచొప్పుననే యనెఁ
గానియెక్కువఁ జెప్పఁ బూనఁడయ్యె
ధీరుఁడౌ నెల్లూరి వీరరాఘవకవి
గడియకునూఱింటిఁ గడువఁడయ్యె
సకల దేశాధీశ సందర్శనులు కొంద
ఱేమాత్రమును జెప్పు టెఱుఁగరయ్యె

గంట కేనూఱునార్నూర్లు గణనఁ జేయఁ
జెప్పితిరి చెప్పుచుంటిరి కొప్పరంపు
కవిశిఖామణులార! మీకంటెనితరు
లెట్లుఘనులగుదురు? చెప్పనెట్లుతగును?

చెప్పిరితొల్లి పెద్దనయుఁ జెల్వలరారఁగ సూరనార్యుఁడున్
మెప్పుగ రామభూషణుఁడు మేటికవీంద్రుఁడు రామకృష్ణుఁడున్
దప్పక నాశుధారల యథావిధివారల శక్తిఁజూపరే
యిప్పటి కాకవీశ్వరుల కింపుజనింపదదేమి చిత్రమో
యప్పని పూనలేక యిటులాడుటెగాక యసూయతోడుతన్

పుట్టుకతోడఁబుట్టినది పూన్కినిమీకవనంబు గావునన్
బట్టఁగలేరు తప్పులిఁక బల్మరువ్రాయుచు దిద్దుకొంచున
ప్పట్టునఁ దప్పులున్నవనఁ బాటియొనర్పక సంచలించువా
రెట్టులనన్న నేమి యిది యించుకమీమదినెంచఁబోకుఁడీ

భవదీయనర్మ గర్భపుఁ జంద్రహాసముల్
　　తెలియకుండఁగ మెడల్ త్రెంచుచుండ
లలితదీర్ఘసమాస లావణ్యతా కల్ప
　　వల్లికల్ కంఠముల్ వలగొనంగ
నతిశబ్దచిత్రవాగబ్ధితరంగముల్
　　తలక్రిందులుగఁద్రిప్పి కలఁచుచుండ
వాక్యధారాధిక ప్రళయకాలసముద్భ
　　వాంబుధారలు కంపమందఁజేయ

నాశుధారా మహాకవిత్వాంబు రాశి
పొంగిదిక్కుల నాక్రమింపంగ నిలువఁ
జోటుదొరకక దిక్కులు చూచితిట్టి
కొట్టుకొనిపోవువారల గొడవలేల

ఆశుధారాకవిత్వమం దాదరమునఁ
బెద్దనార్యుని కాలను బిరుదుతనదు
చేతితోడను వేసి సంప్రీతుఁడైన
కృష్ణరాయఁడెసాక్షి యీకృతులకెల్ల

ప్రథితచీరాల పేరాల వాసులైన
వారలు ముదంబుతో ననివార్యమైన
భక్తిని లిఖించినట్టి యీపద్దియములు
దయనుజేకొనుఁడయ్య మోదముదలిర్ప

**శ్రీ అక్కిరాజు నరసింహకవి - వంగవోలు - చంపకమాల**

కరముమనోహరంబు నలగాంగఝరీరయ భాసురంబు మే
దుర ఘననిస్వనంబునయి తోఁప జగంబున నెల్లవారున
బ్బురమునఁ దేరిచూడఁ గడుఁ బూజితమౌ భవదాశుధారసుం

దరతరమౌ భవచ్ఛతవధాన విధానమనోజ్ఞతం గనం
దిరమగురీతినచ్చెరువు తేజరిలెన్ మునుమిమ్మువంగవోల్
పురమునఁజూచినప్డె యిదెపో కవితావనితావిలాసని
ర్భరగతియంటినిప్పుడు చిరాలపురంబున నాశుధారలో
హరువుగఁజెప్పనద్దినకరాన్వయుఁడైన త్రిశంకుసూనుస
చ్చరితమ వింటినెమ్మదిని సంతసమెక్కువ యయ్యె వహ్వారే!
వరపదగుంభనంబహ సెబాసు రసాన్విత మౌటఁదుష్టియై
పరగెఁబుటంబులన్ మెఱుఁగు వారెడుబంగరురీతిమాకు గో
చరమగునింతలాశువభిసారికఁబోలియెసంగె నిష్ఫలం
కరణములన్ని దాల్చి నయగౌరవుఁ జేఁతల జగ్గనిగ్గసొం
పొఱపునుగుల్కుతల్కుమెఱపుల్మిగులన్వహియించెనౌర మే
ల్వెరిగెనుగౌతుకంబడరె విస్మయమయ్యెను గానఁగూర్మిహె
చ్చరిక రచించినాఁడనొక చంపకమాలికఁ గైకొనుండు సు
స్థిరమతిదీనినాశుకవి సింహములార! సుధీంద్రులార! కొ
ప్పరపుఁగవీంద్రులార! మిమువర్ధిలఁజేయుత నీశుఁడెల్లెడన్

**శ్రీ పేరాల లింగరాజకవి, వేటపాలెము**

సరసవరేణ్యులార! బుధసత్తములార! నియోగివంశసా
గరవరచంద్రులార! నృపకాండహితోరుచరిత్రులార! కొ
ప్పరపురవాసులార! గుణభాసురులార! మనోజ్ఞులార! మీ
సరసకవిత్వధాటికిని సాటియొనర్పఁదరంబె? మేటిమో
టరుగతిమించుధూమశకటంబును గెల్వఁదలంపఁగా దివా
కరురథ వేగతుల్యమగుఁగాదె యిదేమి యదేమి గాంగ నిర్
ఝరనిభ వాగ్విజృంభణముఁ గర్ణములన్ వినఁదన్విదీఱునే
గరిమను మీరుసేయు శతఘంటవధానముఁ జూడఁజూడనీ
కరణిని గంటకైదు శతకంబులఁగూర్చెడి నేర్పుకల్గుధీ

వరులనమీరెమీరె పెరవారలొకో యిదిస్తోత్రపాఠమో
పరిగణనంబపూర్వమునఁ బద్దెములం గడెకొక్కనూఱిటిన్
సరవినిజెప్పువారలు నిజంబుగ నుండిరి వారిమించి యి
ట్లరయఁగవిత్వమల్లుటయె యబ్బురమౌ పని యందులోనస
త్వరమొనరన్ రచించుటయథార్థముగాఁగడుఁగష్టసాధ్యమౌ
మఱియును బూర్వమాశుకవిమండనులన్ నృపకుంజరంబు లా
దరమునఁజూచి మన్ననలఁ దన్పిరి వానికిమీరె సాక్షులౌ
మఱిమఱియెందఱోకలరు మానితచర్యులు వారిమ్రోల న
క్కఱపడి చంపకంబులను గైకొని హారముఁగూర్చిఁనాడ సో
దరకవులార! యాదరముదారగతిన్ గనుపించుచుండి హె
చ్చరికను మత్సమర్పితసుచంపకమాలగ్రహింప వేఁడెదన్

సూరిస్తుత సుకవిత్వ
ప్రారంభకులైన కొప్పరపు వేంకట సు
బ్బారాయ రమణ కవులను
శ్రీరమణుఁడు ప్రోచుఁగాత సిరులిచ్చి దయన్

## శ్రీ కార్యముపూడి రాజమన్నారుకవి

సరసులు పండితుల్ నృపతిసత్తము లెన్నఁగఁ బత్తనంబులం
దఱమరలేకఁజిత్రగతి నాశుకవిత్వ శతావధానముల్
నెఱపి వరప్రసాదులను నిద్దపుకీర్తినిఁ జెందినట్టి కొ
ప్పరపు కవిద్వయంబు శశిభాస్కరులట్ల వెలుంగుఁగావుతన్

కొద్దిది కొప్పరంబు కవికోటులవాగ్ఝరిమేటికీర్తి చే
బ్రద్దలుగొట్టి కాండమున భాసిలు వేంకటసుబ్బరాయనిన్
ముద్దుకవీశుఁదత్సహజుఁబూనుటఁదోఁచకతోఁచెఁగొద్దియౌ
యద్దమునుం గకారము మహాద్రిహరీశులఁ దాల్చునట్లొగిన్

వేంకటసుబ్బరాయకవి వేంకటుఁడౌ రమణార్యవర్యునిన్
బొంకముఁగానుతించు పనిఁబూనిననేఁడులుపట్టునంచు నే
జంకుచు జంకుచిట్టులనఁజాలితి శ్రీచతురేంగితజ్ఞులున్
గొంకుటొకింతలేని కవికుంజరులంచు నిరంకుశంబుగన్

రాజితాం కవిసింహౌ ద్వౌ కొప్పురాద్రిగుహోద్భవౌ
ఇతోధికావధానైశ్చ నతోత్తమబుద్ధైస్సదా

**శ్రీ గుద్దంటి చినగోకర్ణము**

అంబికాదత్త సత్కవిత్వాతి రేకు
లగుచు నవధానముల్ బుధుల్ పొగడఁజాలఁ
జేసి నెగడొందు సత్కవిశ్రేష్ఠులైన
కొప్పరపు సోదరకవులఁ గొల్తు భక్తి

సురుచిర శాస్త్ర వేదులగు సూరివరేణ్యుల సత్కవీంద్రులన్
నిరుపమవాగ్విలాసుల మనీషుల సత్కవితామృతంబునన్
బరిపరిఁ జొక్కఁ జేసినఘనప్రతిభానిధులైన వీరులన్
ధరణిసృజించికాంచెఁగద ధాత యశేషయశోవిలాసమున్



# పంగిడిగూడెము శతావధానములు

## అవతారిక



రసికమహాశయులారా!

ఈచిన్నిపుస్తకమునకుఁ గారణభూతులైనవారు, ఆంధ్రదేశంబునఁ బ్రసిద్ధి వహించిన, సంస్థానములలో నొకటియగు నుత్తర వల్లూరు సంస్థానాధీశ్వరులలో జ్యేష్ఠులును, సద్యశోగరిష్ఠులునునగు మహారాజ రాజశ్రీ శ్రీరాజా బొమ్మదేవర నాగన్న నాయఁడు బహద్దరు జమీందారువారు. వీరి పూర్వులు జగదాశ్చర్య కార్యకలాపము చేతను, ప్రభుజన ప్రీతికర వర్తనముచేతను జనోపద్రవకారి ఘోరమృగ నిర్మూలన కృత్యములచేతను, ప్రఖ్యాతివహించి దేశాధిపతులగు నాంధ్రాంగ్లమేచ్ఛ ప్రభువరేణ్యు లచే వివిధవిధ స్వర్ణబిరుదాలంకార లాంఛన సత్కారములనేకముల గ్రహించి యుండిరి. పూర్వోదాహృతములగు విషయములచే వీరిదిశూర సంస్థానమని నిర్ధారితము కాఁబడినది. ప్రస్తుతప్రభువులకుఁ బితామహులును బితామహప్రజ్ఞా గణనీయులును స్థిరయశఃప్రియులును, విద్యానురక్తులును వితరణశీలురునునైన శ్రీశ్రీ రాజా బొమ్మదేవర నాగన్న నాయఁడు బహద్దరు జమీందారువారు "యశ ఏవ జన్మఫలతాత్మవతామ్" అను నార్యోక్తిననుసరించి, శాశ్వత యశంబు సంగ్ర

హింపనెంచి, యది సత్కవికృత గ్రంథ ప్రభూతంబుగానెంచి సుప్రసిద్ధులును, తెనాలి పురవాస్తవ్యులునునైన బ్రహ్మశ్రీ మతుకుమల్లి నరసింహ కవివరేణ్యుల నిజాస్థాన కవివరేణ్యులుగ నిల్పికొని శ్రీమచ్చెన్నపురీవిలాస ప్రముఖకృతి పరిగ్రహణం బాచరించి కీర్తి లక్ష్మీ పరిగ్రహణం బాచరించికొనిరి. నాఁటనుండి యీ సంస్థానము విద్వత్సంస్థానమనియుఁ బేర్కొనంబడుచుండెను. సర్వవిధములఁ బితామహ తుల్యులైన శ్రీవారు తమ రాజ్యస్థానభాగమగు తోట్లవల్లూరు పట్టణమునకు విచ్చేయుటకు, నంతకుఁ బూర్వమే శ్రీశ్రీ వేణుగోపాలదేవ మహోత్సవ సందర్భమున శ్రీవారి పినతండ్రిగారి పుత్రులైన శ్రీరాజా బొమ్మదేవర సత్యనారాయణవరప్రసాద రావు బహద్దరు జమీందారు వారొసంగు వార్షికసత్కారమునకై మేమటకు వచ్చి యుండుటయుఁ దటస్థించినందున శ్రీ వారికిని మాకును సందర్శన సల్లాపములు సంభవించినపుడు శ్రీవారికి విద్య యందును మాయందును గల ప్రీతిగౌరవములు ప్రకటితములగునట్లు, అనువత్సరమును వారాచరించు శ్రీదేవీ నవరాత్రవ్రత మహోత్సవములకు మమ్మాహ్వానించిరి. తన్మూలమున మేమును శ్రీవారి విద్యాదరములకు సంతసించి వారి యుద్దేశానుసారముగాఁ బంగిడి గూడెమునకు శ్రీమద్రౌద్రి సంవత్సరాశ్వయుజ మాసారంభమున వచ్చి యట శ్రీవారి యభీష్ట ప్రకారము శతావధానముం గావింపఁగా శ్రీవారందుల కానందించి గజా రోహణోత్సవంబుం గల్గింపఁజేసి అయిదునూటపదియాఱులు రూప్యము లొసంగి బిరుదస్వర్ణ మండనములతో రాంకవాదికసువస్త్ర గౌరవంబు లొనర్చి ప్రతి సంవత్సరము ఏతన్మహోత్సవ సమయమున కరుదెంచి వార్షిక సత్కారమందు నట్లుగా నియమపత్రం బొసంగి యానందింపఁజేసిరి. మఱియుఁ దామట్లు సత్కరించుటయే కాక తమ కాప్తులును రసికప్రభువర్యులునునగు మహారాజరాజశ్రీ శ్రీ రాజా కందిమళ్ళ వేంకటరామనరసింహారావు బహద్దరు జమీందారువారి అశ్వారావుపేటలో వారియాస్థానమున మాకవిత్వావధాన విశేషములను జూపం దగినయేర్పాటొనరించి శ్రీవారి సన్మానములచే మమ్మానందితులనుగా నాచరించిరి. మఱియు శ్రీమద్దుర్మతి సంవత్సరమున శ్రీరాజావారి యొక్కయు బంధువుల యొక్కయు, అభిప్రాయానుసారముగా సంపూర్ణ శతావధానముం గావింపఁబడియె.

శ్రీవారి ప్రథమ సందర్శనము మొదలు శ్రీవారికిని మాకును గలుగుచు వచ్చిన సమయానుగుణ ప్రసంగోచితములుగను, ఇతర విషయములుగను శ్రీవారికి సంబంధించినవఅకు మాచే రచింపఁబడిన పద్యములు రాజాలోకమను పేరుగల వివిధప్రసంగపద్యావళియందుఁజేర్పఁబడినవి. ఈ రెండు సంవత్సరముల సభా సమయములకుం జనుదెంచి అవధానములఁ దిలకించి వ్రాసిన కవుల ప్రశంసాపద్య ములలో మాకు లభించినవానిలోఁ గొన్నిటి నిందుఁ బ్రచురించినారము.

ప్రథమ సంవత్సరావధానములోని దేవీస్తవమగు “నీలాంబుజారామకేళీ మరాళమై” యను సీసము శ్రీమద్దుర్మతి సంవత్సరపు, ఉగాది సంచికలో “సంవత్సర ప్రశంస”లో మొదటఁ బ్రకటింపఁబడియున్నది. పద్యముల సందర్భము లందు వివరింపఁబడి యుండుటచేఁ బునరుక్తమగునని యెంచి ప్రత్యేకముగా విషయ సూచిక ముద్రింపలేదు. శ్రీవారికిఁగల ఆర్యమత సంప్రదాయసిద్ధమగు దేవ బ్రాహ్మణ భక్తియు విద్యాదరము నిందుఁ బ్రస్ఫుటముగాఁ గన్పించు చున్నది. ఇట్టి భగవచ్ఛేవాపరులగు దంపతులకు దైవ మాయురారోగ్యైశ్వర్యాభీష్టఫలసిద్ధు లొసంగుఁ గాత!

ముద్రణ ప్రమాద దోషములను గుణజ్ఞులు పాటింపకుందురు గాక.

ఇట్లు,

**కొప్పరపు సోదరకవులు**

1922 సంవత్సరము శతావధానులు

❦❦❦❦❦❦❦❦❦

శ్రీ మత్కనకదుర్గాంబాయై నమః

# పంగిడిగూడెము శతావధానము - I

**(అక్టోబరు - 1920)**



**శ్రీమదిష్టదేవతా ప్రార్థనము**

ఏయంబ బిరుదంబునిప్పించెఁ దొలుదొల్త
        మణికొండభూపాల మౌళిచేత
నేదేవి జయ ఘంటికాదుల నిప్పించె
        మద్రాసు బుధ శిరోమణులచేత
నేతల్లి వేయినూటిప్పించె ఘటికాద్వ
        యిని బీరికాపురాధీశుచేత
నేమాత జయ కేతు వెత్తంగఁ బతకంబు
        లిప్పించెఁ బోలనరేశుచేత

నే ప్రసువు, భుజగేంద్రాది సుప్రసిద్ధ
నృపులచే జయ బిరుదాదు లీయఁజేసె
నట్టి మదుపాస్య శ్రీశివాబ్జాస్య నేఁడు
కూర్మి దళుకొత్త జయ మొనగూర్చుఁగాత!

1. జగదీశ్వరీ స్తవము

నీలాంబుజారామ కేళీమరాళమై
        సామేన శంకర స్వామి వెలయఁ
బవలు రాతిరి సేయు భద్రతాటంకముల్
        దరహాస రుచి ధగ ధగ వెలుంగఁ
త్రయ్యంతవేణి పద్మజురాణి, హరి రాణి
        చెలికారమునఁ గెలంకుల మెలంగఁ
గెంగేలి రాచిల్క క్రీడార్థమెసరేఁగి
        ప్రణవాక్షరార్థ ముపన్యసింపఁ

గ్రహముక్తాఫలామల గగనవాహి
నీ పయఃకణపంక్తి వందే యటంచు
విష్ణుపతి పూజన మొనర్ప విశ్వభరణ
దీక్ష నెలకొన్న దేవి కిదే నమస్సు

2. ప్రకృత ప్రభువును దేవి రక్షించునట్లు

నవరాత్రవ్రతదీక్ష దక్షతనయం ద్రైలోక్యరక్షాచణన్
రవి చంద్రాగ్నివిలోచనన్ శ్రుతిపథభ్రాజన్మహామంత్రరూ
ప, విరాజత్కరుణాంతరంగ నిను, సంభావించు నాగావనీ
ధవు నంచత్కరుణాదృగంచలములందన్పుంగదే, శాంకరీ!

3. సమస్య : నవరాత్రవ్రతదీక్ష చెల్లె నిట నానందం బమందంబుగన్

కవిరాజుల్, బుధరాజు, లుత్తమధరా
        కాంతుల్, హితుల్ బాంధవుల్
సవనంబంచు గణింప, నిర్మల నయ
        స్వాంతంబునన్, దేవి, రా

ఘవమాంబామణితోడ నాగవసుధా
కాంతుండు పూజింప శ్రీ
నవరాత్ర వ్రతదీక్ష చెల్లె నిట
నానందంబమందంబుగన్

4. విష్ణ్వంశజులగు ప్రభువులు

శ్రితచక్రంబుధరింప, సర్వసుమన శ్శ్రేణ్యున్నతుల్ వెంప, సం
తతదీక్షన్ విబుధాపకారి మద విధ్వంసంబుఁ గావింప న
చ్యుతకీర్తిన్ విహరింప భూరమలకున్ శోభల్ గడున్నింప నం
చిత విష్ణ్వంశముగల్గు త్వత్సములకే చెల్లున్నృపాలోత్తమా!

5. దశావతారమూర్తి

వనచర వనచర యుగళము
లనఁగ, ద్విజ ద్విజ యమళము లన, బుద్ధుఁడనం
గను గల్కి యనఁగ విష్ణుఁడు
తనరెన్, దశరూప నామధారియయి నృపా!

6. శ్రీరామచరిత్ర

అనఘులు దేవమౌను లధికార్తిని వేడఁగ నాజిరాజ నం
దనుఁడనఁగన్ జనించి, వసుధాతనయన్ వరియించి పంక్తికం
ఠుని వధియించి, శిష్టుల కనూనశుభం బొదవించినట్టి రా
మునిఁ, గరుణాభిరాముని, నమోయనికొల్వ నభీష్టసిద్ధియౌ

7. కొండ, కుండ, మండ, దండ అను శబ్దములు పాదాంతములందు వచ్చునట్లు శ్రీరాజావారి కాశీర్వాదము

విజయదశమిని బూజల వెలయు కొండ
పట్టి యనురక్తిఁ జూడ నోప్రాశ్నికుండ

సుకృతమణి నాగభూజాని సుకవి మండ
లంబు గణియింపఁ గొనుత శ్రీ లక్ష్మి దండ

8. భారత, భాగవత, రామాయణ గ్రంథములు

విజయ విక్రాంతి విదితముల్, విశ్వరిపు వ
రోగ్ర సేనోద్భవస్మయ నిగ్రహములు
పుణ్యజనవర్ధన క్రియాస్ఫూర్జితములు
పాండు, వసుదేవ, దశరథ భవుల కృతులు

9. విష్ణువు క్షీరసముద్రమును మాని శ్రీ రాజావారి హృదయమున నివసించినట్లు

సారప్రాభవ! నాగభూప! సుగుణాంచ ద్రత్నరాశీ! నయ
శ్రీరమ్యామలభక్తి శాంతిరసవీచీ ప్రోల్లసత్త్వన్మనో
వారాశిన్ సిరితోవసించి హరి, తా వర్జించునింకం బయో
వారాశిన్ బహుభంగసంగతముగా భావించియత్యంతమున్

10. రాజావారి వేఁట

బారుటీటెలఁబట్టి దూరఁగా రానట్టి
పొదలెల్లఁదూటి బెబ్బులులఁ బొడిచి
చిఱుతకత్తులఁ బట్టి చెదరనీయక చుట్టి
చిఱుతల గుండియల్ చీల్చికూల్చి
కాంద్రంచుఁ బైకొని గోండ్రించు పెను వరా
హమ్ముల నహమించి క్రమ్మిపట్టి
చెంగు చెంగునదూఁకు జంగుబిల్లుల లేళ్లఁ
గుర్కురంబులఁబంచి కూలఁజేసి

అశ్వ మాతంగ సుభట మహాంగ వాద్య
చండ రవములు, వనిఁ గలగుండు వెట్ట

వాలు మగఁటిమి నాఖేట ఖేలనంబు
జరుపు నాగావనీశుండు జనకు భంగి

11. రాజసౌధములు – ప్రథమపాదాంత, ద్వితీయపాదాది వర్ణములు "రామా" అని యుండవలయును. – మత్తకోకిల

మోదముంగలిగించువస్తు లమోఘపుణ్యమునిచ్చు రా
మాది దైవతవిగ్రహంబులు నద్భుతావహముల్, సమ
స్తాదృతంబులు శిల్పముల్, ప్రమదాస్పదంబులు చిత్రశ
య్యాదికంబులు, వొల్చు, రాణ్మణి హర్మ్యపాళి సుధీనిధీ!

12. శ్రీ రాజావారి దేవీ పూజ

మన మంబాపదయుగళం
బున నేకాగ్రతను నిల్పి, పుష్పాక్షతలన్
గొని నామావళితోడన్
జనపతి వూజింప, దేవి సంతసమొందెన్

13. సమస్య : కాముఁడు వెన్నెలల్ గురిసెఁ గంతుఁడు బాణములేసెనెచ్చెలీ

నామదినాటుకొన్న యలనాఁడు మొదల్ ప్రిదులంగబోవఁదా
కోమలమూర్తి రూప, మొనగూడదు కార్యము, నిల్వదింకనా
నీమము, కోకిలంబదె ఖణిల్లని అంకెలువేసె, రోహిణీ
కాముఁడు వెన్నెలల్ గురిసెఁగంతుఁడు బాణములేసెనెచ్చెలీ

14. ధర్మరాజే, ప్రకృతప్రభువుగా జనించి బేతాళునిఁ బూజించుచున్నట్లు

శరసంఘాతమునున్, ధనుఃప్రకరమున్, సంప్రీతిరక్షించి, యా
దరువై యొప్పిన భూతనాయకుని బేతాళుం గడుంగొల్చి ద్వా
పరమందయ్యది చాల కిక్కలిని గొల్వంబూని యప్పాండు భూ
వర పుత్రాగ్రణి నీవుగా నిటు జనింపంబోలు నాగాధిపా!

15. పాండవులు, స్వస్వప్రభావములచేఁ బ్రసిద్ధిఁబడసి, ప్రస్తుతప్రభువై యవతరించినట్లు

వరధర్మప్రతిపాదనవ్రతమునన్, వైరిచ్ఛటాగర్వ ని
ర్హరణాత్యుగ్రబలాఢ్యతన్ వివిధలక్ష్యజ్ఞాగ్రగణ్యప్రథం
దురగారోహణ నైపుణిన్ సురభిసంతోష క్రియంబాండుభూ
వరపుత్రుల్ యశమొంది నీవుగ జనింపంబోలు నేకాకృతిన్

16. దసరామహోత్సవములం జూడవచ్చిన జనులు

నాగవాసములసౌందర్యంబు సంగీత
మాసక్తిఁగని విని యలరువారు
చర్మనాటకములుత్సాహంబుతోఁగాంచి
పోలుగాడుండమిఁ బొక్కువారు
గజములఁబులుల నక్కజమారఁ జేరి త
దారవంబులకుల్కి పాఱువారు
శతవధానముఁ జూడఁజాలితిమీనాఁటి
కంచు భూపాలుఁ గీర్తించువారు

స్వకరపద్మంబులం బూజసల్పు రాజ
దంపతు లితోధికైశ్వర్యధాములగుచుఁ
దనర దీవించువారైరి జనులు నేఁటి
విజయదశమీమహమ్ముల వేంకనార్య!

17. సర్వసామర్థ్యములు గల్గి సకల వ్యవహారములు స్వయముగా నిర్వహించు శ్రీ రాజావారికి దివాంజీయుండవలెనా?

అన్నిటఁదాసమర్థుఁడయి యందఱనన్ని విధాలఁ జూచుసం
పన్నతగల్గి గర్వమణుమాత్రమునొందక రాజధర్మముల్
సన్నగిలంగనీయక ప్రజాహితమొప్పు ధరిత్రినేలు నా
గన్న నృపాలవర్యునకొకం డనభిజ్ఞుఁడమాత్యుఁడేటికిన్

18. మత్స్యావతారము

సోమకుఁడను పలలాశి మ
ణీమంజూషోపమాన నిగమచయము, దు
ష్కాముఁడయి వార్ధిఁద్రోయ, మ
హామత్స్యంబగుచు విష్ణుఁ డాఖలుఁ ద్రుంచెన్

19. రాజ్ఞి గారిని గుఱించి

ఉభయ వంశముల కీర్త్యున్నతుల్ వెలయింప
జననంబుఁగాంచిన సర్వవంద్య
మేనితోడనుజాయ మెలఁగు చందంబునఁ
బతి ననువర్తించి పరఁగుసాధ్వి
రేనికిమంత్రియట్టి, నాథునకు సర్వ
విధుల నుత్సాహంబుఁ బెనుచు సుగుణ
గానంబునందు సుజ్ఞానంబునందు న
త్యున్నతస్తుతులందు నున్నతాత్మ
పుణ్యముం గీర్తి వాంఛించు పూతహృదయ
నాగనృపవీర పత్నియౌ, నంద్యచరిత
విజయరాఘవమాంబ, దేవీకటాక్ష
సిద్ధి నభిమతశుభవృద్ధిఁ జెందుఁగాత!

20. సమస్య : ఫలముల గొమ్ము, పోవునిఁకఁ బైత్యము వైద్యములేల విప్రుఁడా

వెలఁగల లోఁదలంపక వివేక విహీనత దేవదేవు కో
వెలఁగల వస్తులమ్ముకొని వేలగు మందులు గొంటివన్నియున్
వెలఁగలఁ బోలఁజాలవరవీస్కము గావున మన్మథాగభూ
ఫలములఁగొమ్ము, పోవునిఁకఁ బైత్యము వైద్యము లేలవిప్రుఁడా!

21. శ్రీ రాజావారి తండ్రిగారిచరిత్రము శ్రీవారి 'శ్రీ మదఖండ' అను బిరుదవర్ణములు పాదాదులయందు వచ్చునట్లు

**శ్రీ**మన్నృసింహధాత్రీనాథవర్యుండు
భయదమృగాటవీవహ్నియంచు
**మ**హితాత్మ! ఛాయాసమాఖ్యాఢ్య సతిగాఁగ
నంది సూర్యోజ్జ్వల్యమమరమీఱి
**ద**యయు, సాహసము నుత్సాహపౌరుషములు
జగదభి వినుతంబులుగఁ దనర్చి
**ఖం**డపరశ్వధాఖండభ క్తివిశేషు
బేతాళనాథు సంప్రీతిఁగొల్చి

**డ**మరమునడంచి, నాగరాట్ప్రముఖసుతులఁ
గాంచి, సుపదాద్యవర్ణవిఖ్యాతబిరుద
గౌరవముఁబొంది, యింద్రసఖ్యమువరించె
బులులరాజని ప్రజలెల్లఁబొగడుచుండ

22. సమస్య : స్థిరశుభంబులొసంగి రక్షింపుమంబ!

కుంకుమాంకితనిశాపంకిలాక్షతములఁ
బూజ గావించిన పూతచిత్త
కరవీర, మందార, కల్హార కుసుమవా
రముల నర్పించిన విమలహృదయ
కర్పూర, మృగమద, గంధసారసుగంధ
బంధురఁ జేసిన పావనాత్మ
శతసహస్రాయుతా ప్రతిమాననామార్చి
తాంఘ్రిగాసల్పిన యనఘబుద్ధి

శాస్త్రనిగదితసర్వోపచారవిధుల
నిన్ను సేవించినట్టినాగన్ననృపుని
పత్నిశ్రీరాఘవాంబ వినూత్నకరుణ
స్థిరశుభంబులొసంగిరక్షింపుమంబ!

23. ఉదయ ప్రార్థనము

సరసీజాసనుఁడాయురున్నతి, సరోజాతాప్తుఁడారోగ్యమున్
సరసీజాలయ భాగ్యమున్ హరిసరోజాతాక్షుఁడమ్మోక్షమున్
సరసీజాతహితాహితాగ్ని నయనశ్లాఘ్యాత్మ శ్రీమన్మహే
శ్వరి, సర్వేప్సితసిద్ధిఁగూర్పఁదలఁతుంబ్రత్యూష కాలంబునన్

24. తిక్కన మంత్రి

ఘనుఁడై పంచమవేదనామకమహా గ్రంథంబు నిర్మించి వి
శ్వనుతాత్యద్భుత ధీసమర్థతఁ గవిబ్రహ్మాంకముంజెందె న
న్యనృపస్వీకృతరాజ్యమున్ మనుమసిద్ధ్యాయత్తముంజేసెఁ ది
క్కనమంత్రీశ్వరుఁడమ్మహాత్ము నెనయంగా లేరుమంత్రీశ్వరుల్

25. యుగంధర మంత్రి

పరసేనాబలదోర్బలోన్నతులచే బందీకృతుండైన య
న్నరనాథుండు, ప్రతాపరుద్రుఁడు నిజౌన్నత్యచ్యుతింజెంద క
య్యరిసమ్రాట్కృతసత్కృతింబొరయ లోకాశ్చర్య కార్యక్రమ
స్మరణీయుండెవఁడయ్యుగంధరమహామంత్రీంద్రుఁడెన్నందగున్

26. తిమ్మరుసు మంత్రి

పురుహూతప్రతిమాన శ్రీనరస భూపున్ మెచ్చఁగాఁజేసి త
ద్వరసౌజన్యము, తన్మహీశ్వరత, రేవం గృష్ణరాయావనీ

శ్వరుఁడొందం గవిరాజకీర్తి రమలన్ వర్ధిల్లఁగాసల్పు తి
మ్మరుసున్, మంత్రికులావతంసు జగతీమాన్యున్ నుతింపందగున్

27. ఎట్టివారు మంత్రిపదవి కర్హులు

పతికిన్ భూప్రజకాప్తుఁడై, బహువిధోపాయంబులన్ శాత్రవ
ప్రతతిం గీడ్వడఁ జేసి రాణ్మణికి హర్షశ్రీలు సేకూర్చి ధీ
చతురుండై, పటుకార్యకౌశలుఁడునై సత్కీర్తులంబొల్చునే
మతిమంతుండతఁడే యమాత్యపదసంభావ్యుండగున్ భూవరా!

28. శ్రీ రాజావారి శమీ పూజా ప్రయాణము

హర్మ్యాగ్రతలములం దతిహర్షితాత్మలై
శుద్ధాంతకాంతలు చూచుచుండ
నిసుమువైచిన రాలనెడములేకుండఁగా
నర సమూహములు క్రిక్కిఱిసి నడువ
భూరికాహాళశంఖభేరికాభాంకార
రవము తత్రత్యులఁ జెవుడువఱుప
నాగఘీంకృతి, బృహన్నాళికాధాంకృతి
చెలరేగి దిక్కుడ్యములఁ బగుల్పఁ

బాదఘట్టనముల రజఃపటలమెగసి
సురనదీస్వచ్ఛజలములబురదసేయ
లలితవనమున జమ్మిపూజలనొనర్ప
నాగవిభుఁడేగుదేఱఁ గానంగనయ్యె

29. కామినీకాముకుల చిత్రపటము

తరుణి! భవద్భ్రుగంబకవితానము భ్రూలతికాశరాసనో
త్తరమున నెక్కు వెట్టి బెడిదంబుగ నేర్పుఁదొడంగెఁద్వత్సుధా

ధరరుచిరామృతంబొసఁగి, దర్పకుదర్పమడంచియాశ్రితుం
గరుణనునన్నుఁ బ్రోవుమని కాముకుఁడొక్కఁడు వేఁడుఁగామినిన్

30. ఆంధ్రీకరణము

పగలే నాచెయిఁ బట్టవచ్చెదవు గోపాలా? యిదేవింత మా
మగవారుండిరివీథిలోన నడుగోమామామ చాల్ చాలు, నీ
తగులంబెంతయొ తెచ్చునాకనెడుకాంతన్ లేదులేయంచుఁజి
ర్నగవొప్పారఁగముద్దు పెట్టిచను కృష్ణస్వామి నిన్నేలుతన్

31. తాళ వృక్షము

వర్షాతపములఁ బాపఁగబీదవార లే
యాకుల గేహంబులల్లుకొంద్రు
కాఱునెత్తురుధారఁగట్టించి గాయంబు
మాన్పించునెద్దానిమంచుబూజు
ఇనుమద్దిచేవకంటెను ఘనంబగుచేవ
దేనిమూలంబునఁగానిపించు
మందుమ్రాఁకులకుమార్మసలు నుష్ణవ్యాధు
లెద్దానిముంజచే నెగిరిపోవు

పొడుగుమానిసిఁగని కడుఁబొట్టివారు
దేనిఁబోల్చెద రద్దానిఁదెల్పఁదగదె
కృష్ణదేవాగ్రజునిరథ కేతనంబు
తాళభూజంబు శ్రీనాగధారుణీంద్ర!

32. సమస్య : జారకులావతంసమును సాఁకఁదగున్ నృపతుల్ నరేశ్వరా!

సారసుగంధపూరఘనసారమసారమటంచు మేటిప
న్నీరము, కమ్మకస్తురియు నింద్యములంచు సుగంధబంధురం

భై రమణీయమౌపునుఁగునద్భుతభంగిస్సృజించుగంధమా
ర్జారకులావతంసమునుసాఁకఁదగున్నృపతుల్ నరేశ్వరా!

33. మేనకా విశ్వామిత్రులు

గరువంపు "గుఱువంపుటిఱుకు చన్నుందోయి"
కుట్లాడ్చి రైక గగ్గోలుసేయ
శ్రవణ సరః ప్రాంత సంచరత్ఝషములై
క్రాలుగన్నులు వింతకాంతులీన
రంగు కుందనపు టరఁటి యాకుపైఁ ద్రాఁచు
సరణి వీఁపునను గీల్జడ నటింప
సర్వాంగ సౌందర్య సహజ లావణ్యముల్
యోగీంద్రు మనము నుఱ్ఱూతలూఁప

చిఱునగవు వెన్నెలలు సాఁగి చెక్కుటద్ద
ములకుఁదళుకీయ, రాయంచకులుకు నడలఁ
గమ్మతేనియలూరు గీతమ్ముఁబాడి
గాధిభవునాత్మ మేనకాంగన కరంచె

34. కర్ణు దాతృత్వము

కవచముఁ గర్ణకుండలయుగంబుఁ గిరీటిజయస్పృహాప్తి వా
సవుఁడరుదెంచికోరెడునొసంగకుమన్నితఁగాంచి యాత్మపె
ల్లవియఁగ నర్యమాహ్వయగతార్థముఁదెల్పియభీష్టపూరణో
త్సవముననింద్రుఁదన్పెను బ్రదాతృ వరేణ్యుఁడుకర్ణుఁడోనృపా

35. భారత యుద్ధ స్థలమును బాసి స్వర్గస్థలమునకుం జనిన కౌరవ వీరులు

అసమవిక్రమరాశి యాపగాత్మజుఁడేగెఁ
గుంభసంభవుఁ డస్త్రగురుఁడు సనియె

భార్గవుశిష్యుండు బహుళాస్త్రవేది క
 ర్ణుఁడుఁ జేరె వెడలె శల్యుఁడతిబలుఁడు
భ్రాతృవర్గపరుండు రారాజుపోయె వ
 రప్రభావుఁడు సింధురాజు తరలె
వైష్ణవాస్త్రోగ్రుండు భగదత్తుఁడు గతించె
 భూరిశ్రవసుఁ దురుభుజుఁడు గడచె

నరిగిరింక నసంఖ్యాకు లరిదిమగలు
ధర్మదేవత కినుకతోఁ దలఁచుటెఱిఁగి
ధర్మజాదులు పెల్లుబ్బితనరుటెఱిఁగి
భూమిభువనంబువీడి, స్వర్భువనమునకు

36. రాజావారి ధేనువు

అనిమిషనాథు గోవరమునందు, వసిష్ఠమహామునీంద్రు నం
దినియెడ, బాణవైరి వనధిప్రభునొందఁగఁజేయుబాణధే
ను నివహమందుఁగల్గిన యనూనమహామహిమంబులెల్ల నా
గన వసుధేంద్రు గోగణమునం దనువొందిశుభంబులీవుతన్

37. శ్రీరాజావారి బావమఱదిగారిని శ్రీరాజావారిని కృష్ణార్జునులతోఁబోల్చుట

ఒకరిసోదరిని వేఱొకరికి భార్యగాఁ
 గల్పించుకొని ప్రీతిఁ గాంచుకతన
సహచరవృత్తిమై సతతంబు నొకచోట
 నొకమాట పట్టునం దుండుకతన
మేనమామ సుతుండు మేనయత్త కుమారుఁ
 డనెడు బాంధవముండు నట్టికతన

నొకరి పురోవృద్ధి కొక్కరుత్సాహంబు
　　సానుకూల్యముఁ జూపునట్టికతన

ధర్మజాతాతిబలభరోత్సవుల మిమ్ము
నల్లకృష్ణార్జునులఁ బోల్పనయ్యెమాకు
రాఘవాంబిక ప్రబల హర్షమున వినఁగ
రామకృష్ణార్య, నాగభూరమణులార!

38. సత్యవ్రతము

చంద్రమతియు, హరిశ్చంద్ర జనవరుండు
సత్య సువ్రతకాములై, నిత్యకీర్తి
ధాములై రావ్రతంబు నుదగ్ర దీక్ష
సలుపఁజాలినవారు వంద్యులు నరేంద్ర

39. శ్రీ రాజాగారి మేనల్లుఁడు

నీలంపు నికరంపు నిగ్గుముంగురులపైఁ
　　గ్రమ్ము నందపుమోముఁదమ్మివాఁడు
మురిపెంపుసొంపుమై ముద్దాడఁగాఁగందు
　　పాలబుగ్గల జగ్గుపరఁగువాఁడు
రిక్కవైచినవారి దిక్కుపొర్లుచుఁ జేతఁ
　　గ్రవ్వుచుఁ గిలికిల నవ్వువాఁడు
గజ్జలకడియముల్ గల్లు గల్లనిమ్రోయఁ
　　జిన్నారితొట్టె రంజిల్లువాఁడు

కృష్ణలీలల కుబ్బి, ముగించి నిద్రఁ
గేకిసలు గొట్టుచును నాలకించువాఁడు
శ్లాఘ్య వేంకట రామ ప్రసాద బాలుఁ
డంబికానుగ్రహమునఁ బెంపందుఁగాత!

40. శ్రీ రాజావారి మేనగోడలు

క్రీడదయివాఱ గోపాలకృష్ణు తోడఁ
బుట్టువందు సుభద్రను బోలఁజాలు
పాపమారావునకు నిఁకఁ బార్థుఁబోలు
పతిని సమకూర్పుమో నాగపార్థివేంద్ర!

41. ప్రకృత రాజదంపతులవలెఁబార్వతీ పరమేశ్వరులను సేవించినవారెవ్వరు?

సురనాథుండు శచీపురంధ్రియు, మనశ్శుద్ధుల్ విడంబింప భా
సురసౌధాంతరచంద్రకాంతశకలాస్తోకప్రదేశంబులం
బరమేశీపరమేశులంగొలిచి రాఘక్కిన్, భవానీమహే
శ్వరులంగొల్చినరాజదంపతు లభీష్టశ్రీలఁజెన్నొందరే?

42. శక కర్తయగు శాలివాహనుఁడు

పురుషరూపముఁగొన్న భుజగేంద్రుఁ గూడిన
యవివాహితకు సముద్భవము జెందె
ఎముక, బొగ్గులు, మృత్తు, నుముక, మంచపుఁగోళ్ల
క్రింద నుంచిన వైశ్యు కీలెఱింగె
పశు లోహ భూ ధాన్య భాగంబు లెఱిఁగించి
విశ్వ వేదిత్వంబు విశదపఱచె
నాగేంద్రుకరుణ, మృణ్మయసేన వజ్ర మ
యంబుగా నని విక్రమార్కు గెల్చె

వసుధఁ బాలించె నేకోష్ణవారణముగ
నేఁటికిన్ శకకర్తయై పాటికెక్కె
నతఁడు శేషాంశజుండు, పూరితయశుండు
శాలివాహననామ రాట్చంద్రుఁ డనఘు!

43. రాజావారి అశ్వములు

ప్రతిపక్షక్షితిభృద్భయావహగతిన్ వర్తింపనింద్రాశ్వముల్
వితతైశ్వర్యవిచిత్రచిహ్నములు భావింపన్ ధనేంద్రాశ్వముల్
సతతానంతపథప్రచారముల నెంచన్వాసరేంద్రాశ్వముల్
మతినూహింపభవన్మహాశ్వము లసామాన్యాత్మ! నాగాధిపా!

44. బుట్ట దీపములు

నాగనృప! యుష్మదద్భుతానంతకీర్తి
సుప్రతాపద్యుతులు, సోమసూర్యవిభల
విష్ణుపదమందఁబోవఁ దద్విధు లెఱుఁగమి
బుట్టదీపంబు లందురీ భూమిజనులు

45. కర్ణార్జునుల యుద్ధము

శల్యసారథ్య వైశారద్య మొక్కట
శౌరిసారథ్య కౌశల్య మొకట
కాలపృష్టగుణటంకారంబు లొకట, గాం
డీవ మౌర్వీ మహారావ మొకట
హస్తికక్ష్యాత్మకంబగు కేతు వొక్కట
కేసరిసుతరూప కేతు వొకట
ధృతరాష్ట్రపుత్త్రక స్తుతివాక్కులొక్కట
వాసవాజాశీస్సువాక్కు లొకట

వెలయ, శస్త్రాస్త్ర పాండిత్యములు, వియచ్చ
రులు ప్రశంసింపఁ గాలరుద్రులను బోలు
కర్ణ పార్థుల రణ మభివర్ణనీయ
మై ప్రవర్తిల్లె, నాఁడు నాగన నరేంద్ర!

46. స్థైర్యాదికములగు సుగుణములు కలవారు స్త్రీలా? పురుషులా?

తెలియం బూరుషకోటికంటె, సతులందే హెచ్చుగాంభీర్యని
శ్చలచిత్తంబులు, సువ్రతాత్మ! యతిహాస్యంపుం బ్రసంగంబువే
ళల నవ్వాపుట, లో రతిప్రియతయెల్లందాఁచుటత్యుత్తమో
జ్జ్వలకీర్త్యార్జన బుద్ధిగొంట, యితరాశాత్యాగమున్సల్పుటన్

47. గడియారము

గడియారంబుపయుక్త వస్తువుల నగ్రస్థానముంజెందు, న
య్యుడు చంద్రార్కులఁగాననీక జలదం బుగ్రంబుగాఁగ్రమ్మ న
య్యెడఁ గాలంబెఱిఁగించు, సైంధవుని నాఁడీయంత్రమే యున్నచో
గడుఁగష్టంబగుఁగాదె? గాండివి ప్రతిజ్ఞం దీర్పఁగాఁ జక్రికిన్

48. సమస్య : జలముజలమ్ములోఁగలిసి సంతమసంబనఁ గ్రమ్మెదిక్కులన్

కలకలలాడు పద్మిని వికాసము వీడఁగఁ గల్వచెల్వ మేల్
కొలకొలలాడ, రేచెలి చకోరముతోఁ గనులెత్త, జక్కవల్
వలవలలాడ, నయ్యినునిఁ బాయుట కేడ్చు దినాంబుజాక్షి క
జ్జలము, జలమ్ములోఁ గలిసి, సంతమసంబనఁ గ్రమ్మెదిక్కులన్

49. మణి, మంత్రౌషధ శక్తులు

గణనాతీతముగా శమంతకము బంగారంబుఁగల్గించుటన్
బ్రణుతప్రక్రియఁబాండురాట్సుతులఁ బుత్రశ్రీకలంజేయుటన్
రణభూమింబడియున్నలక్ష్మణుఁగపివ్రాతంబుతోఁబ్రోచుటన్
మణిమంత్రౌషధశక్తులద్భుతమహామాహాత్మ్యవంతంబులౌ

50. ప్రభువులు భుజింపఁదగిన వస్తువులు

బలవద్వైరుల గెల్చిభూప్రజలఁబ్రోవన్, వ్యాఘ్రసింహాదికా
ఖిల దుష్టోగ్ర మృగావళీవిశసన క్రీడాగతిన్ గోవృషా

దుల రక్షింప, బలంబవశ్యముగ నెందున్ రాజులౌవారికిన్
వలయున్‌గాన, బలద్యుతిప్రదములౌవస్తుల్ భుజింపందగున్

51. లోకస్తుతికి, గుణముప్రధానమా? రూపము ప్రధానమా?

కామినిగాని పూరుషుఁడుఁగానిమతేమియుఁగానిరూపపున్
గోమునఁబేరుఁగాంచుటొనగూడునె? కస్తురి, కోకిలంబు లెం
దేమిటఁగాంచెఁబేరు గుణమెంతయొ కల్గుటఁజేసిగాక యే
రేమదివాని నల్పుగణియింతురె? దింతురె? తద్గుణస్తుతుల్

52. విద్యాబలము జయప్రదమా? దేహబలము జయప్రదమా?

కేవలదేహశక్తియనఁ గేకలమాత్రమెకాని సజ్జయం
బేవిధిఁ గూర్పనేర దెపుడేని జయం బొనగూర్చు విద్యయే
భూవరునాజ్ఞ నియ్యెడలఁ బోరిన మల్లురఁ జూడమే జయం
బేవఱకేనిఁ గాంచఁదగెనే యల దేహబలాఢ్యుఁ డింతయున్

53. పుష్పములలో శ్రేష్ఠమైన పుష్ప మేది?

సూనశ్రేణు లవెన్ని యేనిగల వీ క్షోణిన్ విలోకింప నే
త్రానందప్రదరూపవంతములు, ఘ్రాణామోదసంధానము
ల్గానీ! భూరిపరీమళంబున మహాహ్లాదంబు సేకూర్చు నై
ట్క్వనుంబోలుప్రసూనరాజమునెటన్ వీక్షింప మూర్వీశ్వరా!

54. శాస్త్రములందు ముఖ్యములైన రెండు శాస్త్రము లేవి?

ప్రాణులకునెల్ల నవయవ ప్రకర మనఁగ
వ్యర్థమొకటియుఁగాక ముఖ్యంబులైన
వఖిల శాస్త్రంబులందు ముఖ్యములు రెండు
శబ్దశాస్త్రము, వైద్యశాస్త్రము నృపాల!

55. భారతము

తెలుపును, రాజనీతులను దెల్పుమహోపనిషద్రహస్యముల్
తెలుపు సమస్తధర్మములు దేటగఁబంచమవేద సుప్రధన్
వెలసిన భారతంబు కురువీరచరిత్రమనంగఁ బాండు పు
త్రులహరి సర్వసత్వజయధూర్వహులై మనఁజేయలక్ష్యమై

56. సమస్య : మరుఁడుగ్రక్రుథఁదాఁకె శైవవర సామర్థ్యంబుచే శ్రీహరిన్

హరిపౌత్రుం డనిరుద్ధుఁడం చెఱుఁగకాహా! బాణదైత్యాధముం
డురు దర్పోద్ధతిఁబట్టెఁ బౌత్రకుఁదదీయోదగ్రదర్పాంధ్య మే
పఱ శిక్షింపక మాననంచు హరిరానవ్వేళనాబాధితా
మరుఁడుగ్ర క్రుథఁదాఁకె శైవవరసామర్థ్యంబుచే శ్రీహరిన్

57. రుచిగల పదార్థమేది?

రమణి సుధాధరంబని కరంబనురక్తిని గాముకుల్, రమా
రమణ కథానులాపమని రాగ విరక్తులు మోక్షకాములీ
క్రమమునఁ బల్కుచో నెదియుఁగాదు మహాకవి వర్యు భవ్య వా
గమృతమె రుచ్యమంచు రసికాగ్రసరుల్ వచియింత్రు భూవరా!

58. మనుజుని బాధించు నగ్నులెవ్వి? వానిని హరించుటెట్లు? – మహాస్రగ్ధర

హరియింపన్‌వచ్చు, నన్నాద్యలఘువిధుల న
త్యంతమౌజారరాగ్నిన్
హరియింపన్‌వచ్చుఁ గామిన్యతితరరతిసౌ
ఖ్యంబులన్ మన్మథాగ్నిన్
హరియింపన్‌రాక, దేహిన్ హరువుఁజెఱచుఁ
గ్రోధాగ్ని యొక్కండె కానన్

వరశాంతిఖ్యాత వృష్టింబఱపి, యడఁచుఁ
దత్త్వజ్ఞుఁ దద్దాని నార్యా!

59. కీర్తిలేని మానవుని జన్మము - తరలము

పరిమళం బదిలేనిసూనము పంకజేక్షణ లేని మం
దిరము, నీరము లేని కూపము, నీరజాప్తుఁడులేని యం
బరము, దేవుఁడు లేని కోవెల, పండువెన్నెల లేని రా
తిరి యనంజనుం గీర్తిగల్గని దేబెజన్మము ధీనిధీ!

60. మహారాజశ్రీ శ్రీ శ్రీ శ్రీ రాజా నరసింహనాయఁడు బహద్దరు జమీందారువారు - లయగ్రాహి

శూరగణమందుఁ దనపేరు గణనీయమగు
తీరుల నెఱింగి మృగవారముల సింహ
స్ఫారబలమేర్పడ విదారణమొనర్చి, నిజ
ధారణిసుఖోన్నతుల మీఱ విజయ శ్రీ
ధారియయి, భూరిబలసారుల నుదారులఁ గు
మారులను గాంచి నృపవీరయశుఁడై ల
క్ష్మీరమణుసేవకయి చేరె నరసింహవిభుఁడా
రహితవైరి కెనరారు పెరవారల్

61. శ్రీ రాజావారి కాశీర్వాదము

శ్రీ వాగ్దేవతధీసమంచిత వచశ్శ్రీ సిద్ధి శ్రీ దేవి ధా
త్రీ విఖ్యాతసురాజ్యలాభశుభముల్, శ్రీ రాజరాజేశ్వరీ
దేవీదృష్టిద్విషత్పరాభవకరోద్దేశక్రియాసిద్ధులున్
భావప్రీతిగఁగూర్చి నిన్మనుతురోభవ్యాత్మ నాగాధిపా!

**(సంపూర్ణము)**



# రౌద్రిసంవత్సర శతావధాన ప్రశంసా పద్యములు

శ్రీయుత కొప్పరంపుఁ గవిశేఖరులార! నియోగివంశ ర
త్నాయతనాబ్జులార! కవితా వనితావసతీకృతాత్మ జి
హ్వాయుతులార! ధీరవరులార! నమస్కృతులాచరించి మీ
కీయెడఁ బద్యపంచకమునిచ్చితిఁ గూరిమి స్వీకరింపరే

శారద మీస్వరూపము ప్రశస్తయశోధనులార! సాటి మీ
కేరునులేరు మీకయిత యెందసమాన, వలంతులీరు నా
కోరికదీరఁ బద్యములఁగూరిచి యర్పణఁ జేసికొంటి మీ
ధారకు ధారణాస్థితికిఁ దద్దయు విస్మయమంది ధీనిధుల్

అవధానంబులు పెక్కు సల్పితిరి రాజాస్థాన రంగంబులన్
బవమానత్వరమించునాశుకవితా ప్రావీణ్యముంజూపినా
రవనీనాథులు సత్కవుల్ బుధులు మిమ్మగ్గించుచున్నారలో
కవిసర్వజ్ఞవతంసులార! పొగడంగా శక్యమే నాకిఁకన్

కరమని రసజ్ఞులెంతొ యాదరముమీఱ
మీకు వేయాఱులొసఁగుచు వీఁకగూర్తు
రర్థరహితుండనౌటఁ బద్యంబులేను
శక్తికొలఁదినర్పించితి సరగఁగొనుఁడు

తృణమో, కణమో, భక్తిని
ప్రణతుఁడనగు చేనొసఁగితిఁ బరఁగంగొనుఁడీ
యణువే మేరువటంచని
గణుతించుచుఁ బ్రేమమీఱఁగా మీరెడఁదన్

రౌద్రి సంవత్స
రాశ్వయుజ బ౧౧ లు

ఇట్లు,
**యామర్తి వేంకటసుబ్బారావు**

అకలంకుండు, శతావధాని, కవిరాజాంకుండు శ్రీపాదకృ
ష్ణకవిగ్రామణి, గోపభూపతి సభన్ సంతుష్టుఁడై హృద్యప
ద్యకదంబంబులసంస్తుతించుటలుమున్‌దర్బారులోఁగంటి నే
టికిమిమ్ముంగని మీకవిత్వమునువింటింబుణ్య లేశంబునన్

పవమానత్వరనాశుకావ్యములొనర్పన్ దుష్కరప్రాసముల్
వివిధాలంకృతులందు గూర్చుచుసభన్‌విద్వన్నుతుల్‌గాంచు మీ
రవధానంబున నెట్టిక్లిష్టపు సమస్యల్ పూర్తిగావించినన్
భువినాశ్చర్యకరంబుఁగాదనుచు మద్బుద్ధిన్ వితర్కించెదన్

అతులితప్రజ్ఞశతావధానము మీరు
సేయ సంతోషంబుఁ జెందినాఁడు
బంగారుపతకముల్ భక్తినర్పించియా
స్థాన సత్కవులుగా సల్పినాఁడు
ఏనుఁగుమీఁద నూరేగించి సభలోన
నే నూటపదియాఱు లిచ్చినాఁడు
వర్షాశన మొసంగు పత్రంబుగూడ మ
క్కువ మిక్కుటముగాఁగఁ గూర్చినాఁడు

మును పితామహుఁడౌ నాగభూవరుండు
శ్రీ నృసింహకవీంద్రుఁ గోరినవిధాన
మిమ్ము మా నాగభూపుఁ డిమ్మెయిని గోరెఁ
బ్రేమ దయసేయుఁడో కవి స్వాములార!

**పెమ్మరాజు సత్యనారాయణరావు**

అనుపమకొప్రపున్‌సుకవిహంసములార! కొనుండుమన్నతుల్
కనుఁగొనినాఁడనేఁటిసభ ఖ్యాతిగఁజేయు శతావధానమున్
ఘనమతినాగభూవరశిఖామణి పండితులున్ గవీశ్వరుల్
కని వినుతించి మిమ్మధిక గౌరవతృప్తులఁజేయుటాదిగన్

అరయన్ గంటకునైదునూఱులగుపద్యంబుల్‌జగచ్ఛోద్యధీ
గరిమంజెప్పి యసామ్యులీకవివరుల్ కాళీకృపాసిద్ధ లీ
శ్వరలీలామహిమంబుఁజూపజగతిన్ జన్మించిరంచున్‌గవీ
శ్వరచూడామణులేనుతించిన మిమున్ శక్యంబె నాకెన్నఁగన్

ఓ నాగభూప! మాకీ
యానందముఁగల్గజేయు నాధ్యునకును నీ
కానందనందనుఁడు లో
కానందదుఁడిచ్చునాత్మజానందంబున్

ఇట్లు,

**పసుమర్తి కామన్నశాస్త్రి**

**రౌద్రి సంవత్సర పుష్య శుద్ధ ౧ నాఁడు మఱికొన్ని గ్రామముల వారాహ్వానించినప్పడు ప్రయాణ సందర్భములోఁజెప్పినవి**

సర్వకుటుంబభారముఁ బ్రశస్తతరార్ద్వతమ క్రియావళిన్
ధూర్వహుఁడైనవాఁడనుఁగుఁదోడుగృహంబుననుండితీర్చమే
మిర్వుర మీప్రయాణము నభీష్ట శుభప్రతిపాదకంబుగా
నిర్వహణంబొనర్చితిమి నేఁటికి నీకృపనో మహేశ్వరీ!

చలిప్రేఁగయ్యె ధనాదిగౌరవ విశేషప్రీతులంగూర్చునా
ప్తులవీడన్మనసొప్పదయ్యె జననీపుత్రాదులంజూచుచూ
పులు మెండయ్యెఁబితృప్రయోజనదినంబుంజేరరానయ్యె మే
లొలయన్నేఁటికనుజ్ఞయీయఁగదెమాకోరెడ్డిసీమేందిరా!

**మీగురులెవ్వరను ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము**

అనఘుజయంతి రామవిబుధాగ్రణి సర్వసుఖంబులొందఁజే
య, నమరభాషనేర్పినమహాత్ముని రామదుగన్వయాబ్ధి చం
ద్రుని గురురామకృష్ణబుధధూర్జటినెంచుచుఁదత్కటాక్షసి
ద్ధినిఁదగువిద్య పేర్మిజగతింజరియింతుము వీరయాహ్వయా!

**మత్సహోదరుఁడగు బుచ్చిరామకవిని గుఱించిన ప్రసంగమునుబట్టి పంగిడి గూడెములోఁ జెప్పినవి**

ప్రకటప్రజ్ఞశతావధానములొనర్పంగా, మహాశుప్రబం
ధకవిత్వంబునఁబండితస్తుతులనొందంగాఁ దగెన్‌బుచ్చిరా
మకవిఖ్యాతుఁడుమత్సహోదరుఁడు క్షేమస్ఫూర్తిమై గేహర
క్షకునేఁడుండెను ధామసీమ నయవాసా! బాలకృష్ణాహ్వయా!

**శతావధాన సభాంతమునఁ జెప్పినవి**

అరుదౌ రీవి శతావధానమును జేయం జేసి, నాగావనీ
శ్వరునిన్, సభ్యుల మెచ్చఁజేసి, మము నుత్సాహోద్యులంజేయు నీ
కరుణాపూర్ణత కే మొసంగుట నమస్కారంబులే, కాన, స
త్కరుణాదృష్టుల మన్నమస్కృతులివే గైకొమ్ము సర్వేశ్వరీ!

తమరిడ్డ ప్రశ్నముల్ తగఁబూర్తియగుట సం
    స్తవమాచరించు పృచ్ఛక గణంబుఁ
గోరిన కోర్కి సేకూరుట కతితర
    ప్రమదమందెడు రాజబంధు వితతిఁ
బద్య గద్య శ్రేణి భావముల్ దెలియఁ బ్ర
    శంసించినట్టి రసజ్ఞ వరులఁ
దనమహాస్థానమే తాదృశోన్నతి గాంచు
    టారసి ముదమందు నధిపవర్యు

స్త్రీ ప్రతానంబుతో శ్రద్ధఁజేరి, కాంచి
మోద మిగురొత్త నాత్మలో మురియు రాజ్ఞి
నిష్ట సిద్ధులు దయచేసి యేలుమెపుడు
ఘన దయాస్థాని! భర్మదుర్గా భవాని!



శ్రీమత్కనకదుర్గాంబాయైనమః

అక్టోబరు 1921 దుర్మతి సంవత్సరాశ్వయుజ మాసమున

నవరాత్ర వ్రతమహోత్సవములలో జరిపిన

# పంగిడిగూడెము సంపూర్ణ శతావధానము - II



శ్రీమద్దివ్యశతావధాన శుభగోష్ఠీ శ్రేష్ఠముల్ గాంచి ప్ర
జ్ఞామాన్యుల్ కవిపండితోత్తమ రసజ్ఞక్ష్మావరుల్ హర్ష వా
గ్దామాలంకరణద్విపోత్సవ ముఖాహ్లాదంబులీఁజేయు నీ
వోమన్ రమ్ము! శతావధానకృతి నేఁడో దేవి విశ్వేశ్వరీ!

పల్లీపట్టణరాష్ట్రసీమల, సభాభాగంబులందింతకున్
మల్లీసూనమరందసార కవితామాహాత్మ్యముంగూర్చి వి
ద్వల్లోకభ్రమర ప్రమోదరుతులొప్పందీర్చి తీవట్లె రం
జిల్లంజేయుము నేఁడు నాగనృపుగోష్ఠిన్ రాజరాజేశ్వరీ!

1. శ్రీ రాజావారి శమీపూజా ప్రయాణము

వృషభాశ్వరథహర్ష సుషమాతిశయులు రా
జోత్తమబాంధవు లొక్కవంక
హర్షప్రదాయి గజారోహణోత్సవ
యుత సత్కవిద్వయ మొక్కవంక
శంపాలతాశత సంస్ఫురత్ఖడ్గ స
ముద్భటభటరాజి యొక్కవంక
లఘునాళికోద్ధితాలఘునాదచకిత జం
తూత్కర వీరౌఘ మొక్కవంక

హితబుధోద్యోగి పరిజనప్రతతులొక్క
వంక నుష్ట్రాశ్వతతులొక్క వంక రాఁగ,
సామజేంద్రంబుపై నెక్కి జమ్మిపూజ
కేగె నయ్యారె! నాగనరేంద్రమౌళి

2. సమస్య: వనమా సాహసమింత చెల్లదుసుమా బాగోగులూహింపుమా

ధనమానంబులఁగొల్ల వెట్టి కులగోత్రవ్యక్తిఁ బోఁదట్టి దు
ర్వనితా సంగమమెచ్చఁబెట్టి పగళుల్ రాత్రుల్ ననున్మోహ పా
శ నిబద్ధాత్మునొనర్చె దేమిటికి? నీ సౌభాగ్యమెన్నాళ్లు, యౌ
వనమా సాహసమింత చెల్లదుసుమా బాగోగులూహింపుమా!

3. బేతాళుఁడు

ప్రమథగణరుద్ర గణయుతుఁ
డమలుఁడు ప్రత్యంగిరా హయాకారుఁడు భ
క్తమనోభీష్ట ప్రదుఁడరి
దమనుఁడు బేతాళుఁ డోముతను నాగనృపున్

4. పంగిడిగూడెము, ధరాస్వర్గము

అభివర్ణనీయంబు లగు మహాశ్వంబు లు
చ్చైశ్రవోముఖ్యాశ్వసమితిగాఁగ
నుత్తుంగమత్తేభయూధంబు లైరావ
ణాది దివ్యేభచయంబుగాఁగ
విబుధహర్షక్రియావిలసత్సభాలలా
మంబు సుధర్మాసమజ్జ్యగాఁగ
నున్నతప్రాసాద ముద్యాన మల వైజ
యంత నందన వనాగ్ర్యములుగాఁగఁ

బరిజనము సర్వసుమనః ప్రకరముగాఁగ
రాఘవాంబామణియు నాగరాజవిభుఁడు
శ్రీ శచీంద్రులుగాఁగ భాసిలు జగత్ప్ర
శస్తిఁ బంగిడిగూడెంబు స్వర్గగరిమ

5. సమస్య : రారాతమ్ముఁడ, రారయన్న యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్

సారాత్రావు టనర్థ హేతువది లజ్జా జ్ఞానమర్యాదలన్
నీరుంజేయుట నిక్కమిద్ది వినుఁడా నీరుం గడుంద్రావి దు
ర్వారంబౌ కయిపెక్క మైమఱచి నిర్వస్త్రాంగయై నవ్వుచున్
రారాతమ్ముఁడ! రారయన్న యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్

6. పాదచారిత్వమున శ్రీరాజావారు దేవీపూజానిర్మాల్య విసర్జనముం గావించుట

కరులన్వీడి, విచిత్రపుష్యరథసంఘాతంబులన్ వీడి, మో
టరులన్వీడి, హయంబులన్విడి, నిరూఢంబైన భక్తిన్ శివా
చరణార్చావినియుక్తపూతతరపూజాద్రవ్యనిర్మోచనం
బు రహిం గాల్నడఁదీర్చు నాగవరదేవున్ దేవి రక్షింపదే.

7. రెండద్దముల నడుమనుండెడి మనుష్యుఁడై

ముపురు మనుష్యులనొక రీ
తి విరించి సృజించె ననఁగ దీవ్యత్ప్రతిబిం
బవిధిన్ గననయ్యెడు భూ
ధవ! ముకురద్వయమునడుమఁ దానెవఁడున్నన్

8. వర్షము, దసరామహోత్సవము

వానపిశాచమట్లు గడుభంగమొనర్పఁదొడంగెఁ బోవఁగా
మానసమెప్పుడెట్లయిన మానవనాయకుడుంగవీంద్రులు
న్బానిక నేన్గునెక్కుటఁగనుంగొనిపోయెదమంచుఁ బ్రేక్షకుల్
మానక, యెంచుచోఁజనియె, మాయగవాన, ఘటిల్లెవేడుకల్

9. రాజావారి స్కూలు

బాలురపైఁ గలదయ భూ
పాలుండీ నాగవిభుఁడు భవనంబిడి జీ
తాలిచ్చుచుండెఁగావున
స్కూలువెలయఁ జేయవయ్య సుబ్బారాయా!

10. శ్రీ రాజావారి వేఁట ప్రయాణము

మాకున్ మాపరివారమర్త్యులకు క్షేమంబుంగటాక్షించి బా
హాకౌక్షేయకముగ్ర జంతుదళనోద్యత్సారముంజేసి మ
మ్మేకాలంబును బ్రోవుమంబ! యనిముందేకాగ్రతన్గొల్చి తా
వీకన్ వేఁటకుఁబోవు, నాగవిభు దేవీసత్కృపల్ సెందవే!

11. శ్రీరాజావారు చిఱుతపులిని, బేతాళునకు బలియిచ్చుట

కఱకున్ దంష్ట్రలుఖడ్గశాతనఖముల్ క్రౌర్యోగ్రరావంబులం
దఱకుం దందరనావహింపఁగ మదౌద్ధత్యాకృతిన్మీఱు న

చ్చిఱుతన్దగ్గఱి, లీల, ఖడ్గహతిచేఁ జెండాడి బేతాళుఁడె
త్తతిహర్షింపబలిన్ ఘటించు నరనేతన్ శూరులెన్నందగున్

12. నీచానీచజనసాంగత్య భేదములు

కడులాభంబగుఁగాక, నీచజనసాంగత్యంబు గర్వంబగుం
గడునష్టంబగుఁగాక శ్రేష్ఠజనసాంగత్యంబు గ్రాహ్యంబగున్
బెడఁగౌ, గాడిదనెక్కినిక్కిచనుకంటెన్, వాజిపై నేగుచుం
బడినన్, గౌరవమే ఘటిల్లు, నది సర్వశ్లాఘ్యమౌ ధీమణీ!

13. దేవునిపై నెంతభారముంచవలెను?

తనకృత్యంబులలోని లోపశతముందర్కింపఁగాఁబోక, దే
వుని నిందించుట తప్పుకార్యముసెడన్ మూఢత్వమౌనద్ది గా
లిని దీపంబిడనిల్చుటెట్లు? మతికల్మిన్ సర్వముందీర్చి, దే
వునిపైఁగార్య ఫలంబులన్నిలుపుటొప్పుంగాక సర్వేశ్వరా!

14. ధనవంతుని కుచితకృత్యములు

ధనవంతుండగునాఁడు మైమఱవకౌదార్యంబు స్థైర్యంబునున్
వినయంబున్, క్షమయుంబొసంగ యశమన్వేషించిధర్మాత్ముఁడై
మనుటొప్పున్ ధనమస్థిరంబని నిజాత్మన్నమ్ముచున్ దీపముం
డినయప్డే! యిలుచక్కఁబెట్టుమనుటన్జింతించి శేషాహ్వయా

15. సమస్య : బంగ్లాలోనికిదారియెద్ది? చెపుమా? బాలా! కురంగేక్షణా

ఆంగ్లంబందు మనోజ్ఞవైఖరి నుపన్యాసంబులన్ సల్పఁగా
నాంగ్లేయప్రభుఁడెంచిపిల్వఁగ సహాధ్యాయుండుముందేగె నెం
దుంగ్లాంతింగనకుండఁదోడ్పడఁగ నేనుంబోదు వారున్న యా
బంగ్లాలోనికి దారియెద్ది? చెపుమా! బాలా! కురంగేక్షణా!

16. ప్రస్తుతకవులకుఁగలిగిన గజోత్సవాది సత్కారములు

ప్రకటప్రాభవులై రసజ్ఞమయులై భాసిలుభూపాగ్రణుల్
సుకవిశ్రేష్ఠులఁదన్పియిప్పగిది సుశ్లోకాఢ్యులైరంచుఁ బ్రే
క్షకలోకంబుగణింప నాగనరరాట్చంద్రుండుమాకిందు వా
ర్షికసత్కారముతో గజోత్సవము దీర్పించెన్ బుధౌఘోత్తమా

17. శ్రీ రామచంద్రస్వామి

తావకనామసుధారసరుచియెల్ల
వాణీశవంద్య శర్వాణి యెఱుఁగు
భవదీయపదరజోలవమహత్త్వంబెల్ల
గౌతమమౌనీంద్రు కాంత యెఱుఁగు
త్వన్మహాబాహు దర్పప్రభావంబెల్ల
జనకపూజిత శైవచాప మెఱుఁగు
యుష్మదమోఘబాణోగ్రప్రయోగవై
భవలీలయెల్ల భార్గవుఁడెఱుంగు

శ్రితజనప్రీతియెల్ల సుగ్రీవుఁడెఱఁగు
నిరతశరణాగతత్రాణ బిరుదమెల్ల
నావిభీషణుఁడెరుఁగు నీయఖిలమహిమ
లేమెఱుంగుదు మేలు మో రామదేవ!

18. ఉత్తమాధముల వాక్యములు

దంతిదంతంబుబలె స్థిరత్వంబుఁ జెందు
నుత్తమముఖోద్గతంబయియొప్పుపల్కు
అధమువాక్యంబు తద్విధంబందఁబోక
చలనగతిఁ జెందుఁ గూర్మశీర్షంబుభంగి

19. గరుత్మంతుఁడు

వినతాసతీసుపవిత్ర గర్భారణి
 ననలాకృతిజనించి నట్టిమేటి
గజకచ్ఛపాశన గ్రహణావసరమున
 వాలఖిల్యాశీస్సుఁ బడసిన ఘనుఁ
డమరావతిని శతారాయుధునిర్జించి
 యమృతభాండముఁ గొన్నయట్టి దిట్ట
కద్రూతనూజుల కాంక్ష నిర్వర్తించి
 జనని దాస్యంబు మాన్పిన సమర్థుఁ

డధికమహిమాసనాథు రమాధినాథు
వాహనాకారమునఁ గొల్చు భవ్యుఁడెవ్వఁ
డట్టి విహగేంద్రు నసమమహత్త్వసాంద్రుఁ
దలఁప విష బాధలడఁగుఁ గాంతయసమాఖ్య

20. భూమికి "మేదినీ" నామ మెట్లు వచ్చెను - సుగంధి

కైటభాఖ్యుఁడున్ మధుండుఁ గ్రవ్యభుగ్వరుల్ నిరా
ఘాట బాహుశక్తి బ్రహ్మఁ గంజజన్ముఁగెల్వ రాఁ
బాటనంబు సల్పి చక్రి వారి మేద మెల్లెడన్
మీటి చల్లె దాన ధాత్రి మేదినీప్రథంగొనెన్

21. శ్లోకమునకు భాషాంతరీకరణము

పలుకులఁదేనెలూరువహిఁబల్కి మనంబు శిలోపమంబుగా
ఖలుఁడిల రేఁగుపండు వలెఁగన్పడెడుం బయి కెట్టులున్న న
త్యలఘుదయారసం బొదవ హర్షముఁగూర్చునునారికేళపున్
ఫలమునుబోలిసజ్జనుఁడు భావవిదుల్ గణియింత్రు సర్వమున్

22. పార్వతీ పరమేశ్వరులు

వాక్కునర్థంబనఁగ నైక్యభావమొంది
యుపనిషత్తులు వినుతింప నొప్పుజగము
తల్లి దండ్రుల కెపుడు వందనశతంబు
లిత్తు మా పార్వతీ పరమేశ్వరులకు

23. బాలకృష్ణమూర్తి విగ్రహము – మత్తకోకిల

నేలఁబొర్లుచువచ్చియున్నవనీత పాత్రములోనికిం
గేలుసాఁపి గ్రహించి ప్రక్కలుగ్రిందుమీఁదునుజూచుచుం
జాలినంత భుజించుచుం దనజాడఁగాంచు యశోదకున్
బాలలీలలుసూపు కృష్ణుని బాలవిగ్రహమద్దిరా!

24. శ్రీరామ చరిత్రము

దశరథనామ భూధవునకు జనియించి
గాధేయ యజ్ఞ రక్షకతమించి
గౌతమదార నిర్గత పాపఁగావించి
జనకు మెప్పించి సీతనువరించి
భార్గవరాముగర్వము సర్వముహరించి
పితృవాక్యపాలన స్థితిభరించి
ఆ వాలిఁద్రుంచి సుగ్రీవుమైత్రిగడించి
వనధిబంధించి రావణువధించి

అధిపునిగ విభీషణులంక కాచరించి
క్ష్మాజతో నభిషేక సౌఖ్యములఁగాంచి
సానుజుండయి విశ్వజనీనమహిమ
మించురఘుపతి మిమ్ము రక్షించుఁగాత

25. గయుని నిమిత్తము కృష్ణార్జునులు కలహించుట సుభద్రాదుల తలంపు

ఇరువురు వినకుండి రెవ్వరీపోరాపఁ
గలరొ? యంచు సుభద్ర కళవళింప
నొక్కటికన్ను వేఱొక్కటి చెవియయ్యె
నెట్లంచు వసుదేవుఁడెదఁదపింప
నేటికివచ్చెనేఁ డీమాయ గయుఁడంచు
దేవకీదేవి లోదిగులుఁజెందఁ
గ్రీడిస్వభావంబు నేఁడైన హరిబుద్ధి
కెక్కదే యని హలి యెంచి తెలుపఁ

గార్యగతులెంచి, కౌరవ గణమునొంచి
గయుని మన్నించి, కవ్వడి గారవించి
స్ఫూర్జితాస్త్రోప సంహారములఘటించి
హర్షమొదవించెఁదనవారి కచ్యుతుండు

26. సమస్య : పాముపడగనీడ నెలుక బాగుగఁ బండెన్

భీమమగుజాతి వైరం
బేమాత్రము లేక మైత్రి యిమ్మగ విష్ణు
స్వామి పదాభరణంబగు
పాముపడగ నీడ నెలుక బాగుగఁ బండెన్

27. కవీశ్వరుల నితరులకంటె హెచ్చుగా నేలగౌరవింతురు?

అనిలుఁడుదక్క, దేహులకుఁ బ్రాణసుఖస్థితిఁగూర్పలేరొరుల్
కనుఁగొననట్లు, సత్కవి యొకండె వివేకులకీర్తి, ధాత్రియుం
డిన వఱకుంచుఁ గాకొరులు నేరరు తద్విధికంచు సత్కవీం
ద్రునొరులకంటె నెక్కుడగఁదోప బహూకృతుఁజేతురుత్తముల్

28. సమస్య : సరసునివైపు వీపు నలచాన మొగంబటు గోడవైపునన్

సరసుఁడొకర్తుఁ గూడెనని స్వాంతమునం గడునీర్ష్యఁజెంది సుం
దరియటు గోడవైపునకుఁ దా మరలంగ నసత్యమంచు నా
సరసుఁడు వెన్నునానుకొని సాంత్వన వాక్యములాడఁదోఁచెడున్
సరసునివైపు వీఁపు నలచాన మొగంబటు గోడ వైపునన్

29. శ్రీరాజావారి గుఱ్ఱపు సవారి – తరలము

శతమఖుండలనిక్కు వీనుల జక్కినెక్కి విహార మి
ట్లతిచమత్కృతి తోఁపఁజేయునటంచు నెల్లరుమెచ్చ, ధా
రితక రేచితమఖ్యముల్ గతిరీతులొప్పెడు తేజిపైఁ
జతురతానిధి నాగభూపతి స్వారిసల్పెఁ గనం దగున్

30. వాక్శూరుఁడు – కార్యశూరుఁడు

అధముడుస్త్రీలచెంతఁదనయాప్తులచెంతఁబ్రగల్భవాక్యముల్
పృథులముగాఁగఁబల్కు నరవీసముఁగార్య మొనర్పలేఁడు కీ
ర్తిధనుఁడు తాశ్రమంబనక తీర్చుసమస్తము తద్విధంబులం
బ్రథితపుసాక్షులుత్తరుఁడుఁబార్థుఁడు, నాగనృపాలశేఖరా!

31. లక్ష్మీదేవి రాణిగారిని రక్షించునట్లు – భుజంగప్రయాతము

నమత్సర్వగీర్వాణి నానార్థిలోక
ప్రమోదప్రదస్వాంత భర్మాంగి శ్రీమ
ద్రమాదేవి తానాగరాడ్ధర్మపత్నిన్
క్షమన్ సర్వసౌభాగ్యగాఁ బ్రోచుఁగాతన్

32. చిత్రపటములు గల శ్రీరాజావారి సభాభవనము

ప్రాతర్వేళల రాత్రి వేళలఁ దలంపం జూడ నత్యర్హమై
పాతివ్రత్యముచే సురూపములచే భాసిల్లు స్త్రీవిగ్రహ

ర్వాతం బుత్తమరాజరూపపటముల్ రాజిల్లుటం బ్రాజ్ఞ సం
జాతంబొప్పుట నాగభూవరసభాసౌధంబు వంద్యంబగున్

33. కవులు, పండితులు

కవులుంబండితులంబుదాంబుధులనంగా నిత్యమన్యోన్యవృ
ద్ధివిధుల్ సల్పుచునుందురా, సుకవులెంతేఁగావ్యముల్ గూర్పఁద
త్సువిశేషంబులు దెల్పి పండితవరుల్ శ్రోతృప్రతానంబు న
ర్థవిధానంబులుదీర్పఁజేయుదురు ధీరా! భానుమూర్త్యాహ్వయా!

34. భరతమాత

భాసురసుమపత్ర, ఫల, లతా, వృక్ష, సుం
దరతరారామబృందములుగల్గి
ముక్కారుపంటలు, మిక్కిలిపండించు
జీవ నదీనద శ్రేణిగల్గి
అమితభాగ్యోన్నతు లమరించుమణి, హేమ
రజతాదిలోహకరములుగల్గి
నిఖిలమహాయంత్ర నిర్మాణశాస్త్రోప
దేశదివ్యగ్రంథ రాశిగల్గి

వీరజననీ, సతీ, పుత్రవితతిగల్గి
పొలుపుమీఱు భవత్పుణ్యభూమి, యీతి
బాధలొందకయుండఁ బ్రోవంగదమ్మ
భద్రకరుణాగుణోపేత! భరతమాత!

35. శ్రీరాజాగారి తండ్రిగారును, గీర్తిశేషులును, నైన శ్రీరాజా బొమ్మదేవర నరసింహనాయఁడు బహద్దరు జమీందారువారి ఛాయాపటము

పొదనుండి కవియుబెబ్బులి నెదుర్కొని బాహు
విక్రమంబునఁగూల్చు వీరుఁడంచు

మదమెత్తి పరువెత్తు మత్తేభములవెఱ
పందించు సింహసత్త్వాఢ్యుఁడంచు
భరతునిభంగిగా బహువిధక్రూర మృ
గక్రీడవర్తించు ఘనుఁడటంచు
ఎట్టిదుర్ఘటకార్యమేనిఁ గన్గొనినంత
నిరుపమంబుగఁదీర్చు నిపుణుఁడంచు

సారె కెవ్వానివిందుమా శూరసింహుఁ
డగునృసింహావనీశు ఛాయాపటంబుఁ
గన మహాద్భుత ముదయించె వినుటకంటె
నార్యసన్మాన! రామకృష్ణాభిధాన!

36. శివుఁడు తదేకదృష్టితో గంగను జూచుచున్నట్లుగానుండిన
గంగావతరణము చిత్తరువు – పృచ్ఛకుని సంశయమునకు సమాధానము

అతివంగాంచిన నెంతవానికిని మోహావేశమౌనంచుఁ ద
ద్గతబుద్ధిన్ శివుఁడూర్ధ్వదృష్టి నలగంగన్గాంచు నట్లెంచరా
దతివేగార్భటితో భగీరథునికై యభ్రస్థలిన్బాసి యీ
క్షితిఁ ప్రయ్యన్బఱతెంచు గంగ నిలుపన్మీర్షంబుఁ బైకెత్తుటౌ

37. నూతనముగఁ జేయించిన పెద్ద పడకకురిచి – భుజంగ ప్రయాతము

నవీనాకృతిన్ శిల్పనైపుణ్యమొప్పం
గవీశాభిగణ్యంబుగా విష్ణు పర్యం
క వర్యంబుతోఁ బోల్పఁగా నాగభూపా!
భవద్భృత్యుఁ డీకుర్చి బాగొప్పఁ దీర్చెన్

38. సమస్య : పూవుంగుత్తులు సోకినంతఁ గమలెన్ బొందమ్మిక్రొంబూసరుల్

దేవేంద్రాత్మజుపై విరాళిఁగడు నుద్దీపించు కామాగ్ని నా
సా వజ్రంబు మహేంద్రనీలమగుటన్ శైత్యక్రియల్ సల్పుచో
గోవిందానుజమేనుఁదీవ సొబగుల్ గొల్పించు వక్షోజపుం
బూవుంగుత్తులుసోఁకినంతఁ గమలెన్ బొందమ్మిక్రొంబూసరుల్

39. సూర్యచంద్రగ్రహణసమయముల స్నానాదులొనర్చుటెందులకు?

దినకరుఁడున్ నిశాకరుఁడు దేవనియోగముఁజెందిసర్వలో
కనికరసౌఖ్యవృద్ధులనుగల్గఁగఁజేయు మహోపకారు లా
ఘనులకు రాహుకేతు లపకారులొనర్చెడు పీడమాన్ప స
జ్జనతతిస్నాన, దాన, జప, సద్విధులన్ భజియింతురీశ్వరున్

40. శ్రీ రాజావారి హెడ్జవాబునీవీను కాదంబరి వేంకటరావుగారి పద్ధతి

మొగమాటమనుమాట మొదలెలేకెట్లు తా
నెఱుఁగునో యటె వచియించువాఁడు
తనకార్యమునకంటెఁ దానాత్మనమ్మిన
స్వామికార్యముశ్రద్ధ సల్పువాఁడు
ఆంధ్రాంగ్లభాషలయందన్ని వ్యవహార
ములకనువగు ప్రజ్ఞగలుగువాఁడు
పల్కులందొకరీతి పనులయందొకరీతి
గాని నిష్కాపట్య మూనువాఁడు

మాటయందొకయించుకమార్దవంబు
లేదనుటెకాని యాత్మలో లేశమైన
లేదు కాఠిన్యమతఁడనళీకమతి వి
భాసి వేంకటరావు సూ భానుమూర్తి!

41. దేవీపూజ స్వయముగ నొనరించిన ప్రభుదంపతులు

శ్రీయుతులై మహావిభవసింధువులై, యతిసౌకుమార్యసం
స్త్యాయులునై సతంబుఁగదుఁశ్రద్ధయు, భక్తియుఁదోపఁబూజలన్
స్వీయకరాంబుజంబులను జేయుటనీ ప్రభుదంపతుల్ జగ
ద్ధ్యేయ యశశ్శుభోన్నతులు దేవికృపన్ గ్రహియింపకుందురే

42. శ్రీ రాజదంపతుల బంధుప్రీతి

ఏమఱుపాటుగా నయిన నింత యనాదృతిఁజూపబోవరీ
ప్రేమయు, నిట్టి గౌరవగరిష్ఠతయుం గనమెందు, జానకీ
రాములఁబోల్పవచ్చు మన రాఘవసాధ్విని నాగభూపునం
చీమెయి, బంధులెల్లరువచింపఁగ వింటిమి మిమ్ముభూవరా!

43. సమస్య : అందఱు నందఱే మఱియు నందఱు నందఱె యంద అందఱే

కొందఱు సంస్కృతాంధ్రములఁ గొందఱు ద్రావిడ కన్నడంబులం
గొందఱు యావనాంగ్లములఁ గోవిదులిట్టి ఘనుల్ భవత్సభా
మందిరమందు గౌరవ సమగ్రతనుండిన వారలెన్న నీ
యందఱు నందఱే మఱియు నందఱు నందఱె యందఅందఱే

44. అశ్వత్థ వృక్షము

ఎద్దానిచిగురుల ముద్దచేరక్తగ్ర
హణ్యతిసారాదు లడఁగిపోవు
నెద్దానిఫలచూర్ణ మెల్ల స్త్రీపూరుష
లకును దేజోవృద్ధులను ఘటించు
సంతానకాము లేక్ష్మాజంబు నారాయ
ణ స్వరూపమని ధ్యానంబొనర్తు

నోటిపూతల నెగమీఁటి రసపుఁబట్లుఁ
దలఁగించు నెద్దాని త్వగ్రసంబు

వర్ణనప్రౌఢులెద్దాని పత్రమొక మ
నోహరాంగంబుఁ బోల్తు రనోకహముల
పంక్తియందగ్ర గణ్య మశ్వత్థమద్ది
పెమ్మరాడ్రామలింగాఖ్య విజ్ఞపుత్ర!

45. శరత్కాలము

కనుఁగొననొప్పుఁగాలువల కట్టలఁబూచినరెల్లు పెన్పొదల్
తనరు లసత్సరోవర వితానములన్ నవపుండరీకముల్
జనసుఖదంబులై యెసఁగుఁ జల్లని తెల్లని పండు వెన్నెలల్
జనవర! తావకామలయశచ్ఛవి శారదవేళ నెంతయున్

46. వేఁట

దుష్టమృగబాధలుడిపి విశిష్టసాధు
జంతువులఁబ్రోవ వివిధశాస్త్రప్రయోగ
లక్ష్యసిద్ధులెఱింగి యుల్లాస మొంద
గౌతమాదులు వేఁట ముఖ్యమని రధిప!

47. ద్వారకా తిరుమల

స్థిరకృపవేంకటేశ్వరుఁడె క్షేత్రవిభుండయిప్రోవ ద్వారకా
తిరుపతి సేవ్యమయ్యెఁ బెదతిర్పతినా వడుగుల్ వివాహముల్
జరుగుసతంబుభక్తి మెయిసల్పుచునుందురు ధర్మకర్తలై
తతి సకలోత్సవంబులనుదారులు మైలవరప్రభూత్తముల్

48. పెద్ద తిరుపతి

తిరుపతిక్షేత్రరాజమని దేవసముల్ స్తుతియింత్రు వేంక టే
శ్వరుఁడు తదీశ్వరుండచటసర్వమహోత్సవముల్ ఘటిల్లు న
వ్వరదుఁడుసంశ్రితప్రతతివాంఛితముల్ ఫలియింపఁబ్రోచుఁబెం
పిరవుగ నేడుకొండల పయిన్వసియించిన దేవుఁడాతఁడే

49. సమస్య : పనులుగావు సొంతపనులుగాక సీసములో

బెడఁగైన దంతపు బీరువాలివ్వి మ
 ద్రాసు శిల్పులకుఁ జిత్రము ఘటించు
మర్దళవీణాది మహితవాద్యములివి
 సకలగాయకుల సంస్తవము నొందు
దృఢపరికరములౌనినుప పెట్టియలివి
 సీమదొరలమెప్పుఁ జెందఁజేయు
రమ్యంబులగు నీలిమ్రాను కుర్చీలివి
 బొంబయివారి కబ్బురముగూర్చు

పద్మభవునకేని బ్రతిసెప్పనొప్పుశ్రీ
నారసింహనృపుఁ డొనర్చెనివ్వి
యన్యదేశశిల్పు లరుదెంచిచేసిన
పనులుగావు, సొంతపనులుగాక

50. ప్రశ్నమునకుఁబ్రత్యుత్తరము

పోలేపెద్ది సువంశ భూషణుఁడు సద్బుద్ధి ప్రవృద్ధుండు ని
ష్కాలుష్యోక్తిమధుప్రసారుఁ డుచితజ్ఞత్వంబునన్ మేటిభూ
పాలా!మున్ గుడివాడఁబిల్చి మము సంభావించె సమ్యక్సభన్
ధీ లేఖర్షభ దేశికుల్ సుకవితాధీరుల్ నుతుల్ సల్పఁగన్

51. శైవ వైష్ణవాది, వివిధమతములవారు, వివిధ విధముల
సేవించుట వలన దేవుఁడొక్కఁడే యనుటెట్లు?

అంబరిల్లయనన్, గొడుగనఁగ ఛత్ర
మనఁగ, నాంగ్లాంధ్ర, దైవభాషాంతరముల
నొక్కవస్తువయిన యట్లె, యొప్పుదేవుఁ
డొక్కఁడయి పెక్కునామంబు లొనర ననఘ!

52. అదృశ్యుఁడగు దేవుఁడుండెనని తెలియు టెట్లు?

చలితములౌమహీజములశాఖ లగోచరుఁడైన వాయువుం
దెలిపినయట్లు, జ్యోతిషముతీఱు పరాగవిధంబుఁ దెల్పున
ట్టుల, భగవంతుఁడుండుటకడున్ ధ్రువమంచును, దెల్పుసృష్టి వృ
ద్ధి, లయము, లన్న కార్యములె, తేటగ నింక వచింపనేటికిన్

53. లక్ష్మీనివాసస్థానములు

శూరులబాహులన్ సుకవిసూక్తుల సాధ్వులయాననంబులన్
వారణ, వాజివర్యముల, వారిరుహంబుల, గోవృషంబులన్
సారసుగంధపుష్ప, ఫల, చారువనంబుల, సస్యభూములన్
హారిహిరణ్యరౌప్యముల, నద్దములన్ సిరియుండు మాధవా!

54. శమీపూజా సమయ ప్రయాణక్రమము

మొదలుర్వీశ, కవీశ, దంతియుగ, మాముందప్పరస్సంశయా
స్పదలౌవేశ్యలనాట్య, మక్కెలనదైవ ప్రార్థనార్యాళి, ప్ర
క్కదెసన్ బంధులుఁబ్రాడ్వివాకు, లితరగ్రామాగతుల్రాఁ గడు
న్మదిఁబొంగించెను జమ్మికేగెడు ప్రయాణంబెల్ల వాద్యంబులన్

55. మద్రాసులో శ్రీకానాటు ప్రభువును శ్రీరాజావారు సందర్శించి చనుదెంచుట

ఈనాఁటికొదవిన కానాటునృపు సభ
నున్నతోచితపీఠ మొనరుటకును

ప్రసిడెన్సిఁబాలించు ప్రభులువిల్లింగ్డను
ప్రభృతుల పరిచితి పరఁగుటకును
రాజులతో, మహారాజులతోడ స్నే
హప్రసంగానంద మమరుటకును
వేమవరాన్వయ రామదాససుధీంద్రు
గౌరవప్రేమముల్ గాంచుటకును

రాజ్ఞితోఁదత్సహోదరప్రముఖకార్య
సచివ పరిజనములతోడ శ్లాఘ్యనగర
చిత్రములఁగాంచి పురినెమ్మిఁ జేరుటకును
హేతువగుదేవి నృపు నిత్య మేలుఁగాత

56. సికిందరాబాదునగరవైశ్యవరేణ్యులు శ్రీరాజావారిని తగువిధముల గౌరవించుట

శ్రీ సికిందరబాదు సెంటరుస్టేషను
నందు "ట్రయిన్ డిగ్గి" రన్నయంత
రత్నాకరుఁ గుబేరుఁ బ్రతిసేయవచ్చు నై
శ్వర్యనిధుల్ పురీవైశ్యమణులు
మేలుమోటరుల, బగ్గీలనెదుర్కొని
పుష్పదామముల నామోదమొసఁగి
మంగళతూర్యముల్ మహినిండమ్రోయ నూ
రేగింపుటుత్సవ మెలమిఁదీర్చి

ఇద్ధవిభవాఢ్యుఁడగు జగదీశుహర్మ్య
రాజమందుంచి యే నరరాజమౌళి
నర్హ గౌరవములఁ దన్పిరట్టినాగ
నృపవరు, నుతింపఁదగు, రామకృష్ణరాయ!

57. తొమ్మిది పదయేనుగా నయ్యేననుటకు

నవరాత్రవ్రతసూత్సవ
మవిరతదీక్షలనుబెంచి యనఘాత్ముఁడు నా
గవిభుండొనరించుట, రా
ఘవ! తొమ్మిదియే, పదేనుఁగా సాఁగెఁజుమీ

58. శిష్టులను పరాభవింపఁబూనినవాఁడేమగును?

పరులన్ శిష్టులనిర్నిమిత్తముగఁదాభంగింపఁగాఁబూను ము
ష్కరుఁడెందేనియు దైవవంచితుఁడునై కష్టంబులంజెందు ధ
ర్మరతస్వాంతులఁబాండుపుత్రుల నలంపంబోయికౌరవ్యుఁ డె
ల్లరునవ్వన్ మును జిత్రసేను వలనన్ లావేది కీడందఁడే?

59. వేఁడిపాలు త్రావిన పిల్లి

వేఁడిపాలు త్రావి పెదవి కాలిన పిల్లి
తక్రమిడిన నమ్మి త్రావఁబూన
దొకట భంగ మొదవ, నొగిని దద్రూపకా
ర్యములు సంశయాస్పదములుగావె?

60. దసరాలో మహోత్సవములఁదిలకింప నితర పట్టణములనుండి
వచ్చిన రాజబంధువులు

చందు వేంకటకృష్ణ సత్సమాఖ్యా సము
ద్భాసి సికిందరాబాదు నుండి
చంద్వన్వవాయభూషణమూర్తి యాంజనే
యఘనుండు బందరునందునుండి
బూరుగడ్డన్వయోదార నారాయణ
రావునాయుఁడు కంకటావనుండి

కోలపల్యాహ్వయగోత్ర సీతాపతి
రావు తా సేనాపురంబునుండి

రాఘవఘనుండు ముక్కొల్లుగ్రామవరము
నుండి సర్వేశ్వరాదులత్యుత్తమ స్వ
నగరములనుండి వచ్చి శ్రీనాగనృప కృ
తోత్సవములకుఁగడు హర్ష మొందిరనఘ!

61. ప్రస్తుత కవుల నివాసస్థానమగు కొప్పరమునందలి విప్రులు

ధీలలితుల్, కవీంద్రులు, శ్రుతిస్మృతివేత్తలు తత్ప్రచారులా
ర్వేలనియోగివర్యులు, ప్రవీణులు జ్యోతిషమందు వేద వి
న్మౌళులు వైదికోత్తములు మత్పురియందు వసింత్రు నాగభూ
పాలవరేణ్య! కొప్పరపువారనఁ జింతలపాటివారనన్

62. గాజుచెట్టు

అనఘత్యాగ గుణంబులో వినిమయవ్యాపారుఁడౌనింద్రుఁగా
దని నిన్ దానకళాధురంధరుని నభ్యర్చింప నేతెంచి దే
వనగంబా దివినుండి నొల్లమి భువింబాదంబిడన్ రామి రా
డ్జనమౌళీ! తగె గాజుచెట్టన భవత్సౌధాంతరాళంబునన్

63. చీఁకటి

రాజు తమిఁజేరునని నిశాభ్రమరచికుర
యమున నీరాడి నీలచేలముఁ గురంగ
నాభితిలకం బసిత భూషణములుదాల్చి
కురులకిడు ధూపమన నిరుల్ వఱలునసఘ!

64. మూఁడు కలవాఁడు పుణ్యవిశేషము గలవాఁడు

ధనవిద్యా సౌజన్యము
లనుత్రితము గల్గుటరిది యవియన్నియు నె
వ్వనియెడఁ జూడంబడు నా
ఘనుపుణ్యవిశేష మఖిల గణ్యంబనఘా!!

65. శ్రీ మైసూరు రాజదంపతుల చిత్రపటము

శ్రీరమతోడవిష్ణుఁడు శచీసతితో నమరేశ్వరుండు భా
షారుచిరాంగితో నజుఁడు శైలజతోశశిమౌళి యా రతీ
సారసనేత్రతో స్మరుఁడెసంగిన భంగిని రాజ్ఞితో మహీ
శూరమహీశ్వరుండమరశోభిలుచిత్రపటంబుఁ గాంచితే!

66. సమస్య: కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపుర్వని యెంతురేకదా!

కట్టిఁడి సూర్యనందనుఁడు కార్యమెఱుంగక దుష్టబుద్ధియై
చుట్టలు మిత్రులున్ సతులు సూరెలఁగొల్వ సుఖాననున్న వాఁ
డట్టె యిఁకేల తామసిల నాతని త్రుళ్ళడగింపు లక్ష్మణా!
కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరి పుర్వని యెంతురేకదా!

67. పద్మవ్యూహ నాటక కర్తలగు కాళ్ళకూరి నారాయణరావుగారిని మీరెఱుఁగుదురా?

నీతినిధానమై నెగడంగఁజిత్రాభ్యు
దయరూపకము సుధాధారఁజేసె
అలవిరూపాక్ష పీఠాధీశుఁడగు జగ
ద్గురుచే మహాకవి బిరుదమందె

సుకవితావిదులు నాటకరాజ మిదియని
పొగడఁ "పద్మవ్యూహమును" రచించె
స్వకృతికన్యలనిచ్చె సగుణల సాలంక
రణల శ్రీవీరభద్రగుణి మణికి

దుర్మతులవాదముల దుమ్ముధూళిసల్పె
శతవధానాది చిత్రముల్ జరిపె సభలఁ
గాళ్ళకూరి నారాయణ కవివరుండు
జగమెఱుఁగ మేమెఱుంగమే సరసవర్య!

68. నలచరిత్రములోని నీతి

క్షమనన్యుండెటువంటివాఁడయిన ధిక్కారంబుఁగావించి దే
హమనోవాక్కులభర్తఁగొల్చుటసతీన్యాయంబటంచున్ స్వకా
ర్యములెట్లేగిన శ్రేష్ఠుఁడర్థులనుమెప్పందించు టొప్పంచు నా
దమయంతీనలసచ్చరిత్ర తెలుపున్ధన్యాత్మ వీరాహ్వాయా!

69. సమస్య : కొక్కొరో కోయనుచుఁగోడికూఁతగూసె

కినిసి నవదంపతులుఁ జోరులును శపింపఁ
బ్రభుభటులు నైష్ఠికులుఁ గార్యపరతనేగఁ
దమ్మి గుమ్మడులకు సోయగమ్ము హెచ్చఁ
కొక్కొరోకోయనుచుఁ గోడికూఁతఁగూసె

70. హరిశ్చంద్ర చరిత్రములోని నీతి

తన సర్వస్వము కొల్లవోయినను దాదాస్యంబుచే స్రుక్కినం
దన భార్యాసుతులన్యుపాలయి యవస్థల్ పెక్కువాటిల్లినన్
మనమందింత యసత్యమొల్లని సుధీమాన్యుండు కీర్త్యున్నతుల్
గనునంచుందగఁజంద్రమత్యధిపుసద్గాథన్ గ్రహింపందగున్

71. సఖీజనోక్తులకుఁ బ్రత్యుత్తరంబులొసంగి పార్వతీదేవి పరమేశ్వరుని వరించుట

కనకాంబరంబునకంటెను రమ్యంబు
పులికళాసము పువ్వుఁబోణులార
కమల కల్హారాదికముల కంటెనుమేలు
మదనపుష్పవరంబు మగువలార
నవరత్నహార సంతతులకంటె బెడంగు
ఫణిరాజహారముల్ పడఁతులార
కర్పూర రజములకంటెను గణ్యంబు
లాలేపభసితంబు లతివలార

సౌధములకంటె సౌందర్య సంయుతములు
శైలములు సతులార! ప్రశస్త సర్వ
సురవరులకంటె నధికుఁడీశ్వరుఁడు కాంత
లార! యని తెల్పి వరియించె గౌరి శివుని

72. రామేశ్వరము – రామలింగేశ్వరస్వామి

శ్రీమద్బ్రహ్మకుల ప్రసూతుని దశగ్రీవున్ వధింపం దదు
ద్దామాఘంబటఁగ్రమ్మఁ దన్నిష్కృతికిం దారామదేవుండు సీ
తామాహాత్మ్యవతీప్రణీత సికతాత్ర్యక్షుంబ్రతిష్ఠించె లో
కామోదాప్తిగ సేతుసన్నిధిఁ గనుండారామలింగేశ్వరున్

73. జీవాంతము వఱకితరునకు వశముగానివేవి?

పాతివ్రత్యముగల్గు కాంతకుచముల్ వ్యాఘ్రోగ్రదంష్ట్రావళుల్
నీతింబాసినలుబ్ధమర్త్యధనముల్ వీరాగ్రణీపాణి వి
ద్యోతాస్త్రంబులు, నన్యుచేఁబడవు ప్రాణోత్క్రాంతియౌదాఁక ప్ర
ఖ్యాతి ప్రాంచితదానవైభవ విహారా! నాగధాత్రీశ్వరా!

74. అతిబాల్య వివాహము

అతిబాల్య వివాహము వల
దతి వేలాంబోధి నడుమ నఱ్ఱాడెడు నో
డ తెఅంగుఁగాంచుఁద జ్జీ
విత మనిశము దైవకృపకు వేగిరపడుచున్

75. అర్జునుని యెడల శివుఁడెట్టివాఁడు?

కౌరవగర్వభంజకముగా దయఁబాశుపతంబొసంగి పం
కేరుహబాంధవాత్మజుని గెల్పునకొండుదలంచి తద్విధిన్
వారిజ సంభవాద్యమరవర్యుల నెన్నఁగఁజేసి సాధుర
క్షారతుఁడీశ్వరుండునరుగాధజయోజ్జ్వలుసల్పె భూవరా!

76. రాజుగారి వేఁట డేగలు

కూలుచు బలవత్ఖగముల
వ్రాలుచు శశకములఁ జిత్రపక్షంబులు నా
భీల ఖర నఖముఖంబు ల
వేలాద్భుతమొసఁగ నాగవిభుసాళువముల్

77. రాజాగారి వేఁట కుక్కలు

విదళించుఁ బులులనైనన్
బెదరించుంగరులనైన వివిధమృగములన్
సదమదము సేయు దిక్కులు
ప్రిదులన్ బొబ్బలిడి నాగవిభు జాగిలముల్

78. రాజాగారి తటాకములు – లయగ్రాహి

ఝుమ్మను రవమ్ము శ్రవణమ్ముల కలంకృతి వి
ధమ్మయి ప్రమోద మధికమ్మొసలుపం గెం
దమ్ములను శ్వేతవనజమ్ములను, నీలజల
జమ్ములను మత్తమధుపమ్ములు, భ్రమింపం

గమ్మని సుగంధ పవనమ్ములు, తటమ్ములది
టమ్ములుగనుండిన ద్రుమమ్ముల జనింపన్
శమ్మిడు తటాకనికరమ్ములు, పయోధి సదృ
శమ్ములయి నాగనృపు సమ్మదముఁ బెంచున్

79. సీతను రాముఁడరణ్యమున కేలపంపెను?

అల లంకాపురి సీతసాధ్వియని వహ్న్యాదుల్ దిశాధీశ్వరుల్
తెలుపంజేర్చితి నీయయోధ్య జనసందేహంబుపోఁ దొంటిరీ
తుల దేవావళి తెల్పునంతవఱ కిందున్నిల్పఁగాదంచు శ్రీ
నళినాక్ష్యంశజ సీతఁ గానకనిచెన్ రాముండురాజాగ్రణీ!

80. శ్రీ రాజదంపతులు షడృతువులయందుఁ జేయుపుష్పపూజ

మాధవీమల్లికా కదంబములఁ బద్మ
ములను జేమంతులను గుందములను భక్తి
రాఘవాంబయు శ్రీనాగరాజవరుఁడు
నాచరింతురు, ఋతుషట్కమందుఁ బూజ

81. ధర్మములు – స్రగ్విణీవృత్తము

ప్రాణముల్ బుద్బుద వ్రాతముం జంచలా
శ్రేణులంబోలుటన్ జేతురెంతేని ని
ర్వాణసౌధాగ్ర సౌభాగ్యముంగాంచ ని
శ్రేణులౌధర్మముల్ శిష్టవర్యుల్ నృపా

82. పులిపాక భానుమూర్తి

అలఁతంజెందక పత్రికాపఠన మత్యాసక్తిమై సల్పుచుం
దెలుపున్ సంగతులెల్లలౌక్యవిధులందెల్వింగడుంజూపు నీ
పులిపాకాన్వయభానుమూర్తినయసంపూర్ణుండుయుష్మత్కృపా
కలనంబెంపు వహింప నర్హుఁడు సుధీగణ్యాత్మ! నాగాధిపా!

83. సమస్య: దృఢసత్త్వంబునఁజీమతుమ్మెఁగదరా! దిగ్దంతులల్లాడఁగన్

ద్రఢిమన్మీఱిన పాండుపుత్త్రుల మహాస్త్రప్రౌఢులన్ రాట్పురీ
వృఢలోకాద్భుత విక్రమక్రములనాఁపె న్సైంధవ భ్రష్టుఁడా
దిఢులీంద్రోపములైన నీశ్వరవరాధిక్యంబునంజేసి హా!
దృఢసత్త్వంబునఁ జీమ తుమ్మెఁగదరా? దిగ్దంతులల్లాడఁగన్

84. ఆశీర్వాదము నభిలషించివచ్చిన పుత్రుఁడగు దుర్యోధనుఁడు - గాంధారి

ఎచట ధర్మంబు వర్తించు నచట జయము
గలుగు ధర్మోజయతియంచుఁ దలఁచి పుత్ర
కదన మొనరింపు మనెఁగాని జ్ఞానపూర్ణ
యగుట గాంధారి దీవింప దయ్యెసుతుని

85. గులాబి పువ్వు

కళుకెసఁగుబాలు పాలబుగ్గ కెనవచ్చు
బంతిపువ్వులకంటె నత్యంతకాంతి
మంతమైయొప్పుఁ బద్మసామ్యమగు రూప
సౌరభంబులఁ బుష్పరాజము గులాబి

86. ఎట్టివారు సభయందుఁ బ్రశంసాపాత్రులు? - మందాక్రాంతవృత్తము

సారాసారజ్ఞులమలయశస్సంగ్రహోత్యాతురాత్మల్
ధీరుల్, సత్యోక్తులు, వితరణస్థేమ హస్తప్రశస్తుల్
శ్రీరమ్యుల్, త్వత్సదృశు లధికాస్తిక్యభావుల్, కవీంద్ర
స్మేరాలోకాంచితమగుసభం జెందయోగ్యుల్ నరేంద్రా!

87. సూర్యనారాయణమూర్తిగారిని గుఱించి

పాయక, కొప్రపున్ సుకవివర్యులకభ్యుచితోపచారము
ల్సేయుజనంబునేమరుట లేక పరామరిసించి తెల్పుమం

చాయతబుద్ధిమీరునిచినట్లుగ మెచ్చుగఁజేసె సూర్యనా
రాయణమూర్తి గౌరవవిదగ్రణి వీవగుటన్నృపోత్తమా

88. సమస్య: పృథ్వీన్ సాధ్వీసదధ్వచారులను మెప్పించున్ యశంబుంగొనున్

ఆ ధ్వాంతాపహరుల్ దిశాపతులు భూ
మ్యాకాశముల్ స్తోత్ర శ
బ్దధ్వానంబులతో సతీత్వమెతిఁగింపం
బంక్తికంఠాసురేం
ద్రధ్వంసిన్ముదితాత్ముఁజేసికొను సీ
తాకాంత చందంబునం
బృధ్వీన్ సాధ్వీసదధ్వచారులను మె
ప్పించున్, యశంబుంగొనున్

89. దుష్కరప్రాసములకును, ఇతర కఠినవిషయులుకును, ప్రత్యుత్తరములు వెంటనే యెట్లుతోఁచును?

భగవతీకృపా ప్రభావంబుచేత దు
ష్కరపుఁ బ్రాసములకుఁ గఠినవిషయ
ములకు నుత్తరములు స్ఫురియించుఁజుమ్మి స
ర్వేశనామధేయ! కృతివిధేయ!

90. సమస్య : సారమహనీయమహిమ కాధారమగుచు క్షీరసముద్రవిషయముగా సీసములో నుండవలయును.

విష్ణువక్షస్థల విహరణ శ్రీధన్యఁ
గమలాలయాదేవిఁ గన్నకతన
నాదితేయులను దివ్యామృతంబున జరా
మరణ వర్జితులుగా మనుచు కతన

గల్పక ద్రుమపంచకంబుఁ జింతామణి
స్వర్గ పాలకునకొాసంగు కతన
వెలుఁగు తేనికిజోడు గలుగ వెన్నెలతేని
సృష్టిఁజల్లని మతిఁజేయుకతన

ధేనువుల నగ్రగణ్యమై తేజరిల్లఁ
గామధేనువు నొాదవించుకతన క్షీర
జలధివర్యంబు సర్వ సంస్తవ్యమయ్యె
సారమహనీయ మహిమ కాధారమగుచు

91. ప్రైవేటు సెక్రటరీ శ్రీవెల్లటూరి వీరయ్యగారు

ఊరన్ రాజ్ఞియురాజులేరనుచులోటొాందింతుమేయంచుఁబ్ర
జ్ఞారూఢింబ్రయివేటు సెక్రటరి వీరార్యుండు భావత్క చే
తోరాజీవ వికాసముల్ పొసఁగ సంతోషంబిడెన్మాకు స
త్కారజ్ఞోత్తమనాగభూప! భవదాజ్ఞాయోగముల్ వంద్యముల్

92. సమస్య: పుష్పాస్త్రుండేవఁడేమి సేయుజననీ! పూజ్యాత్మవై యుండిమీ!

దుష్పాండిత్యపు వాదమేల? కృపఁబుత్రున్వీడుమా నన్ను వా
స్తోష్పత్యున్నతు లెన్నియున్నఁదుదకున్ బూదింబడున్ దేహమా
నిష్పాపోపమితంబుఁ దుష్టజగతిన్జిత్రాంగి నానోర్చెదే
పుష్పాస్త్రుండెవఁడేమిచేయు జననీ! పూజ్యాత్మవై యుండుమీ!

93. సమస్య : శుభ్రాదభ్రయశస్కు నభ్రపదువిష్ణుం జేకొానెన్ భర్తగా

ప్రభ్రాజన్మహిమన్ సుపర్వుల సుధంద్రావించెనంచుం బయో
జభ్రూణస్తుతులొాందెనంచు నసదృక్సౌందర్యుఁడంచున్ రమా
సుభ్రూరత్నము, చంద్రసోదరి సురీస్తోమార్చితాంఘ్ర్యబ్జయై
శుభ్రాదభ్రయశస్కు నభ్రపదు విష్ణుం జేకొానెన్ భర్తగా

94. నగరు తగరు తొగరు వగరు అను పదములు
పదాదులయందుండునట్లు చంపకమాల శివధనుర్భంగము

**నగరున** శ్రీవిదేహ నరనాథుఁడు సల్పుసమర్చనెన్న కెం
**త గరు**వమూనిచేసెశివధర్మవిభంగమటంచు నేత్రముల్
**తొగరు**కొనంగ దాశరథితో భృగువర్యుఁడెదర్చ భీతిమై
**వగరు**చతంద్రిఁగన్గొని యపారధృతిన్ రఘువీరుఁడిట్లనున్

95. సమస్య : నానాఁటికిఁ దీసికట్లు నాగంభొట్లూ

ఏనెట్లు సేతుఁగాఁపుర
మీ నాతుకతోడబుద్ధి యేర్పడదయ్యో!
పూనిక నేనెట్లోర్చిన
నానాఁటికిఁ దీసికట్లు నాగంభొట్లూ!

96. వీరభద్రస్వామి – స్రగ్ధర

త్ర్యక్షున్నిందించె, నంబందలఁక కతిమనస్తాపసందగ్ధఁజేసెన్
వీక్షింపన్బంధుఁడే యీవిమతుఁడని యసిన్వీతశీర్షుంబొనర్చెన్
దక్షున్భానున్శిఖిన్దంతములురసనలుందప్పదాటించెఁబ్రోచున్
రక్షాసక్తామరాళిన్, రహిఁదలఁపుసమిద్రౌద్రు నవ్వీరభద్రున్

97. కోటశక్తియగు రణాంకాదేవి – స్రగ్ధర

ప్రాకారస్థానశక్తి ప్రథవెలయువిపద్ద్రావటంకన్, రణాంక
న్లోకాతీత ప్రభావ న్గొలిచివిజయ సంతోషముల్నాగ నాఖ్యో
ర్వీకాంతుం డొందుఁగాతన్ శ్రితులు, హితులు, హర్షింప వర్ధిల్లి నిచ్చల్
రాకాచంద్రాభకీర్తి ప్రభల దశదిశల్ రాజిలం జేయుఁగాతన్

98. విఘ్నేశ్వర స్వామి

శ్రీవిజయప్రమోదములు, సింధుర సైంధవగోవృషాదిశో
భావిభవోన్నతుల్ పొసఁగఁబౌరసుహృత్పరివారవృద్ధులున్
భావుకభంగిఁజెందఁ గరివక్త్రుఁడు భక్తహితుండు రాఘవాం
బావిభునాగనప్రభు నపారకృపారసమొప్పఁ బ్రోవుతన్

99. వేణుగోపాలస్వామి – మాలినీవృత్తము

విపులవిజయలక్ష్మల్ వృద్ధిగా నాగభూపు
న్నృపకుల మణిదీపుస్ప్రీతి రక్షించుమెప్డున్
సుపథహృదయవర్తీ! సూరిసంస్తుత్యకీర్తీ!
విపదగ పవిభావా! వేణుగోపాలదేవా!

100. సూర్యనారాయణస్వామి

నీయంఘ్రుల్, వినతాపదుద్ధృత తమోనిర్భేదమున్నల్పి ల
క్ష్మీయుక్తంబులుగా హృదబ్జముల రంజిం చున్నతంబౌట నా
మ్నాయాకారుని నిన్నుఁగొల్చెదము సంరక్షింపవే సత్కృపన్
ఛాయానాయక! భక్తబాంధవ! గ్రహేశా! సూర్యనారాయణా!

సంపూర్ణ శతావధానము సమాప్తము



# శతావధాన ప్రశంసా పద్యములు

❀❀❀❀❀❀❀

మునుసంపూర్ణశతావధానము మదాప్తుండైననాగయ్య సే
ట్టునియన్ మీరొనరింపఁగాంచితిని హైదర్బాదునన్నేఁడునా
గన ధాత్రీశ్వరుమ్రోలఁజేయుట వినంగాఁగల్గియేతెంచుటం
గనుభాగ్యంబులభించె వెండియును వేడ్కంగొంటినోసత్కవుల్

అనఁగావిందురసజ్ఞులెందఱొసమస్యాపూరణంబందునన్
ఘనులీకొప్పరపుంగవీంద్రులని, మున్గన్నారఁగాగంటి విం
టిని నేఁడీజననాయకేంద్రునిసభన్ నిక్కంబయౌనంటి నే
నినినన్ వ్యర్థుఁడఁగాను సేతునవధానాదుల్విలోకింపుఁడీ

ఎదురంబల్కఁగఁజొచ్చినాఁడితఁడువీఁడేపాటివాఁడంచునన్
ముదురుంజూపులఁజూడఁబోకుఁడు మనంబున్నిల్పుకోలేక ప
ల్కెదమున్ మీకవితాలతాంగివగఁగుల్కెంగాని బాల్యస్థితుల్
వదలన్నేరదు నేఁడు ప్రౌఢయయిమత్స్వాంతంబుఁజూఱంగొనెన్

ప్రతిభాసంపద, ధారణాబలము, ధారాశుద్ధియున్మీకుసు
స్థితిమైఁబుట్టువుతో లభించెనన సందేహంబులేశంబులే
దతిలోకస్తుతులైన మీకుమతినేనా సర్టిఫైచేయుటల్?
మతిచాంచల్యముఁజేసి పల్కితిక్షమింపంజెల్లునోసత్కవుల్

అలభోజక్షితిపాలకృష్ణనృపులుద్యత్కీర్తిసాంద్రుల్ కవి
త్వలతాంగిం గడుశ్రద్ధఁబెంచుకతనన్ ధాత్రీధ్రముల్వోలెవా
రలనామంబులు సుస్థిరత్వముగొనెన్ రాజేంద్ర నీవవ్విధి
న్నలుపంబూనుటవింటిఁదత్సముఁడవైసత్కీర్తిరాణింపవే

**పి.వేంకటకృష్ణ కవి**

ఇచ్చితిఁగొన్నిపృచ్ఛకుల నీయఁగఁజేసితిఁగొన్ని ప్రశ్న లె
ట్లిచ్చినఁగానివానిద్యజియింప, కదల్పకపూర్తిచేసి నా
యిచ్చనుదీర్చియుంట క్షమియింపుడుచేసినతప్పుఁ జెప్పితిన్
బొచ్చెములేని ప్రేమనునుబూర్ణమతింగనుఁడో మహాశయుల్

అభ్రగంగా వేగ మది యెట్టిదో యంచు
 నిసుక ముద్దల నడ్డ మిడిన యట్లు
ప్రళయాగ్ని హోత్రమేపాటిదియో యంచు
 దూది బోరెంబులు త్రోసినట్లు
కడునగాధంబైన కడలి లోతెఱుఁగంగ
 మూర పుల్లను గొల్వఁబూని నట్లు
వేఁడి వెల్గున కెంత వేఁడి గల్గునొ యంచు
 నవనీతపు పరీక్ష నడిపినట్లు

ఆంధ్ర జగమెల్ల శతవధానాది చిత్ర
కార్యముల మెచ్చఁజేసి యఖండ కీర్తి
బిరుదములఁగొన్న మిమ్ము నేఁడెఱుక మాని
చేసితిఁ బరీక్ష, సైచి నా చేసినట్టి
యపకృతిని మర్వఁడయ్య మహాత్ములార!

ప్రథమమౌ బాలసరస్వతీ బిరుద వ
 ర్యము గోపభూపుచే నందినారు
ఆశుకవీంద్ర సింహాంకంబు విక్రమ
 సింహపురంబునఁ జెందినారు
అలచెన్నపురసభయం దాశుకవి చక్ర
 వర్త్యభిధానంబుఁ బడసినారు
అవధానిపంచాన నాహ్వాయంబును భావ
 పురకవిబుధులచేఁ బొందినారు

ఇంక బిరుదంబు లెన్నొ గ్రహించినారు
బిరుదభూషణహారముల్ వేసినారు
పూర్వకవిరాజ సమకీర్తిఁ బొందినారు
సూరినుతులార! కొప్పరసుకవులార!

విధిఁబోలు వేదము వేంకటరాయ పం
డితసార్వభౌముఁ డద్భుతధిషణుఁడు
ఆంధ్రవాల్మికి బిరుదాంకుండు వావిలి
కొల్ను సుబ్బారాయ కోవిదుండు
కవిమౌళి చెన్నాప్రగడ భానుమూర్తి శ్రీ
పర్ణశాల నృసింహపండితుండు
కావ్యకంఠాంకుండు గణపతి సుకవి, వే
టూరి ప్రభాకర సూరివరుఁడు

మఱియు వ్యాకరణాచార్య బిరుదకలితుఁ
డైన ముదిగొండ నాగలింగార్యముఖులు
మెచ్చిన కవీంద్రవరుల మిమ్మిచ్చదీరఁ
గొలిచి సేవింప న్యాయ్యమై వెలయునాకు

ద్రావిడదేశ భూధవుల సత్కృతులు స
త్కవి గౌరవంబును గాంచినారు
ఆంధ్రమండలభూతలాధిప మర్యాద
లుత్తమకవినుతు లొందినారు
మ్లేచ్ఛరాజులచే నమేయసన్మానముల్
పండితస్తోత్రముల్ పడసినారు
ఆంగ్లేయనృపులచే నర్వభూఖండ లా
భములుఁ బ్రశంసలుఁ బడసినారు

మీ కవిత్వంబు వినుమాత్ర మెచ్చిగౌర
వంబొనర్పని వారి నీవలఁకుఁ గాన
మహహా మీరుదయించిన యా ముహూర్త
మెన్నఁదగుఁజుండు సుకవి మహేంద్రులార!

పూర్ణ శతావధాన మిది పూర్ణ సమర్థత మీరొనర్చుటం
బూర్ణముదంబు మా కొదవెఁ బూర్ణముదం బొనగూడె తేనికిం
బూర్ణ యశోబ్ధులార! పరిపూర్ణ కళానిధి మూర్తులార! సం
పూర్ణ శుభోక్తు లింపెసఁగఁ బూర్ణకృపన్ నిరంతబుఁ జూడుఁడీ.

దుర్మతి వర్షమందు విబుధుల్ కవివర్యులు సన్నుతింపఁగా
శర్మము గల్గు నాగనృప సత్తమ గోష్ఠి శతావధానముం
బేర్మి నొనర్చి నట్టి కవివీరుల కేను నమస్కరించెదన్
ధర్మనిదానుఁడౌ నృపవతంసుని కీర్తి ధరన్ వెలుంగుతన్.

(ఈ పద్యముల కర్త యెవ్వరో తెలియదు)

# ఆశుకవితలు

## (వివిధ ప్రసంగావళి)

### శ్రీమద్రౌద్రిసంవత్స రాశ్వయుజమాస నవరాత్ర వ్రతోత్సవములలో శ్రీశ్రీరాజావారి యాహ్వానముచే వచ్చినప్పుడు చెప్పినవి - శ్రీ పంగిడిగూడెములోని ప్రథమ సమావేశము

**ఆశీర్వచనము**

స్వస్త్యస్తు, విశ్వసంస్తవనీయ మహనీయ
సింహహయార్చా సుశీల! నీకు
విజయోస్తు, వీరసాధ్వీత్వాఢ్య విజయ రా
ఘవమాసతీ పుణ్యగణ్య! నీకు
పుత్త్రలాభో ఽస్తు, శ్రీ బొమ్మదేవరనాగ
భూపాగ్ర పుత్రాగ్ర పుత్ర! నీకు
శ్రీరస్తు, గోధరిత్రీ దేవదేవ స
పర్యా ప్రముదితార్యవర్య! నీకు

భోగ, భాగ్యాయురారోగ్య పూర్ణకీర్తి
నిస్తులసురాజ్య సుఖవృద్ధిరస్తు నీకు
సుకవి హృదయాంబుజ దినేంద్ర! సుగుణసాంద్ర!
ఘనవిభవ నిర్జరేంద్ర! నాగన నరేంద్ర!

రంగదుత్తుంగ పిశంగ జటానద్ధ
మణిమకుటోత్కట ఘృణులవాఁడు
భూదళనోద్యమ భూరిసీరాగ్ర సం
శయదాయి లంబనాసంబువాఁడు

వివిధహస్త్రావళీ విన్యస్త బహుశస్త్ర
దుర్నిరీక్షాకృతిఁ దోఁచువాఁడు
అసమదంష్ట్రా కరాళాస్యరంధ్రమువాఁడు
శోణితానన విభాస్ఫూర్తివాఁడు

రాజవశ్య క్రియాశక్తిఁబ్రబలు వాఁడు
ప్రమథ గణరుద్రగణయుక్తిఁ బరఁగువాఁడు
వీర బేతాళదేవుఁడే వేళ మీకు
ఖ్యాత జయ, లక్ష్మ, లిడుత నాగక్షితీంద్ర!

**అన్యోన్య కుశల ప్రశ్నోత్తరములు**

కుశలమే! యుష్మదంకుశ వజ్ర మత్స్యము
ఖ్యార్హలక్షణలక్షి తాంగమునకు
క్షేమమే! భవదీయ చిరపుణ్యఫలరూప
కర్ధాంగలక్ష్మి కత్యలఘుమతికి
మంగళంబే! భవ న్మత్తమాతంగ మ
హాంగ, తురంగ, శతాంగములకు,
సౌఖ్యమే! త్వత్కార్య సచివాప్త, బాంధవ,
సైన్య, కోశాయుధ జాతములకు

శుభమె! భవదీయ విజయ సంశోభితాస
దృక్షసామ్రాజ్య లక్ష్మీకటాక్షములకు
బొమ్మదేవర వంశాబ్ధిపూర్ణచంద్ర!
పూత గుణసాంద్ర! నాగధాత్రీతలేంద్ర!

మత్కవితాకుమారికయు, మత్సహజన్ములుమత్కుటుంబమున్
మత్కృతకావ్యవర్యములు, మద్విజయాంబుజగేహ, శాంకరీ

సత్కరుణావిశేషమున సౌఖ్యపరంపర నందుచుండె, సం
పత్కమలేక్షణాహృదయపద్మనభోమణి! నాగరాణ్మణీ!

గౌరవంబును, శ్రద్ధ కాన్పించు మామకా
హ్వానంబుఁ ద్రోయుదురా? యటంచు
మనకన్నముఖ్యులౌ, మాన్యాత్ము లెవరెందు
నేని పిల్చినఁజనిరేమొ? యంచు
నెవరెట్లుపిల్చిన, నేసమాధానోక్తి
నో తెల్పియిటకురాకుండ రనుచు
రాఁదీఅకున్నచో రానికారణమేని
వ్రాయకుపేక్షింతురా? యటంచు

నస్మదాలోకన కుతూహలాత్మకులగు
వారికిందెల్పి యిదెవచ్చు వారటంచుఁ
బలుకుచుండుట నేలూరు పట్టణమున
విని ప్రమోదించినారమో జనవరేణ్యా!

దాసుమాధవ బుధోత్తంసుని భ్రాత, యా
ర్యహితుండు గోవిందరాయ సుకృతి
ధూమయానము డిగ్గి, యేము హేలాపురి
కేతేరఁ బ్రియహర్ష దృష్టిఁగాంచి
అస్మత్సుఖోదంతమరసి, క్షేమముఁదెల్పి,
స్వీయసద్మమున వసింపఁజేసి
మధురభోజనమున మాన్యతాంబూల స
త్కారాదికమున, మోదము ఘటించి

సరస కొండూరి, భామార్యవరుఁడు కామ
వరపుఁగోటకుఁ బిల్వ, భావమును మెచ్చి

తన హయస్యందనమున స్టేషనున కనుప
నుచితగతివచ్చి మిముఁగంటిమో నరేంద్ర!

విశ్వనుతార్హసత్కృతులు, పెల్లుగవల్లురియందుసల్పి యీ
యాశ్వయుజాదిరాఁబిలిచి, నట్టులె పంగిడిగూడియంబునం
దీశ్వరి లక్ష్మివాణిభజియించునినున్ సహధర్మిణీయుతున్
శాశ్వతకీర్తి కంటిమి భృశంబుగఁగొంటిమిహర్ష సంపదల్

**పూజచేయు దంపతులను జూచుసందర్భమునఁ జెప్పినది**

శారదా సారసాసను లొక్కచో గిరి
జాశంకరులఁ బూజసల్పినట్లు
శ్రీశచీ దేవతాధీశులొక్కెడ మహే
శీమహేశ్వరుల నర్చించినట్లు
ఉర్వీసుతా రాము లొక్కచక్కినిఁబార్వ
తీ పశుపతులఁ బ్రార్థించినట్లు
జాంబవతీ సరోజాతాక్షులొకచోట
గుహమాతృ శంభులఁగొల్చినట్లు

నిశ్చలామల చిత్తులై నిల్చి యొకట
దైవపూజల నొనరించు దంపతులను
మిమ్ముఁగననేఁడు నేత్రపర్వమ్ముగల్గె
రాఘవాంబామణీ! నాగరాజమౌళి!

సర్వాపత్తిమిరార్కమండల సహస్రంబుల్ బలారాతి దు
ర్గ ర్వారణ్యమహాగ్ను లిష్టజయసౌఖ్య శ్రీప్రదంబుల్ సత్పుగ
స్తోర్వీశాదృతముల్, కుటుంబశుభలాభోదర్కముల్ బ్రాహ్మణా
శీర్వాక్కుల్, నిరతంబమోఘమహిమ శ్రీఁబ్రోచునాగాధిపా

సూర్యచంద్రోపమాస్ఫురణాంచితాఖండ
దీపద్వయీ సముద్దీపితంబు,
చిత్రరూపవ్యాజ సేవితాజహరీశ,
వాగ్రమా దుర్గాప్రభావితంబు,
ఫలభారనమ్ర, రంభాస్తంభ, తన్మహో
పత్రపుష్పాధిక, భాసితంబు
వ్యాఘ్రాజినస్థిత, వసుమతీసుర, వరా
మోఘ, శుభోక్తిసంపూరితంబు

పుష్పగంధాక్షతాదిక భూషితంబు
శ్లాఘ్యభవదీయ, దేవపూజాగృహాంత
రాళమౌక్తిక మండప రాజమిది యి
తోధిక శుభాఢ్యమగుత, నాగావనీంద్ర!

ఏదేవిజపియించి, వృత్రాదులజయించి
యింద్రుడు, స్వారాజ్యమేలుకొనియె
నేదేవిఁబ్రార్థించి, యీశ్వరుచే విష
బాధవో, జగము, శుభంబుఁబెంచె
నేదేవిఁబూజించి, యింద్రారుల వధించి
రాముండు, సీతతో రాజ్యమందె
నేదేవి సేవించి, యెల్లశత్రులఁ ద్రుంచి
స్థిరరాజ్యరమ, యుధిష్ఠిరుఁడు సెందె

నజ్జయద, యమృతప్రద యఖిలసౌఖ్య
దాత్రి, సామ్రాజ్య కర్త్రి భూధరవరేణ్య
పుత్రి, బ్రోవుత నిను మనఃపూర్తిగాఁగ
జయ విభవసాంద్ర! నాగనక్ష్మాతలేంద్ర!

203

అభివందనంబు, దుగ్ధాబ్ధీంద్రసుతయంచుఁ
గేలుమోడ్పులు, చక్రిగృహిణియంచు
దండంబు, పుష్పకోదండ జనని యంచు
గిడిగిళ్ళు, జలజాత గేహయంచు
జోహారు, మిహిరాంశు సోదరియంచు న
మస్కృతి సురసతీమాన్యయంచు
జోత, ప్రద్యోతపద్మాతపత్ర యటంచుఁ
బ్రణతి శుద్ధసువర్ణ వర్ణయనుచు

వినతి, వనజాతపాణి యంచును సుభక్తి
తో దినత్రయపూజ సంతుష్టిసల్పు
రాఘవాంబను నాగభూరమణుఁగరుణఁ
శ్రీరమాదేవి సిరుల రక్షించుఁగాత!

అమలకీర్తిఫలంబు లందింతు ననుటకు
స్వచ్ఛముక్తామయ జపసరంబు
అక్షరతత్త్వ వేద్యతఁ గూర్తుననుటకు
స్వస్తికరాక్షర పుస్తకంబు
వేదార్థముఖముగా బింబాశనమును స
ల్పిన యట్ల ప్రజ్ఞలిత్తునన శుకము
సుఖద మేకస్థానసుస్థితి యెల్లదం
పతులకు ననుచుఁ జెప్పంగఁదమ్మి

నెలమిఁదననాల్గు కేలుఁదమ్ములనుదాల్చి
శారదదినంబులందుఁ బూజనములందు
సకలమహిమాధికాలంబ శారదాంబ
మంగళములిచ్చు రాజదంపతులకెపుడు

**శ్రీ రాజావారి సౌధము నుపవనముతోఁ బోల్చుటకుఁ గోరుటవలనఁ జెప్పినది**

హరితద్యుతివితాన, మలరుప్రదేశంబు
లాకు జొంపముల యట్లందమంద
నరుణకాంతికలాప మమరెడు తావులు,
ఫలపల్లవాది శోభలనెసంగ
బహువిధప్రభలతో భాసిల్లుచోటులు,
వివిధప్రసవదీప్తి విస్తరిల్ల
స్వర్ణవర్ణముల లోచనతృప్తి నిడునెడల్
పండుటాకులభంగిఁ బాదుకొల్ప

బంధు సత్క వి వర మిత్ర పరిజనోక్తి
కీర పిక శారికాళి హర్షారవముగఁ
బరఁగెఁ ద్వద్భద్ర భవన ముపవనమనఁగ,
మాధవోపమ! నాగరాణ్మానవేంద్ర!

**వన విహారణ సమయమున జెప్పినది**

అమరాధిపతినందనారామ మెవని యా
రామంబుఁ గన, జ్ఞప్తిరాకపోదు
మారసంహారు, కుమార వనంబేని
వనముఁ గన్గొనఁదలఁపునకు వచ్చు
అర్థేశు నుద్యానమగు, చైత్రరథమేని
యుద్యానమునకు రా నూహకెక్కు
నందనందను, కూర్మి బృందావనమెవాని
వనికిఁజేరిన, మనంబునకుఁజేరు

బహుళతరచిత్ర, సుమ, పత్ర, ఫలయుతంబు
శుక, పిక, భ్రమరాది, సంశోభితంబు

తావకారామ మిది మహోత్సాహమొదవఁ
గాంచఁజేసితివౌ నాగ కాశ్యపీంద్ర!

**దుర్గాదేవత ప్రభువును రక్షించునట్లుగా నొక సమయమునఁ జెప్పినది**

కన్నెత్తి పరకాంతఁ గన్గొనఁగా నొల్లఁ
    డేకపత్నీ వ్రతం బెపుడు సల్పు
దుష్ప్రవర్తనల కెందును జోటొసంగఁడు
    శిష్టవర్తనులను జెంతఁజేర్చు
స్వల్పాత్ములకొకింత స్వాతంత్ర్యము నొసంగఁ
    డుత్తమాత్ములతోడి పొత్తువిడఁడు
వ్యర్ధ వ్యయంబు సేయఁడు పుణ్యకీర్తుల
    కర్థధన త్యాగ మాచరించు

నే సుగుణసాంద్రుఁ డట్టి భూభృత్కులేంద్రుఁ
దావకీనపదాంబుజ ధ్యానశీలు
రాఘవాంబాపతిని, నాగరాజమౌళిఁ
గరుణనిరతంబుఁగనుము దుర్గాభవాని!

తన గాంభీర్యము, సౌకుమార్యమును, శుద్ధాంతైక మర్యాదయుం
బనిగావీయెడనంచు, నిర్మలతర స్వాంతంబుఁ ద్వన్నామచిం
తనమందుంచి, సుకుంకుమాంచిత హరిద్రాచూర్ణ పూజల్, ఘటిం
చిన పూతవ్రత రాఘవాంబను గృపాశ్రీఁబ్రోవుమో యీశ్వరీ!

కరుణాశాలినివంచు, దాసజన రక్షాదీక్షవౌదంచు సు
స్థిరభక్తి న్నినుఁగొల్చుదంపతుల రక్షింపంగదే త్వత్పదాం
బురుహద్వంద్వమిళన్మిళింద మిధునంబుంగాఁ గటాక్షించి శ్రీ
కర కారుణ్యమరంద తుష్టి పొసఁగంగా రాజరాజేశ్వరీ!

విత్తాధీశునిగాఁ గుబేరు, మనువున్ విశ్వామరాధీశుఁగా
మత్తార్వార్యధి రోహణున్, మహితధర్మస్థాన నిర్ణేతఁగా,
హత్తంజేసిన దేవి, యుత్తమనృపత్త్వోన్నత్యుఁగా నాగభూ
భృత్తుం, ద్వత్పదభక్తు,ఁ బ్రోవఁగదవే? శ్రీరాజరాజేశ్వరీ!

భువనంబుల్ సృజియించునంబవగునిన్ భూతాళికిం దండ్రియౌ
శివుఁబుత్రాశజపించుచోఁగరుణ, నాశ్రీకంఠుతోఁదెల్పి, జాం
బవతీకృష్ణులఁ బుత్రవంతులుగ, సల్పంగల్గితీ, వాకృపా
శివ మీదంపతులందు ఁజూపఁ గదవే, శ్రీరాజరాజేశ్వరీ!

కనకక్ష్మాధర రాట్సుతాసుతయనంగా, రౌప్యధాత్రీధరా
గ్రనివాసార్ధ శరీరవాసిని యనంగా! నొప్పునింగొల్చు, నా
గనభూపుం, గులదీపుఁగాఁగనక రౌప్యోన్నత్యనిర్లోపుఁగా,
మనుపంగాఁగదవే! దయాగుణమణీమంజూషవై యీశ్వరీ!

నినునేకాగ్రతఁగొల్చునాగవిభునిన్, శ్రీరాఘవాంబన్ సతం
బును భానుంబ్రభఁజంద్రుఁజంద్రికనుగాఁబోల్పించిదాంపత్యసౌ
ఖ్యనిరూఢిన్ శతవర్షముల్ తనరఁ బుత్రానందముంజెంద, నీ
యనుకంపామృతవృష్టి, నింపఁగదె, యంబా! రాజరాజేశ్వరీ!

**గజారోహణోత్సవులై శమీపూజకుఁజను శ్రీరాజావారిని గుఱించి**

ఆంగ్ల రాజేంద్ర దత్తానర్ఘ్యమణి భుజా
బంధకాంతులు, రవిప్రభలనొరయ
స్వర్ణకీలిత లసచ్ఛార్దూలనఖర సం
తానహారము, శౌర్యమీనుచుండ
భూచక్రనామ విస్ఫురదుష్ణవారణ
ద్వితయంబు, ప్రాభవోన్నతులఁదెల్ప

అష్టగిర్నామవిఖ్యాతంబులౌ, సూర్య
చంద్రాంకయుగము, పార్శ్వముల వెలుఁగ

సామజవరంబునం గవీశ్వరయుగంబు
సుకవితామహితాదరస్ఫూర్తిఁ, జూప,
భద్రగజమున, దేవతాపట్టభద్రు
పగిది, శమికడకేగు, నీభద్రతర, మ
హోత్సవంబెన్నవశమె! నాగోర్వరేశ!

**వేశ్యల యాటఁ జూచునప్పు డొకరు వ్రాసిపంపినదానికిఁ బ్రత్యుత్తరము**

నాఁడునునేఁడునేమి? యొకనాఁటికిబోటికిఁ జిక్కఁబోము పూ
బోఁడులగోడులందగిలి, పోఁడిమిమాన్పఁగలాభమేమి? మా
కూడిక కర్హలంచు, విధికూర్చినవారలు, గల్గిరింత, కే
బోఁడులతోడనేమిపని? పూర్ణయశస్కుల కిట్లెఱుంగుమా!

**శ్రీచిన్నరాజాగారి సందర్శనమును గుఱించి, శ్రీపెద్దరాజాగారు అడిగినప్పుడు చెప్పినది**

ఈవఱకెన్నఁడుంగనమి, నెట్లని తెల్పఁగనౌఁ, బ్రసంగపున్
భావమునెంచుచో, సరసపద్ధతితోఁచె, మఱొక్కమారుమ
మ్మావరమూర్తిపిల్చునఁట, యయ్యదినిక్కమయైనచోఁగ్రియా
కేవలముత్తరమ్మన, సుకీర్తినిధీ! సకలంబు వేద్యమౌ

**దివాణములోని యుద్యోగులను గుఱించి**

స్వస్వకార్యము లెట్లు జరిగిన, స్వామికా
ర్యము శ్రద్ధతోఁదీర్చునట్టివారు

జీవితవృద్ధినిఁ జేయు మీ చిత్తంబుఁ
గరుణామయముఁ జేయఁ గడఁగువారు
భవదీయవిజయ సంపల్లాభముల కిష్ట
దేవతాప్రతతిఁబ్రార్థించువారు
సత్య, ధర్మములు, విశ్వాస, వివేకము
లన్యవంద్యములుగా నమరువారు

విద్వదభిమాన మానసుల్, విజ్ఞవరులు
కార్యకరణ ప్రవీణు లీ కర్మసచివు
లిట్టి ప్రభుభక్తి పరులచే, నెసఁగు నీ ది
వాణ మభిగణ్యమో, నాగపార్థివేంద్ర!

**శ్రీ శ్రీ రాణీగారిని గురించి**

మంత్రవాక్కునకంటె మాననీయము, పతి
వాక్యంబని గ్రహించు వనితలందు
దైవసేవలకంటె, ధన్యముల్, నిజభర్తృ
సేవలంచు, నొనర్చు చెలువలందు
గురునిఁగొల్చుటకంటె, వరునిఁ గొల్చుటె మహో
త్తమకార్యమని కొల్చు రమణులందు
పితృ, మాతృ, సోదర ప్రేమకంటె సునాధు
ప్రేమ హెచ్చని నమ్ము భామలందు

నగ్ర గణనీయవౌచు నాగావనీంద్రు
స్థిరయశః పుణ్యముల వృద్ధిసేయు నిన్ను
శ్రీ కలితమూర్తి గణియింపఁ జెల్లునిపుడు
భవ్యగుణపేటి! రాఘవాంబావధూటి!

**ఐదునూట పదియారు రూప్యములతో వర్షాశనపత్రము మున్నగు సత్కారములు జరిగించినప్పుడు చెప్పినవి**

సంతోషించితిమేము తావక లసత్సత్కార సంపత్తికిన్
సంతోషించె మదీయదివ్యరసనా సంచారవాగ్దేవి తా
సంతోషించె భవాని మద్హృదయకంజాతస్థ సభ్యుల్ కడున్
సంతోషించిరి సంతతోల్లసిత హృత్సంతోష! నాగాధిపా!

నీసౌధంబు రమాసతీ నిలయమై నీయాత్మ ధర్మస్థిరం
బై సర్వాధిక శక్తి శౌర్యసహితంబై యొప్పునీమూర్తియ
న్యాసాధ్యారి పరాభవప్రదజయాఢ్యంబై తగం బ్రోచు ని
న్నాసర్వేశ్వరి బొమ్మదేవరకులేంద్రా! నాగధాత్రీశ్వరా!

నీయౌదార్యము కర్ణు జ్ఞప్తిపఱుప న్నీ సత్కవిప్రీతి ప్ర
జ్ఞాయుగ్వంద్యునిఁ గృష్ణరాణ్ణృపుని సంకల్పింపఁగాఁజేయ దీ
ర్ఘాయు శ్రీసుయశస్సముజ్జ్వలుఁడవై హర్షోన్నతుల్ గాంచుమ
య్యా! యార్యస్తుత! బొమ్మదేవరకులేంద్రా! నాగధాత్రీశ్వరా!

వాల్మీకి కవికవిత్వముచేతనే రామ
నృపతినామము స్మరణీయమయ్యె
వ్యాససత్కవి కవిత్వముచేతనే పాండు
విభుసూనుల యశంబు విశదమయ్యెఁ
గాళిదాసకవీంద్రు కవితచేతనె భోజ
వసుమతీశుని పేరు వ్యాప్తమయ్యెఁ
పెద్దనసుకవి కవితచేతనే కృష్ణ
రాయప్రతిష్ఠ దిక్ప్రథితమయ్యెఁ

గాన సుకవులచేతనే కలుగవలయుఁ
బటుయశోవృద్ధులుత్తమ ప్రభులకనుచు

సత్కవిమనఃప్రపూర్తిని సల్పుచున్న
నినుఁబొగడఁజెల్లు నాగేంద్ర! నృపకులేంద్ర!

దాతల్ గల్గుదు రందునందునెఱదాతల్కొందఱేయుందురా
దాతృత్వాంబుధులన్ సమర్థకృతివేత్తల్ స్వల్పసంఖ్యాకులా
యీతీరుల్గణియింప శ్రేష్ఠపదమే యీవందితౌ, సత్కవి
వ్రాతఖ్యాతసుపద్యగద్యనిచయభ్రాజద్యశోవైభవా.

అంచితాన్యోన్య సమావేశమూనక
        దాంపత్యసుఖమొందఁ దలఁచుటెట్లు
గందపుంజెక్కఁ జక్కఁగ నఱగింపక
        చందనానందంబుఁ జెందుటెట్లు
తైలవర్త్యగ్ని సంధానంబుసల్పక
        తిమిరంబువో వెల్గుఁ దెచ్చుటెట్లు
సామజాశ్వాదుల సమకూర్చికొనక త
        దారోహణోన్నతి నందుటెట్లు

వ్యజనచామరముఖ సంగ్రహణము లేక
స్వేదబాధాపహసుఖంబుఁ జెందుటెట్టు
లనుచు నర్థక్రియల ధన వ్యయమొనర్చి
యశము నార్జించితీవు నాగావనీశ !

వైవాహికోత్సవా వసరంబునందుఁ బి
        ల్పించి హెచ్చుగ గౌరవించుటయును
పట్టాభిషేకవైభవమందు నాఁడర్థ
        విధుల సత్కృతులఁ గావించుటయును
శ్రీవేణుగోపాల దేవోత్సవములయం
        దిరునూట పదియారు లిచ్చుటయును

అన్నియమంబు వర్షాశనంబుగఁబ్రవ
ర్తించునట్లుగ నేర్పరించుటయును
గరివరోత్సవ మేటేట జరుపుటయును
గన్నవాఁడవుగాన మీ పిన్నతండ్రి
పుత్రకునికన్న జ్యేష్ఠత పొసఁగునట్లు
సర్వ గౌరవముల హెచ్చు సల్పితౌర
అలఘుసద్గుణసాంద్ర! నాగావనీంద్ర!

**శ్రీ రాజావారి సత్కారములను గుఱించి మఱియొక సమయమునఁ జెప్పినవి**

శ్రీమాన్య కొప్పర గ్రామవాసుల మమ్ము
దంచిత ప్రీతి రావించినాఁడు
అంబికా సుప్రసాదాసాదితాసాద
కవితా విశేషముల్ గాంచినాఁడు
స్వర్ణమండన గజోత్సవ రాంకవాది స
త్కారంబుల మనంబుఁదనిపినాఁడు
ఏనూట పదియార్లు యాన వ్యయార్థ సం
యుక్త వార్షికపత్ర మొసఁగినాఁడు
రసిక శేఖరుఁడౌర యాంధ్రక్ష్మాంత
రావనీ నాథసుకవి సింహప్రభాస
మాన పరిషద్వరిష్ఠాతిమాననీయ
పద్యరింఛోళి నాగభూపాలమౌళి

ఒక మాటొసంగ వేఱొకమాట చనుదెంతు
రంచును, వెన్కముందాడువారు
ఇచ్చినకొలఁది, పైనిమ్మందురనుచు, ము
న్ముందు బేరములాడఁ బూనువారు

ఉచితానుచిత రీతులూహసేయక, గ్రుడ్డి
చేతి రాయి విధంబుఁ జేయువారు
తప్పించుకొనుటె, యిత్తతి నుత్తమంబని,
సాకుల పొత్తముల్ చదువువారు

అంచితాహ్వానములను, రావించి, సంత
సించి, యిష్టార్థముల సత్కరించి, ప్రీతిఁ
బెంచి యనువత్సరంబు రానెంచు నిన్నుఁ
బోలనేర్తురె? శతజన్మములకు భూప!

పటుతరానిలము వీచుట మహారణ్యముల్
కూలిన నొకవేళఁ గూలుఁగాక
కడు ప్రవాహముల వేగములఁదటాకముల్
తెగిన నొక్కొకవేళఁ దెగునుగాక
కరమువర్షా భావకాలంబులందేఱు
లింకిన, నొకవేళ నింకుఁగాక
గణ్య సంస్కార యోగములేమిఁగోవెలల్
గూలిన నొకవేళఁగూలుఁగాక

చెడదు కల్పాంతమును శుభశ్రీవిరాజ
మాన విజయప్రధాన యశోనిధాన
కవివరాశీస్సువాక్యంబు; గణ్యకీర్తి
చంద్రికాచంద్ర! నాగనక్ష్మాతలేంద్ర!

**నిల్వుటద్దములయందు బ్రతిబింబించు శ్రీ రాజావారిని గుఱించి సన్నిధానము సీతారామశాస్త్రిగారడిగినప్పడు చెప్పినది**

ప్రచురసత్యాశ్రయ భాస్వత్సమాఖ్యల
నంతామరనుతి బ్రహ్మయని తెల్ప

నసమాశ్వ భద్ర విహారంబహీన గు
        ణాఢ్యత శంభుత్వమభినయింప
శ్లాఘ్య చక్ర ప్రకాశకరవిలాస ప
        ద్మాక్షత్వములు హరియనుచుఁదెల్ప
మణికుండలాఖండ ఘృణి వితానంబులు
        కిరణ సంతానంబు నెఱుక పఱుపఁ

బొసఁగి మూర్తిత్రయైక రూపుఁడగు సూర్యుఁ
డీ యినుండన నాగనరేంద్ర సూర్యుఁ
డమలినాదర్శముల దృశ్యుఁడయ్యె జన ని
రీక్షణ సరోజ వికసనంబెసఁగ ననఘ!

**మఱియొకప్పుడు ప్రసంగ సందర్భమునఁ జెప్పినవి**

పంతమునందు భార్గవుఁడు బాహుబలంబున భీమసేనుఁడ
త్యంత సులక్ష్య లాఘవములందున నర్జునుఁడీడు వచ్చు భూ
కాంతులలోన నాగనరకాంతునకున్ మఱి రాఘవాంబికా
కాంతునకున్ నృసింహ నరకాంత సుతాగ్రణికిన్ ధరాస్థలిన్

భూప! త్వద్విగ్రహంబు రవిగ్రహంబయి
        భయద జంతుధ్వాంత పటలినడఁప
లోకాప్త! తావకాలోకంబుదగ్ర సిం
        హాలోకమై పరేభాళినొంప
మానవో త్తంస! యుష్మన్మానసము మాన
        సంబయి సుకవిహంసములఁదనుపఁ
సద్గుణాంభోధి! భవద్గళ రవమబ్ద
        రవమయి, హితమయూరములఁగూర్ప

సంతతాచలధర్మ! నీసతి పతియయి
యాత్మ వసియింప నన్యజనాద్భుత జయ
గరిమఁగంటివి మఱియును గనఁగదయ్య
నిరుపమితపుణ్య! శ్రీనాగనృపవరేణ్య!

**తివాచి మేడను గుఱించి**

అభ్రగంగా తరంగాగత శీతల
          వాతపోత సుఖానుభూతి గల్గి
విపులసోపానాఢ్య వేల్లిత వల్లికా
          సుమ సుగంధాఘ్రాణ శోభగల్గి
మెత్తందనంబునఁ జిత్తంబుఁదనియించు
          నునుదూది చలువ పానుపులుగల్గి
పెనుకురిచీలు చక్కని తివాచీలెల్ల
          పనులు వెంటనె తీర్చు భటులు గల్గి

నాగరాడ్ఘటితోత్సవోన్నతులు గల్గి
మేము వసియించి సుఖియింప నీవహేతు
వగుట నిన్ గడుఁ బొగడుటర్హంబు బ్రహ్మ
వనిత విహరించువాడ తివాచిమేడ

**శ్రీ సూరావధానులు గారి ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము**

వాక్యంబుల్పదియేల, నాగనరరాట్పత్నీమణింబోలి తా
లౌక్యాంచద్వ్యవహార విజ్ఞయయి ధీలక్ష్మీజయావాప్తికా
స్తిక్యాత్మంబతిదేవతార్చలను ఖాసింకోటలో స్త్రైణ మా
ణిక్యంబా నృపపత్నిసల్పి వెలయున్ విద్యావిశేషంబులన్

**శ్రీ రాజావారి సత్కారములు**

ఏమేగుదెంచుట లెఱిఁగి ప్రత్యుత్థాన
వందనాదుల గౌరవము ఘటించి
రాకకాలస్య కారణమెఱుంగఁగఁగోరి
కుశలప్రశంసలఁ గూర్మినెఱపి
సతియుఁదత్సహజుఁడాస్థానికోద్యోగులు
నానందపడుట కాహ్లాదమంది
శ్లాఘ్యాసనోత్తమ శయ్యాదికముల మ
మ్ముఁ దివాచిమేడ నిమ్ముగనునిల్పి
సకలోపచారముల్ సల్పనిత్యముఁజెంత
నివసింప భృత్యుని నిర్ణయించి
పైపరామర్శంబుపరఁగ ననంత రా
మాఖ్యు ముసద్ది నాయత్తపఱచి
ఏలూరునుండి ప్రత్యేకంబుగాఁబాక
నిపుణుఁ బిల్పించి వండింపఁజేసి
ప్రాతరాహ్నికముఁ దీర్పఁగఁగాఫి యుపమ లు
పాహారములు గల్గునట్లమర్చి
అభిమత సుపదార్థహారిభోజనముగా
నర్థతాంబూలంబు లందఁజేసి
అపరాహ్ణవేళలయందు గోధూమ మా
షాదిభక్ష్యాహార మమరఁగూర్చి
వివిధపురీసభా వృత్తాంతముల మదీ
యముల నాకర్ణించి హర్షమంది
విశ్వకద్రు శ్యేన విషధర శార్దూల
శిఖ్యురభ్రముల వీక్షింపఁజేసి

ఆరామయుగళ మహోశ్వోష్ట్ర బహుదేశ
సురభి వృషాదులఁ జూడఁజేసి
దినమొక్కగడియఁగాఁజన నర్మమధురప్ర
సంగంబులను బ్రహర్షంబుఁగూర్చి
సమధిష్ఠితద్విపేంద్రము చెంత గజరాజ
మెక్కించి గరిమనూరేగఁజేసి
శతవధానంబునుసల్ప నేనూటప
దాఱులు స్వర్ణభూషాదు లొసఁగి
అనువర్షమేతాదృశానందమొనర వ
ర్షాశన పత్రంబునప్పగించి
అశ్వరాట్పుర రసికాప్తభూవర గౌర
వముల మేమొందెడు వలనుదీర్చి
దినదినాధికతరాత్యనురాగ సన్మాన
ముల మమ్ముఁదృప్తాత్మకుల నొనర్చి

సత్కవీశ్వరులకు సద్యశంప్రియులగు
సత్ప్రభులు సల్పఁదగినవి సల్పి యుత్త
మప్రశంసలఁగొను నిన్నుమనుచుఁగాతఁ
గృప జగత్కర్త్రి శ్రీనాగ నృపవరేణ్య!

**నర్సారావుపేట పట్టణములోని సుప్రసిద్ధ న్యాయవాదులగు బ్రహ్మశ్రీ చింతలచెఱువు కోటీశ్వరరావు పంతులు గారినిగుఱించి శ్రీ రాజావారడిగిన ప్రశ్నమునుబట్టి చెప్పినది**

నరసరాట్పుర సర్వనరలోకహితుఁడయి
న్యాయవాది యశోభినంద్యుఁడయ్యెఁ
గవిబుధాశ్రిత బంధుగణమిత్రచయకల్ప
వృక్షమై సకలసంవినుతుఁడయ్యె

నిరతాన్నదాన వర్ణితగృహుండనఁ ద్యాగ
భోగాఢ్యుఁడన యశఃపూర్ణుఁడయ్యెఁ
గామేశ్వరీ సమాఖ్యామాన్యసాధ్వీ ప్ర
దర్శిత గార్హస్థ్య ధర్ముఁడయ్యె

అస్మదీయాఖిల వ్యవహార కార్య
విజయసంధాయియై హర్షవిభవకారి
యయ్యెఁ గోటీశరాయ ధీరాగ్రయాయి
అలరుఁ జింతలచెర్వు వంశ్యాగ్రుఁడధిప

**నర్సారావుపేటలోని డాక్టరుగారిని గుఱించివచ్చిన ప్రసంగములోఁ జెప్పినది**

అమృతకరుఁ డమృతాత్మకుఁ డాలవట్ట
మన్వయుఁడు శేషయాచార్యుఁడఖిలవైద్య
రత్నమై నర్సరాట్పురిఁ బ్రభు నియుక్త
వైద్యశాలాధిపతియయి వఱలుననఘ.

**నర్సారావుపేటలోని జమీందారువారగు మ.రా.రా.శ్రీశ్రీరాజా మలరాజు నరసింహారావు బహద్దరు జమీందారుగారినిగుఱించివచ్చిన ప్రసంగములోఁ జెప్పినది**

శ్రీమలరాజవంశ నరసింహనరేంద్రుఁడు నర్సరాట్పురీ
భూమివరుండుయోగ్యగుణపూర్ణుఁడు, శిష్టహితుండుకూర్చుఁజిం
తామణియట్లమాకు సతతంబు సమస్తసమీప్సితార్థముల్
శ్రీమహిళాస్వరూపయనఁ జెన్నగుఁ దన్నృపురాజ్ఞి భూవరా!

ప్రకటభక్తినిఁ బ్రతివత్సరంబు భక్తి
నిమ్నఁగల్పోక్తవిధులఁ బ్రసన్నఁజేయుఁ
బూజఁగావించు నాగన్నభూపు, రాఘ
వాంబికాధీశుఁ గృపఁబ్రోవుమా భవాని!

ప్రయివేటు సెక్రటేర్పదమునఁ దనరారు
చందువంశభవుండు స్యాలకుండు
గుణరాశివేంకట కోదండరామకృ
ష్ణయనాయఁడాత్మ హర్షమువహింపఁ
వెల్లటూర్యన్వయ వీరయాభిధుఁ డసి
స్టాంటు సెక్రటరి వేడ్కనురహింపఁ
బ్రాజ్ఞవర్ణ్యుండు సిరస్తదారగు రామ
కృష్ణరెడ్డి మనఃప్రహృష్టిఁదెల్ప
వడ్లపట్లసువంశభవ రామలింగేశ
రావంతికోద్యోగి ప్రమదమంద
బ్రథితుండు హెడ్డుజవాబినీసు వేం
కటరావు పులకితాంగమున నమర
నిపుణుఁడు హెడ్డెకౌంటెంటగు తల్లాప్ర
గడ బాలకృష్ణవిజ్ఞాని యలర
శ్లాఘ్యచర్యుం డసిస్టాంటుజవాబ్నీసు
భానుమూర్తి ప్రమోదభావమూనఁ
దల్లాప్రగడ కులోత్తంసుఁ డకౌంటెంటు
వీరభద్రార్యుండు ప్రియముసూప
వీరరాఘవసమాఖ్యారాజితుఁడు కమీ
షనరు శాంతిపయోధి సంతసింప
సన్నిధానకుల ప్రశస్త సీతారామ
గుణి గణనీయుండు కుతుకమంద
దామరాజసుగోత్ర ధన్యుండు సూర్యప్ర
కాశాహ్వయుండు డాక్టరెదమెచ్చ
సివిలురిజస్ట్రారు శ్రీ పెమ్మరాట్కుల
రామలింగార్యుఁ డౌరా! యనంగ

సరసుండు కొవ్వలి సత్యనారాయణ
మూర్తి యక్కొంటెంటు మోదమొంద
నడిదమన్వయ శోభనాచలసుజనుండు
పరమసంతోషంబు నెఱుకపఱుప
బమ్మదేవరకులబంధుండు శ్రీరామ
కృష్ణనాయండు సంప్రీతిఁజూప
కులబంధువుండైన గుణశాలి ధృతిశాలి
సుబ్బయ్యనాయఁ డెచ్చుగ గణింప
వడ్లపట్లాన్వయోద్భవుఁడు సీతారామ
సద్గుణి ఫేష్కారు సన్నుతింప
ఆదినారాయణాహ్వయుఁడు నారాయణ
పురము ఠాణాదారుఁ దరుసమంద
మఱియు నుద్యోగులు మాన్యులు సుకవులు
పండితవరులు సంబరముఁజెంద

విజయరాఘవనామ సాధ్వీవతంస
మతితరానంద కందళితాంతరంగ
గాఁగ నీ చేసినట్టి సత్కారశతము
లఖిలజననంద్యములు నాగనావనీంద్ర!

**ఆశీర్వాదము**

మణి గిరి నగర క్షమావల్లభుల కీర్తి
చంద్రికాహాసల సఖ్యమెనసి
ఆత్మకూర్గద్దవాలావనీధవ కీర్తి
ముకురకపోలల ముదముఁగాంచి
మునగాల, వనపర్తి, జననాయకుల కీర్తి
కుట్మలదంతల కూర్మిఁజూచి

ఉయ్యూరు, పీఠపురో ర్వ రేశుల కీర్తి
        కంబుకంధరలతోఁ గలసి మెలసి
ఉర్లాము వెల్లవూ, రుర్వీశవర కీర్తి
        మౌక్తికహారల రక్తిఁదేలి
నరసరా డశ్వరాట్పుర నరేంద్రుల కీర్తి
        ధవళలోచనల బాంధవము మెచ్చి
వర మైలవర, పెద్దపవని, భూవర కీర్తి
        చంద్రాననల చెల్మి సంతరించి
అల చల్లపల్లి, దొడ్డమపేట నృపకీర్తి
        హంసయానల సత్ప్రశంస లెఱిఁగి
బొబ్బిలి, జటప్రోలు, భూవల్లభుల కీర్తి
        వజ్రతాటంకల వాసికలరి
ఖాసీముకోట, వేంకటగిరి నృప కీర్తి
        చందనగంధుల సౌఖ్యమరసి

మఱియు నఖిల ధరానాథ మహితకీర్తి
మల్లికా స్రగ్విణులఁగూడి మాటలాడి
సకలభువనాభినంద్యయై సంచరించుఁ
గాతఁ ద్వత్కీర్తికాంత నాగన నరేంద్ర!

శబ్దరూపములు, స్పర్శరస గంధములుర్వి
        నెంతదాఁకఁబొసంగునంతదాఁక
శబ్ద, రూపములు, స్పర్శ, రసంబు, లుదకమం
        దెంతదాఁకఁబొసంగునంతదాఁక
శబ్ద, రూపంబులు, స్పర్శంబు, వహ్నియం
        దెంతదాఁకఁబొసంగునంతదాఁక

221

శబ్దంబు, స్పర్శంబు, శ్వాసనదైవతముఁగం
        దెంతదాఁకఁబొసంగు, నంతదాఁక
నలఘు శబ్దాత్మకంబగు గుణం, బభ్రమం
        దెంతదాఁకఁబొసంగు నంతదాఁక
స్థిరతరములౌతఁ దావకశ్రీసుకీర్తి
వైభవంబులు, భువనసంభావితములు
రాఘవాంబామనః పయోరాశి విహార
ణాచ్యుతానందరూప! నాగావనీప!



# రాజా లోకము



**గుంటూరు డిస్ట్రిక్టు కోర్టు సెషన్సు జడ్జిగారగు మహారాజశ్రీ ఎఫ్.ఏ.కొల్రిడ్జి గారు 22-1-1920న ప్రస్తుతపు ప్రభువులగు మహారాజరాజశ్రీ శ్రీరాజా బొమ్మ దేవర నాగన్న నాయుఁడు బహద్దరు జమీందారు గారికి వ్రాసి పంపిన యింగ్లీషు లేఖకుఁ దెలుఁగు.**

ఇంగ్లండు నందుదయించి న్యాయాధిప
తిత్వాప్తి నిండియాదేశమందు
నర్వపర్యటన కార్యంబొప్ప న్యాయ స
భాస్థానముల న్యాయవాదులెన్న
న్యాయనిర్ధారణంబాచరించుచు దేశ
చరిత వ్రాయుచునుండు జనవరుండు
గుణసమగ్రుఁడు ఎఫ్.ఎ.కోల్రిడ్జి డిస్ట్రక్టు
సెషన్సు జడ్జి విస్తీర్ణబుద్ధి
మీ తండ్రిగారును మీరును బహువిధా
తిథ్య సంతృప్తులందించుకతన
పులుల వేఁటల సివంగుల షికారుల నతి
స్నేహానురాగముల్ నెఱపుకతన
నితరేతరక్షేమ మెఱుఁగ నష్టప్టు లే
ఖాప్రతిలేఖలు గడపుకతన
పార్థివోత్తముఁడౌ భవత్పితృమరణవా
క్యము విని గడుఁజింతఁగంటిననియు

నాప్తుండుసనినట్టు లస్మత్సతీసుతు
　　లాత్మవిచారంబు నందిరనియు
మీతండ్రిగారు ప్రేమించి యిచ్చిన వస్తు
　　రాజముల్ మఱవంగరానివనియు
ధనమువలెన్ వ్యాఘ్రదంష్ట్ర చేయించి యి
　　చ్చినకత్తిఁ బ్రీతిఁదాఁచితిననియును
నేర్పునోర్పు నెసంగఁదీర్పించి యిడిన యం
　　దపుఁగళ్లుఁ జేపట్టినాఁడననియు
నల్లకొమ్ములచే నొనర్పంగఁబడిన మే
　　జా, గదినుంచె మత్సతియనియును
మీజనకుండన మేదిని విస్మయ
　　ప్రదుఁడైన మానవ ప్రవరుఁడనియు
ఎస్టేటు లేనిచో నింజనీయరు ఖ్యాతిఁ
　　బడయంగఁదగు మహా ప్రజ్ఞుఁడనియు
నిరువదియేను వత్సరము లీయిండియా
　　తిరిగితిఁ దత్తుల్యు నెఱుఁగననియు
నిమ్మహా గాంభీర్య మిట్టి సామర్థ్యంబు
　　పరులయందెందుఁ గన్పట్టదనియు
నింతటి పరిపూర్ణు నెందు ద్వితీయుఁగా
　　లెక్కింప సమకూర లేదనియును
నఖిలసామాన్య కృత్యములకూనక జనా
　　ద్భుతకార్యములఁ దీర్చు ప్రోడయనియు
మత్సతీసుతులేను స్మరియింతు మనిశ మ
　　య్యధిపునాతిథ్య మర్యాదలనియు
విజయనగర ధరా విభులందుఁ బూర్వ భూ
　　వరవర్యునిం బోల్పవచ్చుననియు

నల్పసంఖ్యగల శ్రేష్ఠావనీశ్వరుల మ
 త్పరిచితులం బోల్ప వచ్చుననియు
హైదరాబాదు ప్రయాణపు మర్యాద
 నిరతంబు సంస్మరణీయమనియు
నగపడు మత్కృతంబగు నిండియా చరి
 త్రను భవజ్జనకు నుదంతమనియు
మీరు మీసోదరుల్ మీరాజ్య మిప్డిప్డు
 విభజింపఁబూనుట వింటిమనియు
ఆప్రయత్నముమాని యన్యోన్యమైత్రి రా
 జిల్ల రాజ్యమున్వృద్ధి సేయుఁడనియు
కాదని విభజింపఁగా బూనిసేయఁ ద
 దున్నతికిన్ లోప మొదవుననియు
మీ యోగ్యగుణములు మీ కుటుంబోన్నతుల్
 భావదృష్టులఁజూడ వలయుననియు
నద్భుత పురుషులైనట్టి మీపూర్వుల
 సచ్చరిత్రల స్మృతి సల్పుఁడనియు
నఖిలోపకారులై యాశ్చర్య చర్యులౌ
 ప్రాచీనులఁ దలంపవలయుననియు
శ్రేష్ఠులౌ పూర్వుల స్మృతికైన ప్రాణ స
 న్నిభమైన రాజ్యంబు నిల్పుఁడనియు
శ్రీ సికిందరు బాదులో సౌధములను గ
 ల్పించిన నృపులు మీ పెద్దలనియు
భయదమౌనచటి సిపాయిల యల్లరిఁ
 బాపినవారు మీవారెయనియు
నొకమాఱు వేఱయియున్న రాజ్యంబు వే
 ఱొకమాఱు కలయిక నొందదనియు

మీ పూర్వరాజ్యంబు మీ పూర్వులయశంబు
రక్షింపమీరె భారకులరనియు
బలమన నొండొరుల్ కలిసియుండుటయను
సామెత నమ్మిన క్షేమమనియు
అతినూత్న నియమకార్యముల సల్పిరి ప్రజా
ప్రియులైరి మీతొంటి విజ్ఞులనియు
నవసరంబైనచో నరుదెంచిభేద హే
తువెతీంగి మైత్రిగూర్తుఁదగననియు
మామకదృష్టి యస్మత్సతీసుతుల చూ
పెపుడు మీమీక్షేమ మెంచుననియు
నేలిఖించిన లేఖ నీక్షింపఁ జేయుఁడీ
దయచేసి మీ సహోదరులకనియుఁ

బరఁగుప్రీతిని గుంటూరు పురమునుండి
యనుపులేక భవత్సువంశాధికతలఁ
దెలిపెఁ దెలుపుచునుండెను దెలుపునింక
జనవినుత కార్య! నాగనక్ష్మాపవర్య!

**అశ్వారావుపేట ప్రయాణానంతరమున శ్రీశ్రీ రాజావారికి వ్రాసికొనిన లేఖాంశములు (మకాము : కామవరపుకోట)**

వర్షాతపానిలాపాయ దూరంబయి
రమ్యమౌ శకట వర్యంబమర్చి
గమనచిత్రముఁజూపు కలధౌతతుహినాచ
[illegible] లము లనందగు మహోక్షములఁబూన్చి
జవసత్వసౌందర్య సహితసైంధవముపై
సాయుధశూరుఁ దోనరుగఁగూర్చి

వివిధాధ్వసముదయవేదియౌ వీరు వే
　　　ఱొక్కని ముందేగుచుండఁజేసి

మత్రృయాణం బభయ సౌఖ్యమహితమై ప్ర
వర్తిలఁగఁదీర్చిమీరటు పనుపనాఁడు
కామవరకోటఁ గొండూరునామయాఖ్యు
భవనమునకేగితిమి నాగపార్థివేంద్ర

ఏ సదన్వయకర్తగా సకలపురాణ
　　　ములు విష్ణుదేవునిఁ దెలుపుచుండు
నేవంశపతిసతి యిందిరాదేవి దా
　　　సశ్రేణులకు మహైశ్వర్యమొసఁగు
హర విలాసముకృతినందె శ్రీనాథుచే
　　　నవచితిప్పయ యేకులాగ్రణియయి
ధనము, దాతృత్వంబుఁ దనర నేగోత్రజుల్
　　　శ్రీదుఁ గుబేరుని స్మృతిఘటింతు

రట్టి సద్వైశ్యసంతతి నవతరించు
కతనఁ గవితాయశోరక్తిఁగాంచు కతన
భామయాహ్వాయుఁడాది నాహ్వానపఱచు
నాఁటిబలె మమ్ముఁగని మహానందుఁడయ్యె

త్వత్కృత గౌరవవిధు ల
స్మత్కవితారచన నెఱిఁగి మాన్యులచటి వా
రుత్కట హర్షాత్మకులై
సత్కారోక్తుల నుతింపసాగిరి మిమ్మున్

కొండురిభామయార్యమణికోరినయట్టరుదెంచుమమ్ము నొ
క్కండనె యంచునెంచ కధికప్రమదమ్మున నాదరించుచుం

బండినభక్తినిచ్చెనుసభాస్థలి నూటపదాఱు వస్త్రముల్
నిండదె తద్యశంబు ధరణీభువనంబున నాగభూవరా!

**మంచిరాజువారు**

కులవృద్ధుఁడేకాక గుణవృద్ధుఁడగు మంచి
రాడ్భృగవత్సుధీ రాజమౌళి
తత్పుత్రకుండు విద్వద్వశంవదుఁడు కా
ర్యజ్ఞుండు వీరభద్ర ప్రధాని
నిరతభక్ష్యాన్న సంతృప్త కవీంద్రుండు
గ్రామణి హనుమంత రాయమూర్తి
తత్పితృవ్యుఁడు మహౌదార్య చర్యుఁడు సుబ్బ
రాయాభిధానుండు గేయగుణుఁడు

మమ్ముఁబ్రేమమించి వైశ్యుల మాన్యమతుల
గొందఱంజేర్చి సభయొనగూర్చి శ్రుతివి
భూషణలను నూఱాఱుల భూరివస్త్ర
గౌరవంబులఁదన్పి రక్కజపుఁ బేర్మి

అవ్వారి సద్గుణోన్నతు
లవ్వారిగఁ బొగడఁజెల్లు నటకనుపుట మ
మ్మివ్వేడ్క గూర్చితని ని
న్మవ్వపుఁ బల్కుల నుతించినారు నరేంద్రా

ఆవాక్చాతురి, యాసుధీవిలసనం, బాప్రీతి, యాగౌరవం
బావిద్వత్ప్రియకార్యకౌశలియు, నాయౌదార్య, మాన్యాయవి
ద్యావైశద్యముఁజూడజూడ, మదికత్యాశ్చర్యముంగొల్పెడున్
మావారంచనుకొంటగాదు, జగతీమాన్యుల్నరేంద్రోత్తమా!

మంచిరాజాన్వయుల సతీమయులు సద్గు
ణాభరణ లందు నాత్మ విద్యావివేక

యగుట హనుమత్సుధీంద్రు నర్ధాంగలక్ష్మి
రత్నమాంబిక స్త్రీజనరత్నమంద్రు

కర్ణతుల్యవదాన్యతా పూర్ణుఁడగుటఁ
గర్ణభూషలనప్డిడి గణ్యమైన
సభ యొనర్పింప మఱియొక్క సారిపల్కె
సీతమాపతి సుబ్బార్య శేఖరుండు

అంతభగవత్బుధాగ్రణి హర్షరాశి
మమ్ముఁగనిపల్కెనిట్టు లస్మద్ధితులగు
తడికమళ్లాన్వవాయు లుత్తములు లక్క
వరమునంగల్గిరట కేగవలయుననుచు

అనియటకుఁ బంపఁ దలఁపో
సిన భగవత్సుగుణి హృదయసీమఁ బ్రమోదం
బెనయఁగ నప్పురిఁ గల రా
జన యను నల తడికమళ్ళ సత్కులుఁడర్థిన్

పరువడిభామ యాదులగు బంధులుసద్గుణసింధులెన్నఁగా
నరుదగు వస్త్రగౌరవము లందఁగఁజేసి మహోక్షయుగ్మసుం
దర శకటంబునం బనిచినన్ శుభవాద్య నినాదమొప్పఁ న
ప్పురమునువీడి లక్కవరమున్ వరమోదనిరూఢిఁజేరుడున్

అలకామవరకోటఁ గలచిన్నరాజాలు
శకటంబునెక్కి రా సంతసించె
భగవద్ధనుమ దార్య భామయార్యాదుల
సత్కార్యములకు హర్షమువహించెఁ
దననూత్న సౌధమందున సమర్హాసనో
త్తమశయనాది మోదముల నించె

దినదినాదికభక్తి దీపింప నభిమత
భోజనానందముల్ పోషణించె

నుత్తమాంశుకయుతషోడశోత్తరశత
రూప్యసత్కారమాత్మాభి రూప్యమమర
నలిపెఁ బ్రతివత్సరంబు రాఁదెలిపె భక్తి
సత్యఘనునన్న పెద్దరాజాలు బళిరె!

తమ్ముఁడుసత్యమూర్తి సతతమ్మునయమ్మెసఁగంగనాత్మగాఁ
గ్రుమ్మరఁ బిన్నతండ్రి కొమరుండగు నా పినరాజధీరుఁడం
గమ్మునకున్ భుజమ్ముగతిఁ గ్రాలఁగనొప్పగు రాజనార్యువం
శమ్మభివృద్ధినొందుత యశమ్మనిశమ్మునువాని కబ్బుతన్

వందనపుం గులుండు ధనవంతుఁడు రుక్కయనాముఁడప్పురం
బందునమందచిత్తుఁడుమహావినయాఢ్యుఁడువొల్చునిందిరా
సుందరి తద్గృహంబునఁ ద్రిశుద్ధిగఁ గాఁపురముండు, వాక్యపుం
బొందిక నవ్విదన్వయునిఁ బోలఁగనెవ్వరుఁ జాలరోనృపా!

గౌరవసంపదన్ లవము గగ్గఁగనీయక మాధురీధురీ
ణోరువచఃప్రచారముల నుల్లములం గఱగించుచున్ మొదల్
బేరములాడియుం దుదకుఁ బెద్దసభన్సమకూర్చి భక్తినూ
ఱూఱును నంశుకంబులిడె నాతని వాక్కులు వేయిసేయవే

దేవమాన్యంబులం బెచ్చుఁ దీసి పొట్ట
నింపుకొను చేరికేనొకతంపిఁబెట్టి
పుల్లలెగనెట్టి గోడపైఁ బిల్లివోలె
జెలఁగు నొకబండ రామన్నవలన మొదల
బేరముంబెట్టెఁగాని యాసూరిహితుఁడు
రుక్కయాఖ్యుఁడు నీతిపరుండుగాఁడె?

అందలి విశ్వకర్మ సుకులాభరణుల్ రసికత్వపూర్ణు ల
స్పందవివేకులై, విభవసాంద్రులుగామికిఁ జింతనొంది, పే
ర్మిం దగునంగుళీయకవరీయములన్ మముసత్కరించి, రే
మందుము వారియా సుకవితాదర మాగురుభక్తిరాణ్మణీ!

**జంగారెడ్డి గూడెము**

ఘనుఁడౌదార్యగుణోజ్జ్వలద్యశుఁడు జంగారెడ్డిగూడెంబునం
దునఠాణాకధినేత, కృష్ణగుణి, యన్యోన్యానుమోదంబులిం
పెనయంబిల్చి, సభన్ఘటించి, బుధులెంతేమెచ్చ నూఱార్ల చే
తనుబట్టాంబర గౌరవాదికముచేతం దృప్తిఁగూర్చెన్నృపా

ఆయంబున నధికుఁడుగా
కా యనఘుఁడు దుర్ఘటంబులగు కార్యములం
జేయించు బుద్ధికుశలత
నోయనఘా! కుశల బుద్ధి యొందఁడెకీర్తిన్!

కొన్నినాళ్ళందు విందులఁగుడిచి తనిసి
యశ్వరాట్పురిలో భవదాప్తమౌళి
నారసింహాధిపుఁడు గల్గుటారసియట
కరుగుచుండంగఁ దత్పథాంతరమున

**జీలుగుమల్లి**

జీలుగుమిల్లినాఁబరగు చిన్నిపురంబునక్షారవార్నిధిం
బోలు ధనేశ్వరుండొకఁడు పొల్చుమదాప్తునిపుత్త్రివాని యి
ల్లాలగుటం జనందగియె నయ్యెడకన్యలుబోవఁ జెల్లదా
శ్రీలలితాంగితత్ప్రియతఁజెంది వసించుటచిత్రమయ్యెడిన్

యోగ్యజనునట్ల చివరకా భాగ్యరాశి
షడ్రసోపేత దివ్యభోజనసమృద్ధి

గౌరవించెనుగాని త ద్గౌరవంబు
సహజమదిగామి నిటు వ్రాయఁ జనియెనధిప!

ఆ ధనేశ్వరు దార విద్యావతియును
సత్కుటుంబాగతయునైన సాధ్వియగుటఁ
బుణ్యవతి వానికీవలెఁ బుణ్యమెంతొ
కాక లభియింపదా యోగ్యకార్యములను.

నాఁటి సాయంసమయంబున కటనుండి పయనంబై శ్రీ కందిమళ్ళాన్వయ వార్నిధి సంపూర్ణ సుధాకరుండగు శ్రీ మద్వేంకట రామ నారసింహ ధరావిభుండు నెలకొన్న యశ్వరాట్పురవర్యంబు నత్యంత సమ్మోదంబున మంగళతూర్య నాదంబులు శుభసూచకంబులై శ్రవణపర్వం బొనర్చుచుండ మలయ మారుతార్భకుండనుకూలుండయి తోననడువఁ గొంత ప్రొద్దేగుసరికిఁ జేరునంత.

వినుతగుణాభిరాముఁడగు వేంకటరామనృసింహరాయ రా
డ్జనమణి యస్మదాగమన శబ్దము వీనులవిందుసేయ మ
మ్మునుపఁగఁజేసియాత్మభవనోత్తమమందొకచోట సత్కళా
ఖనియగువిశ్వనాథబుధగణ్యునకున్ మము నప్పగించియున్

రాతిరిచాలయయ్యెను గరంబుశ్రమంబునఁ జేరియుందురీ
రాతిరియాపిప్రొద్దుటవరంబగు ప్రీతినిఁ జూపుఁడంచు భూ
నేతవచించెనంచు నవనీసుర వర్యుఁడు తెల్పి భోజన
ప్రీతులఁదేల్పసౌఖ్యసము పేతులమైశయనించిరాతిరిన్

ప్రాగద్రిన్ దినవల్లభుండు పొడసూపం గాల్యకృత్యంబు లు
ద్వేగప్రక్రియఁదీర్చి యన్నృపవరున్ వీక్షింప మేమెంచుచోఁ
దాఁగట్నంబనిపంచె గౌరవయుత ద్రవ్యాంశుకశ్రేణి ని
ష్ఠాగాథన్వివరింపనేల తుదకత్యానందముం గూర్చుటన్

మచ్చరిత్రంబు సమ్యగ్రీతి నెఱిఁగించు
పత్త్రికాభివ్యాప్తి పరఁగకుండ
మార్గశ్రమలకోర్చి మాదృశుల్ తత్పురం
బునకెన్నఁడేనియు జనకయుంట
ఆజ్ఞసుగ్రీవాజ్ఞయగుట నెఱింగిన
వారేనియుం దెల్పనేరకుంట
కాంచికావిభుని రంగస్వామిదర్శించు
కార్యవేగంబాత్మఁ గ్రమ్మియుంట

సరసమణి దానశాలి రసజ్ఞమౌళి
యైనఁగాని సభాయత్న మాపిమమ్ము
నుచితసత్కారములఁబంప నూహఁజేసెఁ
జిత్తమరయక శ్రీనారసింహవిభుఁడు

మావిషయంబు గార్యవిధి మానవనాయక నీదుపంపుఁబ
ద్యావళివ్రాసిపంప ముదమంది మహోసరసాగ్రయాయి యా
భూవరుఁడప్పుడేపిలువఁబుచ్చి నమస్కృతిపూర్వకోక్తి సం
భావనమొప్పఁ గూరిచిన మన్నన లార్యనుతంబులై తగున్

మముగన్నదాది యా భూ
రమణుఁడు నిజబంధులట్ల రాగముపేర్మిన్
మమువీడక దినము నిమే
షముగతి వెడలించు హృద్యసంభాషలచేన్

సముచితాభ్యంగ మజ్జనవిధానముల న
నూనానుమోదంబు నొందఁజేసె
ననుపమానేక భక్ష్యాహారముల నుపా
హారంబులం దృప్తినందఁజేసె

మహితతాంబూలాది మర్యాదలన్ బహు
గంధచర్చలమెప్పు గల్గఁజేసె
విశ్వనాధసమాఖ్య వెలయు విద్వాంసుఁ డా
త్మానందముం దెల్పునట్లుచేసె

వీరభద్రాఖ్యుఁడౌ మేటి ఫేషుకారు
అలకటూ సూర్యనారాయణాద్యలఘులు
ధర్మలింగాదిఘనులుఁ జంద్రయముఖ సర
సులును నుతిసల్ప సభ ముదంబొలయఁ జేసె

బాలభానుప్రభా భాసమానములుశ
రచ్చంద్రచంద్రికారాజితంబు
లపరదిగ్వ్యాప్త సంధ్యారాగ రమ్యముల్
క్షీరడిండీర రుచిప్రథితము
లబ్జరాగమణి ఘృణౌఘ సంశ్లాఘ్యముల్
వజ్రమణిద్యుతివర్ణితంబు
లంగారకగ్రహాభంగఘృణాకృతుల్
కర్బురగురువరాకారయుతము

లగుచుఁ గలధౌతపు మొలాము లమరునరిది
సాలువులఁజేలముల నిచ్చిస్వాంతమలర
రెండునూటపదాఱు లర్పించె సభను
శ్రేష్ఠ వేంకటరామ నృసింహవిభుఁడు

పూర్వరసికప్రభూత్తముల్ పూర్వసుకవి
వరులు మీరలు మమ్మెట్టి తెఱఁగు లమర
గౌరవింతురొ, యట్లె తా గౌరవించె
నశ్వరాట్పురి నారసింహప్రభుండు

సర్వసమర్థుఁడౌసరసుఁడే భూజాని,
యన్నమాటకుగుతియైనవాని
మహితశిష్టాచార మాన్యుఁడేధాత్రీశుఁ
డన్నసూక్తికి లక్ష్యమైనవాని
పటుధర్మకార్యలంపటుఁడే మహీధవుం
డన్ననుడికి సాక్షియైనవాని
విద్వత్సులభుఁడేవివేకి యే నరపతి
యన్నపల్కున కర్థమైనవాని

వినయపునిధి, విద్యానిధి, వితరణనిధి
యేనృపతియన్న శబ్దసంతానమునకు
సేతుఁడగువాని నరసింహ నృపునిఁదావ
కాప్తుఁగని మెచ్చితిమి నాగనావనీంద్ర!

భవ్యసీతారామ పార్థివుచిరయశః
పుణ్యపుంజంబైన పుత్రుఁడనియు
మాన్యలక్ష్మీకాంత మాసతీగర్భము
క్తాస్ఫోటమౌక్తికాగ్ర్యంబనియును
శనివారపుంబేట జననాధురాజ్య వృ
ద్ధినిఁబ్రీతిమైసల్పు ధీరుఁడనియు
న్యాయపాలనము నొనర్చుచు రాజ స
న్మానంబులొందు సమర్థుఁడనియు
నుచితవ్యయంబుసేయుచుఁగీర్తి రాజ్యర
మాభ్యున్నతులఁ దీర్చు నసముఁడనియు

సత్కుమారులఁగన్న ప్రశస్తుఁడనియు
నర్వకార్యప్రవీణుఁడౌ నధిపుఁడనియు

దమరు నన్యులు, దెల్పిన క్రమముగాఁగ
విని, కనియుఁదుష్టిఁ జెందితిమనఘ! నేఁడు

అనివార్యంబయి రాజకీయమగుకార్యంబొండురాఁజెంతనుం
డిన శ్రీ వేంకటరామ భూధవునకెంతేఁదెల్పి తేఁడేగ, న
జ్జననాథాత్మజుఁడెప్డు నేర్చెనొమహోత్సాహంబుదీపింపఁద
జ్జనకుంబోలిసమస్తరీతులనుమత్స్వాంతంబులన్ లోఁగొనెన్

**పూచికపాడు**

పూచికపాటిగ్రామపతి పుల్లయధీరునిఁజెప్పనొప్పు దా
దాఁచినకొంగుబంగరు బుధప్రకరంబున కాఘనుండు సం
కోచములేక పిల్చి సభఁగూరిచి నూటపదాఱు వస్త్రముల్
ధీచతురత్వమేర్పడఁగఁదెచ్చి యిడెన్ బృథుకీర్తికాముఁడై

**అశ్వారావుపేట**

పునరవలోకనోత్సుకతపొల్పు వహింప భవిష్యదబ్దమం
దునఁజనుదేరఁబల్కెఁబరితోష శుభోక్తులమమ్ము సత్యవా
గ్వినుతుఁడు యుష్మదాప్తమణి వేంకటరామనృసింహరాడ్వరుం
డనఘసుకీర్తి యానృపతియత్యధికప్రమదంబుఁగూర్చిమీ
రనవరతంబు విష్ణుశివులట్లనురాగము సఖ్య సౌఖ్యముల్
గొని తనరారుఁ డాప్తకవి, కోవిద, బాంధవ హర్షమొప్పమి
మ్మనయముఁగీర్తికాంతయు జయాంగనయున్ శుభదృష్టులం గనుం
గొనెదరుగాతపూజ్య కవికోవిద బాంధవ! నాగభూధవా!



# ఆగ్రహ సందర్భములు

1. గుంటూరులో రంగావఝుల హనుమయ్యగారు అను ప్లీడరు గారింటిలో శ్రీ తిరుపతి శాస్త్రిగారు అనవసరముగా కొప్పరపు కవుల ఆశుకవితను విమర్శింపగా, కొప్పరపు సుబ్బరాయకవికి కోపమువచ్చి అన్నమాటలివి.

తమకు సాధ్యముగాని యద్దాని నొరులు
ఖండనము సేయు టెందును గలదు కాదె

2. గుంటూరు సభలో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు "ఈ కొప్పరపు కవులు మాతో సమానులు కారు. మాతో సమానముగా కూర్చుండుటకు వీలులేదు", అని అనగా కొప్పరపు సుబ్బరాయ కవిగారు ఆగ్రహముతో కొన్ని ప్రతిజ్ఞా పద్యములు చెప్పిరి. (ఈ పద్యములు చీరాల శతావధాన పీఠికయందు కలవు.)

3. తిరుపతి వేంకట కవుల శిష్యులైన శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు గన్నవరములో కొప్పరపు కవులు సభజరుపుచుండగా, కొప్పరపు కవులపై కొన్ని ప్రతిజ్ఞా పద్యములు వ్రాసిన కరపత్రములు పంచుచుండగా, ఆగ్రహముతో కొప్పరపు సుబ్బరాయ కవిగారు చెప్పిన పద్యములివి –

రోసమున్న నిజంబైన మీసమున్న
పాఱిపోవుట కూడదు పందవగుచు
ద్వైత వనమున పాండవోత్తముల చేత
సింధుపతి పడ్డపాట్లు గాంచెదవు రమ్ము.

జనమత శక్తి సంపద నసాధ్యు లభేద్యులునైన వారితోఁ
దన లఘు శక్తిఁ జూడక మదంబున మార్కొనఁ జూచు వాఁడిఁకే
మన శతతాళ దఘ్నమగునట్టి మహాహ్రదపాత మాత్మనా
శనమును గోరి సేయుటకు సాహసికుండగు వానిఁ బోలఁడే.

తిరుపతి వేంకటేశ కవి ధీరుల శిష్యుల మంచు చాటి మా
గురువులు వారటంచుననుకొన్న ప్రభాకర శాస్త్రి ముఖ్యులి
ప్పురుసున దుర్వివాదముల పాలయి దుర్యశముం గడించిరే
హర హర! బాల చేష్ట విడనాడని నీవొకరుండు దక్కగన్.

ఆశలడంగి నీ గురుల యంతటి వారెదిరింపలేక యా
వేశము దక్కి యుండి రిఁక ఁబిన్నవు కాఁగలవాఁడ విప్పుడీ
యాశుకవీంద్ర సింహముల కాగ్రహమున్ కలిగింపఁ బోక, వ
త్సా! శివరామ శాస్త్రి! సుగుణాఢ్యుఁడవై యశమున్ గడింపుమా.

4. గుంటూరులో తిరుపతి శాస్త్రిగారు కొప్పరపు కవులను గూర్చి “కొప్పరపు వారు గోదావరి దాటి వచ్చిన బుఱ్ఱ గొరిగింపమా”, అన్న మాటలు దృష్టిలో పెట్టుకొని, కాకినాడలో కొప్పరపు కవులు తిరుపతి శాస్త్రిగారిపై కోపముతో చెప్పిన పద్యములు.

బుఱ్ఱ గొరిగించెద నటంచు బొఱ్ఱ బలిసి
యెవ్వఁడో పల్కెనఁట తొల్లి హీనుఁడగుచు
కంచు దివిటీన వెదకినఁ గానరాఁడు
ప్రాణముండెనొ లేదొక్కొ! పశువొ? నరుఁడొ?

జందెంపుఁ బందెంబు సంధించు వారల
జాడింపమే సభాస్థలికిఁ జేర
తొడదట్టి కడు మిట్టిపడు నట్టి వారల
జాడింపమే సభాస్థలికిఁ జేర

మీసాల పందెంబు వేసి దూకెడి వారి
        జాడింపమే సభా స్థలికిఁ జేర
గోడ చాటునఁ జేరి గోళ్లు గిల్లెడివారి
        జాడింపమే సభా స్థలికిఁ జేర

అరయ పదియవ నాఁటి ముత్తైదువలనఁ
జాటు మాటునఁ జేరి వాచాటులగుచు
వాగుటిది యేల? సత్సభా భవనమునకు
వాడిమై చేరి నిగ్గి పోవలయుఁ గాత.

ఆతఁడు మూతిమీసము గలట్టి మగన్నయె యయ్యోనేని తా
నీ తఱి వచ్చి సత్సభ నహీన గతిన్ జయమందవచ్చుఁగా
కోతి విధాన నెందు సొర కోతలు కోసిన లాభమేమి – యీ
భీతియె తొల్లి యున్ననిటు పెప్పెప కొమ్మొక యంట గల్గనే?

మీ కొఱగాని కృత్యములు మీచెడు పోకలు నెంచలేదె! మీ
కాకులగూడు పొత్తములగాకు ఘటింపఁగఁ బూనలేదె, మీ
ఛీకులుఁ జింతలున్ బయలు చేర్పఁగ నూకొనలేదె యెందుకీ
కాకరుతంబు లేటికి నగన్ గొన దిర్పతి వేంకటేశ్వరుల్

ప్రాసములున్ విరామములు పాడొనరించుచు బూతుపద్దెముల్
వ్రాసిరి నాటకంబులుఁ బ్రబంధము లంచని పేరుఁ బెట్టి యు
ద్వాసన మాచరించి రల ప్రాక్కవి మార్గము లట్టి వీరి కీ
రోసములా యటంచు మిము రోయరె తిర్పతి వేంకటేశ్వరుల్

కాకరపర్తియే సలిపె గర్వము మానిపి శృంగభంగమున్
కాకులయట్లు బాఱఁగఁ జికాకొనరించెను బైడిపాడు పై
యాకులపాటుఁ దెచ్చి బలమంతయుఁ బాపెను గొప్పరంబిఁకన్
గూకలుమాని యెందొ తలఁ గ్రుక్కుఁడు తిర్పతి వేంకటేశ్వరుల్

ఘోర సింహంబు లట్టుల కొప్పరంపు
కవులు చనుదెంచి నాటిరీ కాకినాడ
యందు కవితోన్నతిని విజయధ్వజంబు
మిన్నయై దీని పీకు మగన్న యెవండొ?

కొండవీటి మహాగుహం గూర్కు జెందు
సింహములు రాంగ నీ గ్రామ సింహములకు
బ్రతుకుం దెరువును వర్తన పరిధవిలునె?
చాటు మాటున మొరుగుటే జరుగుం గాక.

బుఱ్ఱ గొరిగించి సున్నపు బొట్లు పెట్టి
ఖరము నెక్కించి యూరేగంగా నొనర్చి
మాల దాసులు ఛీయని గేలిగొట్ట
తిరుపతిని వేంకటన్నను త్రిప్పినాము.

కట్టితిమి విజయ ఘంటిక
మొట్టితి మెసరేంగి కుకవి మూర్ధము లగలన్
బట్టితిమి కాకపురి జయ
మట్టిట్టన రాని మీ దయాశక్తి శివా!

5. శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు వారి పుత్రిక వివాహ సందర్భమున తిరుపతి శాస్త్రిగారు పద్యములను చెప్పుచు ఒక పద్యమిట్లు చెప్పిరి.

ఎలమిన్ సత్కవివై ధరాధిపతివై ఈలీల నీకూతు పెం
డిలికిన్ సత్కవులందఱన్ బిలిచి పాండిత్యంబు మన్నించుచో
పులులన్ మేకల నొక్క చెర్వున జలమ్ముం ద్రావంగాం జేయు చ
ర్యలం జూపించితివయ్య! శ్రీ భుజగభూపా! ....

తిరుపతి శాస్త్రిగారు ఈ పద్యము చెప్పినది, కొప్పరపు సోదర కవులను దృష్టిలో పెట్టుకొనియే కదా! ఈ పద్యమును విని ప్రక్కనే యున్న కొప్పరపు సుబ్బరాయకవి ఆగ్రహముతో చెప్పిన పద్యమిది.

అలవోకన్ గవితా సరస్వతికిఁ గల్యాణంబుఁ గావింప ....
.... తొండమున్ ముడిచి పర్వుల్ దీయు నేతత్ గజం
బుల సింగంబుల నొక్క రేవున జలంబుంద్రాగఁగాఁ జేసితే
అలఘూద్యత్థిషణా! వినిర్జిత సురేజ్యా! పూజ్య విద్యానిధీ!

ఈ సంఘటన తరువాత మరల ఈ యుభయ కవి యుగళములు కలసి కొనలేదు.

6. ఏలూరులో శ్రీ రాజా మంత్రి ప్రెగడ భుజంగరావుగారి యింటి గడపను దాటుచుండగా, కావలెనని ఒకడు తుమ్మగా సుబ్బరాయకవి ఆగ్రహముతో చెప్పిన పద్యము -

కైటభాంతకు నిరాఘాట శంఖ రవంబు
విన్నఁగాని విభీతి నున్నవాని
గాండీవధరు జయోద్దండ కాండాహతిఁ
దిన్నఁగాని చలింపకున్నవాని
కాలకాలుని ఫాల కీలి కీలాలంబు
గన్నఁగాని యెదిర్చియున్నవాని
నంభోధి సంభవ హాలహలంబు పై
కొన్నఁగాని కలంగ కున్నవాని

విందుమే గాని వినమెందు విశ్వలోక
భూత సంఘాత ఘాతుక భూతనిశిత
పటపటాత్కార దంష్ట్రికా పటల చటుల
భీకరాభ క్షుతారవాపేత భీతు

7. బందరులో అసూయాపరులు కొప్పరపు కవులను గూర్చి – "కొప్పరపు సోదర కవులు రేపు సాయంకాలము 4 గంటలకు ఈశ్వర ఘట్టములో సభఁజేయుదురు గాన వారి యభిమానులెల్లరును నచటికి విచ్చేయఁ బ్రార్థితులు" – అని గోడమీద వ్రాసిరి. ఇది చూచిన సుబ్బరాయ కవి కోపముతో చెప్పిన పద్యము –

పరమేశీ కరుణా ప్రలబ్ధ కవితా వైశ్వానరజ్వాలలన్
దరియం జొచ్చి నశించు కాకవి కనాథప్రేత సంస్కార మీ
శ్వర ఘట్టంబునఁ గొప్రపుంగవులొనర్పంబూని రప్పుణ్యమం
దిర మందుండు శ్మశాన రక్షకులు రండీ కాటికాసుల్ గొనన్.

WVVWVVW

# పండిత కవుల ప్రశంసలు

## లేక

## కొప్పరపు కవుల యశోడిండిమము

## మద్రాసు సభలు

## శ్రీ చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాదు, బి.ఏ.గారు

## ఉపోద్ఘాతము

సోదరులారా! విద్యాభిమానులారా!

బ్రహ్మశ్రీ కొప్పరపు సోదర కవీశ్వరులిదివఱకు శతావధానాష్టావధానము లనేకములుగా జరిగించియుండిరి. కాని, నేనెఱింగినవి మాత్రము శశిలేఖాది పత్రికల నుండి కొన్నిటి నెత్తి వ్రాసితిని.

❀ ❀ ❀ ❀ ❀

శ్రీ కొప్పరపు కవులని కీర్తినొందిన బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకటసుబ్బరాయ వేంకటరమణాభిధానులయిన కవిశిఖామణులు, సోదరులు. వీరు నివసించు గ్రామము కొప్పరము. తాలూకా నరసరావుపేట. జిల్లా గుంటూరు.

వీరు పదిరెండేడుల వయస్సులో నుండినపుడే కవిత్వమల్లువారు. తమ తండ్రిగారయిన వేంకట రాయలగారియొద్దను, ఏర్చూరిగ్రామనివాసులయిన బ్రహ్మశ్రీ పోతరాజు రామకవి గారియొద్దను, నర్సారావుపేట నివాసులగు బ్రహ్మశ్రీ రామడుగు రామకృష్ణశాస్త్రిగారి యొద్దను విద్యనభ్యసించి క్రమక్రమముగాఁ గవితాశక్తితో నవధానసామర్థ్యమును వృద్ధిపరచికొని పట్టణములందును, పల్లెల యందును రసికులచే మెప్పుఁజెంది అష్టావధాన శతావధాన సభ లిదివఱకెన్నియో జరిగించియున్నారు.

మణికొండసంస్థానమున శ్రీతవిటిరెడ్డి గోపాలరెడ్డిగారను పండిత ప్రభు వర్యునిచేఁ బండితప్రియంబుగా "బాలసరస్వతి" యను బిరుదము నంది యున్నారు.

నెల్లూరులో విద్యాప్రియులయిన మహాజనులచేఁ గూర్పఁబడిన సభలలోఁ దమ యాశుకవిత్వావధాన సామర్థ్యములఁ బ్రకటించి కవీంద్రసమ్మతముగా "ఆశుకవిసింహ" బిరుదము నొందిరి.

అప్పుడచ్చట స్పెషల్ డిప్టీకలెక్టరుద్యోగులును సంస్కృతాంధ్ర హూణభాషా ప్రవీణులును సత్కవితాధురంధరులునైన బ్రహ్మశ్రీ జయంతి రామయ్య పంతులు గారమ్మహాసభలో బిరుదమిచ్చు సమయమున

పంచశరున్ విరాలి గొలుపంగల చేడెల వాడిచూడ్కులన్
గొంచెము విచ్చు జాజిపువు గుత్తులనంటిన కమ్మతెమ్మెరన్
గాంచనగర్భురాణి కరకంజమునందలి చిల్కపల్కులన్
మించునుగాదె వీరి కమనీయ మహీయ కవిత్వసంపదల్

అని వచియించియున్నారు.

అచ్చట నుండి ఇరువది నాలుగు జిల్లాలకు ముఖ్యస్థానంబై లక్ష్మీ సరస్వతీ నివాస సదనంబై, రాజధానియై పొగడ్తకెక్కిన చెన్నపట్టణంబున కేగి అందుఁ బండిత కవీంద్ర మండల మండితంబులయిన మహా సభలలో నాశుకవిత్వావధాన విలాసంబులనేక విధంబుల గనుపరచిరి.

అట్టి యవధాన సమయములయందు సంతసించిన పండిత కవీంద్రు లీక్రింద నుదహరించిన విధంబునఁబద్య సత్కారంబుల జరిపిరి.

**ఆనంద ముద్రాక్షర శాల హూణ సంస్కృతాంధ్ర పండిత కవులగు**

**శ్రీమాన్ తంజావూరు దేవరాజ సుధీమణి గారు**

గుట గుట లింతగావు పటుగుంభిత గాంగ ఝురుల్సరస్వతీ
కటక ఝణం ఝణల్ శ్రుతి సుఖంబులు వేంకట సుబ్బరాయ వేం

కట రమణాఖ్య సత్కవులు గాఢ మనీష నొనర్చినట్టి యు
త్కట రసభావ భాసుర వికాస వచో రచనా విలాసముల్.

కలిమిన్ గొప్పరపన్వయోద్భవులు నిర్గర్వుల్ గవీంద్రుల్సుధీ
శులు వీరిప్పుడొనర్చినట్టి సరసాశుస్ఫార వాగ్వైఖరుల్
చెలఁగెన్ బో నవకంబులై నవరసోత్సిక్తంబులై నవ్య ని
ర్మల మందార మరంద బిందులహరీ మాధుర్య ధుర్యంబులై

**రైల్వే డిపార్టుమెంటులో నుద్యోగస్థులును బండిత కవులునగు**
**మ.రా.రా గద్దె రంగయ్య నాయుఁడు గారు**

మీకవితాపటుత్వమును మీమహదద్భుత కల్పనంబులున్
మీకమనీయపాకములు మీసమయోచిత యుక్తిశక్తులున్
నాకనివాసులన్ముదమునందఁగఁ జేయుననంగ నిట్టి భూ
లోకజనాళిభావముల లోఁగొనఁజేయుట యబ్బురంబొకో

నిక్కము పల్కెదన్ వినుఁడు నే మిముఁబ్రీతులఁజేయఁగోరిపెం
పెక్క నుతించుచుంటినని యెంచెదరేమొ యదట్లుగాదు మీ
చక్కని యాశుధారయును జల్లని శైలియుఁ బ్రౌఢవాక్కు లే
నెక్కడఁజూచియుండనని యెల్లరకున్ వివరించుటే సుఁడీ

తిరుపతి వేంకటేశ కవిధీరులొకెత్తును మీరొకెత్తుగా
సరితులదూఁచ వారలను సర్వవిధంబులఁ బోలఁదూఁగుచున్
పరమయశంబు వారివలెఁ బల్మరు దిక్కుల నించుచు న్మహా
గరిమఁ జెలంగు మిమ్ముఁగని కౌతుకమందితిఁ దృప్తిఁచెందితిన్

**ఆయుర్వేదీయవైద్యజ్యోతిష విద్వాన్**
**శ్రీయుత, బి.వేంకటరంగమునాయుఁడుగారు**

గురుతరసభ్యులార మనకొప్పరపుంగవులైన సుబ్బరా
యరమణమంత్రిపుంగవ కృతాద్భుత భవ్యశతావధాన స

త్వరకవితాప్రభావములు వారిసుధామధురప్రకల్పనల్
కరమరుదారఁగాంచితిమి కంటిమె యిట్లెపుడైన నిర్ధరన్

వారికవ్యాశ్రయ ప్రస్ఫురద్గరిమంబు
వారి నైర్మల్యము వారిరీతి
వారిధారాశుద్ధి వారిచల్లఁదనంబు
వారి ద్విజన్మత వారిరుచియు
వారి పంకవిమోచనారూఢభవ్యత
వారికూలంకష వర్తనంబు
వారిరసస్ఫూర్తి వారి గంభీరంబు
వారిఘనోదయ ప్రకటనంబు

వారిసరసులదనుపు ప్రవాహగతియు
వారిసర్వజ్ఞమానిత ప్రాభవంబు
వారిభాస్వరకలన వహ్వాతలంప
వారికేతగుఁగాక నెవ్వారికగునె?

**గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రెరీ సంస్కృతాంధ్ర పండితులగు**
**బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు**

నిరుపమ సత్కవిత్వ రమణీయులు నద్భుత వేగ దివ్య వాగ్
ఝరులు మహా ప్రవీణులును జాణలుఁ బ్రౌఢ శతావధాన దు
స్తర తర తంత్ర నిర్వహణ దక్షులు నెవ్వరటన్న మున్ను మా
తిరుపతి వేంకటేశ కవిధీరులఁ జెప్పుదు మిమ్ముఁ జెప్పుదున్.

**స్వధర్మప్రకాశినీ సంపాదకులును వేదశాస్త్రపారంగతులునగు**
**బ్రహ్మశ్రీ కనపర్తి మార్కండేయ శర్మగారు**

కవితాసతీమణీ కమనీయ కేళికా
వనులైవిరాజిల్లు వారలెవరొ

సరస భవద్వచోమృత వశంబునఁ జొక్కిన నాముఖంబునన్
బరవదు వాణి దాఁదెరలి భక్తియె గైకొనుమయ్య ధీమణీ.

**పచ్చెయప్ప హైస్కూల్ సంస్కృతాంధ్రోపాధ్యాయులగు**
**బ్రహ్మశ్రీ పర్ణశాల నృసింహాచార్యులవారు**

విజయేతాం కవివర్యౌ కొప్పర వంశాబ్ధి కౌస్తుభాబ్జౌ తౌ
యత్కవితా మధురిమ్ణా సంతుష్టాస్మోవయం నిరతాం.

శ్రీమత్కొప్పర వంశ మౌక్తికమణి శ్రీసుబ్బరాయాహ్వయ
స్తస్య శ్రీరమణోనుజశ్చ జయతాం సారస్వతజ్ఞోత్తమౌ
యౌ రామస్య సుతా విహాశుకవితా చాతుర్యలోకో స్వయం
జాతౌ సర్వజనైస్సదా భువినుతౌ సంభావితౌ సాదరం.

పర్ణశాలేన కౌండిన్య నరసింహేన సాదరం
కవితా మాధురీ సార పరితుష్టేన సన్నుతౌ

**తండియార్‌పేట హైస్కూల్ సంస్కృతాంధ్రోపాధ్యాయులగు**
**బ్రహ్మశ్రీ బి.వేంకటరామానుజాచార్యులవారు**

సరసపువాక్పమత్కృతుల సర్వజనంబుల కాదరంబుగా
స్థిరతరబుద్ధితోఁ జెలఁగిచేసెడు నీదు శతావధానమం
దరుదుగ మర్త్యలోకముననాడెడు భారతియో యటంచు నే
వెరవుగఁజూచినాఁడ సుమి వేంకటసుబ్బ కవీంద్ర శేఖరా

**ముత్యాలపేట హైస్కూలుకవి పండితోపాధ్యాయులగు**
**మ.రా.రా. పోకల వేంకటనరసింహారావు నాయుఁడుగారు**

ఈసత్కవీశ్వరుల్ భూసురోత్తంసులు
గొప్పరపన్వయుల్ గుణకుశలులు

వేంకటసుబ్బరా ద్వేంకటరమణాహ్వ
యములచే భాను శశాంకులట్ల
నాంధ్రదేశంబున నతికీర్తి వహియించి
నేఁడు చెన్నపురంబుఁజూడ వేడ్క
నరుదేర నీకన్యకాలయంబునఁగన్య
కాదేవిభక్తులౌ ఘనముఖులిటఁ

జెలిమి నవధానకార్యంబుఁ జేయఁజేయఁ
గాంచితిమిగాదె కన్నులకఱవుదీఱ
నింతకన్ననువేఱుగా నేమివలయు
సరసగుణులార యో సభాస్తారులార

**మ.రా.రా. ఱి. వేంకటరంగ కవి గారు**

ఆకుల నీకెల పుడకల
కాకుల గూడల్లినటులఁ గల్పించెడియా
కాకవుల కైతలెన్నఁడు
నీకవులకవిత్వములకు నెన గాఁగలవే?

**బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు**

**శ్రీ కొప్పరపు సుకవి ప్రశంసా నవరత్నములు**

అయ్యా! కొప్పరపుం గవీశ్వరులు మీ యాస్యంబు మేమెప్పుడే
నొయ్యంజూడఁగ లేదు శిష్యుఁడొకఁడోహోయంచు మెచ్చె న్మిమున్
వెయ్యాళ్లియ్యఁగ శక్తిలేదు కొనుఁడీ వెయ్యాఱులేయంచు మే
మియ్యంబూనిన పద్దెముల్ మనుఁడి మీరెచ్చో నిరాఘాటులై.

అరుదగు మీ కవిత్వమని యాప్తుఁడు శిష్యుఁడు నైన మా ప్రభా
కరము వచింపఁగా విని యఖండ ముదంబును పొందినాము బం

దరు దరి కేగుదెంచియును దాపటకున్ జనుదేరకుంట మీ
దరిసెన మబ్బదయ్యెఁ బరితాపకరంబిది మాకు నెంతయున్.

సరిగ శతావధానములు చక్కఁగ జేసెడివారు పూర్వమే
వరలిరి నేఁడు లేరనెడి వార్తలు కల్లలు దివ్యవాక్ ఝరీ
భర పరిపూరితాద్భుత సభా సదలంకరణ ప్రచార సుం
దర తర భావభావుక కనద్భవదీయ వధాన సంపదన్.

చనెడు శతావధానమను జాహ్నవి సంద్రమునందు డిందఁగా
నని జగమాడు నప్పలుకులన్నియు నేఁటి కబద్ధమయ్యెఁ ది
న్నని కవితా ప్రవాహమున నాటక వేషములట్లుగాక మీ
రొనరుచు నున్న దివ్య కవితోదయమన్ హ్రదమద్దువచ్చుటన్.

ఏమొక కొంతకాలమెదియో నొకతీరు శతావధానముల్
గ్రామములందుఁ బల్లెలను రాట్సభలన్ మఱి రాజధానులన్
స్వామి కృపావిశేషమున సల్పిన వారము సల్పుచుంటి మిం
కేమగునో, మఱేమి కొదవీరవధానుల రుద్భవించుటన్.

బందరు వచ్చియచ్చటి సభాసదులన్ దనియించి వారిచేఁ
జందనమో సుమంబొ మఱి శక్తికి మించని దేనిగాని మీ
రంది కృతార్థులన్ సలుపుఁడయ్య మమున్ మిముఁజూచుకోర్కె మా
డెందములందు మిక్కిలిఁ గడిందిగ సందడి చేసెడిన్ జుఁడీ

అనఘులు కూపకూర్మముల యట్టొకచోటనె మగ్గి సగ్గి నూ
తనమగు పాడుత్రోవ నవధానము మానము గంగఁగల్పి తా
మనృతమె యూఁతగాఁగొనెడి యర్భకపుం గవులట్లు గాక మీ
రొనరుచు మార్గముల్ మది కహోయని మెచ్చెదఁగూర్చెదున్జుఁడీ

మీ నామంబులు మీయవ
ధానము విని మాయ కవులు తలలెత్తక లో

లోన నిఁకనేని సిగ్గను
బూని యొకట నుండ్రుగాక బొమ్మల పోల్కిన్.

శశిలేఖలోనఁ జదివితి
విశదంబయ్యెన్ భవత్ప్రవీణత మీకున్
యశమబ్బుఁగాక భగవ
ద్వశమై యాయువును సిరియు వఱలెడుఁ గాతన్.

## సంస్కృతాంధ్ర భాషా పారంగతులగు
## బ్రహ్మశ్రీ మహర్షి కావ్యకంఠ గణపతి శాస్త్రులవారు

అంగ వాం వచన భంగ మాలినో
స్సూరి సంసది కుతః పరాజయః
సుబ్బరాయ రమణౌ మహాకవీ
వేంకటోహి యువయోర్ద్వయోః పురః

## బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగ శాస్త్రులవారు

ఆశు కవీంద్ర సింహములటంచును బాలసరస్వతీ పదా
ధీశులటంచు ఘంట యొకఁడెన్న శతద్వయ పద్య కల్పనా
కౌశల వంతులంచు సుభగంకరణప్రవణావధాన వి
ద్యాశిత బుద్ధులంచు విని తద్దయుఁగోర్కులు వ్రేళ్ల వారఁగన్.

అరుదెంచి చూడ నవధా
నరచన యత్యద్భుతంబు నా కొనగూర్చెన్
సరసముగ మాటలాడెడు
కరణిన్ గవనంబు సేయఁగా శక్యంబే.

కనకాంగి చరిత్రముఁ గృతి
బొనరింపుఁడటంచు సభ్య బుధు లిటఁగోరం

గను వల్లే యని దానికిఁ
బనివడి రచియించిరౌ ప్రబంధము నిపుడే

అరగంటలోనఁ జాతురి
వఱలఁగ మృదు పద్యముల్ జవంబునఁ గవులం
దఱు మెచ్చ లెక్క మీఱఁగ
నొఱపుగ రచియించి రిద్ది యొరులకుఁదరమే

వేంకట సుబ్బరాయ సుకవిప్రభుఁడాతని తమ్ముఁడైన యా
వేంకట నామ సత్కవియు విశ్రుత కొప్పర వంశవార్ధి నే
ణాంకుఁడు కౌస్తుభంబనఁగ నభ్యుదయంబును జెంది చారుని
శ్శంకతరావధానము వెసం బచరించుట వింతఁగొల్పెడిన్

ఈ యిద్దఱి యాశు కవి
త్వాయత చాతుర్య విస్మయాంభోరాశి
స్ఫాయత్తరంగ మాలా
వ్యాయత్తత నొండు దోఁపదయ్యె నెడందన్

**బ్రహ్మశ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరాయపంతులుగారు**

ధోరణి నిర్ఘరాంబువని తోఁపగ గంటకు మూఁడు నూర్లసా
ధారణ వేగయుక్తి బుధ తండము మెచ్చఁగఁబల్కి పద్యముల్
ధారణ తప్పకుండ నవధాన శతంబు ఘటింపఁజాలు నో
సూరి వరేణ్యులార! మిముఁజూడ మహాద్భుతమయ్యె నాత్మలోన్.

ఉత్పలమాలిక

శిష్టవరేణ్యులార! బుధశేఖరులార! కవీంద్రులార! సం
దృష్టము నేఁటి యీసభ త్వదీయమహాశుకవిత్వ సంపదల్
తుష్టిని గూర్చెనేని విబుధుండొక పద్యమునిచ్చునన్న ని
ర్దిష్ట సుభాషితంబుగొని ప్రీతిమెయిన్ వచియించువాఁడ ని

ర్దుష్టపు మీ కవిత్వమున రూఢిని నెయ్యెడఁ గానరావు సం
క్లిష్టములైన మాటలును క్లిష్టపదంబు లనర్ధకోక్తులు
త్కృష్టతరంబు వేగమనికృష్టముధోరణి శాస్త్రపాండితీ
మృష్టము సుప్రయోగము విసృష్టములౌర జఘన్యజల్పముల్
స్పష్టము భావమున్ సమయచాతురి భవ్యము నవ్య మెంతయున్
గష్టము శ్రోతకుం ద్వదనుగంతృత మీరు వచించు చోఁబురా
దృష్టము నశ్రుతంబుగద యిట్టి ప్రభావము గ్రామ్యభాషణా
శ్లిష్టము శైలి మీకుఁ బ్రతిసెప్పఁగ నెవ్వరునేర్తురో మహా
నిష్టముగూరనున్నయది యియ్యెడ భాషకు గ్రామ్యమొక్కఁడే
యిష్టమటంచు నొక్కపసయేదిన వాదముపుట్టఁగా మహా
దిష్టము మిమ్ముమంటి గురుధీరకవుల్ జనియించుటల్ సభా
సృష్టవిధంబుగాఁగ జన హృష్టికరంబుగ సూరిమానసా
కృష్టిగఁబల్క నేర్చుటలు కీర్తితశీలురు నేఁటిగోష్ఠి ని
ర్దేష్టలు మిమ్ము మెచ్చి మొహరీలు వరాలు సరాలుకానుకల్
పుష్టిగనిచ్చి తన్పుటలు పోయె భయంబెదనాంధ్రవాణికిన్
భ్రష్టము నష్టమయ్యెఁ బెదవాదము సద్గుణశాలులాంధ్రమో
విష్టపమందు భాసిలఁగ వేడ్క రహింతురుగాక పండితుల్

తడయరు ప్రశ్నంబడిగిన
దడవరు పల్కులకుఁ గాఁగఁదడఁబడ రెపుడున్
నొడువుల మిడుకరు తోఁపక
వడివడి వచియంత్రు మున్ను వల్లించినటుల్

అనుచు వావిలికొలను సుబ్బారావుయుండు
బుధుల సుకవుల గొప్పరపుంగులాబ్ధి
విధుల వేంకట సుబ్బాఖ్యు వేంకటరమ
ణాఖ్యుఁదత్కవితాశక్తి కభినుతించు

## బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

ఆరయఁ దొంటి కాలమున నత్తయుఁ గోడలు గూడిమాడి మా
భారత జాతికెల్ల బహు భంగుల వన్నె యొసంగి రిప్పుడా
కూరిమి వీడి యత్త కడుఁ గొండిక చూపునఁ జూచుచుండినన్
భారతి మాత్రమెంతయుఁ గృపారతి నున్నతి నిల్పుచుండెడిన్

నాల్కతుదన్నిరంతరము నాట్యము సల్పుట కీ సహోదరుల్
పల్కు వెలందినెట్లు తొలి బామునఁ గొల్చిరొ తేట తేనియల్
చిల్కినయట్లు విందొసఁగుఁ జెప్పిన పద్దెము లెల్ల వహ్వారే
పల్కిన పల్కులన్నియును బద్దెములయ్యెడు నేమి చెప్పుదున్.

ఆలోచించుట లేదు కల్పనకుఁ బద్యారంభ యత్నంబు ము
న్నే లేదించుక ప్రాసకేని యతికేనిన్ గొంకు కన్పట్టదే
యాలస్యంబును గల్గఁబోదు బళిరా యయ్యారె యివ్వారికిన్
బాలేయొఁ జుమి యాశుధార కవితా ప్రారంభ నిర్వాహముల్.

అమితాశ్చర్య శతావధాన రచనాత్యాశు ప్రబంధోక్తి ని
స్సములౌ తిర్పతి వేంకటేశ్వరులకున్ సంతోషముం గూర్చు భ
వ్య మహా శక్తులు వీరలాశు కవితోద్యద్రాజ పట్టాభి షే
కము నందందగు నట్టి దిట్టలని వక్కాణింతు నిక్కమ్ముగన్

## బహ్మశ్రీ ఆశుకవి చెన్నాప్రగ్గడ భానుమూర్తి పంతులుగారు - మాలిక

వరహిమశైల నిస్సరదవారితగాంగ ఝరావతారజి
త్వరమయి, పద్మ భూవదన భాసుర రంగ నట త్సరస్వతీ
చరణసునూపురారసిత చారుతరంబయి తత్కరాంబుజా
గ్రరుచిర రాజకీర మధురస్ఫుట వాగ్విసరాను కారియై
యరిమురి బారుమీదు కవితామృతధారలఁదోఁగుమాకు నీ

ధరపయి స్వర్గమబ్బెఁగదు ధన్యులమైతిమి నేఁడు మీదయన్
వరకవిసింహులార! ప్రతిభా విభవోజ్జ్వలులార! భవ్య కొ
ప్పుర వర వంశవారినిధి పార్వణ శీతమయూఖులార! సో
దర కవులార! గైకొనుఁడుదారత మా యభివందనంబులన్
సరస కవీంద్ర సత్తములు సారవచో విభవాభి రాములౌ
తిరుపతి వేంకటేశ కవిధీరుల మన్ననఁగన్న మిమ్ము మే
మెఱిగి ప్రశంససేఁత జగమెల్ల నెఱింగిన యల్ల విప్రశే
ఖరునకు జన్నిదంబిడుట కావున నే విరమింతు నింతతోన్

పరిచిత భాసురార్థపద బంధము లందముగాఁగఁ బద్దెముల్
సరసవచస్థితిం దవిలి సర్వజనుల్ నుతియింప గంటకున్
బరువడి మూఁడునూరులు ప్రబంధముగా రచియింప నేరికిన్
దరమగునే మహిన్భవదుదార పురాకృత పుణ్యసంపదం
బరగెడు మీకుఁగాక కవిమాన్య సుధీయుతులార! యారయన్

వరమతినన్నపార్యుఁడును వాఙ్మయలోకవిధాతయజ్వయున్
సురుచిర బంధ దక్షుఁడగు సూరివరేణ్యుఁడు శంభుదాసుఁడు
న్వరకవితాపితామహుఁడవంధ్యచరిత్రుఁడు పెద్దనార్యుఁడున్
మఱియును వన్నెగన్న కవిమాన్యు లనేకులు కీర్తిశేషులై
యఱుఁగుటఁ జేసి వారి కవితామృత ధార పరోక్షరీతి న
క్షరమయ కావ్యరూపమునఁ గాంచుటె గాని సచేతనాకృతిన్
వరలఁగ జూచి సంతసిలు భాగ్యములేని కొఱంత కొంత దా
మరలు సరస్వతీ మహిత మంగళ విగ్రహులౌచు నిట్లు గొం
దఱు కవితావిలాస సముదంచిత బుద్ధిసమిద్ధు లిద్ధరన్
దొరకి వచోమృతంబు దయతో వెదజల్లుచు నుల్లసిల్లఁగన్

## బ్రహ్మశ్రీ ఆర్య సోమయాజుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు

వర వేంకట రమణ సుధీ
వర వేంకట సుబ్బరాయ పరికించితి మీ
సరస కవిత్వపు ధోరణి
పరమానందంబు నెదను పాదుకొలిపితిన్

సాయంనటన్నటేశ్వర జటాతటవిని
ర్గతగాంగభంగాళికల్పనాళి
మాకంద గోస్తనీ మాకరంద రసాతి
రేకంబునకు మంజు టీక పాక
మన్యోన్యచరిత వాక్యార్థ నిర్ధూత న
వ్యశిరీష పేశల వ్యక్తిసూక్తి
పండితాహ్లాద కృద్భావ రసౌచిత్య
హృద్యానవద్యంబు పద్య సరణి

జవవిభిన్న నిరాఘాట సవితృఘోట
గరుడ పవమాన పరిపాటి కవన ధాటి
గురుతరంబుగ మీకుఁ జేకూరె నౌర
సూరి నుతులార! సోదర సుకవులార!

సరసత్వంబు మనోహరత్వము ప్రశస్తత్వంబు శోభిత్వమున్
బురుషార్థప్రతిబోధకత్వమును సంపూర్ణప్రభావత్వమున్
పరమార్థప్రతిపాదకత్వమును సంప్రాప్తించి రాణించుతన్
నిరతంబున్ భవదీయ మంజుతర వాణీధోరణిన్ ధారుణిన్

ధారుణిలో ననేకు లవధానము లెన్నియొ మున్నొనర్చుచున్
బేరును బెంపుగాంచిరని వింటిని, గంటిని నేఁడు మిమ్ముఁ, జే
కూరిన తృప్తిఁబద్యములఁ గొన్ని యొసంగితిఁ గాన వీని వే
యారులుగాఁదలంచి యుపహారముగాఁగొనరయ్య వేడ్కతోన్

భారద్వాజ సగోత్రుఁడ
హారియశుఁడ నార్య సోమయాజుల లక్ష్మీ
నారాయణ శాస్త్రిని సువి
చారుఁడ బేరూరిద్రవిడ శాఖోద్భవుఁడన్

**ఆయుర్వేదీయవైద్యజ్యోతిష విద్వాన్**
**శ్రీయుత బొడ్డికూరపాటి వేంకటరంగమునాయుడుగారు**

సమదర్శులై యొప్పు సర్వజ్ఞమూర్తులు
నజులుగాని చతుర్ముఖాంచితులును
పుణ్యజనావనాద్భుత పురుషోత్తముల్
కులగోత్ర హితులైన గోప్రభువులు
సరసుల దనిపెడు సజ్జగద్బంధులు
న్యూనతలేని కళా నిధులును
పాత్రవదాన్యులౌ బలిచక్రవర్తులు
చెలి భిక్షుఁజేయని శ్రీదులనఁగఁ

దనరు చెన్నపురీమహా జనసభాగ్ర
గణ్యులార! భవత్ప్రియ గౌరవంబు
గాంచి భాసిల్లు నీయాశుకవులఁ గూర్చి
సుంతయేను బ్రశంసింపుచున్నవాఁడ
సభ్యులందఱు నన్ దయ సైచవలయు

చంపకమాల

పటిమగలట్టి కొప్పరపు వంశ్యులు వేంకట సుబ్బరాయ వేం
కట రమణాఖ్య సత్కవులకైతనుతింపఁ దరంబె శారదో
త్కటకటిసూత్ర భాగ్మణిరుగంచిత కాంచన కింకిణీగణా
ర్భటులఁ దదీయసుందర కరాగ్ర విభాసుర రత్నకంకణ
స్ఫుటతర నిష్కళంక పరిపూర్ణసుధా మధుర స్వనంబులన్

గటకఝుళంఝుళార్భటులఁగ్రాలు దినాంతసమున్నటన్మహో
నటపటు తామ్రజూట తటనవ్యశశాంక సుధామయూఖ సం
ఘటిత నిరంతరోద్గత సుకౌతుక గాంగ తరంగభంగికా
ర్భటుల ఘుమం ఘుమధ్వనుల ప్రాభవమున్ దెగడున్ దలంపఁబ్రా
కటసరసాశుధార గతిగన్న పురస్కృత బృంహితారవో
ద్భటకరణీ ప్రజాన్విత మతంగజనాథ సదృక్షధూమశా
కటసముదగ్ర సత్వర మఖండిత వృత్తిహసించు నెంతయున్

**శ్రీ ఆర్యసోమయాజుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు (మతౌకసభలో)**

రీవిద్వత్కవనధాటీజపంబునకోడి
పవమానుఁడొకమూల బడిచలించు
భవదీయచతుర వాక్పటిమకోడి యనంతుఁ
డడుగంటి పూత్కృతులాచరించు
భవదుక్తపద్య భావగభీరతకునోడి
జలధిఘూర్ణిల్లుచు జలదరించు
తావకామేయ మేధాశక్తి గనిధాత
పంకజన్మము పాలఁబడితపించు

యుష్మదభివర్ణనీయ రసోచితపద
మృదులతకునోడి నవ్యశిరీష కేస
రాళి ధూళిధూసరితమై యటమటించు
నాశుకవిచక్రవర్తి విఖ్యాతులార!

పండు రేయెండజిగి నటుండుండుమనుచు
నిండె మీకీర్తి సకలదిఙ్మండలములఁ
బండితావళి నుతిసేయుచుండ ధుతవి
తండకవులార! గండరగండలార!

## శ్రీ బొద్దికూరపాటి వేంకటరంగము నాయుఁడుగారిచే రచింపఁబడిన చంపకమాల (మతొక సభలో)

పరమ తపస్వి యాశుకవి పండితలోక విధాత భూమిని
ర్జరకులమౌళి గండుషిత సర్వశృతిస్మృతి దర్శనుండు దు
స్తర బహుబంధ గర్భముఖ సర్వకవిత్వ విశారదుండు దు
ష్కర వివిధావధాన శతకల్పనుఁడద్భుత ధీవిరాజి భా
స్వర పరతత్త్వ వేది గణపత్యభిధాన సుధీశ్వరుండు ధీ
గురుఁడగు భానుమూర్తి కవికుంజరుఁడిద్ధ యశస్వియౌ ప్రభా
కరకవి పండితుండు శత ఘంటము వేంకట రంగశాస్త్రి దు
ర్ధరమతి యాంధ్ర వాల్మికి పదాంకుఁడు వావిలి కొల్నుసుబ్బరా
ద్వర కవి పర్ణశాలకుల వార్ధి విధుండు నృసింహ సూరియున్
మఱియు ననేక పండిత సమాదృతమైన భవత్కవిత్వమున్
సరిగను మాదృశుల్వినుతి సల్పఁగ శక్తులు గారహో సహో
దర కవులార! మీకవనధాటి మహామహిమంబుఁజూడఁగా
సరసిజ భూ కళత్ర ముఖసారస భవ్యకురంగ నాభకే
సరఘనసార సమ్మిళిత సౌరభ సాంద్ర మనోజ్ఞ వీటికా
గురు గురు సౌర బంధుర సుగంధ ఘుమంఘుమ వైభవంబునౌ
సురుచిర హృద్యపద్య పద శుంభదలంకృతి మాధురీ మనో
హరగతి గోస్తనీ బిసరుహప్రభవాచ్ఛ మరంద శర్కరే
క్షురస రసాల పేశల సుకోమల సార సుధాప్రవాహమై
వరలి శిరీష మార్దవ మవారిగఁ గన్పడు నాశుధార పెం
పరయఁగ వాయు వేగముఁ దదశ్వజవంబు సహస్కరాశ్వ స
త్వరము మహీధ్ర నిస్సరదవారణ నిర్ఝర రంహమాశుగా
తిరయము వృష్టిధారగతిఁ దీవరమున్ ఖగరాడ్జవంబు మో

టరు శకటంబు ధూమ శకటంబుల బల్వడి మించునంచు భే
షరెరె యటంచు నౌర భళి యంచు నహోయనుచున్ బలే బలే
యరుదరుదంచు బాగురెయటంచును బాపురె వాహ్వాయంచు న
ద్దిర యనుచున్ శభాష్షనుచు దివ్యమటంచు నయారె మేలు మేల్
వెరివెలటంచు ముక్కుపయి వ్రేలిడుచున్ దలలూపనట్టి వా
రరయ నభావమే సభల యందది యేమొ సభా సదాళి గొ
ప్పర వర వంశ మౌక్తిక విభా విభవాంచిత మూర్తులార! శ్రీ
తిరుపతి వేంకటేశ్వర సుధీశ్వర శంసిత కీర్తులార! స
ద్వర కవులార! వేంకట పదద్వయ పూర్వక సుబ్బరాట్కవీ
శ్వర రమణాభిధాన కవిసత్తములార! గొనుండివే నతుల్.

## సంస్కృతాంధ్ర పండితకవి

## శ్రీ పంగులూరు రామచంద్రయ్య పంతులుగారు

శ్రీమన్నిర్మల భవ్య కొప్పరకుల క్షీరాబ్ధి రాకాసుధా
ధాముల్, కొప్పరనామధేయ నగరీ ధాముల్, మహామంత్రి సు
త్రాముల్, వేంకట సుబ్బరాయ రమణ ప్రఖ్యాత నాముల్, కవి
స్వాముల్ గాంతురు గాత శ్రీపతి కృపన్ సర్వేప్సితార్థంబులన్

ఆరంభంబున కన్యకాభగవతీ హర్మ్యంబునన్ రెండు మా
ర్లారవ్యాగ్రణి భాష్యకార్ల గృహ మందొక్కప్పుడా పిమ్మటన్
శ్రీ రామానుజ కూటమందొక యెడన్ జిత్రంబుగాఁ జేసిరీ
ధీరుల్ నాల్గు శతావధానములు సద్విఖ్యాతి దీపింపఁగన్.

అవధానంబులఁ బెక్కుజూచితిమి మున్నందందు నెందేనియున్
వివిధానల్ప సుకల్పనా నిపుణతన్ విద్వద్వరుల్మెచ్చ న
వ్యవధాన స్ఫురణోచితాశుకవితా వైచిత్రితో వీరియ
ట్లవధానంబొనరించు బాలురను విద్యాశాలురన్ గంటిమే.

అరుదుగఁ జెన్నపట్టణ మహాజన సభ్యనికేతనంబునన్
గరిమను హృద్య పద్య శతకద్వయ మొక్కరగంట నిక్కవీ
శ్వరులొనరించి యాంధ్రజన సంఘము వారిని దన్పి సన్మనో
హరముగ నొందిరందు బిరుదాంకిత కాంచన మండనంబులన్.

శరశీఘ్రంబును నదీరయంబును నభస్వద్వేగమున్ మానస
త్వరితంబున్ నిరసించు నాశుకవితా ధారా సుధా పూర మ
ర్వర నెల్లన్ ఘనులైన కొప్పర కవుల్ వర్షింప సామాజికో
త్కర చిత్తస్థలి సమ్మదాంకురము లుత్పన్నంబులై వర్ధిలెన్.

ఎటుల నుతింతు వీరినిపుడిర్వురు సోదరులాఋవేల ని
ష్కుటిల నియోగి బుక్కగణసోములు వేంకట సుబ్బరాయ వేం
కట రమణాఖ్యులెల్లర నఖండ సుఖైక రసాబ్ధిముంచి రొ
క్కట మన పచ్చెయప్ప సదగారమునన్ గవితా చమత్కృతిన్.

## బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రులవారు

వాణీంశ్రీసుబ్బరాయాభిధనుకవిమణేస్తూర్ణమాకర్ణ్యవిజ్ఞాః
పూర్ణానంద్యైకభాజోజగతిహి విచరంతీతి నైతద్విచిత్రం
కించిద్ జ్ఞాయద్యసూయాపరికరకలుషీ భూతనైజాంతరంగా
వైవర్ణ్యంద్యోతయంతే నిజవదనతలేష్వాత్మసంతాప కేతుం

కొంకకనారదాచెపుమ కుంభినిలోని విశేషవార్తలన్
బొంకముగాఁగవిన్మ సురపుంగవ! యాంధ్రమహామహీస్థలిన్
బంకజసూతినాగపతి భారతులందలపించునట్టియా
వేంకటసుబ్బరాడ్బుధకవిద్విపుసానుజు నెమ్మిఁగాంచితిన్

మిహికామహీధరో ద్వహదభ్రవాహిన్య
భంగరారంగత్ప్రవాహకంబొ

హృద్యోదయధరాధరోద్యత్ప్రభాకర
    ప్రోద్యన్మరీచి వ్రజోత్కరంబొ
ప్రచరన్మహాభాష్య రచనాసుకౌశల
    ప్రచురఫణీంద్ర సద్వచనచయమొ
కౌరవ్యఖండన కారణగాండీవి
    గాండీవనిస్సరత్కాండగణమొ

నాఁగనుతిపాత్రమయ్యెమీ నవ్యరచన
కొప్పరపువంశకలశాబ్ధి కుముదబంధు
లార! వేంకటసుబ్బ రాయాఖ్య వేంక
టరమణాభిఖ్యులార! కవిరవులార!

కలమున్ బూనుట కాగితంబుగొనుటా కాలంబపేక్షించుటా
లలిఁబ్రాసంబువడిన్ మదిన్ వెదకుటా లక్ష్యంబులూహించుటా
విలసత్కావ్య పరంపరాభిరచనా వేగంబుసంధింపుచో
భళి నీకున్ సరియుందురే కవులు సుబ్బారాయధీమన్మణీ

**బరంపురనివాసి శ్రీ గాదె శ్రీజగన్నాథస్వామి పంతులుగారు**

గంటకునూరుపద్యములు గట్టిగఁజెప్పఁగఁ జాలినట్టివా
రుంటకె యబ్బురంబు పడుచుంటిమి యద్దిర! యాశుధారగా
గంటకునాల్గువందలను గ్రాలఁగఁజెప్పుచు మెప్పుఁబొందు మీ
వంటి కవీంద్రచంద్రములఁ బ్రస్తుతిసేయఁగ నెవ్వఁడోపెడిన్

తిరుపతి వేంకటేశ కవిధీరుల వెండియు రామకృష్ణ ధీ
వరుల శతావధానవిధిఁ బైకొనినారని చెప్పఁగల్గుదున్
స్థిరమతి వేంకటేశకవి దీనిని దా శశిలేఖ వేసెఁగొ
ప్పరపుకవీంద్రులార తమభాగ్యముసాటి యొకండు లేఁడుగా

కవితల్గూర్చెడు వాఁడు నూరుగురి కొక్కండుండు నందెన్ననా
శువుగాఁ చెప్పెడువాఁడు తక్కు వెటులున్ జూడంగ నవ్వారిలో
నవధానంబులుసల్పుజాణలుకడున్ స్వల్పంబుగానుంద్రు గా
ని వచోధోరణియందు మీసములు క్షోణిన్ లేరుముమ్మాటికిన్

కంటిని మీస్వరూపమును గంటిని మీసదసద్వివేకమున్
గంటిని మీవచఃఫణితిఁ గంటిని మీకవితావిలాసమున్
గంటిని మీసుమేధ మతిఁ గంటిని మీయవధాన పద్ధతిన్
గంటిని మీప్రభావమును గన్నులపండువుగాఁ గళానిధుల్

ఆసుధాధారఁబోలు మీయాశుధార
నాలకించినఁ గర్ణరసాయనముగ
నున్న హేతువుచేత మిమ్మెన్నితి నిటు
లాశుకవిచక్రవర్తి పదాంకులార!

**ఇట్లే కవివరేణ్యులచే మెప్పుగొనిన యీ సోదరుల గుఱించి చెన్నపట్టణ మున శ్రీ కానుకొలను త్రివిక్రమరామారావుగారను నొక సుకవి వీరి యవధాన సభలలోఁ బృచ్ఛకుఁడుగా నుండి వీరికిచ్చిన సమస్యలు-**

"కామిని పాదనూపురము ఖంగున మ్రోఁగదు హేతువేమొకో "

అనియుత్పల మాలచరణమొకటి సమస్యగానిచ్చి యిది యుత్పలమాలలో నుండఁగూడదని యడుగుటచే

తన జారకృత్య మితరులు
గనకుండఁ బటంబుఁజుట్టెఁ గాళ్లకిపుడు కా
మిని పాదనూపురము ఖం
గున మ్రోఁగదు హేతువే మొకో, యన నేలా?

"సంయమి వరుఁడౌటఁ గుదిరె సంస్కృతి సుఖముల్ "

సంయుక్త సుగుణపుంజా!
సంయమినీనాథ పుత్రసన్నిభ! సర్వా
హంయుద్వేషీ వినుమీ
సంయమి వరుఁడౌటఁ గుదిరె సంసృతి సుఖముల్

ఈ సమస్య శ్రీ త్రివిక్రమరామారావుగారు మద్రాసులో నీ సోదరకవులచేఁ జెప్పఁబడిన సంగతిని బందరులో వేంకటశాస్త్రిగారికిఁ దెలియుటకు జాబొకటి వ్రాసిరి. ఆ జాబువలనఁ దమ సంతోషమును తెలుపుచు వేంకట శాస్త్రిగారదిఁ కృష్ణాపత్రికలో బ్రచురించిరి.

**శ్రీ పిఠాపురము రాజాగారు కొప్పరపు కవులను గౌరవించుట, శ్రీబొద్దికూరపాటి వేంకటరంగకవి, ఆయుర్వేద వైద్య జ్యోతిషవిద్యావేది**

స్వచ్ఛయశోజిత శాంకరాచలరాజు
భూరికళాంచిత భోజరాజు
పూజ్యరావుకులాబ్ధి పూర్ణిమాద్విజరాజు
ప్రకటసంపజ్జిత రాజరాజు
రమణీజనేక్షణ ప్రత్యగ్రరతిరాజు
పూర్ణ మేధాజిత భోగిరాజు
ఉచితధీతోషిత హూణధాత్రీరాజు
భాసురైశ్వర్య కైలాసరాజు

తనరుబాంధవ సుహృదాశ్రితావనుండు
ఘనవదాన్యుండు రావువేంకటకుమార
మహిపతిపదాంక సూర్యరాణ్మానవేంద్రుఁ
డిద్ధతేజుండు పీఠపురీశ్వరుండు

చంపకమాలిక

పురికొను కాంక్ష మొన్నఁ బదుమూఁడవ తేదిని నా విభుండు కొ
ప్పురపు శతావధాన కవివర్యుల నార్యులఁబిల్చి యెట్టియా
పుర శివగిర్నృపాలకులు మొక్కపురాంకుఁడు సుబ్బరాట్సుధీ
వరుఁడు గనంగ గంటకును బద్యశతత్రితయంబుగా నలే
శ్వర చరితంబుఁ జెప్పుమని పల్కిన నాకవులట్టులే మహా
త్వరిత గతిం రచింపఁ గని తద్దయు సంతస మంది ప్రేమతో
నరుదగు వేయినూట పదియాఱులు రౌప్యములిచ్చి తన్పె నీ
ధరణిపుతో సమానులగు ధార్మికులుందు రనంగఁ జెల్లునే.

మున్ను సంస్కృతకవుల సమ్మోద మొదవఁ
బోషణ మొనర్చినట్టి యాభోజవిభుని
ఆంధ్రకవులను బోషించినట్టి కృష్ణ
దేవరాయలఁబోలు నీభూవిభుండు

**ఈ కొప్పరపు శతావధానులయందుఁగల సామర్థ్యములు మిగుల మెచ్చఁ బడినవగుటచే అభినవ సరస్వతియను నొక మాసపత్రికలో 1911 సం. ఫిబ్రవరి 2వ సంచిక నిట్లు ప్రచురించిరి.**

అత్యద్భుతవిమర్శనము అని పిఠాపురపు సంస్థాన కవీశ్వరులగుఱించినది
ప్రకృతము వీరియష్టావధానాంతర్నాటకమునకు నాంది
ప్రారంభింపఁబడుఁగాక - అంతర్నాటకము

ఒకనికినుప్పు వేఱొకనికుల్లి యిఁకొక్కనికాముదంబు మి
ర్యొకనికిఁ గందులొక్కనికి నొక్కనికిన్ బెస లల్లమింక నొ
క్కొకనికి నేక కాలమున నొప్పుగనిచ్చుచుఁ బద్దువ్రాయున
య్యకు భగవంతుఁడిచ్చు నలయష్టవధానికి బచ్చుకున్ సిరుల్

(నాంద్యంతమున)

సూత్ర : (ప్రవేశించి) ఓయీ! విదూషకా! యిటురమ్ము

విదూ : (ప్రవేశించి) హి, హి, హి, హి, హి

సూత్ర : ఏమీ యా వెఱ్ఱినవ్వు

విదూ : మళ్ళా మాట్లాడితే వెఱ్ఱినవ్వు నీది!

సూత్ర : వెఱ్ఱికాదులే వేదురు

విదూ : వెదురా! అవును మఱచినాను. తెచ్చుకొనియెదను (పోఁబోవును)

సూత్ర : (ఆపి) వెదురు కాదు వేఁదుఱు

విదూ : అట్లా చెప్పండి వేదమందురు!

సూత్ర : అఘోరించినట్లే యున్నది. వేదముకాదు వేఁదుఱు

విదూ : అనఁగా!

సూత్ర : అనఁగా వెఱ్ఱియన్న మాటయే

విదూ : తెలిసింది కాని ఇప్పుడు మీరు ప్రదర్శించునాటక మేది!

సూత్ర : ఆంధ్రప్రకాశికా శశిలేఖా సంవాదము

విదూ : మా పెద్దపేరెట్టినా రే!

సూత్ర : పేరునకేమిగాని, ప్రకాశిక ప్రవేశించుచున్నది, మనమనంతర కరణీయము నకుఁ ద్వరపడుదము. పద (నిష్క్రమింతురు)

ప్ర కా : (ప్రవేశించి) ఆహా! ఆ కొప్పరపు జంటకవుల ధార యెంత చక్కఁగా నున్నది. కావుననే బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు

నిరుపమసత్కవిత్వ రమణీయులు నద్భుత వేగ దివ్యవాగ్
ఝురులు మహాప్రవీణులును జాణలు దివ్యశతావధాన దు
స్తరతరతంత్ర నిర్వహణ దక్షులు నెవ్వరటన్న మున్ను మా
తిరుపతి వేంకటేశ కవిధీరులఁ జెప్పుదు మిమ్ముఁ జెప్పుదున్

అని వీరి అష్టావధానమును మెచ్చికొనిరి. (యోజించి) దినమును వచ్చు చుండెడి శశిలేఖ నేఁడేమొ యాలస్యము చేసినది.

శశి : (ప్రవేశించి) ఇదిగో! మా ప్రకాశిక (సమీపించి) చెలీ! కుశలమా?

ప్ర కా : నీ దయవలనఁ గుశలమే. నేను నీరాకకయియే చూచుచున్నదానను. మొన్న (8)వ తేదిని బ్రకటించిన యష్టావధానమున బ్రహ్మశ్రీ యత్యద్భుత శతావధానుల పేరు సుంతయు నెత్తలేదేమి?

శశి : వారెవరు?

ప్రకా : ఎవరా? రామకృష్ణగ్రంథమాల చూడనేలేదా? అత్యద్భుత శతావధానులు.

శశి : అయినచో మొన్న కన్యకాపరమేశ్వరి యాలయమున నవధాన మయినతటి వారిప్రశంసయే రాలేదే

ప్రకా : ఆ కొప్పరపు జంటకవు లింక నెవరి పేరులుచెప్పిరి.

శశి : నీవంతయు నావలన నెఱింగియును మరల నడిగెదవేల! తిరుపతి వేంకటేశ్వరుల నెత్తికొనుట నీవెఱుఁగవా?

ప్రకా : (స్మృతినభినయించి) అవును, సభ్యులకోరికమీఁదను.

చ. అరుదుగనిచ్చుమెచ్చి విబుధావళియే తమశ్లోకమెన్నఁగా
హరువుగ శ్రీసమన్వితులునై విజయానుచరత్వమూనియా
తిరుపతి వేంకటేశ్వరుల తీరునఁ జెప్పఁగనొప్పినారిలన్
దిరుపతి వేంకటేశ్వర సుధీరులె శ్రీకనుపర్తివంశజా.

శశి : చూచితివా! ఈ వేంకటసుబ్బరాయ వేంకటరమణకవీశ్వరుల కవితాధార. ఆశువులో శ్లేషనుగూడ నెలకొల్పుట కెట్టిధారయుండవలెను? ఇట్టివారేదో మసిపూసి మారేడుకాయఁజేయు కవుల నెత్తికొనకుండుట తప్పుకాదు.

ప్రకా : వారియవధానమునకు దీనికిని దారతమ్యము నీవేమి కనిపెట్టితివి?

శశి : నేను గనిపెట్టుట యెందులకు! నీవీమధ్య దేశమాతనే చూచుటలేదా యేమి? ఆమె యిట్లు వ్రాక్రుచ్చినది.

"ఆస్థానకవులగు వేంకటరామకృష్ణకవులు వేర్వేఱ సాయములేక నవధానములు తప్పక చేయఁగలరా? యని కొందఱికి సంశయ ముండెడిది.

అయ్యది యిప్పుడు నివృత్తియయ్యెను. వేంకటరామశాస్త్రిగారి యష్టావధానంబును రామ కృష్ణశాస్త్రిగారి శతప్రాసంబును నేమోగాని యంత సంతోషదాయకములుగా లేవ"నుకొనిరి. ఈ పంక్తులు నీవు చదువనే లేదా!

ప్రకా : చదివితిని గాఁబోలు (స్మృతినభినయించి) అవును. అక్టోబరునెల పేపరులోఁగాదు! ఆ! చదివితిని, ఒక సంశయము వారు శతావధానులే కాక యత్యద్భుత శతావధానులు గదా! అష్టావధానమే బాగుగనుండ కుండుటకుఁ గతమేమో?

శశి : నాకేమి తెలియును, ఆ సంశయము నీవే తీర్పవలెను.

ప్రకా : అయినచో గ్రంథమాల నాయొద్దనే యున్నది. (పుస్తకమువిప్పి) అబ్బే! దీనికింత విచారమెందుకు? వారు వ్రాసికొన్న పంక్తులే సాక్ష్యమిచ్చు చున్నవి. "గురువారమున నొక యష్టావధానము జరుపఁబడెను. దానఁ బ్రాచీనంబులగు రీతుల వదలి ... భాగము లేర్పఱుపఁబడెను. (2వ పుట) ప్రాచీనరీతులు వదలిన తరువాతఁబే రెట్లు వచ్చును, ప్రాచీను లేమి మూర్ఖులా!

శశి : అంత మాత్రముననే కాదు ఇంకను నేమేని లోపములున్నవా? ఏదీ ఆ పుస్తకమిట్లు తెమ్ము

ప్రకా : (ఇచ్చును.)

శశి : (విప్పి) అబ్బో! వీరి యవధానమునకును దానికిని హస్తిమశకాంతరముగా నున్నది. పిఠాపురపువారి యవధానములో కవిత్వమునకై మూఁడు గీతములు మాత్రమున్నవి. కొప్పరపువారి యవధానమునఁ దొమ్మిది పద్యములున్నవి. మొదటి వారి గీతములు మూఁడును నొకటే విషయ మును జెప్పుచున్నవి. రెండవవారివి భిన్న భిన్న విషయములను జెప్పు చున్నవి. తుట్టదుద నొక సమస్య మాత్రమే మొదటివారి యవధానమునఁ గలదు. రెండవవారి యవధానమున రెండు సమస్యలు గలవు. దానికిని దీనికినిగల తారతమ్యమును నీవే తెలిసికొనఁగలవు. కాన నవి చదువుచుంటిని.

రామకృష్ణ గ్రంథమాలలోని సమస్యాపూర్తి

కుండను గొండఁజొచ్చె నిదిగోయని పల్కెను విస్మయమ్మునన్
గొండలు రేఁగిలోకములగుండలుసేయుచునుండఁజూచి యా
ఖండలుఁదుద్ధతుండయి యఖండపరాక్రమ మొప్ప ఱెక్కలన్
జెండఁగడంగుటన్ దెలిసిశీతనగాత్మజుఁడబ్ధి వజ్రిరా (24వ పుట)

కొప్పరపువారి సమస్యాపూర్తి

హరుఁడు గణపతికిఁ బోలెన్
సరసీజాక్షుండు నాభిజన్మునకుఁ బలెన్
గురుకీర్తిగన్న యాసా
(గరుఁడుడు గణపతికిఁ దండ్రిగావలెఁ జుమ్మీ.)

ప్రకా : ఎక్కడి కెక్కడ, ఆ కవిత్వ మెక్కడ ఈ కవిత్వమెక్కడ? నక్కెక్కడ దేవలోక మెక్కడ! ఎట్లో యతిప్రాసములతికి పేకేజీ చేసినట్లది యున్నది. ఇది చక్కఁగా గరుడుని సాగరునిఁగఁజేసి కడు సొగసుగాఁ గనపఱచి పూరించు నటులున్నది. ఇంకను దారతమ్య మున్నదా! అర్థబింధు విషయమునఁ జర్చ యించుక కల్గినను ననివార్యముకాదు.

శశి : నిషిద్ధాక్షరి యిరువురును జెప్పిరి. కాని పిఠాపురపువారు సంస్కృతములోఁ జెప్పిరి. వీరు తెలుఁగులోఁజెప్పిరి. ఇందుఁ గష్టమేదియో నీకు నేను జెప్పనక్కఱలేదు గదా!

ప్రకా : అవును. తెలుఁగులో జెప్పుట సంస్కృతముకన్న ననేక విధములఁ గష్టము.

శశి : కొప్పరపువారిని అలఁతి, వలతి, పొలతి, గలతి. అనుపదములు చేర్చి సత్యభామ నరకాసురునితోఁ బోరువిషయము వచ్చునట్లు చెప్పుమనిరి.

ఇట్లు కొన్ని మాసపత్రికలలో వీరి వృత్తాంతము ప్రచురింపఁబడెను.



# గుంటూరు సభలు

## (౧) గుంటూరు సభలో బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారిచేఁ చదువఁ బడిన పద్యములు

సారవిస్తార కవితాప్రశస్తులార!
ప్రథిత దివ్యాశుకవి చక్రవర్తులార!
సోదర కవీంద్రులార! వాక్సూరులార!
భవ్య గుణులార! మీకిదే స్వాగతంబు

దురమున బల్లిదుండరులఁ దోలెడుచో వెనుకంగవేయ న
ట్లురవడిఁ బద్యముల్ పలుకుచుండి పిఱిందికిఁబోక పల్కులన్
బొరపడకుండ గ్రంథశతముల్ వచియించు తెలంగుభూమిపైఁ
దిరుపతి వేంకటేశకవి ధీరులకున్ మఱి మీకె చెల్లెఁగా.

చెలఁగి కోకోయటంచుఁ గోయిలల జంట
కొసరుచున్ మావిపైనెక్కి కూయునట్లు
కోవిద చయంబు మెచ్చఁ గోకో యటంచుఁ
గవితఁజెప్పెదరౌ మేటి కవుల జంట

అరసి కొండవీటికవిహంసలటంచును మీకు మా పురీ
పౌరు లొసంగిరా బిరుద పంక్తికి బైన వతంస శబ్దమున్
గూరిచినన్ భవత్కవితకుం దగదే యెవరెట్టులన్న నే
నారసి కొండవీటికవిహంసవతంసులటంచుఁ బిల్చెదన్

వాదోద్దై యలవాణి పద్యశతమున్ బల్కింప శ్రీదేవియున్
జేదోడై కనకాభిషేక శుభమున్ జేకూర్ప నానావధా
నాది ప్రక్రియలంది దిగ్విజయ యాత్రారంభ శుంభద్యశః
ప్రాదుర్భావముచేత మించితి రనల్పంబిద్ది సామాన్యమే?

స్థిరతన్ సత్కవి సార్వభౌముఁడగు నా శ్రీనాథుఁడేసీమఁ గా
పురమున్ జేసెనొ యందె మీరు జననంబున్ బొందుటట్లే కవి
త్వ రసజ్ఞత్వముచేత మించు టరయన్ ద్వైరూప భావంబునన్
ధరపై నాతఁడె మీరలై జననమందంబోలు నంచెన్నెదన్

నాటికిన్నేఁడు మనకొండ వీటిసీమ
కడుపుచల్లఁగఁ గన్నదీ కవుల కాన్పు
నాదు కొడుకులె కవులంచు నవ్వు కోన
సీమ పెద్దతికంబింకఁ జెల్లనీదు

అలరుం దేనియ సోన లుట్టిపడునట్లల్లారు ముద్దారఁగాఁ
బలుకన్నేరిచి ప్రౌఢనిర్భరవయః పాకంబునన్ జాతి వా
ర్తలచే నూత్నచమత్క్రియాకలనచే రాణించు మీకావ్యపుం
జెలికై యువ్విళులూరుచుండ్రు రసిక శ్రేష్ఠుల్ విమోహంబునన్

చేరువనుంటచే బెరటి చెట్టది మందునకేలవచ్చు నం
చూరక లోకమాడుకొనునుక్తియథార్థము గానిమాటయుం
చీరహిఁ జాటినట్లు, జనియించితి రెచ్చట నచ్చటే ప్రశ
స్తోరు యశంబుగాంచితి రహో యిదిదుర్లభ మెంతవారికిన్

సరసకళానిబంధన లసద్రసవాక్కృతిమత్ప్రబంధ బం
ధురసదలంక్రియా నిచయధూర్వహ గీర్వనితా విపంచికా
దర సువికస్వర స్వరవిధాన సుధారసమాధురీ ధురం
ధర బహుళప్రబంధ కవితావనితావినుతావదాత వి
స్ఫురిత భవద్యశఃపటలి పొల్పువహించుత నక్షరస్థితిన్

అరవిరి జాజిపూ సరుల నల్లినరీతిఁ
దియ్యంపుఁబలుకుఁ బొందిక లమర్చి

# గుంటూరు సభలు

## (ఎ) గుంటూరు సభలో బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారిచేఁ చదువఁ బడిన పద్యములు

సారవిస్తార కవితాప్రశస్తులార!
ప్రథిత దివ్యాశుకవి చక్రవర్తులార!
సోదర కవీంద్రులార! వాక్శూరులార!
భవ్య గుణులార! మీకిదే స్వాగతంబు

దురమున బల్లిదుండరులఁ దోలెడుచో వెనుకంగవేయ న
ట్లురవడిఁ బద్యముల్ పలుకుచుండి పిఱిందికిఁబోక పల్కులన్
బొరపడకుండ గ్రంథశతముల్ వచియించు తెలుంగుభూమిపైఁ
దిరుపతి వేంకటేశకవి ధీరులకున్ మఱి మీకె చెల్లెఁగా.

చెలఁగి కోకోయటంచుఁ గోయిలల జంట
కొసరుచున్ మావిపైనెక్కి కూయునట్లు
కోవిద చయంబు మెచ్చఁ గోకో యటంచుఁ
గవితఁజెప్పెదరౌ మేటి కవుల జంట

అరసి కొండవీటికవిహంసలటంచును మీకు మా పురీ
పౌరు లొసంగిరా బిరుద పంక్తికి బైన వతంస శబ్దమున్
గూరిచినన్ భవత్కవితకుం దగదే యెవరెట్టులన్న నే
నారసి కొండవీటికవిహంసవతంసులటంచుఁ బిల్చెదన్

వాదోద్దై యలవాణి పద్యశతమున్ బల్కింప శ్రీదేవియున్
జేదోద్దై కనకాభిషేక శుభమున్ జేకూర్ప నానావధా
నాది ప్రక్రియలంది దిగ్విజయ యాత్రారంభ శుంభద్యశః
ప్రాదుర్భావముచేత మించితి రనల్పంబిద్ది సామాన్యమే?

మాయమ్మ సత్కటాక్షము
పాయక మీకందఁజేయుఁ బరమాత్ము దయన్

ఆరయ మీదుకంఠమున నక్కజమయ్యెడి పుష్పహారముల్
సూరిజనంబులీయ నవి సొచ్చెనొమీగళమందుఁ జూడలే
వో రసవంతమై వెలయు నుత్పల చంపక మాలికావళుల్
సారముచే మనోజ్ఞగతిఁ జల్లుచు జారుసుగంధ మానఁగాన్

ఆశుగములౌచు మీనుడు
లాశలఁ బ్రసరించి మించి యలరుట నిజమౌ
నాశక్తి మీకెయున్నదె
వో శంకలిఁకేల మీరు భూ గీర్వాణుల్

వెయ్యేడుల్ దలక్రిందులై తపములన్ బెంపొందఁ గావించినన్
జయ్యంబేరికి నాదువేగమని నీ స్వాంతంబునందెన్ను దే
మయ్యా మారుత! వీరియక్షర జయంబందంగ లేవింకఁ బో
వయ్యా పుష్పసుగంధచోర! నిను చేనందంగనున్నారు వీ
రయ్యో దేహమునెందొ దాచుకొనవయ్యా యంద్రు గాడ్పున్ జనుల్

ఆయక్షర వస్తువెటో
స్వాయత్తమునయ్యెఁ బరమ హంసలు మీకో
హోయంచు నరులుపొగడ న
మేయంబై మీదుశక్తి మేదిని వెలయున్

కవిరాజులై వీరు భువిని భాసిలిరని
కవిహంసచిహ్నాసంకలితులైరి
భువనంబులందెల్లఁ బొల్పందిరని వీరు
కవిహంసచిహ్నాసంకలితులైరి

వాణీసతినిభక్తి వహియింతురని వీరు
కవిహంసచిహ్నసంకలితులైరి
సరసుల సన్నిధిఁ జరియింతురని వీరు
కవిహంసచిహ్నసంకలితులైరి

యనుచు మీనూత్న నామంబు లనుదినంబు
సార్థకంబని తలపోసి సభ్యులకిటఁ
చెప్పి వేడుక పొడమినఁ జిన్నతనపు
సాహసంబొప్పఁ జెప్పితి శంకవీడి

చేతనైనట్లు సల్పితి గీతములను
సీసమిచ్చితి బంగారు చేతలేదు
వెండియునుగొద్ది మాయింట విబుధులార!
రత్నకవి యిచ్చువానిని రహిచెలంగ

మఱియు నుత్పలచంపక మాలికలను
శక్తికొలదిని సమకూర్చి భక్తిదోప
నిడితి బుధులార! గైకొనుండింపుమీర
నేను మీకిచ్చు బహుమతు లివియెసుండి.

సూనృత ప్రియులైన విశుద్ధమతుల
కఖిలవిద్యాఢ్యులైన మహాత్ములకును
నిష్కళంక చరిత్రులౌ నిపుణులకును
మోదమిడుఁగాత మీచిన్న పొత్తమెపుడు

గుంటూరు
1911

ఇట్లు,

**సి.యల్.నారాయణప్రసాద్**, బి.ఏ.
(సంకలన కర్త)

# కాకినాడ సభలు

## శ్రీ చేగంటి బాపిరాజుగారు

శ్రీ మదయోధ్యా నగరీ
ధాముఁడు సోదర యుతుండు ధాత్రీతనయా
కామనుఁ డనిలజనుతుఁడు య
శోమహితుఁడు బ్రోచుఁగాత సోదరకవులన్

సుకవితాభిమానులారా! సూనృతప్రియులారా!

సకలదిగంత విశ్రాంతకీర్తులును బాలసరస్వత్యాది బిరుద విరాజితులును నైన శ్రీమత్కొప్పరపు సోదరకవీంద్రుల చరిత్రంబు నెఱుంగనివారును, వానను దడవనివారును, సూర్యకిరణ ప్రసారంబు సోఁకనివారును, లేరని నాకుఁదెలిసియు వారు నూతనముగా నీ కాకినాడ పురంబునకుఁ దెనాలిపురమున న్యాయవాదులు, రసజ్ఞులునునగు శ్రీమదజ్జడపు భీమశంకరరావు పంతులుగారిచే నాహ్వానింపంబడి 21-5-1912 తేదీయందు శ్రీగంజాం వేంకటరత్నము పంతులుగారి ద్వితీయ పుత్రికా కళ్యాణ మహోత్సవ సమయంబునకు వచ్చి యాపుర వాసుల నాశుకవితామృత ప్రవాహంబున నోలలాడించి యచ్చట ననేకవిధ బహుమానంబుల నందిరి.

ఆంధ్రభాషా విశేషంబున నీ యాంధ్రదేశ యోషామణికి సువర్ణమయ మహాభూషణంబనందగిన నీ కాకినాడ పురంబున నిట్టి యనుపమానమగు తమ

కవితాశక్తినిఁ జూపి యింతటి సత్కారంబులంబడసినవారు మఱొక్కరు లేరగుటచే నిచట వీరిసభలను, సన్మాన విషయంబులును నాకుఁ దెలిసినంతవఱకుఁ దెలియంబఱచుచున్నాఁడను.

1. దివాన్ బహద్దరు బిరుదాంకితులును, హైకోర్టు వకీలుగారును నగు శ్రీ దురిసేటి శేషగిరిరావు పంతులుగారును, పండిత కవీంద్రులయిన శ్రీ కస్తూరి శివశంకర శాస్త్రిగారును, అగ్రాసనాధిపతులుగా శ్రీ గంజాము వేంకటరత్నము పంతులుగారి కళ్యాణ భవనంబున శ్రీ పంతులుగారి ధర్మపత్నియును సుగుణవతియునగు మాణిక్యాంబ గారిచే నొకసభ జరిగింపఁ బడెను. ఆ సభలో రు. 116-0-0లు బహుమానమొసంగిరి. ఇందు సీతాకళ్యాణ మాశుప్రబంధముగాఁ జెప్పఁబడినది.

2. శ్రీ పోలవరము జమీందారుగారును, సరస్వతీపత్రికాధిపతులునునగు శ్రీ రాజా కొచ్చర్లకోట వేంకటకృష్ణరావు బహద్దరు జమీందారుగారును, పండితవర్యులగు శ్రీ వంకా వేంకటరత్న శాస్త్రిగారును అగ్రాసనాధిపతులుగ నీ కాకినాడ మహాజనులందఱచే శ్రీ పిఠాపురపు మహారాజాగారి కాలేజీలో నొక మహాసభ జరిగింపఁబడెను. ఆ సభలో రు. 232-0-0 లును, 2 బంగారపు బిరుద మండనములును నొసంగిరి. ఇందు భీష్మ జనన మాశుప్రబంధముగాఁ జెప్పఁబడినది.

3. ఆంధ్రాక్షరతత్త్వాదిగ్రంథకర్తలును, వైయాకరణులును, విద్వత్కవి వరేణ్యులునునగు శ్రీ పాడి వేంకటస్వామిపాఠీ గారగ్రాసనాధిపతులుగా నీ పురమందు సుజనరంజనీ ముద్రాక్షరశాలాధిపతులును విద్యావిశేషులునునగు శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావు పంతులుగారిచేఁ దమ మందిరంబుననే యొకసభ జరిగింపఁబడెను. ఆ సభలో రు. 116-0-0లును రెండు బంగారపు బతకములును నొసంగిరి. ఇందుఁగంసవధయు, నభిమన్యువధయు ఆశుప్రబంధములుగా ఁజెప్పఁబడినవి.

4. వైశ్య వంశజులును సుగుణధనాభిరాములును నగు శ్రీ పైండా పెద్దయ్యన్న గారను పర్యాయనామముగల వేంకటాచలపతిగారిచే వారి గృహంబుననే యొక సభ జరిగింపఁ బడెను. ఆ సభలో రు.116-0-0లు నొసంగిరి. ఇందాశు కవిత్వమును జెప్పరి.

5. ధనికులును విద్యా రసికులునునగు శ్రీ కొవ్వూరి ఆదినారాయణ రెడ్డి గారిచే వారి భవనంబుననే యొక సభ జరిగింపఁబడెను. ఆ సభలో ననేకవిధములగు సత్కారంబు లొనర్చిరి. ఇందు నాశుకవిత్వమును జెప్పిరి.

ఇట్టి సభలలో వీరికవితా సామర్థ్యంబును దిలకించి యభిలషించి పండిత కవీంద్రుల నామధేయంబును వారి యభిప్రాయంబులు తేటపడు పద్యంబులును నే నెఱింగినవఱకును నాకు లభించినంతవఱకు నీక్రింద నుదహరించితిని.

కాకినాడ ఇట్లు,

2-6-1912 **చేగంటి బాపిరాజు**

## గంజామువారి యింటియొద్ద సభలోఁ జదివిన పద్యములు

కవులును బండితేంద్రులును గ్రాల్కొనియుండిన కాకినాడలో
నవిరళశక్తితో సభల నద్భుతలీలల నిర్వహించి కా
కవులకు గర్వభంగమగు కైవడి నాత్మజయధ్వజంబునున్
నవముగ నాటినారు భువనస్తుతిఁ గొప్పరపుంగవీశ్వరుల్

రారేపోరె మహాకవుల్ నిజవచోరంభంబు సూపింపరే
వారిన్ వారి కవిత్వమున్ గనియు సంభావింపరే సభ్యులె
వ్వారైనన్ మనకొప్పరంపుఁ గవిరాట్పుర్జన్యుఁ లట్లొప్పిరే
స్ఫారప్రజ్ఞకు సభ్యులిప్పగిది సంభావించిరే యెవ్వరిన్

అరరేయంచు వహావ్వరేయనుచు వహ్వాయంచునున్ మెచ్చుచున్
కరతాళధ్వనులన్ ఘటించుచు మహానందంబునుం జెందుచున్
సరసత్వంబును జూపు వాయసపురీ సభ్యాళి మెప్పించు కొ
ప్పరపున్ సోదరసత్కవీశ్వరులదే భాగ్యంబు భాగ్యంబనన్

నిలువఁగలారె కాకపురినిర్భయులై సభనెట్టివారలున్
నిలిచిననిర్త్రుగాక యొకనేర్పున నూర్పయినన్ వెలార్ప కే
పలికినపల్కు వేరొకటఁబల్కక కొప్పరపున్ మహాకవీం
ద్రులవలె నాశుసత్కృతులు దూకఁగ జెప్పెడివారలుందురే

పుట్టిరి విప్రకులంబునఁ
బట్టిరి జగదేకమాత పదపద్మంబుల్
కట్టిరి జయకంకణములు
కొట్టిరి శాత్రవులతలలు కొప్రంపుఁగవుల్

రాజోలు — **పొన్నాడ కృష్ణమూర్తి**

నటదుమాపతిశిర స్తటవిరాజద్దివ్య
గంగాప్రవాహ వేగంబుకంటె
కమనీయకాఠిన్య రమణీయ నిరుపమ
ప్రౌఢాంగనాస్తన ద్వయముకంటె
నిస్తులమాధుర్య శస్తసంస్తవనీయ
ఘనగోస్తనీస్తబకములకంటె
నిఖిలసుపర్వ ప్రముఖ నిత్యవర్ణనా
ప్రాబల్యవహసుధా రసముకంటె

వడియు, రసభావ కఠినత, వర్ణనీయ
మాధురీధురీణత, స్వచ్ఛమహిమఁదాల్చి

వెలసెఁగా భవదీయకవిత్వ గరిమ
వంద్యమై సోదరకవీంద్ర వర్యులార

ఇచ్చినారు నృపాలు రెన్నేని బిరుదముల్
మెచ్చినారు కవీంద్రులిచ్చతోడ
పెచ్చినారు గ్రహించి వేనూటపదియార్లు
హెచ్చినారు సమాను లెవ్వరనఁగ
వ్రచ్చినారు విరోధివర్గంబు నెల్లను
ద్రచ్చినారు సమస్తగ్రంథములను
తెచ్చినారు సుకీర్తి దేశంబునకునింత
వచ్చినారిపుడు కన్పండువుగను

గాంచినాఁడను మిము, సంతసించినాఁడ
భవదఖండాశుకవితా ప్రభావమనుప
మేయమని పొంగినాఁడ నమేయ కీర్తి
విభవులార! కొప్పరపుకవివరులార!

కొప్పరపువారి కవనము
కప్పురపుంబలుకులట్లు గనిపించె బలే
యిప్పగిదిఁ జెప్పనొప్పునె
యొప్పుగ నెవ్వారి కేని నుర్వీస్థలిలోన్

చెలఁగ గంజాముకవారింట సీతపెండ్లి
లీల భీష్మజననముఁ గాలేజిలోన
రీవిమీఱ బ్రహ్మానందరావుగారి
భవనమున నభిమన్యు కంసవధలనెడు
కథలఁ జెప్పిరి సోదరకవులు భళిర!

గంజామువారింటఁ గడిమిగైకొనినారు
　　నూటపదార్లు వినోదమొదవ
నాపైని సంబరంబలరార నేనుంగు
　　నెక్కియూరెల్ల నూరేగినారు
కాలేజిసభలోనఁ గైకొని రిన్నూట
　　పదియార్లు బంగారు పదకములను
ప్రథిత బ్రహ్మానంద రావింటనూరార్లు
　　బంగారుపదకముల్ పడసినారు

పైడ వెంకటాచలపతి మేడలోన
నూటపదియార్లుపడసిరి మాటమాత్ర
నరయ మాకాకినాడ భాగ్యంబుకదుఁబ
విత్రమయ్యెఁ గొప్పరపుకవివరులార!

చంద్రునకునూలుపోగన్న సామ్యముగ మ
దీయహృదయ తోషణమిట్లు తెలిపినాఁడ
నంతియేకాని మిమునెన్న నెంతవాఁడ
నాశుధారాకవీంద్ర సింహాంకులార!

కాకినాడ　　　　　　　　　　　　　　ఇట్లు,
18-6-1912　　　　　　　　**ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి**

**కాకినాడ మనోరంజని పత్రికా సంపాదకులు శ్రీయుత కాళ్ళకూరి నారాయణరావుగారు కాలేజిసభలోఁ జదివిన పద్యములు**

తలమీఁద గంగను ధరియించు శివునకు
　　సలిలాభిషేకంబు సలిపినట్లు
జగతికెల్లను వెల్గు సమకూర్చు నినునకుఁ
　　బేరిమి దివ్వె జూపించినట్లు

విశ్వమెల్లసుఖింప వీచుమారుతునకు
వీవనఁ జేపట్టి విసరునట్లు
వసుధాతలంబెల్ల వర్షించుఘనునకు
సరవితో నర్ఘ్య మొసంగినట్లు

దశదిశల నాశుకవితామృతంబుఁగురిసి
ఖ్యాతిగాంచిన కొప్పరకవులమీఁద
బద్దెములు చెప్పుటకు సిద్ధపడిననాదు
చాపలముసైపుఁడీ సభాస్తారులార

సభలోన మాటాడఁజాలుటే గొప్ప ప
ద్యములతో నగుట చోద్యంబు గాదె
తడబడుచైనఁ బద్యంబల్లుటే గొప్ప
పరమాశుధార యబ్రంబు గాదె
అడిగిన పద్యమొండైనఁ జెప్పుట గొప్ప
గంట కేనూఱు లక్కజము గాదె
ఉర్విలో నిట్టి వారొకరు పుట్టుట గొప్ప
యిరువురొక్కింట నచ్చెరువు గాదె

పూర్వ భవమున వీరేమి పుణ్యమాచ
రించిరో యిట్టి వారిని గాంచ వీరి
తల్లిదండ్రులు చేసిన తపమదేమొ
బళిర యిట్లుండ వలవదే భాగ్య గరిమ

వడిలాగి విడువంగఁబడిన బాణమురీతి
బరిమీఁదఁబఱచెడు పాముభాతి
నేలకుదిగుకొండ కాలువకరణిని
మిఱుమిట్లుగొలుపు క్రొమ్మించుసరణి

మిడివేసఁగినిఁబడు వడగండ్ల చందాన
    సందీక మోదు వర్షమువిధాన
వడిజిచ్చుబుడ్డి వెల్వడుమిఖ్గురులమాడ్కిఁ
    దమిరేఁగు మిడుతలదండుపోల్కి

బళిరెయొంటిగఁ బదులుగ వందలుగ స
హస్రములుగను మఱియు ననంతములుగ
వెలువడెడు వీరిజిహ్వాగ్రవీధినుండి
పద్యములు పండితకవీంద్ర హృద్యములుగ

కాలికి బంగారు గండపెండెర మంది
    వన్నెగన్నట్టి పెద్దన్న నాఁడు
పదగుంభనమునందు బహుళ విఖ్యాతిని
    గాంచిన రామలింగ కవినాఁడు
ఘటికా శతగ్రంథ కరణ ధురీణుఁడై
    కీర్తినించిన బట్టు మూర్తినాఁడు
జాములో శతకంబు సంధించి బిరుదంబుఁ
    గైకొన్న వీరరాఘవునినాఁడు

వెలసి పెంపొంది ప్రోడయై విస్తరించి
యవలఁ బెద్దలఁగలసిన యట్టియాశు
కవిత నేఁటికిఁగొప్పర కవులవలన
నవతరించెను మరల నీయవనిలోన

గణయతి ప్రాసలక్షణమె యుండ దటంచు
    వదరు వారికిఁ దలవంపు గాఁగ
వల్లించుకొన్నదే వడిఁ జదువుదు రంచుఁ
    జాటు వారికి నగుబాటు గలుగ

పల్లెటూళ్ల నొకింత పరువుఁ గాంచి రటంచుఁ
బలుకు వారికి శృంగ భంగ మొదవ
చెప్పినదే మార్చి చెప్పుచుందు రటంచుఁ
జెప్పెడి వారికి సిగ్గు రాఁగ

కాకినాడ పురమ్మునఁ కవివరులును
పండితులు పండితప్రభుల్ వఱలు సభను
ఆశు కవితామృత ప్రవాహంబు వెల్లి
విరియఁ జేసిరి నేఁడు కొప్పరపు వారు

వసుధలో నార్వేల వారి కైవసమందు
రాశుకవిత్వ మహాప్రకర్ష
వలనొప్ప నార్వేల వారి సొమ్మందురు
బంధ కవిత్వ సంబంధపటిమ
ధీరులౌ నార్వేల వారి సొత్తందురు
గర్భ కవిత్వ సందర్భశుద్ధి
వంద్యులౌ నార్వేల వారి పంటందురు
చిత్రకవిత్వ వైచిత్ర్యగరిమ

అట్టి యార్వేల వారింటఁ బుట్టఁగల్గి
నందులకు సార్థకంబుగ నందినారు
విశ్వము నుతింపఁగా జతుర్విధ కవిత్వ
పట్ట భద్రత్వమౌర కొప్పరపుఁ గవులు

**కాకినాడ కాలేజి పండితులు శ్రీ వేంకట నారాయణ పాఠీయను**
**పాడి వేంకటస్వామి గారు**

వళియుంబ్రాసములేని సంస్కృతకవిత్వంబందు దేవీప్రసా
ద లసత్ప్రజ్ఞులు కాళిదాసముఖ వేత్తల్ కావ్యమాశూక్తులన్

బలుకన్ గొప్పగనుండె; నీయెడల గొప్రంపుంగవుల్ గంటలో
పల బెక్కాశు చరిత్రముల్ సభలలోఁ బల్మాఱువాక్రువ్వరే

శ్రీమచ్ఛిష్ట కులాబ్ధిపూర్ణశశియౌశ్రీకృష్ణమూర్త్యాఖ్యుఁడా
హా మున్ గోగ్రహణంబుఁ జెప్పెఁనట యొండాశుప్రబంధంబుగన్
సామాన్యంబుగ గొప్రపుంగవులు సంస్థానంబులం జెప్పరే
నామోదంబుగ గంటలోపల ననేకాశుప్రబంధంబులన్

యతియే యుండదు ప్రాసయే గదియ దేయంశంబునం దన్వయ
స్థితియే లేదు సమాస మిల్లయని విద్వేషంబుతోఁ బల్కు పం
డిత కాకంబుల దుష్ప్రలాపములు శాంతిం బొందెడున్ సభ్యులై
ప్రతతాశూక్తులఁ గొప్రపుంగవుల కావ్యంబింత యాలించినన్.

కొప్పరపుసోదరులుసభఁజెప్పుకవిత
వీనులలరంగఁ బలుమఱువినియువినియుఁ
గనులు తనియంగ వైఖరిఁగనియుఁగనియు
నలరె వేంకటనారాయణాఖ్య పాఠి

**కాకినాడ పోస్టుమాష్టరు శ్రీయుత దేవగుప్త సన్యాసిరాజుగారు**

తేనెలసోనలో! కలక దేరిన మీఱిన పానకంబులో
మానిత మాధురీగుణ సమంజస దివ్యరసాయనంబులో!
సూనమరంద గంధపరిశోభితదివ్యఝురీ తరంగ సం
తానములో! సుధారస నిధానములోగద మీకవిత్వముల్

గండగత్తెర కాడఁగట్టి పరీక్షగాఁ
        గబ్బంబు లల్లు తిక్కన్నరీతి
రెండందియలు గాళ్ళఁ గొండాడఁ దాల్చిన
        యల యలసాని పెద్దన్నకరణి

వాణి నారాణినా వాసికెక్కితినని
యెన్నికcగన్న వీరన్నభాతి
సర్వజ్ఞుcడన సమస్తకవీంద్ర కోటిచే
మన్ననల్ గన్న సోమన్న సరణి

వేగముగ నాశుధారా కవిత్వ మీరు
చెప్పcగలుగుదురో కవిసింహులార!
బాలకాకారములుదాల్చు ప్రౌఢులార!
షట్సహస్రద్విజాన్వయ చంద్రులార!

రాయలుమీకవనము శ్రుతి
పేయముగావినిన మీకు వేయcడతోడా
లీయెడ నీయిలలోcగవి
రాయలుమీరనుచుc! గొప్పరపుcగవులారా!

ఆ కృష్ణ దేవరాయలు
మీకవనము విననిలోటు మెచ్చునిలోటున్
మాకృష్ణరాయలిప్పుడు
పోకార్చె సభాభిముఖ్యముం గైకొనుచున్

నూటపదియాఱులును నే
నూటపదాఱులును గొంచు నుతికెక్కిన మీ
బోటికవివరులు మత్కృతి
నూటిక నూల్పోగుగాc గనుంగొననెంతున్

శ్రీహరిచింతనామృతపాన పరిమత్త
చేతో మధుపరాజు పోతరాజు
రాజాధిరాజ సభాజనస్తవనీయ
బహుసద్గుణ సమాజుc బాపరాజు

గాంగనిర్ఝరసదృగ్ధారాళవాక్సుధా
రసవిభూషితభోజు రంగరాజు
రమణీయ రసవిస్ఫురచ్ఛబ్ద కలిత వి
ద్యా దివిషద్భూజు నయలరాజు

దొట్టికవిలోక చక్రవర్తులనుగన్న
యాంధ్రభారతి పూర్వపుణ్యమునఁజేసి
యవతరించిన యనుఁగు కందువులుమీర
లవుదురను దేవగుప్త సన్యాసిరాజు

**కొప్పరపు సోదరకవులకుఁ బంపిన పద్యములు - మహారాజశ్రీ బ్రహ్మశ్రీ కొప్పరపుఁ గవీశయుగళమునకు నమస్క్రియాపురస్కృతముగ**

లేశమునేని జంకకవలీలఁ బదంబుల చాలు గూర్చి మా
యాశయముం బొసంగఁగఁ బ్రయాస మొకింతయు లేక గోస్తనీ
పేశల పాక మొప్పఁగను భీష్ముని సత్కథఁ జెప్పినట్టి మీ
యాశు కవిత్వ ధోరణికి నంజలి సేయఁగఁ జెల్లు, లేదిఁకే
కోశము నందు సందియము కొప్పరపుం గవులార మీకు స
ర్వేశు ననుగ్రహంబున సమృద్ధిగ నాయువు శ్రీయుఁగీర్తి ధీ
కౌశలమున్ బొసంగుత సుఖం బొడగూరుచు నిచ్చలున్ ధరా
ధీశుల సత్కృతుల్ వెలయు నెంతయు నుద్ధతి గల్గుఁగావుతన్.

కాకినాడ ఇట్లు విన్నవించు విధేయుడు,
2-6-1912 **ఆదిపూడి ప్రభాకరరావు**

కొప్పరంపుఁగవులు గొప్పవారనుచుంట
వినుటెకాని యెపుడు కనుట లేదు
చేసినట్టి పనులె చెప్పినదానికి
సాక్ష్యమిచ్చెమాకు సరిగ నేఁడు

ఈవినయంబీవాగ్ధా
రా విభవం బీకవిత్వ రమణీయత యీ
భావుకపదార్ధ గుంభన
మేవెరవునఁగనిన నొరులయెడ లేదుగదా

వచ్చిన ప్రాంత పద్యములె వందల కొద్దిగ నొక్కగంటలో
నెచ్చట నేనియుం జదువ నెవ్వరి కైన నశక్యమన్నచోఁ
జెచ్చెరఁ గ్రొత్త గాథలను జెప్పఁడటన్నను జంకు గొంకులే
కుచ్చితఁ జెప్పు నిక్కవుల యొప్పులె చెప్పఁగ నొప్పు నెప్పుడున్.

ఎందఱఁ జూడ మిద్ధరణి నిద్ధకవిత్వ మహత్త్వ సంపద
స్పందుల, వారలిత్తెఱగు వారని వింటిమె కంటిమే మహా
నందము గూర్చి రిక్కవులు నాగ విభూష జటాటవీ విని
ష్యంది సరిత్ఝురీ పరిలసత్కవితా రస ధీర ధోరణిన్.

మంచిబిరుదములంగాంచి రంచితమగు
పదకములను జెందిరిబహు బహుమతులుఁగ్ర
హించిరిఁక వీరి కేమిత్తు నంచు నెంచి
పంచరత్నము లివె సమర్పించుకొంటి

ఇట్లు,

**శృంగారకవి సర్వారాయకవి**

**శ్రీ కొప్పరపు కవులు సకల సత్కార్యంబులంది తమ నివాసంబున కేగు సమయంబునఁ జెప్పిన పద్యములు**

శ్రీమాన్య కొప్పర గ్రామ వాసుల మమ్ము
భీమాఖ్యు చేతఁ బిల్పించితీవె
గంజాము వంశ వేంకట రత్న ఘను నింట
గురు సభాస్థలి మెప్పు గూర్చితీవె

కాకపురీ నరాగ్రణులచే సభ మహో
దంచిత స్థితి సంఘటించితీవె
ఆ సభాధీశ్వరుఁడలరి కోరిన పద్య
కృతులు మాచేతఁ బల్కించితీవె

తత్సభా స్థలి సుకవి విద్వన్నరేంద్ర
వరులచేఁ బెక్కు మన్ననల్ జరిపితీవె
మహిమ నీ కాకినాడ నస్మద్విజయపు
ధ్వజము నాటించితీవె శ్రీ వాగ్భవాని!

న్యాయవాదులు ధరానాథు లీపురి వర్ణ
నీయు లెంతేని మన్నించినారు
పండితేంద్రులు కవిప్రవరు లీనగరి న
ద్భుత కళాకౌశలుల్ పొగడినారు
గుణరాశి కొవ్వూరి కులుఁడాది రెడ్డి యి
వ్వీట హెచ్చున గౌరవించి నాఁడు
అనఘ పండా వేంకటాచలుండిచ్చోట
మేటి నూఁటార్లిచ్చి మెచ్చినాఁడు

సుగుణశీలి బ్రహ్మానంద సూరి మౌళి
శ్రేష్ఠుఁడీయూరఁ గడు నాదరించినాఁడు
కాన నింతకు నీ కృప కారణంబు
తల్లి! కైకొమ్మ యిదియె వందన శతంబు

కాకినాడ ఇట్లు,
2-6-1912 **చేగంటి బాపిరాజు**
(సంకలన కర్త)



# అనుబంధములు

శ్రీ హయగ్రీవాయ నమః

## ఆ ము ఖ ము

❦❦❦❦❦❦❦

బ్రహ్మశ్రీ మహాకవి కాళ్ళకూరు నారాయణరావుగారి సంపాదకత్వమున కాకినాడ నుండి వెలువడిన 1912 జులై 15 మనోరంజనీ మాసపత్రికలో "కొప్పరపు సోదరకవులు - కాకినాడ" అను శీర్షిక క్రిందఁ బ్రకటింపఁబడి, తమదగ్గఱనున్న మహాకవి కాళ్లకూరు నారాయణరావుగారి వ్యాసమును గుంటూరు అరండల్‌పేట తొమ్మిదవలైను వాస్తవ్యులు ఎం.ఏ. పట్టభద్రులు తిరుపతి వేంకటీయాది గ్రంథకర్తలు సారస్వతాభిమానులు సుహృద్భావులునగు బ్రహ్మశ్రీ గుండవరపు లక్ష్మీనారాయణామాత్య శేఖరులు సుమారొక సంవత్సరమునకు బూర్వముఁనాకిచ్చి చూడుమనిరి.

నేనా వ్యాసమును జూచుచుండగనే యందలి పద్యములను, నాకడనున్న కొప్పరపు సోదరకవుల రచనలను మఱికొన్ని యితర రచనలను గలిపి యచ్చొత్తించి పుస్తకరూపమునఁ బ్రకటింపనెంచితిని. కాని నేనప్పుడు కొప్పరపు సోదరకవుల చరిత్ర ముద్రింపించుచుండుటచేత బిమ్మట కొన్నినాళ్ళకు ననఁగా 8-9-1972 తేదీన గుంటూరు బ్రాడీపేట నాలుగవ లైనులో నేను ట్యాక్సీక్రిందపడుటవలనను నింతకాల మాగవలసి వచ్చినది.

భగవదనుగ్రహమున నేనిప్పుడారచనల నన్నిటిని కలిపి "కొప్పరపు సోదర కవులు - ఆశుకవిత - కాకినాడ" యను పేరుతో నచ్చొత్తించి పుస్తకరూపమునఁ బ్రకటింపఁ గలిగినందుకు సంతోషించుచున్నాను.

నాఁడు కొప్పరపు సోదరకవుల యాశుకవితామృతము నాస్వాదించి సంతోష పారావార తరంగంబుల నుయ్యాల లూఁగిన పండిత పామరులెందఱో గలరని చెప్పుటకు వారి శతావధానములందలి పండితకవీంద్రుల ప్రశంసా పద్యములే సాక్షి. నాఁటివారిలో నే నొకరుండనై యుండుట నాయదృష్టము.

వర్తమాన భవిష్యత్కాలములలో సకలజను లీ గ్రంధమువలన సోదరకవుల యాశుకవితామృతమును జవిచూచి యానందాబ్ధి నోలలాడఁ గలరని చెప్పుట కెట్టి సందియము లేదు.

నా సంకల్పమును దెలిపినంతనే ధనమిచ్చి తోడ్పడిన అభిమానవంతు లందఱకు నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

నే నభ్యర్థించినంతనే తమ పనులన్నియు మానుకొని ముద్రణస్ఖాలిత్యముల నప్పటికప్పుడు సవరించి యిచ్చుచు నాభారమును తగ్గించిన తెనాలి తాలూకా జూనియర్ కాలేజి రిటైర్డు సీనియర్ తెలుఁగు పండితులు ఉభయభాషా ప్రవీణులు నైన బ్రహ్మశ్రీ పులిగడ్డ వేంకట సుబ్బారాయ ప్రెగ్గడపుంగవులకు నా హృదయపూర్వక ఆశీశ్శతంబులు.

పెనుగుదురుపాడు — ఇట్లు,

ఆనంద సంవత్సరాది — ముద్రాపయిత

24-3-1974 — **కుంటముక్కల వేంకటజానకీరామశర్మ**



# కొప్పరపు సోదరకవులు - ఆశుకవిత

## కాకినాడ



మనోరంజని

15-7-1912 **కాళ్ళకూరి నారాయణరావు**

..... ఆశుకవిత్వము లోకమున కుపయోగించునది కాదcట! భాషను బాడుచేయునంట! బంధకవిత్వము వలనను గర్భకవిత్వము వలనను లోకమునకేమి యుపయోగమున్నదో! ఈ కాలములో నష్టావధానులు శతావధానులు నొంటిగను జంటగను గుప్పతిప్పలుగా బయలు వెడలుచున్నారు గదా! లోకమునకు వీరి యవధానములవలన నేమి ప్రయోజనము కలిగినదో! కలుగుచున్నదో!! కలుగc గలదో!!!

*"రవికెల గుడ్డలు చొక్కల గుడ్డలు రంగుగ గుట్టెడువారలకున్
సవరుగ దొర్లకు నెత్తులమీcదను క్షౌరముచేసెడి వారలకున్
భవనములందున దివ్వెల నెప్పుడు బాగొనరించెడు వారలకున్
మివులుగc గత్తెర కావలయుంజుమి మిత్రుcడ వింటివె మేదినిలోన్"

---

*ఇది, కొమ్ములుతిరిగిన యొక యవధానిపుంగవుల జత, యవధానము నందుc గత్తెరమీcదc జెప్పిన పద్యము. ఇది నాకడనున్నందున సోదరకవులిచ్చట నున్న దినములలో నొకప్పుడు వీరెట్లు చెప్పుదురో చూతమని కత్తెరపై నొక కవిరాజ విరాజితము చెప్పుడని యడుగ, వారున్నపాటున నాశువుగా నేడెనిమిది పద్యములం జెప్పిరి. వానిలో నొకటి యీ దిగువ నుదహరించు చున్నాcడ.

అను నిట్టి యవధానపుఁ బద్దెములవలన భాషకేమి పోషణము జరుగుచున్నదో! తరచిన కొలఁది యీవిధముగ వారి యుక్తులు వారికె ప్రతిబంధకములైవారి దుర్వాదమును, వారి యోర్వలేమిని, వారి కడుపుమంటను వేనోళ్ల వెల్లడించు చున్నవి.

నిశ్శంకమైన పాండిత్యమును, నిరాఘాటమైన కవితాధారయు, నిర్ధారితమైన ప్రతిభయు, నిష్పన్నమైన కీర్తియు, నిష్కళంకమైన వర్తనమును గలిగి - యాంధ్రలోకమునకెల్ల వన్నెదెచ్చు నీ సోదర కవిచంద్రుల సామర్థ్యమును జూచి సంతసించుటకు మాఱుగా, నీర్ష్యవహించుటయు వారి సభలకుఁ బోకయే, వారి కవితాధోరణి వినకయె, వారెట్టివారో గూడ నెరుఁగకయె తోఁచినట్లెల్ల వదరుటయు నీచకృత్యములుగదా!

ఆశుకవిచక్రవర్తులు ప్రతిసభయందును - ప్రసిద్ధ కథయొసఁగక, యే యితర భాషలలోనిదైనఁ గ్రొత్త కథనొసఁగి మా సామర్థ్యమును బరీక్షింపుఁడని సభ్యుల ధీకొని యడుగుచున్నారు. మీకిష్టమగు వర్ణనములను, నియమములను గోరుఁడని గొంతెత్తి పలుకుచున్నారు. మీకేమేని సందియములున్నచోఁ జాటున ద్రోహపుమాటలాడక, సభలోలేచి నిలువంబడి నిస్సంశయముగ మమ్ములనడుగుఁడని ఢంకాపయి దెబ్బఁగొట్టి చెప్పుచున్నారు. యతిప్రాసము లెంతమందునకైన బోధపడునట్లుగా నాయాస్థలములలో నాఁగియే నుడువుచున్నారు. వ్యంగ్యములు, శ్లేషలు, నౌచిత్యములు మున్నగు విశేషములుండు పట్టులను ప్రతివారికి బోధపడుటకై రెండేసి మూఁడేసిసారులు పఠించుచున్నారు. ఇట్టి స్థితిలో వారిసభకేపోకయుఁ, బోయినఁబెదవి మెదల్పకయు, వెనుక వాదులాడుట తగునా!

---

"ఇరువురు గూడి యొనర్చునెడం బనులెప్పగిదిన్నెఱవేఱెడునో,
యిరువురు కాంతల సందునఁ గాంతుఁడదెంత సుఖంపడఁజాలునొ, యొ
క్కరునకు నొక్కరుఁడేగతిఁ దోడ్పడఁ గావలెనో క్రియలందునఁ గ
త్తెర మన కత్తెరఁగెల్ల వివేకనిధీ! తగబోధ యొనర్చుఁజుమీ!"

ఇంక నీ విషయము నింతటితో ముగించి వారి యాశుకవిత్వ, మాశువును గూర్చి యప్పకవి చెప్పినట్లుపమానములు నుత్ప్రేక్షలు లేనిదిగా నుండునో – మన యసత్యవాదులు చెప్పునట్లు గణయతిప్రాసలు లేనిదిగా నుండునో, – లేక మేముచెప్పినట్లు సలక్షణముగానే యుండునో మాపారకులకు విశదపరచుటకై మేము వ్రాసికొనిన వారి పద్యములు కొన్నిటి నీదిగువ నుదాహరించెదము –

**గంజామువారి యింటఁ జెప్పిన సీతాకళ్యాణమునందలి పద్యములు.**

**దశరథుని పుత్రోదయ మిట్లు వర్ణింపఁబడెను :-**

దంతములు నాలుగైరావతంబునకును
దనయులగు వారు నల్వురు దశరధునకు
నభ్యుదయ మంద విబుధ చయంబు పొంగ
వైరి దోషాచరాళి గర్వంబడంగ

**వసిష్ఠుడు దశరథునితో విశ్వామిత్రుని ప్రభావమునుగూర్చి చెప్పిన మాటలిట్లభివర్ణింపఁ బడెను :-**

చటుల తపోగ్నిచే జగమెల్ల నుడికించి
భవ్యమౌ బ్రహ్మర్షి పదవిఁ గాంచె
మేనకాంగనతోడ మేనొక్కటిగఁ జేసి
వలనొప్పఁగా శకుంతలను గాంచె
స్వర్గంబునకుఁ బ్రతి స్వర్గంబు నిర్మించి
యటఁ ద్రిశంకు మహేంద్రు నట్టులుంచె
గారాని దొసఁగులఁగావించి దయనించి
యల హరిశ్చంద్రుని ఖ్యాతుఁ జేసె

బ్రహ్మఁ దిమ్మని, దిమ్మని బమ్మగాఁగ
సేయ నేర్పుగలాఁడు కౌశికుఁ డితండు
చండకోపుఁడు సకలాస్త్ర శస్త్రవేది
వీనికోరికఁ దీర్పు మూర్వీకళత్ర!

**రామలక్ష్మణుల నిరుగెడల నిడుకొని చను విశ్వామిత్రునిట్లు వర్ణించిరి:-**

కనుఁగవ శోణకాంతు లెసఁగన్ ధనువుల్ శరముల్ కరంబులం
దున వెలుఁగన్ జగంబు లొక తూరియె గెల్చెడి పెంపుఁ జెల్ల న
ల్లన నల రామ లక్ష్మణు లలంఘ్యులు వారిరుప్రక్కలం దగన్
మునివరుఁడొప్పె శృంగయుగముంగల మత్త వృషంబు కైవడిన్.

**రాముఁడు సుబాహుని జంపుటనుగూర్చి యిట్లు వక్కాణించిరి :-**

తా సుబాహుఁడైన నీ సుబాహుళ్యంబుఁ
జేసి యా సుబాహు క్షితినిఁ గూల్చెఁ
దన సమాఖ్య వాఁ డితండంచు నెంచక
క్షత్రధర్మమెంత చిత్ర మహహా!

**శ్రీరాముడు శివధనుర్భంగమునకై లేచునపుడు సీతకును దత్సఖికి ప్రసంగము జరిగినట్లు మనోహరముగఁ గల్పింపఁ బడెను :-**

**సీత శంక :-**

మగఁ డీతండగు నీ కటంచనెదు కొమ్మా! తమ్మిపూతేకుఁ బో
ల్పఁగనౌమేను గలట్టి యీ సరసుఁడే లావంది ముక్కంటి విం
టి గుణం బెక్కిడు నొక్కొ! యుక్కుగల మన్నీ లెందఱో చేరి సి
గ్గుఁగొనం జూడమె? యింత భాగ్యమిఁక నాకున్ దక్కునే? నిక్కమే!

**ఇందులకు సఖి చెప్పిన సమాధానము :-**

విరులనుప్రాలి సోయగము ప్రీలకయుండ మరందమాను న
త్తఱి మృదులంబునై, యులివిధంబున దారువునంటఁ దొల్చుచోఁ
గరము గఠోరమౌ యలి ముఖంబున నీ సుకుమారమౌళి సుం
దరతర మూర్తి యుగ్రమగు ధర్మముఁ బూన మహోగ్రమౌ జుమీ!

**రాముని గళమున సీత గజపుష్పమాల వైచుట**

గజదనుజ వైరి ధనువున్
గజిబిజి లేకుండ విరిచి ఖ్యాతింగను నం
గజమూర్తి రాము గళమున
గజసుమ దామంబువైచె గజగమన తగన్.

**కళాశాలలోఁ జెప్పిన భీష్మజననము నందలి పద్యములు, ఇష్టదేవతా ప్రార్థనము**

శ్రీయుత కృష్ణరాణ్ణృపతి శేషగిరీంద్రఘనుండు సూర్యనా
రాయణ మూర్తియుం బిలువ నస్మదమేయ కవిత్వ శక్తిఁ దా
రీ యెడఁజూడఁ జేరిన యహీనులు కాకపురీ సుధీంద్రు లౌ
రా! యని మెచ్చ మమ్ము విజయాఢ్యులఁ జేయఁగదమ్మ శాంభవీ!

**కథారంభమునందు భీష్మునిట్లభివర్ణించిరి.**

గంగా మహాదేవి కడుపు చల్లఁగఁ బుట్టి
గాంగేయుఁడను పేరు గాంచినాఁడు
వసు సప్తకంబిడు వరశక్తిచే నల
శక్తిసాధను మించఁ జాలినాఁడు
కన్నతండ్రి యభీష్ట మున్నతంబగు భక్తిఁ
దీర్చి యింద్రియగర్వ మోర్చినాఁడు
పరశురామునిఁ బోరఁ బరిభవం బందించి
యేక వీరఖ్యాతి నెసఁగినాఁడు

విష్ణు భక్తాగ్రగణ్యుఁడై వెలసినాఁడు
సకల భువనాద్భుతక్రియల్ సలిపినాఁడు
ఘనుఁడు దేవవ్రతుఁడు భీష్ముఁడనఘ చరితుఁ
డమ్మహామహు కథఁదెల్ప నలవియగునె!

**గంగకును బ్రహ్మకును గల బంధుత్వమును, ఆమె యతనిఁ జూడఁగోరుటయు నిట్లు తెలుపఁబడెను.**

హరి పద నలమునఁ దా, నా
హరి నాభీ నలినమందు నజుఁడొదవుట సో
దర భావమూని యొకతఱి
సురనది యయ్యజునిఁజేరి చూడఁదలంచెన్.

**గంగ శరీరధారిణియైన విధమిట్లు ప్రశంసింపఁబడెను:-**

ఘన శిరోజౌఘమో కాక శైవాలమో
యను సందియంబింత యమర కుండ
నయనంబులో కాక నలిన పత్రంబులో
యను సందియం బింత యలమ కుండఁ
దళుకుఁజూపులొ కాక బెళుకు బేడిస మీలొ
యను సందియం బింత తనర కుండ
గరువంపు పిరుదులో కాక సైకతములో
యను సందియంబింత మొనయ కుండ

వళులొ కాక బెడంగైన యలలొ యనెడి
నట్టి సందియ మింతయు నలర కుండ
గంగ నైజాంగ సంపదల్ రంగు మీఱ
నొక్క శృంగారవతి యయి యొప్పుఁ గాంచె.

**తోడి నదులు స్త్రీరూపములను దాల్చి గంగాదేవిని వెంబడించుట:-**

అవ్వార్త విని యొక్క జవ్వనియై వచ్చి
యమునా మహానది యాశ్రయించె
అప్పల్కు విని యొక్క కప్పుర గంధియై
వచ్చి కృష్ణానది మెచ్చుఁ జూపె

అమ్మాట విని యొక్క కొమ్మయై వచ్చి కా
వేరీ మహానది వేడ్కఁ బెంచె
అద్దాని విని యొక్క ముద్దరాలై వచ్చి
నర్మదా నది చాలఁగూర్మి నెఱపె

మఱియు ధాత్రీస్థలంబున మహిమఁగనిన
వాహినీమణు లంచితోత్సాహ మొదవ
నమ్మహోదంతమును వినినంతఁ గొంత
లగుచు వేవచ్చి సేవించి రల్ల గంగ.

**బ్రహ్మను చూడ వచ్చిన గంగను సరస్వతి గౌరవించినట్లే క్రిందివిధమున నెంతయు సరసముగఁ గల్పించి చెప్పిరి.**

అన్నగారిఁజూడ నన్నుమిన్నగ వచ్చు
గంగఁ దోడి తెచ్చి గారవించె
జగతి మగని లోన సగమాడు బిడ్డయన్
పలుకెఱింగి యుంటఁ బలుకు వెలఁది.

**బ్రహ్మ కొలువులోనున్న మహాభిషుఁడను ముని గంగను చూచి మోహించిన విధమిట్లు చెప్పఁబడెను:-**

అప్పూవ్వువింటి బంటున
కప్పన మొనరించి యమ్మహాభిషు నాత్మన్
ముప్పుం దిప్పలఁ బెట్టెను
ముప్పోకల మారి గంగ ముని యతఁడైనన్.

**ఈ సమయమునందు సభ యందలి బల్లమీఁది దీపము వీవన గాలిచే నారిపోఁగా దాని నుపమానముగఁ జేసి చక్కని యీ క్రింది పద్యమును జెప్పిరి.**

విషమపుఁ దాళ వృంతమున బెంపగు గాలిని దీపమాటె, నా
విషమ శర ప్రయుక్తమగు భీమ మహాశుగ శక్తి నమ్మహా
భిషుని హృదంతర స్థితిని వెల్గెడి జ్ఞానపు దీప మాఱెఁగా
విషయ సుఖంబులం దెగడు విజ్ఞులిసీయని యేవగింపఁగన్.

**ఎవ్వరేని తన్నపహసింతురేమోయని శంకించు మహాభిషుఁడు మనసును దృఢము చేసికొనిన విధమెంత స్వాభావికముగ వర్ణించిరో చూడుఁడు.**

కించు దనంబు దోఁప నను గేరి తిరస్కృతి సేయువారు యో
జించు కొనంగలేరొ తమ చెయ్వులు! దిక్పతులంచు మౌనులం
చెంచెద నొక్కొ యిట్టి తఱి యీ చనుదెంచిన వారికిట్లె నే
మంచము లెల్లఁగంతలను మాట యెఱుంగఁగఁ జేయఁ జాలనే

**గంగ శంతనుని దృష్టిపథంబునఁ పడునప్పటికి ధరించి యున్నసుందరాకృతి యిట్లు వర్ణింపఁబడెను.**

పున్నమి జాబిల్లిఁ బోలు నెమ్మొగమును,
కలువ ఱేకుల మించు కన్నుఁ గవయు,
నీలంపు సరులనఁజాలు ముంగురులును,
దిమిరంపు రాశినిఁ దెగడు కొప్పు
తళుకుటద్దములఁ గాల్దన్ను నున్జెక్కులు,
కలదు లేదను భ్రాంతిఁ గొలుపు కౌను,
ఇసుక తిన్నెల గోట నెగమీటు పిరుదులు,
లే యనంటుల గేలిసేయు తొడలు

మిలమిలఁగ నొక్క వెలఁదియై విమలరత్న
ఘటిత కాంచన భూషణ కలిత యగుచు
మదన మంత్రాధిదేవత మాడ్కిఁ దనరు
జాహ్నవిని గాంచి మోహించె శంతనుండు.

**భీష్ముని యుదయ ముత్ప్రేక్షింపఁబడెను:-**

ప్రాక్పయోరాశి సూర్యుని బడసినట్లు
క్షీర వారాశి యంబుజ వైరిఁ గన్న
యట్లు, జాహ్నవి గాంచె మహాత్ము భీష్ము
శంతనుండెంతయును మది సంతసింప.

**పోతాప్రగడ వారియింటఁ జెప్పిన యభిమన్యు వధ, కంసవధల యందలి పద్యములు :-**

**కుకవి నిరసన పూర్వకమగు నిష్టదేవతా ప్రార్థనము :-**

గురులఘువర్ణభేదమొక కొంచెమెఱుంగక తాఱుమాఱుగాఁ
దిరుగుచుఁ దన్నుఁబోలు నొక తిమ్మని గూడుచుఁ గొమ్మ లెక్కుచున్
చిఱచిఱలాడుచున్, విభుని చేపడి యందఱ వెక్కిరించు నా
తిరిపెపుఁ దిమ్మ పోతరము దీర్చి జయంబిడు మమ్మ శాంభవీ!

**కంసవధయందుఁ బూతన సంహారమిట్లు తెలుపఁబడెను:-**

పాలసుఁడైన కంసుఁడనుపన్ బెనుపండు వటంచుఁ బొంగుచున్
బాలిశయైన రక్కసి చివాలునఁ బాలివె పాలటంచు గో
పాలక బాలుఁజేఱెఁ దనపాలిఁకఁ దీఱె నటంచు బాలుఁడే
కాలుఁడటంచెఱుంగమిని గాలముదానికి దాపురించుటన్.

వలచు వారల మమ్ము వదరింపకుర యను
పడఁతుల కోపాలు బాపుమేటి
దిక్కు మాకిక నీవె దీనపోషక యను
భక్తుల పాపాలు బాపు మేటి
మదమెత్తి యెదిరించి కదనంబు సల్పెడి
పగతుర రూపాలఁ బాపుమేటి

ద్రొక్కఁ జాలనివారిఁ జక్కఁ జేరిన వారిఁ
బాలించి లోపాలు వాపుమేటి!

పాలు పాలంచు విసమున్న పాలొసంగఁ
గేలి దరిఁజేరు పాతకి బాల హంత
పాలతోఁగూడఁ బ్రాణాలు లీల నొడిసె
బాలుఁడైయున్న త్రిజగతీ పాలకుండు.

**శ్రీ కృష్ణుడు కంసుని వధించిన క్రమమిట్లు తెలుపంబడెను:-**

బడుగుం బీదలఁ దల్లిదండ్రులఁ జెఱం బట్టించె మిమ్మింతకున్
గడపంజూచె బదాఱువేల సతులం గాఱించె నీ దుష్టు నీ
చెడుగుం గంసుని ద్రుంతునంచుఁ గరిపై సింగంబనన్ శౌరి తాఁ
బెడకేలన్ సిగబట్టి తట్టి యడచెన్ భీమాట్టహాసంబునన్.

**అభిమన్యు వధ యందు యుధిష్ఠిరుఁ డభిమన్యునిఁ పద్మవ్యూహమును భేదింపుమని యడిగినట్లు చెప్పిన యీ పద్యమును కనుఁడు.**

గురుఁడల కౌరవేశ్వరుని కోరికపై ననుఁబట్టఁ దమ్మి మొ
గ్గరము ఘటించె శౌరియును గాండివియుం జని రన్యకార్యము
న్నెఱపఁగఁ దద్విభేదనము నేరరొరుల్ మఱియేమి చెప్ప ను
ర్వర మము నీట ముంచినను బాలను ముంచిన నీవె పుత్రకా!

**అభిమన్యుడు పద్మవ్యూహమును గూర్చి రథమును బోనిమ్మనిన సారథి వారించిన క్రమమిట్లు తెలుపంబడెను:-**

బాలుఁడవునీవు దుర్వార బలులు వార
లెదిరి బలమును దనబల మెఱుఁగ కుండ
సాహస మొనర్చినం గీడు సంభవించుఁ
బాటి సేయుము నామాట పార్థ తనయ!

**ఇందుకభిమన్యుఁ డొసఁగు నుత్తరమునెట్లు తెలిపిరో విలోకింపుఁడు:-**

ఇంచుక యేని శంకఁ గొన కిట్లనఁ జెల్లునె? నీవు గాన సై
రించితి, నాదు మామ భళిరే! యనఁ దండ్రి శబాసనన్, గురున్
మించి, కృపుం గలంచి, యటు మీఁద సుయోధను గర్ణునొంచి, య
భ్యంచిత కీర్తి నించెద, భయంపడనేల? రథంబుఁ ద్రోలుమా.

**సైంధవుని విజృంభణ మిట్లు పేర్కొన బడెను:-**

సింధు నృపాలుఁడెంత? యనిఁ జీరికిఁ గొందునె? పోర మద్భుజా
బంధురశక్తి మున్నెఱిఁగి పాఱఁడె? యంచని భీముఁడేచి రా
గంధగజాసురారి వర గర్వమునన్ సివమెత్త నాఁగె, నా
సైంధవుఁడౌర! దైవ కృపచాలిన శ్వానము సింహమౌ గదా!

**అభిమన్యుని విక్రమమును, శాత్రవులయక్రమమును, అతని నిర్యాణమును నొక పద్యమున నిట్లు వర్ణింపఁ బడెను:-**

చాపము నెక్కువెట్టి రిపుజాలము మారి మసంగినట్లు వాల్
తూపుల నేపడంప మది దోఁపక కర్ణుడు దుస్ససేనుఁడున్
జాపగురుండధర్మమని జంకక యొక్కట దూఁకి పైకొనన్
బాపపు దైవమేమియన! బాలుని కాలుని ప్రోలు చేరిచెన్.

**మంగళ సిద్ధి కొరకు, అభిమన్యుఁడు మరల బ్రతికింపఁబడిన ట్లీ క్రింది పద్యము చెప్పఁ బడెను.**

అల సుభద్రయు నుత్తర హర్షమంద
నన్న ముదమొంద, జగమెల్ల నబ్రమందఁ
బాండవేయులు నిజ పదాబ్జంబు లంద
మరల బ్రతికించె హరి యభిమన్యు నంద.



# తిరుపతి వేంకట కవులకు హెచ్చరిక

మనోరంజని పత్రిక : 17-12-1914

## గురు విశ్వనాథకవులు



ఓ యెండగండి కవు లా
రా! యిది యాలింపుఁడయ్య యలుగక; సత్యా
ర్థాయత్తుల కింపును దు
ర్ధీయుతులకుఁ గినుకఁ దెచ్చు తెలివిడి యగుటన్

బాంధవులు రామకృష్ణులు పగరలగుట
భీమ విజయులనందగి బిరుదుగనిన
సోదరులు ప్రాణ శత్రులై చూడఁబడుట
నెఱుఁగనయ్యో మీకురు బలం బిట్టి దంచు

సభకేఁగు దెంచి యాసనముఁ గోరని కొప్ప
రపుఁ గవిపైఁ గల్ల వ్రాయుటయును
అనవసరమ్ముగా నాసనమ్మున కాసఁ
జెందియు గజిబిజి చేయుటయును
పండితుఁడీ రీతిఁ బల్కరాదని తప్ప
భాస్త్రారులనఁ దల వంచుటయును
అవధానములఁ దప్పి యవి యెఱింగించు యథా
ర్థవాదులఁ దూలనాడుటయును

హితులని యసత్యవాదుల నెంచుటయును
వలదిటులనన్న వారల వదరుటయును
కలహ భోజనులకు విందు సలుపుటయును
గలుగు భవదీయ చరితంబుఁ దలఁపఁ దరమె?

అంగదుఁడాడు సంధివచనార్థ మపార్థముచేసి రావణుం
డంగదఁ జెంది నట్టు లహహా మన గుంటురి వారి సంధి వా
క్సంగతి లెక్కసేయ కెకసక్కెము లాడెను వేంకటేశ్వరుం
డింగిత మేమియంచు నగరే తమ వారలు నాఁడు ఖిన్నులై

వచ్చెనెటో దురోదరము వంక విశంకటమైన పోరు మీ
యిచ్చకు వచ్చినట్లనకుఁ డీ వినుఁడీ తగు సంధి వాక్యమున్
గచ్చులు మానుఁడీ యనుజనార్దను పల్కసమర్థు పల్కుఁగాఁ
దచ్చనచేసి కౌరవులు దర్పము సూపినయట్లు సూపుడున్
వచ్చెగదా పరాభవము భావము శాంతిల నింకనేని వి
ద్వచ్చయ మాననీయమగు పద్ధతి నుద్ధతి మానియుండుఁడీ.

ఇప్పటి రూల్సున కేము కట్టుంబడ
మంటిరి జైలుల నరయుఁడయ్య
పేర్చి దేవుని లక్ష్యపెట్టమేమని యంటి
రింక లంకావాస మెంచుఁడయ్య
లలిఁబాసి మాకు వల్లభులు లేరంటిరి
భరణంబునకు దావ వైవుఁడయ్య
జనసఖ్య మడఁగినఁ జచ్చిపోమంటిరి
మృషసఖ్యమైనఁ గోరెదరటయ్య

బలు సముద్రము మోకాలు బంటి యనెడు
దానికిం బూనితిరటయ్య తగదు తగదు

నెత్తిపై మోయరాని బర్వెత్తుకొనక
పరువు చెడిపోక యుండఁగా బ్రతుకుఁడయ్య

ఇవి కోరుడంచు ముందెఱిఁగించి వారవి
కోరఁగా వెంటనే కూర్చుటయును
క్రొత్తప్రశ్నములైనఁ గూడ వీనాడంచు
మరునాటి కయ్యవి మార్చుటయును
అవధాన కాపట్య మంత శిష్యులకు నే
రిపి యట్టి ద్రోవనే త్రిప్పుటయును
ఒప్పుల నన్నింటిఁ దప్పులుగా మార్చి
పొరుగువారలఁ దిట్టిపోయుటయును

నిత్యకృత్యంబులై మీకు నెగడుచుంట
నెఱిఁగియును మిమ్ము నిరసింపరేల కొంద
ఆహహా! యభిమానదేవతా మహిమగాక!
హస్తగత వస్తువుం జూడ నద్దమేల?

అక్షరతత్త్వంబు నరసియే “పడిశ” మ్మ
టంచు వ్రాసిన యుపాధ్యాయులార!
సూనృత వాక్కు పేరూని “యేని” పదంబుఁ
దప్పని నట్టి విద్వాంసులార!
అల “కరోమి” కిఁ “గవయామి” కి యుక్తులు
సంధించినట్టి ప్రశస్తులార!
అవధాన పద్యంబు లన్ని చదువకున్నఁ
దప్పుగాదన్న వధానులార!

తగు జనుల గూర్చుచును గీరతమును, సీమ
నెపుడు వినిపించు పౌరాణికేంద్రులార!

శిష్యులకు యుద్ధబోధలు సేయు దేశి
కేంద్రులార! కొనుండు మా వందనములు.

కాశికృష్ణ బుధుండు కరుణఁ జూపకయున్న
నభిమానమున సభలమరకున్నఁ
గొప్పరకవి సాయ మొప్పిచేయక యున్నఁ
గీరతంబునఁ బ్రొద్దు గెంటకున్నఁ
బృచ్ఛకులను దబాయించి పల్కకయున్న
నన్యోన్య సాహాయ్య మందకున్నఁ
గృపసేయుఁడవధాన మిది కాదనక యున్న
మఱునాఁటి కా సభ మార్పకున్న

నేమి యవధాన మిదియని యెచ్చరించు
వారలకు మ్రొక్కకున్న దుర్వారమైన
నేఁటి బింకమ్ము నా నాఁడె నీటఁగలిపి
దారిఁ బట్టింపకున్నె గుంటూరి గోష్ఠి

రణమైనన్ సరియే నియోగి సభఁ జేర్పన్ రాదు ప్రశ్నంబులం
దణువంతైన శ్రమంబు నీయదగ దా యా ప్రశ్నలన్ వైదికా
గ్రణులే కోరుఁడటంచు మున్దెలిపి శాఖాబాంధవుల్ కూర్ప బ్రా
హ్మణకోడూరున సల్పినట్టి సభ మీకౌన్నత్య మిప్పించునే?

కొందఱు మిత్రులున్ మఱియుఁ గొందఱు బాంధవు లేగుదెంచి మా
పందెము నిర్వహించుకొన వచ్చినవారము, ప్రశ్నలన్నియున్
ముందుగ వ్రాసియుండనఁగ ముచ్చట దీరఁగ వ్రాసియిచ్చి, వా
నిం దగఁ గోరఁ జెప్పితిరి నీతియొకోయది? పిన్నపాటిలోన్.

అవధానముల సమస్యల నీయరాదంచు
సిద్ధాంత మొక్కటి సేయుటయును

కావ్యపాఠము సెప్పుకార్యంబు వదలివే
        సినవార మంచు వచించుటయును
శాస్త్రార్థ మొనరించు సరణి యియ్యెడఁ బెట్టు
        కొన లేదటంచు వాక్రుచ్చుటయును
ఆకాశపుఁ బురాణమందు సారంబు లే
        దదియేటి కంచుఁ బోనాడుటయును
గంటలు తప్పినఁగాని యీ యవధాన
        ముల లోటు గాదంచుఁ బలుకుటయును

జూచియేకాదె నవ్విరి సూరివరులు
నరసరాట్పురిలో సభన్ జరుపువేళఁ
బృచ్ఛకుల కెంతయు నమస్కరించువేళ
నొడలెఱుంగని సివ మిప్పు డుండఁదగునె?

తప్పుగాని సమస్యను దప్పటంచుఁ
బలికి పండిత దూషణ సలిపినార
లెదుర గుంటూరునకు రయిలెక్కి పిక్క
బలము జూపుట లెఱుఁగని వారు గలరె?

సన్న్యాసమీయవే శతవధానమున కో
        భారతీ యని మ్రొక్కువార లెవరొ?
ఆశుకవిత్వ మాయలు సేయకిపుడు కా
        పాడరావే యన్నవార లెవరొ?
బృచ్ఛకులార! యంపింపుఁడీ మమ్ము మా
        యూరికేగతి నన్నవార లెవరొ?
యీగండ మీనాటి కెట్లు తప్పింతువో
        పరదేవతా యన్న వార లెవరొ?

సరిగ నవధాన పద్యముల్ చదువుఁడనిన
భోజన మొనర్చుటకుఁ బ్రొద్దుపోయెఁ జదువ
వలను పడదంచు బొంకిన వార లెవరొ?
భావమున నెంచుడయ్య బాపట్లపురిని.

వేమవరావధాన మది వేయి విధంబుల మ్రోఁగెఁ బత్రికా
స్తోమమున న్భవత్ప్రజ లసూయకు నెంతటి యాలయంబులో
యేమెయి మిమ్ము మింటిపయికెత్తి నటింపఁగఁ జూచుచుండిరో
దీమసమెట్టిదో, నిజముఁ దెల్పుఁడికేటికిఁ గూటవాదముల్

తిరుపతి వేంకటేశ కవిధీరులు గారొకొ మీరు? మీకుఁ గా
పురమగు కాకినాడ బుధపూజ్యులు కొప్పరపుం గవీశ్వరుల్
దిరముగ నాటలేదొకొ? యతిప్రతిభన్ విజయధ్వజంబు, దు
ష్కరమగు నేఁటి చింతకును గారణ మయ్యది మీకుఁగాదొకో?

తిరుపతి శాస్త్రిగారి వసతిన్ జయకేతువు నాటినారు సో
దరకవు, లేమి సేతునని తల్లడమందుచు నీవు వేంకటే
శ్వర! మొఱపెట్టుటంగద! యసాధ్యతరంబగు పక్షపాతముం
బొరసినవారు వేమవరపున్ ఘను లెక్కుడు పట్టుఁబట్టి కొ
ప్పరమున కేము దుర్యశము వాటిలఁజేసెడి పూన్కియోజనాం
తరముననున్న పల్లియను దా వొనరించి మహాసభన్ సమా
దరమునఁ గూర్చి రందు నవధానము పేరిటి గారడీని నె
య్యురు పలు సాయమున్ సలుపుచుండ నొనర్చితి రందుఁ గౌశలం
బఱగొఱ యొౌటచే నపజయం బనయంబు తటస్థమయ్యె న
క్కొఱతలు తీర్చుకో దలఁచి క్రూరవిచారులఁ బక్షపాతులన్
మొఱకుల సత్యఘాతకుల మూఢులఁ గొందఱఁ గూర్చి వ్యాసమున్
బఱబఱవ్రాసి యవ్విబుధ వందితమై తగు నాంధ్ర పత్రికా
వరము పరిగ్రహింపమికి వందురుచుంటిరిగాన దీననే
యెఱుఁగఁ బడె న్భవన్మహిమమెల్ల బుధేంద్రుల కాంధ్రమండలిన్.

శపథం బొప్పగఁ గాకినాడను జయస్తంభంబు స్థాపించి మీ
నృపుఁడున్ సత్కవి పండిత ప్రవరులున్ మెచ్చంగ నున్నప్పుడే
వ్యపదేశంబులు సాగి రామికిని నిద్రాసక్తులట్లుండి నేఁ
డపరాభూతులఁ బోలి దూఱెద రిదేలా సోదరద్వంద్వమున్

చండప్రజ్ఞులఁ గొప్రపుంగవుల నేసాధింతు నన్నట్టి ఛా
త్రుండౌ వేలురి వంశ్యుఁడోడినను, బోరున్ మానకున్నారుగా,
గాండీవాయుధు గెల్తు నేనని ప్రతిజ్ఞంగొన్న కర్ణుండు మి
త్రుండీల్గం గనియున్ సుయోధనుఁడు పొందుం జెందకున్నట్లుగన్

కక్షన్ గన్నవరంపు మేటి సభ నక్కవ్యగ్ర యుగ్మంబుఁ దా
నాక్షేపింపఁగ నేగి భంగపడె మీ యాప్తుండు శిష్యుండు హృ
త్సాక్షిం గైకొని తెల్పినార మిదియున్ సత్యంబు సత్యంబనన్
సాక్షుల్ నూర్గురి మించియుండి రిఁక మీ జంజాటముల్ మానుఁడీ

ఎంతో సంశయ మేల? గన్నవరమందే తేటగాఁదేలె మీ
యంతేవాసికిఁ గల్గువాసి, భవదీయాత్యంత తేజోన్నతుల్
వింతల్ కాకపురంబులోఁ దెలిసె మీ వీరాట్టహాసంబులున్
గంతుల్ తిమ్మన గంతులం చెటిఁగె లోకం బింక శాంతింపుఁడీ

సత్సంభావ్యుఁ డొకండు మీ కరిగ వ్యాసంబొండు సత్యోక్తులన్
హృత్సాక్షింగొని వ్రాసిపంప నపు డన్నింటిన్ బలెన్ విశ్వ వి
ద్వత్సంపూజిత యాంధ్రపత్రిక గొనెం దప్పేమి? యప్పత్రికన్
దత్సంపాదకుఁ దిట్టిపోయనగునే, తజ్ఞుల్ విచారింపఁగా
నుత్పాదింపఁదగున్ దదంశముల బుద్ధ్యుత్సేకమే యుండినన్

అజవం ... ... ... ... ... ... ... ... పత్రికా స్థాపకున్
సుజనాక్షేపకుఁ బక్షపాతపరిపూర్ణుం జానపాట్యన్వయున్
భజియింపంగ! సమస్తపూజ్యగుణ భాస్వత్పత్రికా స్థాపకున్

గుజనాక్షేపకు సత్యవాఙ్నిరతు మాన్యున్ గాళ్లకూర్యన్వయున్
భజనీయున్ వరకావ్యకర్త నవధానప్రక్రియాధుర్యు న
కృజపుంభంగిని దిట్టనెట్టిగతి నాల్కన్ ద్రిప్పినా రక్కటా!

ప్రతిమల్లుల్కవి సింహలాంఛనులు చేవన్ వారి నోడించు టే
కృతి సాధ్యంబది కాకయుంట నలవారిన్ దిట్టుచున్నారుగా
శతధా నయ్యది యొప్పు నొక్కగతి! దచ్ఛాఖీయులన్ దుచ్ఛవా
క్తతిచే బూతులు దిట్టుచుంటి రదియే ధర్మంబు యోజింపుఁడీ!

సభలో గెల్తుమటంచు సోదర కవీశానుల్ విజృంభింప నా
సభగాకుండఁగ వెట్టియుక్తులఁ గడున్ సంధించియున్ బాటి పో
యి, భయభ్రాంతులు కాని భంగి నన్నృతంబే వ్రాయుచున్నారహో
యభిమానాంబుజగంధికై వలచి మోక్షాపేక్ష వర్జించుచున్!

అవధానంబున యందు నాశుకవితా వ్యాపారమందున్ ద్విష
న్నివహాసాధ్యుల భాతృకవ్యధిపులన్ డీకొంటి మేనిన్ బరా
భవమే సిద్ధము తప్పదంచు నుచితోపాయంబుఁ జింతించి శా
త్రవ వీరుల్ హసియింప నుత్తరకుమారప్రజ్ఞలన్ జూపి నేఁ
డవిలంఘ్య ప్రతిభాప్రచారముల వాక్యాళిన్ విడంబింతురే!

అధికుండో యధముండొ శాత్రవుఁడు తానై పిల్వ డీకొన్నచోఁ
బ్రథనంబుం బొనరించి చావఁగను జంపంగన్ జనున్ గాక య
ప్రథుఁడౌ నాఁడటుగాకమున్ బిలిచి కొప్రంపున్ గవుల్ రా మనో
వ్యధమై మార్కొనలేక పంపితిరి శిష్యశ్రేణి సీ! సీ! యనన్

తద్దినముఁబెట్టు నాతని తమ్ముని బలె
నేను గూర్చుందుఁ దిరుపతిలేనినాఁడు
రోగిమగఁడని నన్ను మీరుఁ దలఁపఁ దగు
ననవె? గుంటూరిలో వేంకటాచలాఖ్య!

మరువక వేంకటేశ! వినుమాయిది, నీ సతి వ్యాధివోవ కు
గ్లరు దొరసాని మందొసంగఁగా నివసించితి వెన్నియేని వా
సరములు గర్తపూర్వసతి సత్యమయా నివసించుటెల్ల సో
దరవిజిగీషనేయని యతథ్యపు గ్రంథము వ్రాయనేటికిన్!

ధారణమెల్లఁ బోయె నవధానము సేయఁగఁ జాలమింక మే
మాఱడి నొందకుండఁగఁ గృతార్థులఁ జేయుఁడటంచు మీర లూ
రూరను వేఁడుచున్న విన రూరక పిల్రు వధానమంచు వే
మారులు దెల్పనేఁటి కభిమానులుగా భవదీయు లద్దిరా

ప్రేమగలవారు పిల్చినఁ బిల్రుగాక
విడిచిపోయిన యవధాన విద్రుమోష్టి
కొఱకు వార్ధక్యమునఁ బండ్లు గొఱకుకొనుచుఁ
దేప తేపకు నేల సంతాపపడుట!

బూతుల కృతుల వ్ర్వాయుఁడు
జేతుల తీట యదివోవఁ జీ ఛీ యని ప్ర
జ్ఞాతిశయు లేవగింపఁగ
నేతావున సభయటంచు నిక నేగకుఁడీ

అవధానమ్మొనర్ప నాశుకవితా వ్యాపారమున్ దీర్ప స
త్కవులున్నారు సురూప యౌవన రమాఖండుల్ ప్రచండ ల్పుగౌ
రవ మొందందగువారు మీరలిక వార్ధక్యంబు విత్తాశయున్
దవులన్ లోకము మోసపుచ్చఁదగునా? తంత్రంబు మేలిచ్చునే!

శక్తిచాలని యవధాన సణలు సలిపి,
తెచ్చిపెట్టకుఁ డపకీర్తి దిట్టలకును,
జెడినదగు కోఁతి వనమెల్లఁ జెఱచునన్న
సరణిఁ దిరుపతి వేంకటేశ కవులార!

ఆలోచించియు వ్రాసినట్టిదగు పద్యంబే రసాభాసమై
బాలాలాప సమానమై గణయతిప్రాసాది సంత్యక్తమై
తాలుం బాతరఁ బోలియుండఁ దమ రేదారిన్ సుధాధారలన్
మేలంబాడు మహాశుపద్యకవులన్ మీఱంగ నాశింతురో

కాళీపాద పయోరుహార్చకుల వాక్కాంతా పుమాకారులన్
వ్యాలోలామృత వాగ్విలాసుల వధాన్యగ్రీవులన్ దుష్కవి
వ్యాళ వ్యూహ విహంగ పుంగవులఁ గొప్రంపుం గవీశార్కులన్
వాలింపన్ వశమే వధాన కవితా ప్రభ్రష్టులౌవారికిన్

శ్రీనివాసాచార్య సింహంబు గర్జింప
        నిభరూపమునఁ బరువెత్తునాఁడు
కాశినాథ బుధేంద్ర కాలాహి బుసవెట్ట
        మండూక రూపాన నుండునాఁడు
రామ కృష్ణ కవీద్ధరక్షువీక్షింపంగ
        మృష భావమున లోగి మిడుకునాఁడు
శ్రీరామరాట్కవిశ్యేనంబు పొడసూప
        శశకిశోరక వృత్తిఁ జనిననాఁడు

నేరువని కొన్ని మాయల నేర్చి నేఁడు
దశగళాకృతిఁ దాల్చి పాతాళహోమ
మాచరించుచు నుంటి రయ్యదియు సోద
రకవి రాడ్రామలక్ష్మణ నికటచరకు
భృచ్ఛురులచేతఁ జెడు గీరతేశులార!

మీదగు కోపమంతయు సమిద్ధ్యగఁ దెల్పుచు బుద్ధిసెప్పఁవార్
వైదికులున్ నియోగులును వారలవారల కానివారలున్

సోదరమిత్రులా? కపట సూక్తుల వారల నిందఁజేసి మీ
వాదమునున్నిముం బొగడువార లపాక్షికులా? యిదెట్టిదీ
సోదెలు నమ్మువారలును జూడఁగ నేఁడును గూడ నుండిరే?

గారడు లింద్రజాలములుగా నవధానము లాచరించు మీ
తీరులు సత్యలేఖలను దెల్పెను బత్రిక లట్టివాని మీ
రూరక తిట్టుచుంటి రొహొహో! నెయి మీగఁడలన్ హరింపఁగా
గోరెడి పిల్లిశాపములకుం దెగ గంటిమె యుట్ల చేరులన్!

అగ్రాహ్యానృత పద్యకంటక కుజౌఘాకీర్ణ గుంటూరి సీ
మ గ్రంథాటవి తావకీనము నసన్మార్గంబునున్ సర్వ మం
త్రగ్రీవాయుత సత్యదైవత లసన్నారాయణాస్త్రానలా
త్యుగ్రజ్వాలలు భస్మసాత్కృతుని జేయున్ మానుఁడీ దంభముల్

దాంభిక గర్వభంజనులు,

**గురువిశ్వనాథకవులు**

(గురు విశ్వనాథకవులు అనగా శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు,
శ్రీ పోతరాజు విశ్వనాథ కవిగారు)



# పండిత బ్రువ లక్షణము

**(రామేశ్వర కవి విరచితము - 1911)**

(రామేశ్వరకవి అనునది ప్రచ్ఛన్ననామము. అసలు పేరు పాటిబండ సూర్యనారాయణరావు, వీరు గుంటూరులో గొప్పవకీలు)

1. నిరుపమ శేముషీకలిత నిర్మలచిత్తసరోజులార! యో
సరసకవీంద్రులార! బుధసత్తములార! గుణాఢ్యులార! స
త్యరతిపరీతులార! యనృతాత్యసహిష్ణుశుభాత్ములార! మీ
రరయుఁడునాదుపల్కు లివియన్నియు నొప్పులెయ్యై తనర్చెడిన్!

2. త్వరపడఁబోక మీరిపుడు వాస్తవముం గ్రహియింపఁ గోరుచోఁ
బురములయందుఁ బల్లెలఁ బ్రపూర్ణవిచారణసేయుఁడీ! నిజం
బెఱుగుఁడి! పాండితీగరిమయెందును లేక యఖండకీర్తి భా
సురతఁ జెలంగఁగోరుపురుషుండు వికారములెన్ని సేసినన్
ధరఁబరిహాసపాత్రుఁడగుఁ దథ్యముసత్యమువాస్తవంబు, ము
మ్మఱుబరికించిచూడ ననుమానము లేశములేదు దీనికిన్

3. ఖరమది సింహచర్మమును గాయమునిండను గప్పికొంచుఁదా
దిరిగిన నెంతదాక జగతిం భ్రమియింపఁగ జేయఁగల్గుఁ దొం
దరగ నిజస్వభావముఁ గనంబడఁ జేయదె? సత్యసింహముల్
పొరయనిచోట్ల “నేమృగవిభుండసుమీ” యనుచుం బ్రతాపముం
బిరబిరఁదీయుచుం దనసమీపము, జేరకయుండ నెద్దియో
వెరవునుజూచుచుం “దమరు వీరులు సద్గుణశాలు” లంచు ను
త్తరములఁబంపుచుం గడుహితంబుగ నెట్టులొపుచ్చుఁగాల; మ
బ్బురమదియేమి! తన్గుఱుతువట్టెడువారలు లేనినాడు త
త్తరపడకెట్టి వేసములఁ దాల్చినఁ బట్టెడువార లెవ్వరుం
దురు? కలకాల మొక్కగతితోఁ జనుచుండెనె? యెప్పుడైన నే,
నరయఁగ నెందునేని నిజమైనమృగేంద్రము రాకయుండునే!

4. స్వరమునసైనఁ దోపదొకో సత్యము? బింకముఁ జూపఁగోరి "నా
సరసకు నీవురాఁదగవు చాలునుబొ"మ్మనికూయ నంతతో
నరుగునె? "తానుగాడిదె" నటంచు నెఱింగియె కూసెఁగాని యం
దఱు నటుఁబిల్వ జేయవలె దానిని; గాడిదెచెంతనిల్వఁ గే
సరికదిపోలునే తగదు సత్యము సత్యము సత్యమద్ది! యీ
వరుసన పండితబ్రువుని వర్తన ధాత్రిఁ జెలంగుచుండదే.

5. సరసకవిత్వమద్ది సహజంబుగరావలె! పుస్తకంబులన్
మఱిమఱి వల్లెవేసి గ్రహణప్రతిభాదులు లేశమేనియున్
వఱలకయున్న నెట్లొ బుధనామముఁ బొందితి నింక సత్కవీ
శ్వరబిరుదంబు వచ్చుటధ్రువంబని కష్టముమీఁద నెట్టులో
యరుదుగఁజెప్ప బద్యమది యావురుమంచును నేడ్చినట్టులన్
బరఁగునుజూవె! యట్టికవనం బెటులెట్టులొయల్లియాత్మలో
మురియుటతోడఁ దృప్తిఁగనఁబోవక యాశుకవిత్వశక్తి, సు
స్థిరతరధారణాపటిమ, ధీబలముం గనకే వధానముల్
నెఱపఁగఁబూని త్రిమ్మరిన నేటనిపించునె? యెందుఁబోయినం
గరము పరాభవంబగునుగాని; యటంచని యూరకుండునే

6. గురువునుబోలఁగాఁదగిన కొందఱశిష్యులఁ జంకఁబెట్టి చె
చ్చెరఁజనుచుండు, నింట మునుజేసినయట్టివియో కవీశ్వరుల్
పరులురచించినట్టివియొ పద్యములంగొని వానిచే సభాం
తరముల నడ్గుఁబెట్టి యవి దబ్బబ బబ్బుడఁ జెప్పివేయు నిం
కొరులిడు ప్రశ్నలల్కనయి యొప్పినవానికిసైత మెంతయుం
జిరచిరలాడి చచ్చిచెడి చెప్పును జప్పనిపద్య మెట్టులో

7. హరిహరి! యెద్దియేని సులభాంశమెయైన జడాత్మబుద్ధికిం
బిరుసుగఁదోపఁ దప్పుకొనువీల కటా! యెదియంచుముందుగాఁ
గఱకఱమంచుఁ బ్రశ్న యిదిగాదిదిగాదని బోకరించు; నే

నరయఁగ లేదు దానఁగల యర్థ మదేమని బొబ్బరించు; ధీ
వరుఁడెవఁడిద్దియిచ్చెనని పొండితిచాలకధిక్కరించు; ను
స్సురుమని నన్గలంతురనుచున్ మొగమంతయు నెఱ్ఱఁజేయు; దు
ర్భరపుశతావధానమిది పప్పును నన్నముఁదింటగాదు దు
ష్కరవిషయంబు లీఁదగదుగాయనఁ దెల్లమొగంబువెట్టు; నీ
కరణి నెటెట్లొ తప్పుకొనఁగా వశమయ్యది గాకయున్న 'మా
పరువునునిల్పుడయ్యా! మము బాముఁలఁబెట్టకుఁడయ్యా! గర్భిణీ
తరుణియగున్సుమా యిదియథార్థము! మేమిటవచ్చినట్లు మా
పురులకుఁ బంపుడయ్యా! యికఁబోదుము పున్నెమదెల్ల మీకుఁజే
కుఱు'నని కాళ్ళబేరమునకుం జనుదెంచుచు దేవురించెడిన్

8. సరిసరి! కుంభకోణమది సాగుటయెట్లు వధానమొక్క వా
సరమునఁజేయ ధారణవశంపడకే నగుబాట్లు మాకు దా
పరమగునో యటంచు మిషఁబన్ని సభన్నిలుపంగఁజేసి రా
తిరి నుదయంబుఁ బద్దెములఁ దీరిచి వల్లనవేసివచ్చినన్
మఱుదినమా సభాంతరమునం జదువంగనుబూని తొ్రటుపా
టొఱయఁగఁ బాదముల్ పదములూడఁగఁ జాలునుదప్పఁ బ్రక్కలన్
వరలినవారు పద్దెములు వ్రాసినవా రటుగా దిటంచు స
త్వరముగ నెత్తిపట్టి పయిపైనదువం జెయివెట్టినెట్టినన్
జరుగదదెట్టిధారణయొ! శక్తియొ! మొద్దది మొద్దుదానినిం
బరుగిడునట్లుచేయ వశమా! ములుకఱ్ఱయు మొక్కపోవుటే
జరుగునుగాదె! మొద్దునకు సాయముఁజేయ గ్రహింపనేర్చునే

9. సరకుగొనండుపాపము! స్వశక్తివిధం బిదమిత్థమంచుఁ దా
నెఱుఁగకపోదు; పండ్లబిగువేర్పడఁగా నవమానదుర్యశః
పరిహరవాక్యపుంజములఁ బల్కఁదొడంగును, 'మేమువెన్కబల్

మెఱుగుగఁ జేసినారముసుమీ! మతివోయెనునేడు, నాటిది
త్తతిఁదలపోసి మమ్ములగృతార్థులఁజేయుఁడి సభ్యు'లంచుఁ దా
మొఱలిడుఁ; జేతఁగానిపనిఁబూనుఁడు మీరలటంచు నెవ్వరే
డ్చిరి, యొకవేళనేడ్చి తమచేరువకీడ్చిన నీడ్చినట్టి యా
పురుషులపజ్జఁజేయవలెఁబో! సభకుం దగువాఁడనంచుఁ బ్రి
మ్మరిన శుభంబె? వెన్క ససమానముగా నొనరించెనంట! యే
వరుసను జేసిరో కనినవారిపుడైనసులేరె! నాడు కొం
దఱు నుతియించిరేమొ! యదినాణెమె! హంసలు రానివేళలన్
గరటములే మహాకవులుగాఁ దలపంబడుటద్ది యబ్రమే

10. పరునిసహాయమందక సభాస్థలినిల్వఁడు పండితబ్రువుం
డరిదిగఁ దోప మిత్రుని సభాధిపుగానొనరించి వానినే
పొరిపొరిమూటగట్టుకొని పోవుచునుండును, దారిబత్తెమ
క్కఱఁగొనిపోవురీతి నటుఁగాకయె యుండిన మాడిచావరే

11. స్థిరుఁడయికూరుచుండి సభఁజేసి వధానముఁబూర్తి సేసినన్
గరము సెబాసు! వహ్వా! యనఁగాఁ దగుఁగాని; పరప్రదత్తవా
క్స్ఫరణములంగొనంగఁ దమకంబున మాటికిమాటికిన్ సభాం
తరముననుండి చాటునకుఁ దారుచునుండ నిదేటికంచు నే
పెఱలనఁబోరు, త్రాగుటకుఁ బీల్చుట కంచని యెల్లవారెఱుం
గరె! యిటు సభ్యసంతతుల కన్నులఁగప్పుచు నొక్కనాటితోం
దర నిరుమూడునాల్గయిదునాళ్ళకుఁబెంచి వధానమం చెదో
జరిపి మృషావధానితెగఁ జంకలుగొట్టుచు విఱ్ఱవీగెడిన్

12. వరమతియైనయొక్క కవివర్యునిమెచ్చి రసజ్ఞుడౌర! యె
వ్వరుసము లుర్వినీకనుచుఁ బద్యముఁజెప్ప, స్వకీయనీచతా
గురుత నెఱింగిరేమొయని గుమ్మడికాయలదొంగపోల్కి బా
పురె! యులుకుం గడుంగడు; ప్రముగ్ధుని డంబము లిట్టివేగదా

13. పెరుగదు మాయవేసమిక వెల్లడియౌనని భీతిగ్రమ్మఁగా
దరియెదిగానలేక మతిదప్పి చికాకయి ప్రేలినంతలో
గరువమడంపఁగల్గు కవిగండడువచ్చి యెదిర్చివేయఁగా
నురమునవాటినట్టి శరమూడ్చఁగలేకయె కుందు చెట్టులే
నరి నెదిరింపఁగావలయునంచును బెగ్గకుఁ బెన్గులాడు, "నా
శరమదియొక్కటే విడువఁజాలదు, రెంటినిగల్పి ఱువ్వినం
బెఱుకఁగలేనె నాబలము బీరముచూడుఁడి' యంచుఁ బల్కెడిం
దఱుచుగ నొంటికిం బుధులు దాకినయప్పుడు రెంటికింజనున్

14. మఱుపుకురాదుదెబ్బ, పొడిమాటలుడాబినఁబోదు నొప్పి; న
న్నరసియెవండుగాచునిక! హా! శివ, రాముడ, స్వామి! యంచు నూ
పిరి నిలుపంగఁ దోక నెటుఁబీకుటఁ కాయతిగానకార్చుచుం
ద్వరితగతి ప్రవాహమునఁ దార్కొనిమున్గుచునున్న వాఁడుదా
గరికనుజూచి దానిఁగొని గండముఁ దప్పుకొనంగయత్నమున్
బరపెడిలాగు, సింగమదిపైఁబడ నక్కలవేటకాఁడు త
న్గురువుగనెంచి వెంటఁజనుకుక్కలఁ దా నుసిగొల్పులాగు, ది
క్కరిపడరాని పాట్లుపడినంతనె లాభమె! పండితబ్రువా!

15. అఱవము నింగిలీషు మఱియాంధ్రము తుర్కముమాటలాడెడున్
దొరలకువంటవాఁడు నిపుణుండగు బట్లరుపాకశాస్త్రినా
బిరుదముఁ బూనినాఁడు, పురవీథులఁ గ్రుమ్మరినాల్గుబాసలన్
"గరిమనుజూపువాఁడ, బుధకాండులు రం' డనఁదోఁచునట్లుగాఁ
బరిచితిఁ బూర్తిచెందకొక బాసనునైనను, గోవులేనియా
పురమున గొడ్డెలచ్చియను పోడిమిఁజెందుచు నొక్కబాసలో
దరిగనినట్టి పండితునిఁ దార్కొని నావలె రెండుబాసలీ
వెఱుగవునాకు రావనిన నెంతయులాభమె పండితబ్రువా!

16. తిరుపతి పైది కొప్పరము – దీనికిఁ గ్రిందుగ నుండు వేంకటే
శ్వరుఁడు పరిస్ఫుటాంశమిది సత్యము సత్యము సత్యమంచుఁ జూ
పఱులకుఁ దోపుచుండఁ దలపైఁ గల వస్తువుఁ జూడలేమి నా
తిరుపతి, మూల కొండొక ప్రదేశము నందున డాగి వేంకటే
శ్వరుఁడొక రిద్దరద్ది కనఁ జాలక యున్నను వీని సంగతిన్
గరము యధార్థమే తెలుపఁ గల్గి యటం గల పాటిబండలే
పరి పరి కర్మ సాక్షులయి పల్కఁగ నీగతి దాటు టెట్టులో
యెఱుఁగనటంచు వాదెఱచి యేడ్చిన లాభమె? పండితబ్రువా!

17. ఒరులగుణాతిరేకముఁగళోన్నతి సుప్రతిభావిశేషమున్
సురుచిరవాగ్విలాసమునుజూచి సహింపఁగలేక వారినె
ల్లరువినుతింపఁగాఁదనకు లాఘవ మయ్యెడి నంచు నీసుతోఁ
గొఱకొఱమంచు, వాదమునకుంజనుదెమ్మన రాక యేదియో
వెరవునుజూచుచున్ వికటవేషములెన్నియొ తాల్చి చాటునం
బరబరకూసికొంచు నవమాన భయంబును బొందఁబోక, కొ
క్కెరపనులాచరించి యపకీర్తికిజంకక సిగ్గులేక సుం
దరమని పెద్దచిన్నయును దైవము నీతియువీడి దేనికిన్
వెఱవనటం చిసీ! విడచివేసిన వానివిధంబుదోప నా
సురపద యోగ్యలక్షణముజూపుట లాభమె! పండితబ్రువా!

18. తరమగునే సలక్షణవధానము సల్ప మృషావధానికిన్
'బరమముదంబు మాకు నొకవందయిడంబది వే'లటంటమే
మెఱుగమె? "యిప్పుడంతకును నిబ్బడిముబ్బడి నాల్గురెట్లుగా
దిరువదిరెట్ల కిబ్బడిగ నిత్తుము వచ్చి శతావధానమున్
నెఱపు"డటన్న మొద్దుబలె నిశ్చలవృత్తిని బూనియుంటి వె
వ్వరికమృషావధానియొ ప్రపంచమెరుంగదె! పండితబ్రువా!

19. అరసితినీగతింబిడుగు వౌదుసుమీ సొరకోతలందు, బా
గుర! యిది దూరమేగి తొడఁగొట్టెదు, పాండితిగల్గినన్ సభాం
తరమునఁ బండితేంద్రులువినన్ భవదీయకళాతిశక్తి, వ్యా
కరణపుఁదెల్విఁ జూపుమనఁగా జెవిదూరదదేమొ! వల్లభుల్
విరిసినయట్టి కాంతలబలెం దల సూపఁడు ధైర్యమూని, యె
వ్వరిక యపండితుండొకొ ప్రపంచమెఱుంగదె! పండితబ్రువా!

20. భరమనియెంచఁబోక పయిబట్టయు వచ్చెడిలాగు వెంబడిం
బరువిడుచున్ వధానమునఁ బాతికవంతునె రెండునాల్లకుం
బెరుగఁగఁ జేసి గోడపయి పిల్లివిధంబుననుండి సాయముం
దటిగనిపెట్టిచేయుచుఁ బదంపడి పృచ్ఛకులిచ్చు ప్రశ్నలం
దటిముటిసాధ్వసాధువిషయంబులు చర్చకువచ్చినప్పుడం
దటికి స్వపాండితీస్థితి కనంబడకుండ, వధానికప్పుడే
పరిభవమబ్బకుండ, బలె! పామదిచావకయుండఁ గఱ్ఱయున్
విఱుగకయుండఁజెప్పు మదినేరుపుఁజూపెడి మధ్యవర్తి యై
తిరిగినవాని దొఋణముఁ దీర్చుకొనంగ నతిత్వరన్ మహా
దరమునుజూపుచున్ శతవధానము వారముమీద నొక్కటన్
దఱిలిచి నాల్గురెట్లుగఁ గృతజ్ఞతఁజూపి శతావధానులం
చొరులను దువ్విపంపిన మహోన్నతిఁగాంతువె! పండితబ్రువా!

21. చెరుపది యేమగున్ నిజము జెప్పిన నిష్ఠుర మొక్కటేసుమీ!
స్థిరతరకీర్తి పూరుషులు తిక్కన పెద్దన మూర్తిలాగునన్
సురుచిరసత్ప్రబంధములు సొంపులుగుల్కఁగఁజేసి యుంటివో,
యరయగ దేవభాష నొకటైననుఁ గావ్యమువ్రాసియుంటివో,
హరిహరదైవభక్తి విషయంబగు పద్దెము నోటవచ్చెనో,
మురియుటకేమి? జల్లుపదముల్గల పూర్తికిరాని పొత్తమున్
సరసములంచు మెచ్చుచును జాకలి మంగలి వేశ్యజాతులుం

బరమపురాణముల్ బలెను బాడుచునుండెడి కొన్నిపొత్తముల్
కరకరగీసి బాపురె! చకాపికి కక్కికి గ్రంధకర్త నం
చురవడిఁ బాటపాడిన నహో! యభిమానులు వంతపాడినం
గురుతరకీర్తి యబ్బుననుకొంటివె! కంటివె! పండితబ్రువా!

22. గిరపతిగింకటంబులను గీటడగింపఁగ గిత్తి గీన్కితో
గిరపతిగింకటేశ్వరుల గిండకు గీటుగగీరి గిక్కడం
గిరగిరగింతగీధలను గీరతముం గిలె గీడిగీడియా
గిరియును గియ్యముంగెదరి గీవ్యమటంచునుగీసి యద్దియే
వరకృతియంచుఁ బొంగుచును "వంచకమొక్కటి కాకి! కాకి! నీ
స్వరము మనోహరంబుసుమి! పాడుమటన్నను నుబ్బి నోటిలో
నెరపడిపోవుటంగనక యెంతయుగూసెడిలాగు" మీకృతుల్
సరసములౌర! యేది యొకసారిపఠింపుఁడు పద్యమొండనం
బురబురఁబొంగి యర్భకులముం దభిమానులముందుదేహముల్
మఱచి సుధీసభాంతరములన్ మతివీథులలోన మాటికా
వరకృతిలోని పద్దెములె పాడుచు బల్ తయితక్కతందనాల్
బఱపినయంతమాత్రమునఁ బండితుఁడౌనొకొ పండితబ్రువా!

23. కరటబుధప్రతీప మదగర్వహరుండగు నొక్కరాముఁడే
పరుఁడనియెంచనేల? తలపన్ విబుధేంద్రుఁడు శ్రీనివాసుఁడుం
సురనుతిపాత్రవాగ్రమణ సూర్యపదాన్వయ సత్యవాదులుం
గరమశుభం బనర్ధకము కయ్యముమానుమటంచు నీతినిం
గఱపఁగఁబూనువార లతికంటకులంచుఁ దలంచి రావణా
సురుఁడెది మూటగట్టుకొనె! చూడఁగఁజాలవు దుర్జనుల్ రమిం
తురు కలహోద్యమంబు సుజనుల్ నిరతంబును సంధిమార్గమే
యరసెద'రన్న న్యాయమహహా! తెలిసెం భవదీయపాండితీ
భరమిదియంచు, నీకెతగుఁ బండితనామము పండితబ్రువా!

24. అరయఁగ గ్రంథకర్త యొకడంట! వధానియు నొక్కడంటపో!
మఱియొకడంట యాశుకవి! మాటలుతీపివ భేదబుద్ధియే!
మురియకుడీ! యుపాయముగఁ బోరడగింపఁగఁ పాళ్ళుసేసి ము
గ్గురికినిబంచిపెట్టె నిదిగో కనుమా యయగారుమాన్యులే

25. పరమహితుండు కృష్ణుఁడని వంగిపురంబును జొచ్చి వేడఁగా
శరణమతండు దాని మనసా కనకుండునె! తన్నుఁ బెద్దగాఁ
బురమున నేగఁజేసి గురుపూజలొసంగిననాఁటి భక్తినిన్
మఱచునె! పక్షపాతియనుమాట లవేటికిఁ బండితబ్రువా!

26. మురిపెముతోడనర్భకుల ముందిడికొంచు మహాట్టహాసముల్
బఱపిన పెద్దవారిపనిబాగట! బాగట! యెట్టిపెద్దవా
రెఱుగకయుండఁ బిన్నలదియేమొ యొనర్చిరటంచు నొచ్చి సుం
దరతరవాక్యముల్ పలుక న్యాయముఁజెప్పినవాఁడవౌదువే!

27. ఉరకయె పెండ్లిపల్లకి మఱొక్కని బాలకునెక్కఁజేయు, నా
వరుసను నెక్కునెల్లరు గుబాలునఁ బెండ్లికుమార్తెకున్ మనో
హరులయి పుట్టిముంతురని యార్చెడి పెండ్లికుమారుఁడెంత ధీ
వరుఁడొ! ప్రపంచతత్త్వ పరిభాసితచిత్తుఁడొ! యద్దిగాక యొ
క్కరుఁడు మఱొక్కడింక మఱొకండును బల్వురు నెక్కుచుండఁగా
బరువయి పల్లకీవిఱిగి పాడగునంచును మోయువారలే
మొఱలిడరో! వధూవరుల మోములకడ్డని పెండ్లిపెద్దలే
యరువరొ! సిగ్గుతా విడిచియాడెడి పెండ్లికుమారుఁడుండునే!

28. పఱచి యపండితుండెకడ పండితగోష్ఠికి రాక డాగెడున్
గొఱతఘటిల్లుకీర్తికని గుట్టుబయల్పడకుండఁజేయు చా
తురిమెయిఁదత్సభాస్థలి బుధుల్గలరేమొ యటంచనాక పా
మరతను దప్పుగానిదియె మాటికిఁదప్పని నొక్కిపల్కెడున్

సరసుఁడెయైనఁ బండితులసన్నిధిఁ బిమ్మటనైన నేర్చికా
వరముననొప్పు తప్పనుచుఁ బల్కితిఁ దప్పని నేనుజెప్పుటే
మఱిమఱిగొప్పతప్పని' క్షమాపణఁ గోరుటమేలు, దానిచేఁ
బరువునుబోదు; కాదనినఁ బండితగోష్ఠిని నిల్పుకోదగున్

29. సరసముగా సభాస్థలిని జాటుము నీదగు ప్రజ్ఞలన్నిటిన్
విరసములేటికిన్! గపటవేషముఁ దాల్చఁగఁ జక్రవర్తివే!
యరినెదిరింప వాదవిషయంబదిపోనిడి ప్రక్కత్రోవలన్
సరభసవృత్తిగంతులిడసాగెదు దొంగనుబట్టలేరాకో!

30. నిరతము పచ్చిదొంగయయి నీచపుఁ ద్రోవలఁబోవువాడె వె
ల్తురుఁగని సైపలేఁడెచటఁ దోరపుఁ జీఁకటియుండునోయటం
చరయుచునుండు, రంధ్రములనంతటఁ జూడఁగఁగోరు, నోటినిన్
దెఱచిన బూతులే దుముకు, తెల్పుసువాక్కుల బూతులంచొగిన్

31. "సురసనగేంద్రమయ్యది విశుద్ధసుధారసపూర్ణముల్ దొనల్
సరసు లగాధముల్ గలవుచాల, తలంబటఁగానలేక బా
పురే! సుమనః ప్రకాండములు మున్గుచుఁ దేలుచునుండు, నింకఁగిం
పురుషులఁబట్ట నేర్చుపదముల్గలవౌర! మహోచితస్థితిన్

32. ఉరుమహిమాస్పదంబులు మహోన్నతముల్ కృతిరాజము ల్మతా
భరణములన్ రచించియలపద్మజుదేవి నలంకరించినా
డరిదిగఁ బొత్తమొండు సగమైన రచింపఁగలేక మాన, దం
తర మెఱుఁగంగలేవు బుధనాధుడవో! కవినేతవో! బలా!

33. మొరటునకబ్బఁగా మొగలిపూవు తదీయసుగంధధోరణుల్
సరసమతింగ్రహించునె! వెసన్ వెలిఁబుచ్చు స్వకీయతుచ్ఛతన్
విరివిగఁజాటుచాటునను బ్రేలెదు బూతులొ పచ్చిబూతులో,
తెరవిడి రమ్ము రమ్మిపుడె తెల్పెద బూతులుగావు నీతులే!

34. ఎఱుఁగుదు మీదుప్రాణముల కెంతయు భారము మాదుప్రాణముల్!
వెఱతుమె మేము? మానమునె పెద్దగఁజూతురుగాదె పండితుల్!
ఇరవిదిమాకు మీకదిసుమీయను భేదములేదు, పండితుం
డరమరలేక సర్వవిషయంబుల నెప్పుడుఁ బూజ్యుఁడేయగున్

35. మఱుగుకుఁబోక తప్పుకొనుమాటలనాడక, స్వోక్తి పోషణా
దరమదియున్నఁ, బాండితి పదంపడియున్న, సభాప్రసంగమో
సరగునఁ బత్రికాముఖపుఁజర్చయొ మీకెటబాగొ యందె యే
ర్పఱచి భవత్తదుక్తి నిలుపందగు" నంచన మౌన మూనెడున్

36. నిరతము జీవనంబు పరనిందసుమీ! యదియేమొ! తాను స
త్పురుషుఁడెయైనచో నొకరితో మరియిద్దరితోడఁగాదు తా
నరిగినచోటనెల్లఁ గలహంబులె సజ్జనపాళితోడ, నో
రరయఁగమంచిదైన జగమంతయు నప్పుడె మంచిదైచనున్

37. పరులునుగారు వారు మనవారలెపాపమటన్ వధానమున్
జరుపఁగఁజేసిమీకు సరసంబుగ నూటపదారులిచ్చి స
త్వరముగ గారవించి మదిఁదాపముఁబాప ధనంబు పోగుచే
సిరి పిలువంగసాగిరది సేగియె పోరది యేమి హేతువో

38. విరతినొనంగి కుక్షిభృతి వేషపరంపర కింటిమూల, జే
రిరొాయననేల? గుండెచెదరెన్ సుమి! నెట్టిననేనిఁ వెన్నునుం
జరచిననేనిఁ బూర్వగతి సాగదు, శక్తి యొకింతగల్గినన్
గొఱతయె? యింకఁదోలుదురు కుండలలోపల గుట్టముల్ వడిన్

39. ఎఱుఁగవునీదు నోటిదుడుకీగతిదెచ్చెను మాయసింగమా!
శరభనివాసమిద్దియగు, సత్యమృగేంద్రము లేవజంకెడిన్
శరణమువేడి కాచుకొనఁజాలును బ్రాణములంచుఁ దెల్పగాఁ
బరువెటులేనినిల్పుకొనబాగని కాలికి బుద్ధిసెప్పెడున్

40. మరణము మేలుగాదె యవమానముకన్నను, నాల్గుడబ్బులుం
దొరుక నినుం భరింతుననితోపఁగ నీపని బూనినాడ నీ
భరణముకోసమై పడెడిపాటులు నాకవి ప్రాణగొడ్డపుం
జెఱలయి యేచుచున్నవి యిసీ! యని పొట్టకు బుద్ధిసెప్పెదున్

41. పరునిబలంబు నాబలము బాగుగఁ జూడక కాలుదువ్వఁగా
బరపెదు, పిచ్చిసాహసము ప్రాణములార్చు, నతండు సత్కవీ
శ్వరుఁడు, మహానుభావుఁడు, యశస్వి, సుధీమణి, నక్కయేడ? యా
పరమపదంబదేడ? యని పల్కుచు గుండెకు బుద్ధిసెప్పెదున్

42. చరమదశన్ విషాదగతి సంభవమయ్యె, వధానకార్యమున్
నెఱపుటతప్పు, చూపవలె నీదగు ధారణయంచు సభ్యులం
దఱు బలవంత పెట్టిరెటుఁ దప్పుకొనంగలవాఁడ నింక పై
జరుపఁగఁబోకుమంచుఁ బదిసారులు నోటికి బుద్ధిసెప్పెదున్

43. చుఱుకగు తెల్వితేటలవి సున్నయెయైన సదాత్మతం గడుం
బరువుగఁబల్కి పెద్దలిడు మన్ననలం గనబోక మంచి సె
బ్బరఁగనలేని యర్భకులపాలయితింగద! చెడ్డబుద్ధినిన్
సరసకునీడ్చి కూల్చెనని చాటునబుద్ధికి బుద్ధిసెప్పెదున్

44. కరముస్వపాండితీమహిమఁ గన్పడఁజేసి పొగడ్తఁ చెందఁగా
సరియనిపించుఁగాని తనసాహితిగట్టిగఁ జూడనెట్టిదో
యెఱుఁగక పండితప్రవరు లెంతటివారయియున్న నాసుధీ
వరులకు నేమిరాదనుచు వాగుచు నింకఁదనంత పండితుల్
మఱియిక నెవ్వరుండరని మాటికి మాటికిఁ జాటుచుండుటల్
ధరణినిఁ బండితబ్రువుల లక్షణమంచు వచింత్రుకోవిదుల్.



# వేదము వేంకటరాయ శాస్త్రి గారు

శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్ జమీందారుగారి ప్రథమ పుత్రికయగు హైమవతీ పరిణయపు నాకబలి (22-12-1913) నాఁడు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారి యధ్యక్షతను ఏలూరులో కొప్పరపు సోదరకవుల యాశుకవిత్వ సభ జరిగినది. ఆ సభోదంతమును 1914 జనవరి 3 కృష్ణా పత్రికలోఁ బ్రకటించిరి. అందలి వేదము వేంకటరాయశాస్త్రిగారి యభిప్రాయము.

"వీరు చేసిన పని మిక్కిలి కష్టమైనది. కవిత్వములో కష్టము నెఱింగిన వారికే యీ సంగతి తెలియఁగలదు. ఇందు ఆశుధారావ్రతము కత్తిమీదను, త్రాటి మీదను నడచుట వంటిది. ఆక్షేపించుట సులభము. చేయుట కష్టము. అన్ని పద్యములు మిక్కిలి బాగుగా నున్నవి. లోపములే కనుపించలేదు. ఉభయ భాషల యందును వీరికిఁగల సమర్థతను వెల్లడించుచున్నది. ఇది అభ్యాసవశమున కలిగిన శక్తి కాఁజాలదు. వీరి ముఖమున బాల్య మగపడుచున్నది. జన్మతోవచ్చిన శక్తి యనుటకు సందియములేదు. వీరిని నిందించుటకు యత్నించువారు మిగుల నిర్దయులు, మఱచి పోఁదగినవారు. వీరికి నేఁడొసఁగఁబడిన "ఆశుకవి శిఖామణి" యను బిరుదము, తత్సూచకముగా నీయఁబడిన బంగారు పతకము వీరికి మిక్కిలి యర్హమైనవని నేను రూఢిగాఁ జెప్పఁగలను. కాదని వాదింప దలఁచిన వారితో నేను వృద్ధుఁడనయ్యును బోరాడుటకు సిద్ధుఁడనై యున్నాను. కాదనువారు నాయెదుట వాదింప వచ్చును. ఇదియే నా వాదమునకు తగిన సమయము. ఈ ధీరులు నయాది గుణములు కలిగిన వారగుటచేత జనుల ప్రేమ కర్హులు. వీరింకను వృద్ధిలోనికి రాఁగలరని నా భావన."



# శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరువారి

# హితోపదేశ పద్యములు

మనోరంజని 15 నవంబరు 1911

సంపుటము : 2 సంచిక : 1

తొలుతన్ వాగనుశాసనుండు నిలిపెం దోడ్తోడ రాజేంద్రుఁడీ
తెలుఁగున్ వర్ధిలఁజేసె, దిక్కన మహోద్వృత్తిం బరంగించె, న
వ్వల నెఱ్ఱాప్రగడాఖ్య సత్కవియు నొప్పన్ సోముడుం బెంచి రీ
యిలపై దానికిఁ గృష్ణరాయఁడును జేయించెం జయంతింగడున్

కావ్యరచనాగరిమఁ జూపె నవ్యరీతి
నాంధ్రకవితా పితామహుం డతనివెనుక
ఘనుఁడు పింగళి సూరన కావ్యకాంత
వివిధరీతుల మెప్పంది వెలయఁజేసె

నాకుజ ముఖ్యులౌ కవు లనంతములౌ కృతులన్ రచించి సు
శ్లోకుల సచ్చరిత్రములు సొంపుగ నిల్పిరి, వారువోయినన్
లోకములం దదక్షరములుం గృతికర్తల పేళ్లు నిల్చెఁగా
కేకరణిం గణింపనగు హృద్యములై తగు తచ్చరిత్రముల్

కవులనంగ సృష్టికర్తలు కాలత్ర
యజ్ఞు లిట్టులయ్యు నాంధ్ర భాష
పొలుపు దక్కి, మారి పోవుచు నుండంగ
నేమి చేయుచుండి రెట్టి తగవు?

కవులొనరింపగాఁ దగిన కార్యములున్ విడనాడి వాక్యపుం
బవరముచేయు చొండొరుల పైఁబడుచుందురు లాభమేమియో
వివరముసేయ రత్నకవి వేదము వేంకటరాయశాస్త్రియుం
దవిలిరి పెద్దకయ్యమున, గానఁబడెం గవిసంఘ మక్కటా!

తిరుపతి వేంకటేశ్వరులు గద్వాలాది
దేశంబులం బోరుఁ దెచ్చుకొనిరి
అదియు జిరంతనంబయ్యెఁ ద్రవ్వఁగ నేల
యొక వంక రామకృష్ణ కవి యుగము
నొక చెంతఁ గొప్పరపు కవి యుగ్మమ్మును
నెదిరించి బవరంబు వదలరైరి
వృథ సేయుచుండి రివ్విధి ననర్గళమైన
కవిత నక్కట యేమి గల్గెదాన

వాసిఁ బశ్చిమ ఖండ నివాసులకును
మనకుఁ గల్గిన యట్టి సన్మైత్రి వలనఁ
దెలియఁబడినట్టి నూత్నాంశములు దెలుఁగున
గ్రంథరచన యొనర్పఁగఁ గడఁగ వలయు.

తిరుపతి వేంకటేశ్వరులు తెల్గునవ్రాసిరి యింగిలీషులోఁ
బరగెడు బుద్ధ సచ్చరిత పద్యము హృద్యముగాఁగ నీ గతిన్
వెరవునఁ జేయునట్టి కృతివృత్తులు దూరముఁజేసి వీరు మా
సరసన గూరుచుండుటకుఁ జాలరు మాసరిగాఁ గవిత్వమున్
విరచనఁ జేయఁజాలినను వీరల నొప్పెదమంచుఁ గొందఱిం
గురువులటంచు మమ్మనరు కూడదటంచు వచింత్రు కొందఱిన్

ఇవ్విధమునఁ బలుకుచుఁ బలు
చివ్వకుఁగాల్ ద్రవ్వనగునె? చింతింపంగా

నెవ్వరి కెవ్వరు సరిగల
రెవ్వరికి న్వారెగాక యేనాఁడైనన్

పద్దుగ కృష్ణరాయపతి పల్లకి యెత్తఁగఁ గూరుచున్న యా
పెద్దన, రామభూషణ కవిక్రియశ్లేష మొనర్పకుండ బల్
విద్దెకుఁ దక్కువయ్యెను గవిత్వ పితామహుఁడన్న గొప్పయుం
బద్దవ వచ్చునే యొకటఁ బ్రౌఢి వహింతురు కొంద ఱెంచఁగన్

కొప్పరపు వారి గుంటూరు వారలు
బిరుదు లిచ్చి చాలఁ బెద్దఁజేసి
నప్పుడెల్ల నీ శతావధానులు గల
రంచు వారు మదిదలంచ లేదొ!

ఒక్క కాలంబు నందు నహోబలుండు
వైదికుండని బ్రమసి సంపన్నుఁ డొకఁడు
పొగడె, నంత నియోగిగా నెగడెనంచు
నొక్కఁడు నిదర్శనముఁ జూపెఁ జక్కగాను

వైదికులు న్నియోగులును వారల వారలలోన నాడికా
పాదిత భిన్నతం దగిలి బాంధవమందున వారువీరలున్
భేదము గల్గి భోజన విభేదములేక చరించి రిప్పు డీ
వాదము లేల వారలకు వారును వీరికి వీరు సాటియౌ!

వేదవిహిత కార్యవృత్తుల నుండుట
వైదికులును, లోకవర్తనముల
నియతులై నియోగులయిరి గాకొక జాతి
భేద మెట్టి శాస్త్రవేత్త పలుకు!

వైదికులందు లౌకికులు పండితులుం గవులుంద్రు, వేదవి
ద్యాదరముం గవిత్వమును నచ్చపు బాండితియుం నియోగులం

బాదుకొనుం దలంపఁగ వివాదపడందగు హేతు వింతయున్
లేదు కదా? వివాదకథ లీనము సేసి సుఖింపుఁడేకమై

ఎల్ల బ్రాహ్మణులును నేకమై యుండంగ
యత్నమాచరించు టర్థమగును
వేరువేరు శాఖలేరి యెక్కువ సేయఁ
బాడిగాదు సౌఖ్య పథము గాదు

వర పరవస్తురంగ కవివర్యుఁడు పండిత వేంకటార్యుఁడుం
దిరుపతి వేంకటేశులను ధీరతఁ బూని శతావధానముల్
జరిపెడు నాఁడు డీకొనఁ దలంపరు, వీరలపైకి శిష్యులం
బురికొలుపం దలంప రిటు బుద్ధులు లేవొకొ వైష్ణవాళికిన్

పండితులం గవీంద్రుల నవారణఁ జేరిచి యైకమత్యమం
దుండఁగజేసి దేశము సముద్ధరణం బొనరించు వేడ్కతో
బెండిలియన్మిషంబునను బిల్చితి, వారపుడేట నేట ని
ట్లుండిన బాగటన్న నపుడొప్పితి నాగతిఁ గూర్పు సేయఁగన్

మంతన మొప్ప భాష నభిమానము గల్గినవారు దీనికిన్
నంతసమందిరేనియును సాగఁగఁ జేసెదు నట్టి భారమున్
గొంతవహించెదన్ మొదటికూరుపు నెల్లరు నెంచి నెప్డు గా
వింత మటన్న నప్పటికిఁ వేడుక సిద్ధముగాఁగ నుండెదన్

పరిణయమందుఁ గూడుకొని పల్కిన పండిత వాక్య మేను ని
బ్బరముగ నామనంబున నుపశ్రుతిగాఁ దలపోసి యెల్లవ
త్సరముల నీ సమాగమము సల్పఁగ నెంచియె వ్రాసి యుంటి ని
వ్వరును మీఁదియంశము లవారిత కౌతుకవృత్తి మీఱఁగన్

**రాజా మంత్రిప్రెగడ భుజంగరావు**

**శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్ జమీందారుగారు 1916లో రచించి ప్రచురించిన హైమవతీ పరిణయము అను నామాంతరము గల "ఆధునిక కవి జీవితములు" - (పుట 31,32) అను గ్రంధమునందు వ్రాసిన కొప్పరపు కవిసోదరుల వివరములు -**

## కొప్పరపు కవిసోదరులు

వీరి నివాసస్థలము గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా కొప్పరము గ్రామము. ఆశుకవిచక్రవర్తులు. శతావధానులు. తండ్రి కొప్పరపు వేంకటరాయఁడుగారు. తల్లి సుబ్బమాంబగారు. ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. కౌండిన్యసగోత్రులు. జన్మదివసములు. 1. పార్థివ సంవత్సర కార్తీక శుద్ధ ౭ గురువారము. 2. సర్వజిత్సంవత్సరపుష్య బ౧ం శుక్రవారము. వీరి గురువులు 1. బ్రహ్మశ్రీ పోతరాజు రామకవిగారు, 2. బ్రహ్మశ్రీ రామడుగు రామకృష్ణ శాస్త్రిగారు. వీరు అష్టావధాన శతావధానాశుకవిత్వ సభలిప్పటికి దాదాపు 150 కన్న నెక్కుడుగ జరిగించి, అచ్చటచ్చట నర్హులచే బిరుదమండనములఁ బెక్కువడసిరి. 1. అలవాల లష్కరులో బ్రహ్మశ్రీ ఆదిరాజు తిరుమలరావుగారి మహాసభలో "**ముంగాలి బిరుదుఅందె**"యును 2. మణికొండ అస్థానమున మ.రా.శ్రీ. తాటిరెడ్డి గోపాలరెడ్డి జమీందారువారిచే '**బాలసరస్వతి**' బిరుదమును, 3. నెల్లూరులో మహాసభాజనులచే '**ఆశుకవీంద్ర సింహ**' బిరుదమును, 4. బుచ్చిరెడ్డి పాలెములో మ. బెజవాడ పట్టాభిరామరెడ్డిగారిచే '**విజయ ఘంటికా**' బిరుదమును, 5. మదరాసు మహాజనసభలో విజ్ఞాన చంద్రికామండలి వారిచే '**ఆశుకవి చక్రవర్తి**' బిరుదమును,

6. మద్రాసులో మతౌకసభలో '**విజయఘంటికా**' బిరుదమును, 7. గుంటూరులో మహాసభాజనులచే '**కుండినకవిహంస**' బిరుదమును, 8. అందే సోమసుంద రేశ్వరాలయ సభలో '**కవి రత్న**' బిరుదమును, 9. బాపట్లలో మహాసభాజనులచే '**అవధాని పంచానన**' బిరుదమును, 10. మార్టేరులో మహాసభాజనులచే '**కథాశుకవీశ్వర**' బిరుదమును, 11. ప్రకృతము మాచే మహాసభలో "**ఆశుకవి శిఖామణి**" బిరుదమును బొందిరి. వీరింత కాలమును, ఆవధానాశుకవిత్వ సభలం గడపి యిప్పుడిపుడే గ్రంధరచనకారంభించిరి. కాని యింతకుమున్ను కొన్ని శతకములను దత్తుల్యములగు కొన్ని చిన్ని పొత్తములను రచియించియున్నారు. వీరు ఆశువున నానావిధ వృత్తములతో నెట్టికథనైనం బ్రబంధశైలిగ గంటకు 500 పద్యములు రచియించు సామర్ధ్యముగలవారు, వీరొకపర్యాయము పన్నిదమునకై మార్టేరు సభలో గంటకు 720 చొప్పున యొక అరగంటకాలము మనుచరిత్ర యాశువుగ రచించిరంట. వీరిపై నితరులగు మహాకవులు రచించిన ప్రశంసా పద్యములొక సహస్రము కెక్కువగానుండును. వీరింతవఱకు రచియించిన పద్యములన్నియు, వ్రాసియుంచినచో సుమారు మూఁడు లక్షల కెచ్చుగలవని సహృదయుల యభిప్రాయము. వీరిరువురును సోదరులు. వీరికింక యిరువురు సోదరులు కలరు. అందుఁ బ్రథములు, అష్టావధానమునఁ గృతకృత్యులై శతావ ధానమునకుఁ బ్రయత్నించుచున్నారు. గంటకు 200 పద్యము లాశువుగఁ జెప్పఁ గలరు. వీరిపద్యము లీ గ్రంధమందు మఱియొకచోఁ గాన్పించును. వీరి పిన్న తమ్ములును గవిత్వము చెప్పఁగలరంట. వీరి గృహమును జూచిన యొక కవి "**కవితపుట్టిల్లు సోదర కవులయిల్లు**" అని చెప్పిన గీతపద్య పాదమునుబట్టియే సర్వమును గ్రహింపఁదగియున్నది. జగద్విశ్రాంత కీర్తులగు వీరి విషయమింతకన్న వ్రాయుట పునరుక్తి.



## శ్రీ వేంకటసుబ్బరాయ కవిగారి అస్తమయము

### శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు

యతులుంబ్రాసలువోయినన్ గణములున్వ్యత్యాసముంజెందినన్
మతియెట్లేగిన నట్లువోవుచుఁ బ్రధానంబైన వస్తుస్థితిన్
స్మృతియింతైనను లేక యాశు వెటులో యీడ్వం గవుల్లేరె యీ
క్షితి; నీరీతిని గారుగాకయని శోకించుంజుమీ వాణియున్

కచ్చెనేకాని నిక్కమునకు నీపొండి
　　తికి రిచ్చవడకున్న ధీరుఁడెవఁడు?
వాదంబునకెకాని వాస్తవంబునకు నీ
　　యాశువుంగని తృప్తినందఁడెవఁడు?
అరసికతంగాని యఖిలాంధ్ర విషయంబు
　　నందు నిన్మెచ్చని యాతఁడెవఁడు?
చాటుననేకాని సమ్ముఖంబున నమ
　　స్కారంబనని ధైర్యశాలి యెవఁడు?

అమ్మహామహోపాధ్యాయు నంతవాని
నాశుకవితలో నలరించి యాశుకవి శి
ఖామణి యటన్న బిరుదంబుఁగాంచినట్టి
సుబ్బరాట్కవీ! కీర్తి శేషుండవైతె?

అప్పకవి కున్న భావము
తప్పని చెప్పుటకునాశుధార తలఁచియే
కొప్పరపుంగవియై తా
నప్పునిఁ దీర్చికొనిపోయె నాంధ్రులు వగవన్

# డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ, M.A.,Ph.D.,

## రచనల సూచిక

**ముద్రితములు**

1. **మణిహారము - (1968)**
వివాహ సందర్భమున సంకలనము చేసిన సాహిత్య వ్యాసముల గ్రంథము.

2. **తిరుపతి వేంకటీయము - (1973, 1975, 1997)**

తిరుపతి వేంకటకవుల సాహిత్య జీవితము-ఎనిమిది అంకముల నాటకము-ఆంధ్ర విశ్వ విద్యాలయము బి.ఏ. తరగతికి (1975-78) పాఠ్యగ్రంథముగ నిర్ణయించిన గ్రంథము.

3. **ఆదిభట్ల నారాయణదాసు - (1975)**
ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఎకాడమి ప్రచురించిన గ్రంథము.

4. **పంచముఖి - (1976, 1999)**
వివిధ పత్రికలలో ప్రచురితములైన ఐదు సాహిత్య వ్యాసముల గ్రంథము.

5. **నారాయణ దర్శనము - (1983, 2003)**

ఆదిభట్ల నారాయణదాసుపై పరిశోధనము - ఆంధ్రవిశ్వవిద్యాలయము 1980లో పిహెచ్.డి. ఇచ్చిన సిద్ధాంత గ్రంథము.

6. **వాల్మీకి రామాయణము - మహాకావ్యము - (1982)**
వాల్మీకి మహర్షి వర్ణనా వైభవమునకు దిక్ప్రదర్శన గ్రంథము.

7. **కళాకేళి - (1992)**

తెలుగు సంస్కృతి ప్రతిబింబించు కళామయ కథాత్మక పద్య కావ్యము. ఈ కావ్యముపై తెలుగు విశ్వవిద్యాలయములో 24.01.2002న పి.వి రత్నాచారికి ఎమ్.ఫిల్. పట్టా లభించింది.

8. **దక్షిణకాశిక - (1997)**
శ్రీనాథ మహాకవి విరచిత శ్రీ భీమేశ్వర పురాణమునకు ప్రతిపదార్థ భావవిశేష సహితమైన తొమ్మిదివందల పుటల విపుల వ్యాఖ్యాన గ్రంథము.

9. **చతురాస్య - (1998)**

సాహిత్య సభలలోని (సమస్యలు - దత్తపదులు - వర్ణనములు - ప్రత్యేక సమావేశములు) పద్యముల సమాహార గ్రంథము.

10. **శ్రీనాథుడు - సందేహాల చర్చలు - (2000)**
11. **ఆధునిక యుగారంభములో సాహితీ కలహాలు - (2001)**
12. **కొప్పరపు సోదర కవులు - (2003)**

**ఆముద్రితములు**

13. **మహాకవి కాళిదాసు**

కాళిదాసు నామము - కాలము - గ్రంథములు - ఉపమాలంకార వైవిధ్యము - వాల్మీకి అనుసరణములు - మొదలగు అనేకాంశముల వివరణములతో కూడిన సమాలోచన గ్రంథము.

14. **సాహిత్య కాలక్షేపము**

గ్రంథ పీఠికలు - ఆకాశవాణి ప్రసంగములు - ఉపన్యాస వ్యాసములు - వివిధ సమయాలలో చెప్పిన పద్యములు గల గ్రంథము.

15. **తెలుగు సాహిత్యములో సందేహ ధోరణులు - సమన్వయ సరణులు**

82 సందేహములు - వాని సమన్వయముల 1035 పుటల గ్రంథము. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ మేజరు రీసెర్చి ప్రాజెక్టు పథక సహాయముతో వ్రాయబడినది.



# కృతజ్ఞతలు

శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని తమ అమృత హృదయముతో ఆవిష్కరించిన 'అవధాన సరస్వతి' శ్రీ పేరాల భరతశర్మ గారికి

డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ గారిని పరిచయం చేసిన మిత్రులు తనికెళ్ల భరణి గారికి

కళాపీఠం 'లోగో'ను ప్రసాదించిన 'లోగోత్తముడు' బహుకళాప్రపూర్ణుడు 'బాపు' గారికి

అన్నింటా నాకు 'పెద్దదిక్కు' భరాగో గారికి

ఈ పుస్తకమే తన మస్తకంగా సమస్తం సమర్పించుకున్న డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ గారికి

పుస్తకాన్ని అందంగా తయారు చేసిన రాంషా-శిరీష పబ్లికేషన్స్ యాజమాన్యానికీ, ఉద్యోగులకూ

మేమున్నాము మీవెంట అంటూ ఆర్థికంగా, హార్దికంగా సహాయం చేస్తున్న అజ్ఞాత వాఙ్మయాభిమానులకు

'కళాబంధు' M.P (రాజ్యసభ) డా॥ టి.సుబ్బరామిరెడ్డి గారికి

'సాహిత్యబంధు' Ex M.P (రాజ్యసభ) పద్మశ్రీ డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారికి

'స్థితప్రజ్ఞులు' విజయ్ నిర్మాణ్ కంపెనీ అధినేత డా॥ ఎస్. విజయకుమార్ గారికి

ఇంతమంది మహనీయుల ఆశీస్సులూ సహకారం లభించినప్పటికీ ఈ పుస్తకంలో కొన్ని అచ్చుతప్పులు ఉన్నట్లు తెలుసుకున్నాను.

దీపధారులు అని చివరి అట్టమీద కొందరు మహనీయుల రూపచిత్రాలున్నూ పుటలు vi, vii లలో వారిని గురించిన క్లుప్త పరిచయాలున్నూ చేర్చగలిగాము. అంటే మహత్తరమైన తెలుగు వాఙ్మయంలో దీపధారులు వీరే తప్ప మరెవ్వరూ లేరా అని విచికిత్స జనించవచ్చు. ఐతే, ఆకాశంలో అనంతకోటి నక్షత్రాలలో పేర్లు ఇరవై ఏడింటికే పెట్టుకోగలిగాం కదా. వీటికి నన్ను క్షమించాలి.

బుధజన విధేయుడు

'మా' శర్మ

